# ఆసూరి మరింగంటి
# వేంకటనరసింహాచార్యుల (చతుర్థి)
# రచనల సమగ్ర పరిశీలన

పరిశోధక సిద్ధాంత వ్యాసము

894.813109
RAN

మాడభూషిణి రంగాచార్యులు

# ఆసూరి మరింగంటి వేంకటనరసింహాచార్యుల (చతుర్థి) రచనల సమగ్ర పరిశీలన

ACC No 6044

పరిశోధక సిద్ధాంత వ్యాసము

డాక్టర్ మాడభూషి జీ రంగాచార్యులు
తెలుగు ఉపన్యాసకులు
నాగార్జున ప్రభుత్వ డిగ్రీ కళాశాల
నల్లగొండ

ఆసూరి మరింగంటి
వేంకటనరసింహాచార్యుల (చతుర్థి)
రచనల సమగ్రపరిశీలన
పి హెచ్. డి. సిద్ధాంతగ్రంథము
డాక్టర్ మాడభూషిణి రంగాచార్యులు

ప్రథమముద్రణ : విభవ చైత్రశుద్ధపాడ్యమి
18 మార్చి 1988

ప్రతులు : 1000

సర్వహక్కులు రచయితవి

RAN

మేలుప్రతి : రూ॥ 50-00
సాదాప్రతి : రూ॥ 40-00

ACC No 6044

లభించు చిరునామా :
శ్రీమతి మాడభూషిణి వెంకటమ్మ
శ్రీనివాసనిలయము
ఇంటి నెంబరు 6-2-13 N
నాగార్జునకాలని
నల్లగొండ - 508 001

ముద్రణ :
శ్రీరామకృష్ణ ప్రింటర్స్
ఖమ్మంరోడ్
మిర్యాలగూడ - 508 207

# కృతిసమర్పణము

శ్రీ వేంకటేశ్వరస్వామి పాదకమలములకు

భక్తిపురస్సరముగా

— డా॥ మాడభూషిణి రంగాచార్యులు

ఈ సిద్ధాంతవ్యాసము ముద్రణకు ఆర్థిక సహాయమందించిన

పూజ్యులు

## ఆచార్య తూమాటి దొణప్ప

(తెలుగు విశ్వవిద్యాలయ ఉపకులపతి)

గారికి హృదయపూర్వక

కృతజ్ఞతాభివందనములు

# గురుస్మృతి

**దివి. 19–5–1987** నాడు పరమపదము పొందిన

అస్మద్గురుపర్యులు పూజ్యులు

## కీ॥ శే॥ కోపూరు గోపాలకృష్ణారావు గారిని

స్మరిస్తూ

గ్రంథకర్త

ఆచార్య ఎం. కులశేఖరరావు
తెలుగుశాఖాధ్యక్షులు
ఉస్మానియా విశ్వవిద్యాలయము
విజ్ఞానపురి — విద్యానగరం
హైదరాబాద్

విభవ ఉగాది
18–3–1988

# అభినందన

డాక్టర్ మాడభూషిణి రంగాచార్యులవారు నాకు చిరకాల మిత్రులు. ఆచార్యగోపాలకృష్ణారావుగారి మార్గదర్శకత్వంలో వారు పరిశోధన కార్యక్రమం నిర్వహిస్తుంటే, వారి కృషిని సన్నిహితంగా చూసే అవకాశం నాకు కలిగింది. నిశితమైన విమర్శన దృష్టి, యథార్థమైన వివేచన, నూతనవిషయ సేకరణపై ఆసక్తి సాహిత్య పరిశోధకులకు ప్రధానంగా కావలసిన ఉపకరణాలు. శ్రీరంగాచార్యులవారికి ఈ గుణాలన్ని పుష్కలంగా ఉన్నాయని నాకు తెలుసు. ఇపుడీ సిద్ధాంత గ్రంథం చదివినపుడు అవిషయం మరింత బలపడింది.

తెలంగాణంలో, ఆంధ్రదేశంలోని ఇతర ప్రాంతాల్లో వలెనే, చాల కాలంగా సాహిత్యకృషి జరుగుతున్నది. సంస్కృతాంధ్రభాషల్లో, కవులు పండితులు కావ్యాలు, లక్షణగ్రంథాలు వ్రాసి ఆ భాషా సాహిత్యాలను సుసంపన్నం చేసినారు. విద్యానాథునివంటి పండితులు రాజాశ్రయంలో పరిశ్రమిస్తే, పాల్కురికి సోమన, పోతన వంటి కవులు తాము నమ్మిన మత సిద్ధాంతాలను అలంబనంగా తీసుకొని కావ్యరచనలకు పూనుకొన్నారు. ఈ రెండు మార్గాల్లోకూడ తెలంగాణం సాహిత్యరంగంలో ఆనాటినుంచి ఈనాటిదాకా చైతన్యవంతంగానే ఉన్నది.

మరింగంటి వంశం కవులు దేశవ్యాప్తంగా ఉన్నప్పటికి వారు, తెలంగాణమునే తమ కావ్యరంగంగా ఎన్నుకొన్నారు. వారు తాము నమ్మిన సిద్ధాంతాలపైననే ఆధారపడి తరతరాలుగా కావ్యరచన సాగించినారు. తాళ్ళపాక వంశంలాంటివారు తప్ప, ఒకే వంశంలో అనేక తరాలలో కవులు, పండితులు వెలసి ఉండడం అరుదే. మరింగంటివారి పూర్వగృహనామం ఆసూరివారు. ఇది శ్రీవైష్ణవ పరమాచార్యులైన శ్రీమద్రామానుజుల ఇంటిపేరు కూడ. అపేరు పెట్టుకొన్నందుకు మరింగంటివారు విశిష్టాద్వైతంలోను, సాహిత్యంలోను విశిష్టమైన కృషిచేసి విశేషఖ్యాతిని ఆర్జించినారు.

శ్రీమద్రామానుజులవారితో ఈ వంశంవారికి సాన్నిహిత్యం ఉన్నట్లు మనకు తెలియవచ్చినప్పటికి, క్రీ.శ. 16వ శతాబ్దమునుంచి మాత్రమే ఈ వంశపు కవులు చేసిన సాహిత్యకృషి మనదాకావచ్చింది. మరింగంటి అప్పలాచార్యులు, గోలకొండ కుతుబ్షాహిరాజుల గౌరవాన్ని పొందినాడట. మల్కిభరాం అనే ఇబ్రాహింకుతుబ్షా, ఈ కవిని అన్నివిధాల మన్నించి సకలోపచారాలు చేసినట్లుగా పొన్నిగంటి తెలగనార్యుడు యయాతిచరిత్రలో చెప్పినాడు. యథార్థానికి తెలగనార్యునికి రాజాస్థానప్రవేశం చేయించినవాడు ఈ అప్పలాచార్య పండితుడే. ముసల్మాను రాజును 'ఇభరాముడు' అని పేరుపెట్టిన కవికూడ ఇతడే అయి వుంటాడని నావిశ్వాసం.

తెలుగులో వెలువడిన నిరోష్ఠ్యకావ్యాల్లో రామాయణా కథాత్మకమైన దశరథరాజనందన చరిత్రకు ప్రత్యేకస్థానం ఉన్నది. వీరూ వారు కాదు, స్వయంగా శ్రీశారదాదేవి అనుగ్రహంతోనే మరింగంటి సింగరాచార్యులు ఈ కావ్యాన్ని వ్రాసినారట. రామశబ్దం పలుకక రామాయణం వ్రాయడం ఎంతకష్టమో వ్రాసిన వారికే తెలుసు. దాన్ని చదివినవారికే తెలుస్తుంది. పొన్నిగంటి తెలగనార్యుని దారిలో ఈ కవియే శుద్ధాంధ్ర సీతాకల్యాణం కూడ రచించినాడు. దానికి ఇంకొక మెరుగుకూడ పెట్టి దాన్ని నిరోష్ఠ్యంగా కూర్చినాడు. ఈ శారదావరప్రసాదుడు పందొమ్మిది కావ్యాలు వ్రాసినట్లుగా తెలియవస్తుంది. కాని మనకు లభించినవి కొన్నిమాత్రమే. ఈ సింగరాచార్యుల తరువాత అనేకానేక కవి పండితులు బహు సంఖ్యలో కావ్యాలు గ్రంథాలు రచించి సరస్వతిని సేవించినారు.

ఇటువంటి పండిత వంశంలో జన్మించినవారే మరింగంటి వేంకటనరసింహాచార్యులు. వారిని చతుర్థి నరసింహాచార్యులని పేర్కొనడం ఉన్నది. ఈ కవి ఒకటి రెండు కాదు ఇరవైఅయిదు కావ్యాలు వ్రాసి ప్రశస్తివహించినవారు. వీటిలో మాలతీవసంతము వంటి ప్రబంధాలున్నాయి. సుచిత్రాభ్యుదయం వంటి నాటకాలున్నాయి. మానసప్రబోధశతకం వంటి వైరాగ్య శతకాలు ఉన్నాయి. ప్రద్యుమ్న విజయమనే యక్షగానమూ ఉన్నది. ఇంతటి బహుముఖీనమైన ప్రతిభాపాండిత్యాలు కలిగిన కవిపండితుని గ్రహించి, చక్కని పరిశీలనచేసి డాక్టర్ మాడభూషిణి రంగాచార్యులుగారు ఈ సిద్ధాంత గ్రంథాన్ని సిద్ధంచేసినారు. ప్రాచీనపద్ధతిలో ఉండే రచనలమీద అంతగా ఆసక్తిలేని కాలంలో, శ్రీరంగాచార్యులవారు మరింగంటి వేంకటనరసింహాచార్యులవారి గ్రంథాలన్నింటిని సేకరించి, వాటికి సమగ్రంగా, పరిశీలనాత్మక విమర్శలు వ్రాసి, ఆ కవి ప్రతిభాపాండిత్యాలను ప్రదర్శించినారు. ఇది చక్కని కృషి. డా॥ రంగాచార్యులవారి కృషికి, ఆచార్య గోపాలకృష్ణారావుగారి విజ్ఞానాత్మకమైన మార్గదర్శకత్వం

తోడైంది. ఇంకేమి కావాలె? చక్కని సిద్ధాంతగ్రంథం అవతరించింది. దీః అనేకానేక విషయాలు చర్చితమైనాయి. పరిశోధకులకు నూత్న విషయాలు వె అయినాయి. డాక్టర్‌గారి శ్రమ ఫలించింది. ఇంత మంచి గ్రంథం వ్రాసిన డా రంగాచార్యులవారిని అభినందిస్తున్నాను.

సం/-

ఎం. కులశేఖరరా



డా॥ ముదిగొండ వీరభద్రయ్య
తెలుగు ఉపన్యాసకులు
నాగార్జున ప్రభుత్వ కళాశాల
నల్లగొండ

# ఆప్తవాక్యము

శ్రీమాన్ మాడభూషిణి రంగాచార్యులవారిని డాక్టర్ రంగాచార్యులుగా చేసిన గ్రంథం ఇది. వీరి ఈ సిద్ధాంతగ్రంథం అచ్చుకావటానికి ముందు మరింగంటి వేంకటనరసింహాచార్యుల వారెవ్వరో నాకు తెలియదు. ఈ సిద్ధాంత గ్రంథం చేతుల్లోకి వచ్చాకనే వారెవ్వరో తెలియడమే కాక, ఒక మహా ప్రతిభావంతుడైన కవి — పండితుడు కూడా అయిన కవి — అంతశక్తి ఉండి కూడా — ఎలాంటి కీర్తి కాంక్షలేకుండా, గుప్తంగా ఉంటూ ఎంతటి సాహిత్య సృష్టి చేశాడో తెలిసింది. కేవలం వేంకటనరసింహాచార్యులవారి విషయమే కాకుండా 15వ శతాబ్దినుండి సాహిత్యసేవ చేస్తూ, అనేక కావ్యాలను రచించిన ఈ కవి వంశీకులైన ఎందరో మరింగంటి కవుల విషయం కూడా ఈ గ్రంథంవల్ల తెలుస్తుంది. ఈ వంశంలో పేరుతెచ్చుకొన్న కవులలో వేంకటనరసింహాచార్యులవారు పదహారవ వారు కావడం ఆ వంశం ఎంత గొప్పవంశమో తెలుపుతుంది.

డా॥ రంగాచార్యులవారీ కవి సర్వకృతులను ఈ గ్రంథంలో సమగ్రంగా పరిశీలించారు. మూడు పద్యకావ్యాలను, తొమ్మిదినాటకాలనూ, ఆరు లఘుకృతులనూ, ఏడు స్తోత్రాలనూ రచించిన సత్కవి నరసింహాచార్యులు. 1961 దాకా జీవించిఉండిన కవి కావడంచేత అనేక అధునిక ప్రభావాలు కూడా ఈ కవిలో మనకు కన్పిస్తాయి. అట్లాంటి ప్రభావం గాఢంగా 'లలిత' అన్న ఈ కవి రచించిన నాటకంలో కనిపిస్తుంది. కవిగారి ఆయా కావ్యాల, నాటకాల గొప్పదనం అంతా కూలంకషంగా చర్చించి రంగాచార్యులవారు తమ ఈ గ్రంథంలో తేటతెల్లం చేశారు. ఐనా లలితను గూర్చి ఇంకా పరిశీలించాల్సింది భావి పరిశోధకుల

కున్నదనే చెప్పవచ్చును. ప్రౌఢభాషా సంస్కారం, కావ్యసంస్కారం ఉన్న కవి చాలా గొప్ప వ్యావహారిక భాషలో, ఆధునిక సామాజిక ఇతివృత్తంతో ఈ నాటకాన్ని రాయడం ఆశ్చర్యాన్ని కలిగిస్తుంది. నిజాం ప్రభుత్వకాలంలోని దొరలు శ్రామికుల్ని, దళితుల్ని, దరిద్రుల్ని ఎలా బాధించి పీడించారో ఈ నాటకంలో స్పష్టంగా కనిపించుతుంది. నల్లగొండ జిల్లాలోని రాజకీయ ఉద్యమాల ప్రభావం ఈ కవిని కొన్ని సామాజిక వాస్తవికతలపై దృష్టిసారించేటట్లు చేసిందని లలిత నాటకం చూశాక అర్థమవుతుంది. అముద్రితమైన ఈ నాటకాన్ని కూడా తన పరిశీలనలోకి తీసికొని తెలుగుసాహిత్యానికి డా॥ రంగాచార్యులవారెంతో మేలు చేశారు.

ఈ సిద్ధాంతగ్రంథంలో కొట్టవచ్చినట్లుగా కనిపించే విషయం రంగాచార్యులవారి వైదుష్యం. ప్రబంధాలను గురించి రాస్తున్నా, నాటకాలను గురించి రాస్తున్నా, శతక, స్తోత్రాదులపై రాస్తున్నా, ఆయా ప్రక్రియలమీద ఇంతకుముందు సాహిత్యలోకంలో జరిగిన అనేక చర్చలు, గొడవలు, వాదవివాదాల ఫలితంగా సిద్ధమైన సిద్ధాంతాలను, స్పష్టంగా — ఏ తికమకలు లేకుండా — ప్రతిప్రక్రియకు ముందు డా॥ రంగాచార్యులవారు ఎంతో చక్కగా రాశారు కవి చేసిన వర్ణనలు, రసపోషణ ఇత్యాదులను ప్రస్తావిస్తూ ఆచార్యులవారు ఎంతో వైదుష్యంతో వాటిలోని ఘనతను, శాస్త్రబద్ధతనూ నిరూపించారు. వర్ణనాదులపై ఆచార్యులవారీ గ్రంథంలో రాసింది చదువుతున్నప్పుడు మొదటగా పాఠకునికి కలిగే అభిప్రాయం మరింగంటి నరసింహాచార్యులవారెంత గొప్పకవులు అని — రెండవదిగా — ఇంత గొప్పకవి ఋణం శ్రీమాన్ మాడభూషిణి రంగాచార్యులవారు తాము ఈ గ్రంథ రచన చేసి తీర్చారు అని; వేంకట నరసింహాచార్యులవారి రచనల్లో తెలుగు జాతీయులలో నిత్యవ్యవహారంలో ఉన్న సామెతలను, జాతీయాలను కూడ తీసి చూపిస్తూ రంగాచార్యులవారు ఎంతో మంచిపని చేశారు.

ఈ గ్రంథరచనలో డా॥ రంగాచార్యులవారియందు మనకు ప్రత్యేకంగా కనిపించే ఒక గొప్ప సుగుణం — కవిత్వంపై వ్యాసరచన చేస్తున్నప్పుడు కవితా రసాస్వాదన చేసిం తర్వాతే ఈ రచన చేయడం. ఇది కవికి ఎంతో న్యాయం చేసే గుణం. కవికి కావాల్సింది అతని చరిత్ర కాదు — అతని వంశ చరిత్ర అంతకన్నా కాదు! ఆయనకు కావలసింది ఆయన కావ్యనాటకాలలోని కావ్యకళా మర్మాలని పాఠకులు తెలిసికొని తల ఊపి ఓహో! అనడం. దీనికి రంగాచార్యుల

వారి వంటి సద్విమర్శకులు తోడ్పడి నావంటి సామాన్య పాఠకునికి పథనిర్దేశం చేయగల్గితే కవికి ఇంకా ఎక్కువ ఆనందం! దీన్ని రంగాచార్యులవారు చక్కగా సాధించారు. వస్తువు అలంకారంగా రూపాంతరం పొందడమే కవిత్వమన్నారు గుంటూరు శేషేంద్రశర్మగారు. నరసింహాచార్యులవారి కవిత్వంలో అలంకార రచన ఎంత రమ్యంగా సాగిందో డా॥ రంగాచార్యులవారు చక్కగా సోదాహరణంగా నిరూపించారు. ఆసక్తితో పఠించగలిగే శైలితో డా॥ రంగాచార్యులవారీ సిద్ధాంత గ్రంథం రచించారు. ఇది నేటి పరిశోధనా గ్రంథాలలో మృగ్యం. పరిశోధన, పరిశీలన, అనుశీలన అన్న మూడు పాయలుగా ఈ గ్రంథంలో అచార్యులవారు తమ శక్తిని ప్రసరించారు. వారిని మనసారా అభినందిస్తున్నాను.

ఆప్తవాక్యంగా మరొక్కమాట. డాక్టరేట్ ఒట్టి వ్యాజంగా ఉండాలి. దానికి ముందూ వెనుకా విద్యార్థి పరిశోధన, విమర్శన అన్నవి చేస్తుండాలి. ఈ రచనతో పని ముగిసిందనుకోవద్దని పెద్దలైన రంగాచార్యులవారికి మనవి. సాహితీ క్షేత్రంలో — ముఖ్యంగా విమర్శనా రంగంలో — ఆచార్యులవారు తమ కృషిని కొనసాగించాలని అభ్యర్థిస్తూ —

సం/—

డా॥ ముదిగొండ వీరభద్రయ్య

డా॥ వారణాసి వీరనారాయణశ
తెలుగు ఉపన్యాసక
ప్రభుత్వ డిగ్రీ కళా
గద్వా

# ఆప్తవాక్యము

అప్తమిత్రులు శ్రీ మాడభూషిణి రంగాచార్యులుగారు డాక్టరేట్ ప
గై కొన్ననాటి నా యానందమాకంద మీ విభవ వసంతమున కన్నులపండువ
సేచి పూచి గాచినదా యన్నట్లు, వారి సిద్ధాంతవ్యాసము రమణీయ గ్రంథరూపమ
ముద్రణ భాగ్యమునంది పలువురు రసజ్ఞ పరభృతాలకాలవాలము కానున్నదన
భావనయే నన్ను పరవశుడి నొనర్చినది.

ఆచార్యులుగారితో నాకున్న ముప్పదేడుల సాహచర్య మీ యాప్తవాక
మునకుఁ బ్రేరణయైనది. ఈ శతాబ్దివాడైన శ్రీ మరింగంటి వేంకటనరసిం
చార్యుల (చతుర్థి) కృతులఁ బరిశీలించుట ద్వారమున వారు మా నల్లగొండజిల్లాల
విస్మృత కవియైన యొక మహనీయుని, తెలుగు లోకమునకుఁ బరిచయముచే
సాహితీప్రియుల డెందములనలరించినారనుట పొగడ్త కాజాలదు. కావ్యనాట
శతకాది సాహిత్యప్రక్రియల సాధించిన బహుముఖప్రజ్ఞాశాలియుభ, క్త కవియునై
మరింగంటివారి కృతులఁ బరిశీలించుకృషిలో శ్రీ రంగాచార్యులుగారు కృతకృత
లైనారనుటకీ గ్రంథమే సాక్ష్యము. నిరంతర పరిశ్రమము, వివేచనాశీలము, కవి
యెడగలభక్తి తాత్పర్యములే సాధనములుగా శ్రీ రంగాచార్యులుగారొనర్చిన కృషి
తోటి విమర్శకుల కాదర్శప్రాయమై నిలచినదన్న యతిశయోక్తి కానేరదు. గ్రంథ
సేకరణకై ఆచార్యులుగారు తిరిగిన ప్రదేశములకును, పడినశ్రమకును మితిలేద
వారి పరిశీలనానుభవమునకు జతలేదు. ఒక్కొక్క గ్రంథము లభించినపుడెల్ల
వారు నా కందలి విశేషాంశములను వివరించి, కవి ప్రతిభను ప్రశంసించుచు
నాకెంతో సంతోషమును కలిగించెడివారు. అదియొక విచిత్రమైన సాహిత్య
వ్యాసంగము. నాకు మరుపురాని మధురానుభవము.

శ్రీ ఆచార్యులుగారు మిత్రవాత్సల్యగరిమచే నన్నీ యాప్తవాక్యము వ్రాయుడని కోరుట నాకు గజారోహణాది సన్మానము జరిగినంతగా నానందమును చేకూర్చినది.

విస్మృతభక్తకవిని లోకమునకు చాటిన శ్రీరంగాచార్యులుగారికి హృదయ పూర్వక ధన్యవాదములు తెలుపుకొనుచు, వారికపై మరింత దీక్షతో సాహితీ మతల్లికి సేవయొనర్తురని యాకాంక్షింతును.

అభివందనములతో
డా॥ వారణాసి వీరనారాయణశర్మ

# స్వవిషయము

1977 సంవత్సరములో భగవదనుగ్రహము వలన ఆచార్యుల సహకారము వలన ఉస్మానియా విశ్వవిద్యాలయమువారు ఎం. ఫిల్‌కు అనుమతించిరి. 1979లో "ఆంధ్రమహాభారతములో ప్రకృతి వర్ణనలు' అను అంశముపై సిద్ధాంతవ్యాసము సమర్పించి ఎం. ఫిల్ పట్టా పొందితిని.

1980లో సాహితీలోకమున మరుగుపడిన ప్రసిద్ధకవి కీ॥ శే॥ ఆసూరి మరింగంటి వేంకటనరసింహాచార్యులు (చతుర్థి) రచనల సమగ్రపరిశీలనను పి హెచ్. డి. అంశముగా గ్రైకొంటిని. ఇందుకు పూజ్యులు అస్మద్గురువర్యులు కీ॥ శే॥ ఆచార్య కె. గోపాలకృష్ణారావుగారు పర్యవేక్షకులుగా నుండిరి. వారి సూచనల ననుసరించి 1981 నవంబర్‌లో తంజావూరు సరస్వతీమహలు, మద్రాసు ప్రాచ్యలిఖిత పుస్తక భాండాగారము, తిరుపతి ప్రాచ్యలిఖిత పుస్తక భాండాగారములకు విషయసేకరణనిమిత్తము వెళ్ళితిని. ఈ సందర్భమున పై మూడు గ్రంథాలయాధిపతులు నాయందు చూపిన సౌహార్దత విస్మరింపరానిది. ఈ సందర్భమున నామిత్రులు శ్రేయోభిలాషి శ్రీ అంగలూరి శ్రీ రంగాచార్యుల సహకారము మరువలేను.

మరింగంటి కవుల తాళపత్ర గ్రంథముల నిలయములోగల గ్రంథములు చూచుటకు కనగల్లు, గ్రామము వెళ్ళినపుడు చి॥ మరింగంటి చెన్నయాచార్యులు చూపిన ఆదరణ శ్లాఘాపాత్రము. నేను పరిశోధనచేసిన కవి కీ॥ శే॥ ఆసూరి మరింగంటి వేంకటనరసింహాచార్యుల (చతుర్థి) గారి కుమారుడు శ్రీమాన్ పురుషోత్తమాచార్యులు వారి తండ్రిగారి రచనలనందించి యీ పరిశోధనావ్యాస రచనకు మిక్కిలి తోడ్పడిరి. వారికి సర్వదాకృతజ్ఞుడను.

మరింత విషయసేకరణకు చేయు ప్రయత్నములో భాగముగా ఖమ్మం, యాతవాకిళ్ళ, వేంకటనరసింహాపురము, మద్రాసు, పాలెం, భద్రాచలము పర్ణశాల

దగ్గరి దుమ్ముగూడెము గ్రామములలోగల మిత్రులకు లేఖలు వ్రాయగా దయచేసి వారు తమశక్తి కొలది వివరములందించిరి. ఓరుగల్లులో వయోవృద్ధులు, జ్ఞాన వృద్ధులు శ్రీమాన్ మనవాళాచార్యులు వారి కుమారుడు పీతాంబరాచార్యులు అందించిన విశేషాంశములు అమూల్యమైనవి. వారిమేలు చిరస్మరణీయము.

ఎంతశ్రమించినను కవిగారి (25) రచనలలో రెండు నాటకములు, ఒక శతకము, మూడు తారావళులు లభించకపోవుటవలన యీ సిద్ధాంతవ్యాసము పరిపూర్ణమనుట కవకాశము లేదు.

ఈ సిద్ధాంతగ్రంథరచనారంభమున రక్తపుపోటువలన అనారోగ్యముగా నుంటిని. కాని ఇది ఆరంభించినతరువాత భగవంతుడు అనుగ్రహించి, ఆ వ్యాధి లేకుండచేసి, అనతికాలములో యీ సిద్ధాంత గ్రంథము పూరించుటకు కావలసిన శక్తి నొసంగి, 1985 జూలైలో పి.హెచ్. డి. పట్టా పొందుటకు అనుగ్రహించిన భగవంతునికి భక్తిపురస్సరముగా నమస్కరించుచున్నాను.

ఇట్లు
భవదీయుడు
మాడభూషిణి రంగాచార్యులు

# కృతజ్ఞతలు

ఈ సిద్ధాంత వ్యాసరచనకు అవకాశమిచ్చి, అనుక్షణము సలహాలను ఇచ్చి దీనిని ఇట్లు తీర్చిదిద్దిన పర్యవేక్షకులైన గురువర్యులు కీ॥ శే॥ ఆచార్య కె. గోపాలకృష్ణారావు గారి ఋణము తీర్చలేనిది. వారికి

ఉస్మానియా విశ్వవిద్యాలయము తెలుగుశాఖాధ్యక్షులు ఆచార్య కులశేఖరరావు గారికి

పూర్వ తెలుగు శాఖాధ్యక్షులు ఆచార్య బిరుదురాజురామరాజు గారికి

ఆచార్య నాయని కృష్ణకుమారి గారికి

డా॥ యస్. వి. రామారావు గారికి, డా॥ రవ్వా శ్రీహరి గారికి, డా॥ కసిరెడ్డి వెంకటరెడ్డి గారికి

మిత్రులు శ్రేయోభిలాషులు డా॥ ముదిగొండ వీరభద్రయ్య గారికి
(ఉపన్యాసకులు, నాగార్జున ప్రభుత్వ కళాశాల, నల్లగొండ.)

మిత్రులు శ్రేయోభిలాషులు డా॥ వి. రత్నయ్య గారికి,
(ఉపన్యాసకులు, నాగార్జున ప్రభుత్వ కళాశాల, నల్లగొండ.)

మిత్రులు శ్రేయోభిలాషులు శ్రీ హరీంద్రబాబు గారికి,
(ఉపన్యాసకులు, నాగార్జున ప్రభుత్వ కళాశాల, నల్లగొండ.)

మిత్రులు శ్రేయోభిలాషులు డా॥ వారణాసి వీరనారాయణశర్మ గారికి,
(తెలుగు ఉపన్యాసకులు, ప్రభుత్వ కళాశాల, గద్వాల.)

మిత్రులు శ్రీ ఉంగలూరి శ్రీ రంగాచార్యుల గారికి

మిత్రులు హితైషి డా॥ మారం శతృఘ్నరెడ్డి గారికి

సిద్ధాంతగ్రంథమున కాధారభూతుడైన ప్రముఖకవి మరింగంటి వేంకటనరసింహాచార్యుల కుమారుడు శ్రీ పురుషోత్తమాచార్యులు గారికి

తంజావూరు, మద్రాసు, తిరుపతి ప్రాచ్యలిఖిత పుస్తక భాండాగారాధిపతులకు

వ్యాసరచన కొనసాగించుటకు సహకరించిన నా సహధర్మచారిణి శ్రీమతి వెంకటమ్మకు

పరిశోధనలో ప్రోత్సహించిన మిత్రులందరికి

ఈ పరిశోధనా వ్యాసంగమున కనుమతించిన ఉన్నత విద్యాశాఖాధికారి గారికి

సిద్ధాంతగ్రంథము సకాలములో ముద్రించి యిచ్చిన శ్రీరామకృష్ణ ముద్రణాలయాధిపతి శ్రీ సూలూరి శివసుబ్రహ్మణ్యం గారికి

— రచయిత

# విషయసూచిక

# ఆంధ్రసాహిత్యము - మరింగంటి కవులు

ఆంధ్రసాహిత్యము వేయి సంవత్సరములనుండి అనగా నన్నయ నుండి నేటి వరకు మూడు పూవు లారు కాయలుగా వివిధప్రక్రియలతో విలసిల్లు చున్నది. క్రమవికాసమునొందిన తెలుగు సాహిత్యమును సాహిత్య చరిత్రకారులు కొన్ని యుగములుగా విభజించిరి. ఈ యుగవిభజనము వివిధపద్ధతిలో కొన సాగినది. ప్రసిద్ధకవి, చారిత్రిక వ్యవస్థ లేదా యుగలక్షణముల ననుసరించి యుగవిభజనము చేయుట ఇట్టిది. ప్రసిద్ధకవుల ననుసరించి నన్నయ శ్రీనాథాదుల యుగమని, చరిత్ర పునాదిగా చాళుక్య కాకతీయ యుగమని, యుగలక్షణముల ననుసరించి పురాణ, ఇతిహాసయుగములని పేర్కొనుట సాధారణముగా కనిపించు చున్న విషయము.

నన్నయనుండి నేటివరకు ప్రముఖ కవులు వివిధ కాలములలో సాహితీ రంగములో కృషిచేసి, అమూల్యములైన రచనల నందించిరి. మొదట పద్య గద్యములతో అరంభమైన తెలుగు సాహిత్యమను మొలక, రానురాను వివిధ ప్రక్రియలను చేపట్టి నేటి కొక మహావటవృక్షముగా విలసిల్లుచున్నది.

## ఆంధ్ర సాహిత్యము - కవి వంశములు

నన్నయాది మహాకవు లాంధ్రసాహిత్యమును పరిపుష్ట మొనర్చి యుండిరి. అట్లే సాహిత్యసేవకు అంకితమైన కొన్ని వంశముల కవులు, వారి చరిత్ర తెలుగు సాహిత్య చరిత్రలో కొంత వరకు మాత్రమే ఉదాహృతమగుచున్నది. అజ్ఞాతముగ నున్న కొన్ని వంశముల చరిత్రను ఆ వంశీయు లాంధ్రసాహిత్యమున కొనరించిన సేవను పరిశీలించినపుడు వారి కృషివిశేషములు వెల్లడియగుచున్నవి.

తిక్కన వంశీయులలో తిక్కన, భాస్కరమంత్రి అనువారు ప్రసిద్ధులు భాస్కరుడు తిక్కనకు తాత. క్రీ. శ. 1180–1220 ప్రాంతమువాడు. ఎఱ్ఱన తండ్రి సూరన కవియైనట్లు తెలియుచున్నది.[1] శ్రీనాథుని తాత కమలనాభామాత్యుడు క్రీ. శ. 1350 ప్రాంతమువాడు. వీరి వంశచరిత్రవలన తాతమనుమలు కవులైనట్లు వెల్లడియగుచున్నది.[2] ఆ తరువాత వారి వంశీయులు రచనలు చేసినట్లు తెలియదు. తాళ్ళపాకవారి వంశములో అన్నమాచార్యులు, పెదతిరుమలాచార్యులు, తిమ్మక్క, తిమ్మనార్యుడు (తిరుమలాచార్యుడు), చినతిరుమలాచార్యుడు మున్నగువారు ప్రసిద్ధకవులు.

వెన్నెలకంటి సూరన వంశజుడైన జన్నయ దేవకీనందనశతకము రచించినట్లు "తెలుగు కవుల సంగ్రహచరిత్ర" వలన తెలియుచున్నది.[3] ధూర్జటి వంశములో అతని మనుమడైన కుమార ధూర్జటి కృష్ణరాయవిజయము రచించినట్లును, ఇందు ధూర్జటి తన పెదతాత గారైనట్లు పేర్కొనెను.[4]

పై వివరణాంశములను పరిశీలింపగా, తెలుగు సాహిత్యములో కవి వంశము లెన్నియో సాహితీమతల్లికి అమూల్యాభరణములు సృజించి, సమర్పించుకొనినవి. ఇట్టి కవి వంశములలో పదహారవ శతాబ్దినుండి నేటివరకు తెలుగు సాహిత్యమున కలంకారములు కూర్చిన కవి వంశజులు మరింగంటి కవులు.

---

1. శా. ప్రాజ్ఞ ప్రస్తుత.............................................స
ర్వజ్ఞుం డప్రతిమాద్భుతోభయకవిత్వప్రౌఢశబ్దార్థయో
గాజ్ఞాసిద్ధిమనుండు మజ్జనకు డుద్యత్కీర్తి శ్రీసూర్యుడీ........
— నృసింహపురాణము పీఠిక 26 పద్యము.

2. శ్రీనాథుడు భీమఖండములో తనతాత కమలనాభామాత్యుడు పద్మపురాణ సంగ్రహము రచించినట్లు పేర్కొనెను.

3. విద్యార్థికల్పతరువు, తెలుగు కవులసంగ్రహచరిత్ర, 617 పుట

4. చ. స్తుతమతియైన యాంధ్రకవి ధూర్జటి పల్కుల కేల గల్గెనో
యతులిత మాధురీమహిమ నా మును మీ పెదతాత చాల స
న్నుతిగనె గృష్ణరాయల మనోజ్ఞ సభన్.......
— కృష్ణరాయవిజయము

# మరింగంటి కవులు - వీరి ప్రశస్తి

తెలుగు సాహిత్యము రాజాశ్రయముచే మిక్కిలి విలసిల్లినది. రాజరాజ నరేంద్రుడు, రెడ్డిరాజులు, శ్రీకృష్ణదేవరాయలు, నాయకరాజులు మున్నగువారి కాలములో తెలుగు సాహిత్యము మూడు పువ్వు లారు కాయలుగా విలసిల్లినట్లు తెలుగు సాహిత్య చరిత్రవలన తెలియుచున్నది.

తరువాతి కాలములో తెలుగు సాహిత్యమున కాశ్రయ మొసంగు రాజాస్థానములు కరువైనందున ఈ బాధ్యతను చిన్నచిన్న సంస్థానములు స్వీకరించినవి. ఆంధ్ర ప్రాంతమందలి నూజివీడు, బొబ్బిలి, విజయనగరము, పిఠాపురము మొదలగునవియు; తెలంగాణమునందలి గద్వాల, వనపర్తి, ఆత్మకూరు, జటప్రోలు, దోమకొండ, రాచకొండ, నారాయణపురము, నడిగూడెము, బేతవోలు మొదలగునవియు నిట్టివి. ఈ సంస్థానములు ఎందరో కవి పండితులను పోషించి, అమూల్య కృతిరత్నములు వెలయింపజేసినవి. ఈ సంస్థానాధిపతులు కృతిభర్తలే గాక, కృతికర్తలుగాను ప్రసిద్ధికెక్కిరి. సంస్థానాధిపతుల మార్గమున కొందరు జమీందారులు, భూస్వాములు, మహానుభావులు, ఉదారులు, సాహిత్యాభిమానులు కవులనాదరించి, వారి కావ్యములను ప్రకటించుటకు చేయూత నొసగిరి. తెలంగాణములో అనేక కవులు ఆంధ్ర సాహిత్యమున కలంకారప్రాయమైన రచనలను గావించిరి. ఇట్టి కవులలో మరింగంటి కవులు పేరెన్నికగన్నవారు.

తరతరాలనుండి యీ మరింగంటి వంశ కవులు సంస్కృతాంధ్రభాషలలో కావ్యములు వ్రాయుచు లబ్ధప్రతిష్ఠులైరి. చారిత్రి కాధారముల ననుసరించి యీ వంశమువారి వివరములు కొంతవరకైనను పదహారవ శతాబ్దారంభమునుండి లభించినవి.

ఈవంశమువారి నివాసము నల్లగొండ మండలమందలి కనగల్లు, గ్రామము కొంతకాలము తరువాత యీ వంశమువారు మిర్యాలగూడెం తాలూకాలోని "అనుముల," హుజూరునగరు తాలూకాలోని "యాదవాకిళ్ళ" జనగామ తాలూకాలోని మల్లంపల్లి", నల్లగొండ జిల్లాలోని "సూర్యాపేట", విశాఖపట్నము జిల్లాలోని భీమునిపట్నము", కృష్ణామండలమునందలి "మొఖాసాకలువపూడి" మున్నగు

ప్రాంతములకు వలసపోయి, ఆయా ప్రాంతములందే స్థిరనివాస మేర్పరచుకొనిరి. వారి వంశీయు లచటనే వసించిరి

వీరి ఇంటిపేరు ఆసూరి మరింగంటి వారు. ఆసూరి పేరు విశిష్టమైనది. శ్రీమద్రామానుజులవారుకూడా ఆసూరివారే ఇక మరింగంటి యను గృహనామము చేరుట కొక ఐతిహ్యము ప్రచారమున కలదు. ఈ వంశపు కవులు తమతమ కావ్యారంభమున (శ్రీరంగనాయకులు శ్రీమద్రామానుజులవారితో నన్న) యీ క్రింది పద్యము నుదాహరించిరి.

కం॥ "కంటిన్ లక్ష్మణమునివరుఁ
గంటిన్ గూరేశ దేశికస్వామి మఱిం
గంటి నదెవ్వరన మఱిం
గంటి మహాన్వయము దనరె గణ్యం బగుచున్"[1]

దీనివలన వీరి వంశనామము మరింగంటి యైనట్లు చెప్పికొనుచున్నారు. వీరు మౌద్గల్యస గోత్రులు లక్ష్మీనృసింహ వేంకటేశ్వర భక్తులు వీరి దాచార్య పీఠము. నేటికిని వైష్ణవాచార్య పీఠములలో మరింగంటివారి పీఠమే పెద్దపీఠము. సమాశ్రయణ ప్రదానములోను, శిష్యసంచారములోను ఈ వంశమువారే అగ్రగణ్యులు.

మరింగంటి వంశమువారిలో సింగరాచార్యుల ప్రసక్తి (క్రీ.శ. 1550 కాలము) ప్రప్రథమముగా కనిపించుచున్నది. వీరికి పూర్వము యీ వంశమును గూర్చిన విశేషములు, కవుల వివరములు వారి రచనలు చరిత్ర కందలేదు. అప్పలాచార్యులు, జగన్నాథాచార్యులు మున్నగువారు ప్రౌఢకవులైనట్లు దశరథ రాజనందనచరిత్ర వలన తెలియుచున్నది. దశరథరాజనందనచరిత్ర పీఠికలో (పరిష్కర్త శ్రీరంగాచార్య) తెలిపిన వివరముల ననుసరించియు, ఓరుగల్లులో మల్లంపల్లి లక్ష్మణాచార్యుల వంశీకులలో వృద్ధులైన మనవాళాచార్యు లొసగిన

1. దశరథరాజనందన చరిత్ర ప్ర. ఆ. 16 పద్యము.

— ఆసూరిమరింగంటి సింగరాచార్యులు

వివరముల ననుసరించియు,[1] మరింగంటి వంశవృత్తాంత మిట్లున్నది.

## 1. చెన్నయాచార్యులు. (అనంతాళ్వారు)

"సకలరాజాధిరాజరాజమకుటాగ్రఘటితచిత్రరత్నబహుళనీరాజనాతివిభ్రాజితాంఘ్రిసరసిజు"డైన[2] ఈ చెన్నయాచార్యులు మాధవగురుని పుత్రుడు. ఇతడు పుట్టుకతో సర్పరూపిగా కనిపించుట విశేషము. ఈయన బహుశాస్త్రనిష్ణాతుడు. పణ్ణరాజుగుట్ట యీతని నివాసము. ఈ పణ్ణరాజుపల్లి యనుగ్రామము ప్రస్తుతము మిర్యాలగూడా తాలూకాలోని అడవిదేవులపల్లి గ్రామ సమీపమున నున్నది. ఈయన మాహాత్మ్యము దశరథరాజనందనచరిత్ర, నిరోష్ఠ్య సీతాకల్యాణము, గోదావధూటీపరిణయము మొదలగు కావ్యముల ఆరంభమున వివరింపబడినది.[3] చెన్నయాచార్యులు నృసింహస్వామి భక్తుడు. సర్పరూపి. నేటికిని ఆగ్రామమున గుట్టపైగల దేవళములో భక్తులు సర్పమునకు పాలుపోయు టాచారము కలదట. ఈవంశమువారు పామును పూజించుటకు గల కారణము కూడా ఇదియే.

## 2. అప్పలాచార్యులు. (కాలము 1520-1580)

రాజాస్థానములలో మరింగంటివారి పేరు యీ అప్పలాచార్యుల నుండి వినిపించుచున్నది. ఈతడు నరనాగాశ్వపతులచే మన్ననలందినవాడని దశరథరాజనందనచరిత్ర నిరోష్ఠ్యసీతాకల్యాణములవలన తెలియుచున్నది.[4] పొన్నికంటి తెలగనార్యుని యయాతిచరిత్ర ననుసరించి యీ అప్పలాచార్యులు మల్కిభరాం ఆస్థానములో విశేష గౌరవాదరములు పొందినట్లు తెలియుచున్నది.[5]

## 3. జగన్నాథాచార్యులు. (16 వ శ. ప్రథమార్థము)

అప్పలాచార్యుల ఐదవ సోదరుడు జగన్నాథాచార్యులు. ఈయన 'సరస శతపద్యలేఖినీవిరచనోక్తి' కలవాడు, 'వినుత శతఘంట బిరుదాంక విజయుడు.'

---

1. నేను ఓరుగల్లు వెళ్ళి ఈ వివరములను స్వయముగా సేకరించితిని.
2. నిరోష్ఠ్య సీతాకల్యాణము. ప్ర. ఆ. 47 పద్యము.
3. గోదావధూటీపరిణయము. ప్ర. ఆ. 9 పుట
4. దశరథరాజనందనచరిత్ర. ప్ర. ఆ. 30 పద్యము
5. దశరథరాజనందనచరిత్ర పీఠిక 8 పుట

'అవధానచక్రవర్తి.' ఇంతేగాక కనకాభిషేకమందినవా డనియు, శతావధాని యనియు, బహుసంస్కృతాంధ్రరచనాదక్షుడనియు, నేబతి కృష్ణమంత్రి తన రాజ నీతిరత్నాకరములో స్తుతించెను.[1] ఈయన శ్రీరంగరాయల ఆస్థానములోనో, అళియ రామరాయల ఆస్థానములోనో సన్మానము పొందియుండవచ్చునని శ్రీరంగాచార్యులు అభిప్రాయపడిరి.[2] ఈయన సోదరుడే ప్రసిద్ధకవియైన సింగరాచార్యులు.

## 4. సింగరాచార్యులు. (16 వ శతాబ్ది ఉత్తరార్థము)

ఈవంశమువారిలో ప్రసిద్ధకవి సింగరాచార్యులు. ఈయన 'శతఘంటావధాన,' 'శారదాప్రశ్నవివరణ,' 'ఆశుకవి,' ఇత్యాది అన్వర్థబిరుదాభిరాముడు. వరదమాంబా తిరువేంగళాచార్యుల గర్భశుక్తిముక్తాఫలము. ఈ కవి క్రీ. శ. పదహారవ శతాబ్ది ఉత్తరార్ధమువాడని శ్రీరంగాచార్యులు అభిప్రాయపడిరి.[3] వేంకటేశ్వర కరుణాకటాక్షము వలన ఏకైకదినప్రబంధరచనాదక్షుడనైతిననియు నరపతులు అశ్వపతులు గజపతులచే మన్ననలు పొందినవాడ ననియు, కవి స్వయముగా చెప్పికొనెను.[4] అప్పలాచార్యులు, జగన్నాథాచార్యులు, వేంకటాచార్యుడు, నృసింహుడు, కోనేటిరాయశౌరి, రంగప్ప, సింగరప్ప యనువారలు సింగరాచార్యుల సోదరులు. వీరి ప్రశస్తి గురించి గాని, రచనలగురించి గాని వివరములు లభించుటలేదు. సింగరాచార్యుల తరువాత ఈ వంశములో ప్రసిద్ధ కవుల వివరము లిట్లున్నవి.

---

1. " గురుమూర్ధన్య శతావధానబిరుదాంకున్ ... .. ...............
   ............... ... మరిగంటి వేంగళజగన్నాథార్య గీర్తించెదన్. "
2. ద. రా. నం. చ. పీఠిక 9 పుట
3. దశరథరాజనందనచరిత్ర పీఠిక 21 పుట
4. "వరవందారు జనావళీహృదయ....................
   స్ఫురితైకైకదిన ప్రబంధరచనా...................
   నరనాగాశ్వనృపాలసభ్యగణితుండన్ సింగరాచార్యుడన్."
   ద. రా. న. చ. ప్ర. ఆ. 32 పద్యము

**5.** వేంకటనరసింహాచార్యులు (ప్రథమ) క్రీ.శ. 1770 (నరసింహప్ప)

ఈ వంశములో వేంకటనరసింహాచార్యులను నామము కల్గిన ప్రసిద్ధకవులు నలుగురు. ప్రథమ, ద్వితీయ, తృతీయ, చతుర్థి వేంకటనరసింహాచార్యులని వారిని పేర్కొనవచ్చును. ప్రథమ నరసింహాచార్యులు సింగరాచార్యుల తరువాత ఆరవ తరములోనివాడు.[1] ఈ మహాకవి రంగాంబా, వేంకటార్యుల పుత్రుడు. ఈతని అనంతర కవుల నామములివి.

6. వేంకటరాఘవాచార్యులు.
7. వేంకటనరసింహాచార్యులు. (ద్వితీయ)
8. చెన్నకృష్ణమాచార్యులు.
9. వరదదేశికులు.
10. అప్పలదేశికులు.
11. లక్ష్మణదేశికులు.
12. వేంకటనరసింహాచార్యులు. (తృతీయ)
13. శ్రీరంగాచార్యులు.
14. వేంకటరామానుజాచార్యులు.
15. లక్ష్మణాచార్యులు.
16. వేంకటనరసింహాచార్యులు. (చతుర్థి)[2]

లభ్యమైనంతవరకు మరింగంటి కవులలో ప్రశస్తి వహించినవారి వంశావళి ననుసరించి పేర్కొననైనది. ఇపుడు వీరిలో ప్రసిద్ధకవులు తమ రచనల ద్వారా తెలుగు సాహిత్యమున కొనరించిన సేవ నిట్లు వివరింపవచ్చును.

---

1. ద. రా. నం. చ. పీఠిక 10 పుట

2. దశరథరాజనందనచరిత్ర పీఠిక 12, 13, 14 పుటలు

# మరింగంటికవుల సాహిత్యసేవ

## సింగరాచార్యులు (16 వ శతాబ్దిఉత్తరార్థము)

ఈ వంశమువారిలో ప్రసిద్ధ కవి సింగరాచార్యులు. ఈ కవి తొమ్మిది సంవత్సరముల ప్రాయముననే కవితారచన మారంభించినట్లు తెలియుచున్నది.[1] ఇరువది సంవత్సరముల వయస్సునాటికి పదిహేడు రచనలు గావించినట్లు సింగరాచార్యులు స్వయముగా చెప్పికొనిరి.[2]

ఈ రచనలివి

1. వరదరాజస్తుతి
2. శ్రీరంగశతకము.
3. చక్రలాంఛనము.
4. కవికదంబము
5. శతసంహిత (ఆంధ్రీకరణ)
6. రామకృష్ణవిజయము (ద్వ్యర్థి)
7. అష్టభాషావిశేషకృతులు
8. నాటకశాస్త్రము
9. ప్రేమాభిరామము } ద్విపదలు
10. ధనాభిరామము } ద్విపదలు
11. నలయాదవరాఘవపాండవీయము (చతురర్థి)
12. సకలాలంకారసంగ్రహము
13. రాకాసుధాపూర్ణము
14. ఆంధ్రభాషాభూషణము

## వింశతి నిరోష్ఠ్యకృతులు (వీనిలో)

15. దశరథరాజనందనచరిత్ర

---

1. దశరథరాజనందనచరిత్ర పీఠిక 22 పుట
2. శుద్ధాంధ్రనిరోష్ఠ్యసీతాకల్యాణము. ప్ర. ఆ. 5, 6, పుటలు.

16. శుద్ధాంధ్రనిరోష్ఠ్యసీతాకల్యాణము
* 17. తారకబ్రహ్మరామశతకము
* 18. షోడశరాజులచరిత్రము
* 19. సమాసచూడామణి
(17, 18, 19 నెం. నిరోష్ఠ్యాలుకావు)

పై రచనలలో ♦ దశరథరాజనందనచరిత్ర, శుద్ధాంధ్ర నిరోష్ఠ్య సీతాకల్యాణ మను రెండు గ్రంథములు మాత్రము పాలెం కళాశాలలో ఉపన్యాసకులుగా పని చేయుచున్న శ్రీరంగాచార్యులు పరిష్కరించి సాహిత్య అకాడమీ పక్షమున ప్రకటించిరి.

వేంకటనరసింహాచార్యులు (ప్రథమ), నరసింహప్ప (1770 ప్రాంతము)

గోదావధూటి పరిణయ కర్తగా ప్రసిద్ధి కెక్కిన ఈ కవి "షోడశ మహాగ్రంథబంధురాలంకారనిర్మాణపారీణ ఘనయశోబంధురుడు."[1] ఈ క్రిందివి వీరి రచనలు. మిగిలినవాని వివరములు లభించుటలేదు.

1. విదేహరాజకన్యకాభ్యుదయము.
2. శ్రీకృష్ణశతాసందీయము
3. చిలువపడిగటేని పేరణము.
4. నృకంఠీరవాభ్యుదయము.

---

మరింగంటి వేంకటనరసింహాచార్యుల (చతుర్థి) రచనల సమగ్రపరిశీలనము అను అంశముపై పరిశోధనకై గ్రంథాన్వేషణ సందర్భమున కనగల్లులోని శ్రీరంగాచార్యుల తాళపత్రపుస్తకభాండాగారములో వీరిరచనలలో * ఈ గుర్తులు గల తాళపత్రగ్రంథము లీ వ్యాసకర్తకు లభించినవి. తారకబ్రహ్మరామశతకము షోడశరాజులచరిత్ర, సమాసచూడామణి యను తాళపత్రగ్రంథములు లభించినవి. ఇవి భావిపరిశోధకుల కుపయుక్తమగును.

♦ దీన్నిమాత్రమే ఎకాడమీవారు వేసినారు.

1. పై రచనలలో గోదావధూటీపరిణయ అశ్వాసాంతగద్యమున ఈ విశేషణము కలదు. గోదావధూటీపరిణయము క్రీ.శ. 1956 లో కనగల్లు శ్రీరంగా

5. క్షత్రబంధూపాఖ్యానము (ముద్రితము)
6. జాంబవతీకుమారశృంగారవిలాసము
7. రామానుజాభ్యుదయము
8. శల్వపిళ్ళరాయచరిత్ర
9. విష్వక్సేన ప్రభాకరము
10. గోదావధూటీపరిణయము (ముద్రితము)
11. పద్మినీకన్యకాభ్యుదయము
12. రతీమన్మథాభ్యుదయము
13. మిత్రవిందోపాఖ్యానము
14. శ్రీకృష్ణతులాభారము (ద్విపద)

వేంకటనరసింహాచార్యులు (ద్వితీయ) 19 శ. ప్రథమార్థము

ఈ కవి 'తాలాంకనందినీపరిణయ' మను ఆరాశ్వాసముల ప్రౌఢప్రబంధమును,'ఇందిరాల భాగవత' మను యక్షగానమును రచించినాడు. (తాలాంకనందినీ పరిణయము శ్రీరంగాచార్యుల పరిష్కరణతో క్రీ శ. 1980లో ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమీ పక్షమున ప్రకటింపబడినది) ఈ కవి నాటకశాస్త్రము గూడా రచించినట్లు డాక్టరు పోణంగి శ్రీరామ అప్పారావుగారు తెలిపిరి.[1] వీరివే కొన్ని

---

చార్యుల సంపాదకత్వమున రామగిరి భక్తసమాజము పక్షమున ముద్రింపబడినది. మిగిలినవానిలో ఐదవది క్షత్రబంధూపాఖ్యానము పాలెం శ్రీరంగాచార్యులు ప్రకటించిరి. 1, 2, 4, 5, 6, 7, 8, 9, 10, 14, క్రమసంఖ్య గల తాళపత్రగ్రంథములు కనగల్లులో శ్రీరంగాచార్యుల తాళపత్రనిలయములో గలవు. ఇవిగూడా మిక్కిలి శిథిలమై కీటకదష్టమై స్పష్టత కోల్పోయిన స్థితిలో నున్నవి.

1. తెలుగునాటకవికాసము 126 పుట. కానీ ఈ అభిప్రాయం సరికాదు. నాటకశాస్త్రమును వ్రాసినది సింగరాచార్యులేకాని నరసింహాచార్యులుకాదు. ఈ థీసిస్‌లో 8వ పేజీ చూడండి నాటకశాస్త్రం పేరున్నది.

చాటుపద్యము లున్నట్లు (భారతి జూన్ 1969) శ్రీరంగాచార్యుల వ్యాసము వలన తెలియుచున్నది.* ఈ కవి తండ్రి భావనాచార్యులు. ప్రపితామహుడు కూడా భావనాచార్యులే. వీరుభయులు కూడా గొప్ప కవులే అని వేంకటనరసింహాచార్యులు చెప్పికొనెను.

వేంకటరాఘవాచార్యులు (19 వ శతాబ్దము)

ఈ కవి రంగనాయకమ్మ, భావనాచార్యుల పుత్రుడు. ప్రౌఢకవి. క్రీ. శ. పందొమ్మిదవ శతాబ్దపు టుత్తరార్ధమువాడు. ఈయన కేశవస్వామి శతకము, (అంత్యప్రాస) క్షమావింశతి యను రెండు రచనలు లభ్యమైనవి. ఇవి ఓరుగల్లు నుండి వెలువడిన 'ఆంధ్రాభ్యుదయ' మను పత్రికలో ప్రచురింపబడినవట. ఇందు కేశవస్వామి శతకము క్రీ. శ 1964 లో వేంకటరామానుజాచార్యుల (కళ్ళచెర్వు) సంపాదకత్వములో ప్రచురింపబడినది.

చెన్నకృష్ణమాచార్యులు (క్రీ.శ. 1850) ప్రాంతమువాడు

ఈ కవి వేంకటనరసింహాచార్యుల (ద్వితీయ) సమకాలికుడు.[1] కనగల్లు వాస్తవ్యుడు. గోలకొండ కవులసంచికలోను, దశరథరాజనందనచరిత్ర పీఠికలోను వీరిగురించి కొన్ని వివరములు గలవు. యాదగిరి నృసింహశతక మీకవి రచన. మరికొన్ని యితర రచనలున్నవట. కాని లభ్యమగుటలేదు. లభ్యమైన నృసింహ శతకము అముద్రితము.

వరదదేశికులు (19వ శతాబ్దము)

ఈ కవినివాసస్థలము హుజూర్‌నగర్ తాలూకాలోని నరసింహపురము. ఈయన శ్రీరామపాదుకాస్తవము, గోదాస్తుతి, యను రెండు సంస్కృతరచనలు

---

* వీరి చాటువులు వివరంగా 'చాటుపద్యరత్నావళి' యందున్నవి.
(ఎకాడమీప్రచురణ)

1. తాలాంకనందినీపరిణయము వంశవృక్షము 1980 ప్రకటితము పీఠిక.

గావించెను. వీనిలో శ్రీరామపాదుకాస్తవము శ్రీనల్లాన్‌చక్రవర్తుల పార్థసారథాచార్యులు (ఖమ్మం) ముద్రించిరి. గోదాస్తుతిని వారి సోదరులగు రామానుజాచార్యులు ప్రకటించిరి. ఈ రెండు రచనలు మిక్కిలి విలక్షణమైనవి.

అప్పలదేశికులు

ఈ కవి అర్వపల్లినృసింహస్తోత్రము రచించినట్లు శ్రీరంగాచార్యులు అభిప్రాయపడిరి.[1] ఈ కవి గురించిన యితర వివరము లేవియు లభించుటలేదు.

లక్ష్మణదేశికులు (పందొమ్మిదవశతాబ్ది ఉత్తరార్థము)

లక్ష్మణదేశికులు క్రీ.శ. 19 వ శతాబ్దము ఉత్తరార్థమున నున్నవాడు. వరంగల్లు జిల్లా జనగామ తాలూకాలోని మల్లంపల్లి గ్రామ మీ కవి నివాసస్థలము 'కారికావళి' 'సూక్తిరత్నమాల,' 'రామానుజాష్టోత్తరశతము' మున్నగునవి వీరి అముద్రిత రచనలని డా॥ బి. రామరాజుగారు తెలిపిరి.[2] ఈ లక్ష్మణదేశికుల వంశమువారు నేటికి వరంగల్లులో నున్నారని తెలిసికొని వారినుండి సేకరించిన వివరము లొసంగుచున్నాను.[3]

---

1. దశరథరాజనందనచరిత్ర పీఠిక 13 పుట
2. విజ్ఞానసర్వస్వము (6) 755, 756 పుటలు.
3. తేది 2-1-1982 ఈ వ్యాసకర్త ఓరుగల్లులోని యీ వంశము వారిలో వృద్ధులైన మనవాళాచార్యులను దర్శించి తెలిసికొనిన విశేషము లివి.

   లభ్యమైనంతవరకు వీరి పూర్వీకులలో ప్రథములు సీతారామానుజాచార్యులు. సర్వశాస్త్రకోవిదుడు. వీరిరచనలు లభించుటలేదు. పదునెనిమిదవ శతాబ్దమునకు చెందినవాడు. ఈతని కుమారుడు పరాంకుశాచార్యులు. పరాంకుశాచార్యుల కుమారుడు మనవాళాచార్యులు. ఈతని కుమారుడు లక్ష్మణదేశికులు. ఈ లక్ష్మణదేశికులు వేదవేదాంతశాస్త్రపారంగతుడు. ధర్మజ్ఞుడు. సత్యశీలుడు సంగీతసాహిత్యములలో ప్రతిభాసంపన్నుడు. ఈ కవి (108) ఒడయవర్ల తిరునామాలు, (20) మంగళహారతులను రచించెను.

**వేంకటనరసింహాచార్యులు (తృతీయ) 19వ శతాబ్దము.**

ఈ కవి చెన్నకృష్ణమాచార్యుల కుమారుడు. 'అనిరుద్ధవిలాస'మను యక్షగానము రచించెను. ఈ కవి సుమారు (90) సంవత్సరముల క్రితము ముండినవాడు.[1]

**శ్రీ రంగాచార్యులు**

ఈ కవి తమ పూర్వులు రచించిన వందలకొలది తాళపత్రగ్రంథములు సేకరించి, తన ఇంటిలోనే ఒక గదిలో భద్రపరచెను. ఈ కవి రచించిన గోదా శతక మముద్రితము. గోలకొండ కవులసంచికలో 'మాత' శీర్షికక్రింద రాష్ట్ర మాతను సంబోధించి వ్రాసిన సీసపద్యమొకటి యీ కవిది కలదు. వీరి సంపాద కత్వములో వేంకటనరసింహాచార్యుల (ప్రథమ) రచనయైన 'గోదావధూటీ పరిణయము' క్రీ.శ 1956 లో రామగిరి మహిళాభక్త సమాజము వారిచే ప్రకటింపబడినది. వీరు క్రీ.శ. 1965లో మరణించిన తరువాత పూర్వము వీరు భద్రపరచిన తాళపత్రగ్రంథములన్నియు చెల్లాచెదరై పోయినవి. మిగిలినవి కీటక దష్టమై శిథిలావస్థలో నున్నవి.

---

ఇవన్నియు అముద్రితములే. లక్ష్మణాచార్యులు ఉపాధ్యాయులు. పెంచికల్ పేట జిల్లా పరిషత్తు ఉన్నత పాఠశాలలో పనిచేయుచున్న వీరి మనుమని దగ్గర పై రచనల వ్రాతప్రతులున్నవి. వీరే పై రచనల ముద్రణకు ప్రయత్నించుచున్నారు. ఈ లక్ష్మణదేశికుల పుత్రుడు మనవాళాచార్యులు (85)సంవత్సరముల వృద్ధుడు. జ్యోతిశ్శాస్త్ర వేత్త, సంగీతజ్ఞానము కలవాడు. వీరి కుమారుడు పీతాంబరాచార్యులు. పంచాంగకర్త. వయస్సు (56) సంవత్సరాలు. మరియొక కుమారుడు లక్ష్మణాచార్యులు ఉపాధ్యాయుడు. వీరే లక్ష్మణదేశికుల రచనల ముద్రణా ప్రయత్నము చేయుచున్నారు.

1. ఈ వేంకటనరసింహాచార్యుల పుత్రుడే కనగల్లులో తాళపత్రగ్రంథ నిలయ స్థాపకుడైన శ్రీరంగాచార్యులు

వేంకటరామానుజాచార్యులు

ఈ కవి వేంకటరాఘవాచార్యుల పుత్రుడు. ఇటీవలివరకు మొఖాసాకలువపూడి(కృష్ణా జిల్లా) నివాసముగానుండి క్రీ. శ. 1972 లో కుధరపల్లిలో పరమపదించిరి. వీరు తమ పితామహుడైన వేంకటరాఘవాచార్యుల కేశవస్వామి శతకము ముద్రింపించిరి. 'భల్లాతక క్షేత్ర మాహాత్మ్య' మను ఐదాశ్వాసముల ప్రబంధమును, రాఘవశతకమును రచించిరి. ఇందు ప్రబంధ మముద్రితము. శతకము ముద్రితము. ఇందలి వృత్తములు(108)రాఘవ మకుటముతో నున్నవి.[1] వీరి కుమారుడు సీతారామస్వామి ప్రస్తుతము నూజివీడులో నున్నాడు. ఈ వేంకటరామానుజాచార్యుల సోదరులే వేంకటనరసింహాచార్యులు (చతుర్థి). వీరి సోదరులైన లక్ష్మణాచార్యులు సుప్రసిద్ధ హరికథాకథకులు. చక్కని కవిత చెప్ప గలవారు. వీరు భీమపుర లక్ష్మీనరసింహప్రభు శతకము(1959), శబరీసపర్య (1968), హనుమన్మూర్తి(1968) మొదలైన రచనలు గావించినట్లు తెలియుచున్నది.[2] వీరి నివాసము విశాఖమండలములోని భీమునిపట్నము.

ఇతర కవులు —

రామానుజాచార్యులు (కాణికవి)

ఈ కవి ప్రస్తుతము భద్రాచలముదగ్గర దుమ్ముగూడెములో అర్చకులుగా నున్నాడు. కనగల్లులో తాళపత్రగ్రంథనిలయస్థాపకుడైన శ్రీరంగాచార్యుల సోదరు డీ కవి. ఇతనికి కాణ్వాచార్యుడని నామాంతరము. ఈ కవి మల్లారి నృహరిశతకము ముద్రితము. ఇందు దుమ్ముగూడెములో సీతారామచంద్రుల నిత్యనైమిత్తములగుఱించి తాను పడిన శ్రమను కవి శతకారంభమున మనవి చేసికొనెను. 'కాణికవి కన్నీటిధార'యను మరియొక ముద్రితరచన మీ కవిదే. ఇందు దుమ్ముగూడెము సీతారామచంద్రస్వామి ఆలయములో అగమశాస్త్రప్రకార మర్చ

---

1. రాఘవశతక ముద్రితప్రతి (1948) యీ వ్యాసకర్త వద్ద నున్నది.
2. దశరథరాజనందనచరిత్ర పీఠిక 15 వ పుట, శ్రీరంగాచార్య

నలు జరుగకపోవుట చూచి, కవి దుఃఖించి వ్రాసిన విశేషములు కలవు. విరివెంకి వేణుగోపాలస్వామి శతకము, బుర్రలేనికథ యను మరి రెండు రచనలు ప్రకటనకు సిద్ధముగా నున్నట్లు యీ కవి తెలిపెను.

పురుషోత్తమాచార్యులు

ఈకవి వేంకటనరసింహాచార్యుల (చతుర్థి) పుత్రుడు. పురుషోత్తమాచార్యులు ప్రస్తుతము సూర్యాపేట శ్రీవేంకటేశ్వర కళాశాలలో ఆంధ్రోపన్యాసకులుగా పని చేయుచున్నారు. వీరిప్పటివరకు మూడురచనలు గావించిరి. ఇందు వేంకటేశ్వర, యాదగిరిలక్ష్మీనరసింహప్రభు శతకములు ముద్రితములు. "గోదాదేవి" ప్రబంధ మముద్రితము. ఈ కవి ప్రాచీనకవిత్వాభిమానియైనప్పటికి, అప్పుడపుడు వచన కవిత్వము గూడా వ్రాయుచున్న వర్ధమానకవి. సహృదయుడు.

ఇట్టి ప్రసిద్ధకవుల సందించిన దీ తెలంగాణమునందలి మరింగంటి వంశము వీరు ఆంధ్రసాహిత్యమునకు చేసిన సేవ అమూల్యమైనది. వీరిలో ప్రసిద్ధకవులైన సింగరాచార్యులు, వేంకటనరసింహాచార్యులు (ప్రథమ, ద్వితీయ, చతుర్థి) నామ ధేయులు ప్రతిభాసంపన్నులై వివిధప్రక్రియలతో ఆంధ్ర సరస్వతి కపూర్వాలం కారములు కూర్చిన కవిపుంగవులు. ఇట్టి ప్రసిద్ధకవులలో అర్వాచీనుడు తెలుగు సాహిత్యములో వివిధప్రక్రియలతో రచనలు కొనసాగించి, సుమారు (25) రచనలు చేసి లబ్ధప్రతిష్ఠులైన వేంకటనరసింహాచార్యులు (చతుర్థి) ప్రతిభా సంపన్నులు.



# చతుర్థి వేంకటనరసింహాచార్యుల ప్రశస్తి

మరింగంటి కవులు ఆంధ్రసాహిత్యమున కొనరించిన సేవలు వివరించిన సందర్భమున వేంకటనరసింహాచార్యులు (ప్రథమ, ద్వితీయ, చతుర్థి) ప్రసిద్ధ కవులై, విశిష్టమైన రచనలద్వారా తెలుగు సాహితీమతల్లిని భూషించిన అంశము సూచింపనైనది. వీరి రచనల సంఖ్యయు ఎక్కువే. మరింగంటి కవులలో వేంకట నరసింహాచార్యులు (చతుర్థి) ఒకరు

తెలంగాణమున ప్రత్యేకముగా నల్లగొండ మండలములో ఇరువదవ శతాబ్ది ప్రథమార్థమునగల కవులలో చతుర్థి వేంకటనరసింహాచార్యులు సుప్రసిద్ధులు. ఈ కాలమున పాశ్చాత్య సాహిత్య సంపర్కమువలన ఆంధ్రసాహిత్యములో అభినవకవిత పట్టము కట్టుకొనినది. నవలాసాహిత్యము, కథానిక, నాటిక వచనకవిత మున్నగునవి బహుళప్రాచుర్యము నొందిన దశలో సాంప్రదాయిక కవితపై, ప్రబంధములపై ఆసక్తి చూపి, వేంకటనరసింహాచార్యులు (చతుర్థి) ప్రబంధములు, నాటకములు, ప్రహసనము, వీథిభాగవతము, వ్రతకథ, శతకములు, తారావళులు, స్తోత్రములు మున్నగు సాహిత్యప్రక్రియల చేపట్టి, పట్టినవన్నియు ప్రతిభావంతముగా నిర్వహించెను. ఈ శతాబ్దము మరింగంటి వంశపు కవులలో యింతటి ప్రతిభాసంపన్నులైన కవులు లేరు. తమ వంశములో సుప్రసిద్ధులైన సింగరాచార్యులు, ప్రథమ వేంకటనరసింహాచార్యుల సరసన నిలువవలసినవారీ చతుర్థి వేంకటనరసింహాచార్యులు.

ఈ కవి ప్రగతి అభ్యుదయ భావములు కలవాడు. సాంప్రదాయిక కవిత్వమునందాసక్తి కలవాడు. ఆధునిక ప్రక్రియలను చేపట్టి విజయవంతముగా రచనావ్యాసంగము కొనసాగించిన ప్రతిభాశాలి. సామాజిక ప్రాధాన్యముగల అంశ

ముల నితివృత్తముగా గ్రహించి తనరచనలు గావించిన ఆదర్శకవి. ఒక శతకము తప్ప మిగిలిన రచనల నన్నింటిని భగవదంకితము చేసిన పరమభక్తుడు. అగర్భ దరిద్రుడైనను, గ్రంథముద్రణకై ఎవరిని యాచించలేదు. రెండు రచనలు తప్ప మిగిలినవన్నియు మిత్రుల ధనసాహాయ్యమున ముద్రింపబడినవి. ధనవంతులైన మిత్రులు ఈ కవి రచనలను విని తమకుతామే ముందుకు వచ్చి ముద్రణకు కావలసిన ధనము కూర్చిరి. ఈ కవి పేరుప్రతిష్ఠలకొఱకు ఆత్మగౌరవము వదలు కొనలేదు. మిత్రుల ధనసాహాయ్యమున ప్రకటింపబడిన గ్రంథముల నీకవి విక్ర యించి ధనార్జనకై ప్రయత్నించకపోవుట ప్రస్తుతింపదగిన అంశము. రచనలను మిత్రులకు, గ్రంథాలయముల కుచితముగా పంచిన ఉదారుడు. నిజాం నవాబు నిరంకుశపాలనలో జరుగు దౌష్ట్యములను నాటకమున (లలిత సాంఘిక నాటకము) నిర్భయముగా చిత్రించి ప్రకటించిన ధైర్యశాలి. ఇంతటి మహోదాత్తాదర్శములు గల కవివరేణ్యున కీ శతాబ్ది సాహిత్య చరిత్రలో సముచితస్థానము లభించలేదు. విస్మృత పండితకవిని పరిచయ మొనర్చి ఆయన రచనల ప్రశస్తిని చాటుట ఈ సిద్ధాంత వ్యాస ధ్యేయము. భగవదంకితములుగా కృతులు రచించుట యీ కవికి గల వైశిష్ట్యము చాటుచున్నది.

## తెలుగుసాహిత్యములో వీరికిగల స్థానము

మరింగంటి కవులు పుట్టుకవులే గాని పెట్టుకవులు గారు. లక్ష్మీనృసింహ, వేంకటేశ్వరవరప్రసాదలబ్ధకవితాశక్తి కల్గినవారని యీ వంశపు కవులందరు చెప్పికొనిరి. వేంకటనరసింహాచార్యులు (చతుర్థి) శ్రీమదలమేలుమంగాసమేత వేంకటేశ్వరస్వామిప్రసాదలబ్ధకవితాధురంధరుడు. వీరి రచనావ్యాసంగము నల్ల గొండ, మహబూబునగరమండలములలో శిష్యసంచారము చేయునపుడును, బాంధవ్యరీతిలో ఉభయగోదావరులు, కృష్ణామండలములకు వెళ్ళినపుడు కొన సాగినది. దాదాపు నలుబది సంవత్సరముల పైగా అనగా క్రీ.శ. 1920 నుండి 1961 వరకు రచనావ్యాసంగ మీ కవి నిర్విరామముగా కొనసాగించెను. ఈ కవిరచనలన్నియు మిత్రుల ధనసాహాయ్యమున ప్రకటింపబడినవి. ఇవన్నియు (ఒకటితప్ప) భగవదంకితములే. మూడు ప్రబంధకావ్యములు, పది నాటకములు,

పంద్రెండు శతకములు, స్తోత్రములు, వ్రతకథలు మున్నగు లఘుకృతులీ కవి రచనలు. ఈ రచనలకు సమున్నత స్థానము కలదు.

కవిత, వనిత, లత ఆశ్రయము లేనిది రాణించ వను విషయము నీ సందర్భమున పేర్కొనవచ్చును. ఈ కవి ధనవంతులను గాని, జమీందారులను గాని, వణిక్ప్రముఖులను గాని ఆశ్రయించక జీవితాంతము పేదరికములోనే క్రమగ్గెను. ఈ కవి కీర్తిప్రతిష్ఠల కాశించలేదు. ముఖాసాదారు లొకరిద్దరు వీరి రచనల నాదరించినారు.

## కవిపరిచయము - జీవితవిశేషములు

వేంకటనరసింహాచార్యులు క్రీ.శ. 1902లో నల్లగొండమండలమందలి కనగల్లు గ్రామములో జన్మించెను. తండ్రి రాఘవాచార్యులు. తల్లి నరసమాంబ. మౌద్గల్యస గోత్రులు. ఆపస్తంబసూత్రులు. యజుశ్శాఖాధ్యాయులు. బాల్యమున ఈతని విద్యాభ్యాసము వీథిబడిలో జరిగెను. ఆరుసంవత్సరముల వయస్సున సోదరునితో యీకవి ద్వారకాతిరుపతి వెళ్ళి, అక్కడ రెండుమూడు సంవత్సరము లుండెను. ఆతరువాత తన తండ్రి వేంకటరాఘవాచార్యులు, తాత భావనాచార్యులతో కలిసి శిష్యసంచారము చేయుచు, మహబూబునగరము జిల్లాలో కల్వకుర్తి తాలూకా జూపల్లిలో కొంత కాలము వసించిరి. అక్కడ మరింగంటివారి శిష్యులు రంగినేని వంశీయుల కోరిక ననుసరించి వేంకటరాఘవాచార్యుల కుటుంబము కొంతకాల మా గ్రామములో నుండెను. ఆపిదప వేంకటనరసింహాచార్యుల విద్యాభ్యాసము బావగారైన గోమఠం రంగాచార్యుల వద్ద జరిగెను. గోమఠం రంగాచార్యులు ఏలూరు కిరుపది మైళ్ళ దూరమున గల తెంపల్లి గ్రామములో నివసించి యుండిరి. వీరి దగ్గరనే వేంకట నరసింహాచార్యులు కావ్యములు పురాణములు చదువుకొనిరి.[1] ఈ కవి విద్యాభ్యాసము గురించి యింతకంటె వివరములు లభించుటలేదు.

---

1. ఈ అంశములను నరసింహపురములోగల మరింగంటి అళహ సింగరాచార్యుల (90 సంవత్సరములు వృద్ధుల) వలన, వేంకటనరసింహాచార్యుల పుత్రుడు పురుషోత్తమాచార్యులవలన తెలిసికొంటిని.

వేంకటనరసింహాచార్యుల వివాహము అండాళమ్మతో క్రీ.శ. 1928 ప్రాంతములో జరిగినట్లు తెలియుచున్నది. ఈ దాంపత్య జీవనము పదునాలుగు సంవత్సరములు సాగినట్లు ఈ కవి రచించిన మానసప్రబోధశతక పద్యమువలన తెలియుచున్నది.[1]

ఆసూరి మరింగంటి వంశమువారిలో ప్రసిద్ధుడైన సింగరాచార్యులకు శారదప్రసన్నయై తానేసిన ప్రశ్నలను వివరించుటవలన సంతసించి "మీ వంశమున తరతరాలుగా విరాజిల్లుదు"నని అనుగ్రహించినదట. ఆ వాణీ వరప్రసాదమువలన యీవంశమునందువారికి సహజసిద్ధముగా కవిత్వమలవడినది. ఈ తరములోని వేంకటనరసింహాచార్యులకు కూడా సరస్వతీకృపాకటాక్షము వలన కవితాశక్తి యబ్బినది. కాని దీనికి భిన్నముగా వేంకటనరసింహాచార్యులు తన రచనల చివర "శ్రీమదలుమేలుమంగానమేత శ్రీవేంకటేశ్వరస్వామికృపా ప్రసాదిత సరసకవితాధురంధర" యని చెప్పికొనెను సింగరాచార్యుల తరువాత యీ వంశమువారు వేంకటేశ్వరస్వామిని ఇలవేల్పుగా సేవించియుందురు.

ఈ కవి బాల్యమునుండి కవితావ్యాసంగము కొనసాగించినట్లు "కూర్మనారాయణచరిత్ర" నాటకమువలన తెలియుచున్నది.[2] ఈ కవి మొదటిరచన రాఘవశతకము. క్రీ.శ. 1925 ప్రాంతము నాటిది. నేడలభ్యము. క్రీ.శ. 1930 నాటికి ఈ కవి (7) గ్రంథములు రచించెను.[3] వివాహానంతరము మిత్రులు,

---

1. "ఏ తన్వి పదునాలుగేండ్లు సన్ జతగూడి,
   బహుకష్టసుఖములన్ పాలుగొనియె"

   మా. ప్ర. శతకము 1

2. "క్రమ కోమల పదాక్రమణ గావింపుచు.................
   బాల్యమప్పటినుండి బహుగ్రంథములు వ్రాసి............
   సుజనాళి కింపును జూపువాడు......................
   పండితాళికి మిత్రుడై యుండువాడు"

3. గోపాలచూడామణి శతకము చివరిపుటపై నాచే రచింపబడిన "గ్రంథవివరముల పట్టిక" లో సూచితము.

శిష్యులు, ఈ కుటుంబమునకు సకల సౌకర్యములు కలిగించుటవలన వీరు సిరికొండ, మోతె గ్రామములలో కొంతకాల ముండిరి. తెలంగాణములో వీరికి విస్తృత శిష్యవర్గము కలదు. ఈ కవి శిష్యసంచారము చేయుచు, శిష్యులు కోరిన చోట కొంత కాలముండి రచనావ్యాసంగము కొనసాగించెను.

నిజాం రాష్ట్రమున ఉర్దూ, రాజభాష గౌరవము నొందినందున తెలుగు భాషాసాహిత్యవికాసముల కవకాశము స్వల్పముగా నుండెను. ఈ వాతావరణమున వేంకటనరసింహాచార్యుల రచనలకు సముచితాదరము లభించలేదు. ఒక సందర్భములో ఈ కవి పశ్చిమ గోదావరి జిల్లా చింతలపూడి తాలూకా కళ్ళచెర్వు గ్రామములో ఆలయపూజారిగా పనిచేయుచుండిన సోదరులు రామానుజాచార్యులను చూచుటకు వెళ్ళియుండెను. అచట తనకు గల సాహిత్యపరిచయముతో అభిమానుల కోరిక ననుసరించి, రామాయణ, భారత, భాగవతాది పురాణ కాలక్షేపము చేసెను. అక్కడ జమీందారులు, దాతలు ఈయన పాండిత్యమును కవితాప్రతిభను గుర్తించి, కవి రచనలను ముద్రించు యేర్పాట్లు చేసిరి. ఈతని "మాలతీవసంత" మను కావ్యమును చింతలపూడి తాలూకా జీలకర్రగూడెము మఖ్తేదారగు మ॥రా॥శ్రీ రాజారాఘవరాజు రంగరాజుగారు దత్తత తీసికొనెను.

తరువాత ఇది సాలంకృతకన్యాదానముగా శ్రీకృష్ణపరమాత్మ కంకిత మొసగబడినది. గ్రంథముద్రణకై చేయూత నొసగిన దాతలకు ధనికులకు, మిత్రులకు హృదయపూర్వకమైన కృతజ్ఞతలు తెలుపుకొనెను. కాని అంకిత మొసగలేదు.

1942లో భార్యావియోగమున మానసికముగా క్రుంగిపోయినను, ఈతడు కవితావ్యాసంగమును మానుకొనలేదు. క్రీ.శ. 1952లో ఈతడు తిరిగి స్వగ్రామము సూర్యాపేటకు వచ్చి, ఇల్లు కట్టుకొని నివాస మేర్పరచుకొనెను. క్రీ.శ. 1954లో సూర్యాపేటలోని వేదాంత భజన మందిరములో ఆరుమాసముల పాటు పురాణకాలక్షేపము చేసెను. ఆ తరువాత తన కుమారుడు పురుషోత్తమాచార్యులు ఉద్యోగరీత్యా నల్లగొండయం (రామగిరిలో) దుండుట వలన ఈ కవి కూడ యిచటనే వసించి, రామగిరి శ్రీసీతారామచంద్రస్వామి ఆలయమున 1960లో భారతము పురాణకాలక్షేపము చేసెను. ఈ కవి పురాణకాలక్షేపము శ్రోతలు

పరవశించునట్లు రసవంతముగా ప్రవచించెడువారు. ఈ కవి వినయశీలి. ప్రతి గ్రంథమునందును తాను అల్పజ్ఞుడ ననియు, తన దోషములను హంస "క్షీరనీర న్యాయము"న పండితులు ఒప్పులు గ్రహించి దోషములు పరిహరించవలయునని మనవి చేసికొనెను. బహుగ్రంథకర్తయైనను, కవితాప్రతిభయున్నను, వినయము సౌశీల్యము, సౌజన్యము ఈతని పాండిత్యమునకు బంగారమునకు తావి యబ్బి నట్లు వన్నె కూర్చినవి. భగవంతునిపై ఈతనికి గలభక్తిశ్రద్ధలు అపూర్వమైనవి.

ఈకవి (60) సంవత్సరముల వయస్సులో క్రీ.శ. 1961 ఆగష్టు 5 తేదీన రామగిరిలో పరమపదించెను. ఈ కవి స్వర్గస్థులైనను రచనలద్వారా చిరస్థాయిగా వీరి కీర్తిప్రతిష్ఠలు విరాజిల్లుననుటలో సందేహము లేదు మరింగంటి వంశము కవులలో (చతుర్థి) వేంకటనరసింహాచార్యులకు గల స్థానము విశిష్టమైనది.

## (చతుర్థి) వేంకటనరసింహాచార్యుల రచనావ్యాసంగము

రచనాకాలము ననుసరించి వీరి రచన లీ క్రింది విధముగా నున్నవి.

1. రాఘవశతకము.

ఇది వీరి మొదటి రచన. క్రీ.శ. 1925. వీరు తమ పదునాల్గవ యేట రంగాపుర సత్యనారాయణ శతకములో (27) పద్యములు రచించినట్లు ఈ శతక విజ్ఞప్తిలో మనవి చేసికొనిరి. ఇది అలభ్యము.

2. సుందరీవిలాసము. (1926) (ప్రహసనము)

వైశ్యవేశ్యవధ యను నామాంతరము గల యీ సుందరీవిలాసము క్రీ.శ. 1926 లో రచింపబడి శ్రీహరి కంకిత మొసంగబడినది. ఈ ప్రహసన మా రోజులలో వైశ్యులు వేశ్యలతో సుఖించుటవలని దుష్ఫలితములను, సాంఘిక దురాచారములను రూపుమాపుట కుద్దేశింపబడినది.

**3.** గోపాలచూడామణిశతకము. (1928)

కవి ఈ శతకమును క్రీ.శ. 1928 లో రచించి, శ్రీరామచంద్రున కంకిత మొసంగెను. ఈ శతకము ఓరుగల్లులోని శ్రీమాన్ కోవెల రంగాచార్యులచే పరిష్కరింపబడి, సముద్రాల నరసింహముగారి ధనసాహాయ్యమున క్రీ శ. 1929 లో వరంగల్లులోని వేంకటేశ్వర ముద్రణాలయమునందు ముద్రింపబడినది.

**4.** కూర్మనారాయణచరిత్ర. (ఐదంకముల నాటకము 1934)

కవి ఈ నాటకమును క్రీ.శ. 1934 లో రచించి, శ్రీతిరుపతి వేంకటేశ్వర స్వామి కంకిత మొసంగెను మహబూబునగరు జిల్లాలోని కల్వకుర్తి తాలూకా యందలి జూపల్లి గ్రామాధికారులైన మ॥రా॥శ్రీ రంగినేని హన్మంతరావు దేశముఖుగారి ద్రవ్యసాహాయ్యమున యీ నాటకము క్రీ.శ. 1936 లో ముద్రింప బడినది.

**5.** ప్రద్యుమ్నవిజయము. (1935 యక్షగానము)

కవి ఈ వీథినాటకమును క్రీ.శ. 1935 లో రచించి రేపాల నృసింహ స్వామి కంకిత మొసంగెను. నడిగూడెము రేపాల శ్రీకొల్లు పాపయ్య ద్రవ్య సాహాయ్యమున వాణీ ముద్రాక్షరశాల యందు ముద్రింపబడినది.

**6.** సత్యనారాయణవ్రతము. (హరికథ 1938)

కవి ఈ హరికథను క్రీ.శ. 1938 లో రచించినను, ద్రవ్యాభావముచే క్రీ.శ. 1944 వరకి హరికథ ముద్రణభాగ్యమునకు నోచకొనలేదు. కవి ఈ హరికథను వేంకటేశ్వరస్వామి కంకిత మొసంగెను. క్రీ.శ. 1944 లో సూర్యా పేట నివాసియగు దారండిగ నారాయణగారి ద్రవ్యసాహాయ్యమున హైద్రాబాద్ లోని వాసుదేవ ముద్రాణాలయములో యీ హరికథ ముద్రింపబడినది.

7. సుమాలినీపరిణయము. (నాటకము 1945)

కవి ఈ నాలుగంకముల నాటకమును క్రీ.శ. 1945 లో రచించి వేంక టేశ్వరస్వామి కంకిత మొసంగెను. మహబూబునగరు జిల్లాలోని కల్వకుర్తి తాలూకాయందలి జూపల్లి గ్రామాధికారియైన రంగినేని రామచంద్రరావుగారి ద్రవ్యసాహాయ్యమున ఈ నాటకము ముద్రింపబడినది.

8. మానసప్రబోధశతకము (స్మృతిశతకము 1946)

కవి ఈ శతకమును తన భార్య ఆండాళమ్మ పరమపదించిన తరువాత ఆమె స్మృత్యర్థము రచించెను. క్రీ.శ. 1946లో మిత్రుల ధనసాహాయ్యమున ముద్రించి, భార్య కంకిత మొసంగెను. ఈ శతకము హైద్రాబాదు సుల్తానుబజారు లోని ప్రేమసాగర ముద్రణాలయమున ముద్రింపబడినది.

9. కళ్ళచెర్వు సీతారామచంద్రశతకము. (1948)

ఈ భక్తిశతకము క్రీ.శ. 1948 లో రచింపబడి కళ్ళచెర్వు సీతారామ చంద్రస్వామి కంకిత మొసంగబడినది. పశ్చిమ గోదావరి జిల్లా చింతలపూడి తాలూకా, కళ్ళచెర్వు ముఖాసాదారులు మ॥రా॥శ్రీ రాజా చెలికాని వెంకట్రామ నృసింహభాస్కరరావుగారి ద్రవ్యసాహాయ్యమున, ఏలూరు మంజువాణి ముద్ర ణాలయములో యీ శతకము ముద్రింపబడినది.

10. శ్రీమత్తిరుమలాపుర భోగసుందర సీతారామచంద్రశతకము (1948)

కవి ఈ భక్తిశతకమును క్రీ.శ. 1948 లో రచించి, సీతారామచంద్ర స్వామి కంకిత మొసంగెను. శ్రీ కనుపర్తి లక్ష్మీనరసింహమూర్తి పంతులుగారి ధనసాహాయ్యమున యీ శతకము ముద్రింపబడినది.

11. శ్రీ ఉర్లగొండ లక్ష్మీనృసింహస్తోత్ర తారావళి

ఇరువదియేడు సీసములతో నున్న యీ తారావళిని కవి ఉర్లుగొండ

లక్ష్మీనృసింహస్వామి కంకిత మొసంగెను. ఈ తారావళి బెజవాడ వాణీ ముద్రాక్షరశాలయందు ముద్రింపబడినది. భక్తుల దానమువలన యీ తారావళి ముద్రింపించినట్లు కవి తారావళి చివర చెప్పికొనెను

## 12. మాలతీవసంతము (ప్రబంధము 1949)

ఇది ఐదాశ్వాసముల పద్యకావ్యము. పశ్చిమ గోదావరి జిల్లా, చింతలపూడి తాలూకా, జీలకర్రగూడెము ప్రభువైన మ॥రా॥శ్రీ॥ రాజా రాఘవరాజు రంగరాజు గారి ద్రవ్యసాహాయ్యమున ఏలూరు మంజువాణి ముద్రణాలయములో యీ కావ్యము క్రీ శ 1949 లో ముద్రింపబడినది. ఈ కావ్యకన్యకను పై రాజాగారు దత్తత తీసికొని, సాలంకృత కన్యాదానముగా శ్రీకృష్ణపరమాత్మ కొసంగినట్లు కవి తన కావ్యవిజ్ఞప్తిలో పేర్కొనెను.

## 13. సుచిత్రాభ్యుదయము. (నాటకము 1950)

శ్రీకృష్ణపరమాత్మ కంకిత మొసంగబడిన నాలుగంకముల యీ నాటకమును కవి చాలా కాలము క్రిందట రచించినను, ధనాభావము వలన ముద్రింపబడలేదని కవి తన విజ్ఞప్తిలో పేర్కొనెను. క్రీ.శ. 1950 లో పశ్చిమగోదావరి జిల్లా, చింతలపూడి తాలూకా కొత్తగండిగూడెము మొఖాసాదారుడైన వెల్లంకి పట్టాభిరామస్వామిగారి ద్రవ్యసాహాయ్యమున, ఏలూరులోని మంజువాణి ముద్రాక్షరశాలయందు యీ నాటకము ముద్రింపబడినది.

## 14. శశికళ. (నాటకము 1950)

నాలుగంకముల ఈ నాటకము క్రీ.శ. 1950లో రచింపబడినది. క్రీ.శ. 1956లో పశ్చిమ గోదావరి జిల్లా, చింతలపూడి తాలూకా రంగాపురములోగల ఈదర వెంకయ్య, పట్టాభిరామయ్యగారల ద్రవ్యసాహాయ్యముతో ఏలూరులోగల పట్టాభిరామా ముద్రణాలయములో ముద్రింపబడినది. కవి ఈ నాటకమును రంగాపుర సత్యనారాయణస్వామివారి కంకిత మొసంగెను.

15. నీలోద్వాహము. (ప్రబంధము 1950)

నాలుగాశ్వాసముల యీపద్య కావ్యమును కవి క్రీ.శ. 1950లో రచించెను. క్రీ.శ. 1956 లో శ్రీరంగాపుర సత్యనారాయణస్వామి భక్తులగు ఏలూరు పుర పాలకసంఘాధ్యక్షులగు, రావుసాహెబు బిరుదాంకితులు శ్రీ దామరాజు వెంకట్రావు పంతులుగారి ద్రవ్యసాహాయ్యమున, ఏలూరు ఆంజనేయ పవరు ప్రెస్సులో ముద్రింపబడినది. కవి యీ కావ్యమును కూడ రంగాపుర సత్యనారాయణస్వామి కంకిత మొసంగెను.

16. శ్రీరంగాపుర సత్యనారాయణ శతకము. (1956)

కవి ఈ శతకమును క్రీ.శ. 1956లో రచించి భక్తవరుల ధనసాహాయ్యముచే ముద్రింపించి, రంగాపుర సత్యనారాయణస్వామికే అంకిత మొసంగెను. అయితే యిందలి (27) పద్యములు తన పదునాల్గవయేట వ్రాసితిననియు, మిగిలిన (81) పద్యములు మాత్రము క్రీ.శ. 1956లో పూరించితిననియు, కవి చెప్పుకొనెను. ఈ శతకరచనావ్యాసంగమున మరొక్క విశేషము కలదు. శ్రీమతి రుద్రవరపు కామేశ్వరాంబయందావేశించిన శ్రీ వీరవేంకటసత్యనారాయణస్వామి ఆజ్ఞానుసారము యీ శతకము పూరించినట్లు కవి తన శతకము ముందు విజ్ఞప్తిలో మనవి చేసికొనెను.

17. శ్రీగోదాదేవిస్తవము. (అలభ్యము)

18. ఆచార్యస్మృతి. (అలభ్యము)

19. కళ్ళచెర్వు సీతారామచంద్రస్తోత్రము. (అలభ్యము)

20. పద్మవ్యూహము నాటకము. (అలభ్యము)

21. అనిరుద్ధవిలాసము నాటకము. (అలభ్యము)

22. శ్రీమత్తిరుమల వేంకటేశ్వర అంత్యప్రాస నియమశతకము. (అలభ్యము)

23. శ్రీరంగాపుర శ్రీసత్యదేవస్తోత్రతారావళి. (1957)

కవి ఈ తారావళిని క్రీ.శ. 1957లో రచించి, శ్రీసత్యదేవున కంకిత మొసంగెను. ఈ తారావళి అడవికొలను కామేశ్వరరావు ద్రవ్యసాహాయ్యమువలన ఏలూరులోని పట్టాభిరామా ప్రెస్సులో ముద్రింపబడినది.

24. లలిత. సాంఘికనాటకము (1960) అముద్రితము

నాలుగంకముల యీ సాంఘిక నాటకమును క్రీ.శ. 1960 ప్రాంతమున కవి రచించినట్లు తెలియును. నాటకము పూర్తిగావింపబడినది. అంకితము గుఱించి వివరము లేమియు లేవు.

25. మిత్రవింద పద్యకావ్యము. అసంపూర్ణము, అముద్రితము.

ఈ పద్యకావ్యములో కవి ప్రథమాశ్వాసమును (104) పద్యగద్యములతో పూరించెను. ద్వితీయాశ్వాసములో (20) పద్యగద్యములు వ్రాసియున్నవి. ఇది వీరి చివరి రచన కావచ్చును. దీనిని వ్రాయుచుండగనే వీరు స్వర్గస్థులైరి.

మొత్తముపై యీ కవి రచనలు పైన పేర్కొనినవి ఇరువదియైదు అని తెలియుచున్నది. ఇందు ఇరువదిమూడు రచనలు ముద్రితములు. రెండు అముద్రితములు. ముద్రితములలో ఏడు అలభ్యములు. మానసప్రబోధశతకము తప్ప మిగిలిన వన్నియు భగవదంకితములే. దీనినిబట్టి వీరి జీవితకాలమంతయు రచనా వ్యాసంగములోనే గడిపినట్లు స్పష్టమగుచున్నది. సమయానుకూలముగా పౌరాణికుడుగా, భగద్విషయకాలక్షేపము చేసినట్లుగా సూర్యాపేట, రామగిరిలో శ్రోతలను భక్తితన్మయత్వములో ముంచినట్లు నేటికీ వీరి మిత్రులు, భక్తులు చెప్పు కొనుచున్నారు.

## వేంకటనరసింహాచార్యుల రచనల వర్గీకరణ

ఇంతవరకు ఈ కవి రచనలను రచనాకాలము ననుసరించియు, వీనిని

ముద్రించుటకు కవిపడిన శ్రమను గుఱించియు, ఈ రచనల అంకితము గుఱించియు వివరించనైనది. వీరి రచనలు పరిశీలించినచో వివిధ సాహిత్యప్రక్రియలు చేపట్టి వానిలో తన కవితాశక్తినంతయు రంగరించి, గుమ్మరించినట్లు స్పష్టమగుచున్నది స్థూలముగా వీరి రచనల నీ క్రింది విధముగా వర్గీకరింపవచ్చును.

*I* పద్యకావ్యములు

1. మాలతీవసంతము. (ముద్రితము)
2. నీలోద్వాహము. ( ,, )
3. మిత్రవింద (అముద్రితము, అసంపూర్ణము)

*II* నాటకములు.

1. పద్మవ్యూహము. (ముద్రితము అలభ్యము
2. అనిరుద్ధవిలాసము. ( ,, ,,
3. కూర్మనారాయణచరిత్ర. (ముద్రితము, లభ్యము
4. సుచిత్రాభ్యుదయము. ( ,, ,,
5. సుమాలినీపరిణయము ( " ,, )
6 శశికళ. ( ,, ,, )
7. లలిత (సాంఘికము) (అముద్రితము, లభ్యము)
8. ప్రద్యుమ్నవిజయము (వీథినాటకము, ముద్రితము లభ్యము)
9. సుందరీవిలాసము (ప్రహసనము, ముద్రితము లభ్యము)

*III* లఘుకృతులు, శతకములు.

1. రాఘవశతకము (ముద్రితము అలభ్యము)
2. గోపాలచూడామణిశతకము. ( ,, లభ్యము )
3. కళ్ళెపెళ్ళ సీతారామచంద్రశతకము ( ,, ,, )
4. శ్రీరంగాపుర సత్యనారాయణశతకము ( ,, ,, )
5. మానసప్రబోధశతకము ( ,, ,, )

౮. శ్రీమత్తిరుమలాపుర భోగసుందర సీతారామచంద్ర అంత్యప్రాస శతకము. (ముద్రితము, లభ్యము)

## స్తోత్ర తారావళులు

1. శ్రీగోదాదేవిస్తవము (ముద్రితము అలభ్యము)
2. ఆచార్యస్మృతి ( " " )
3. శ్రీ ఉర్లుగొండ నృసింహస్తవము ( " లభ్యము )
4. రాఘవరాజు రంగరాజుస్మృతి ( " " )
5. కళ్ళచెర్వుసీతారామచంద్రస్తోత్రము ( " అలభ్యము )
6. రంగాపుర శ్రీసత్యదేవస్తోత్రతారావళి ( " లభ్యము )
7. సత్యనారాయణవ్రతము. హరికథ ( " " )

మొత్తముపై పరిశీలింపగా మరింగంటి వేంకటనరసింహాచార్యుల (చతుర్థి) రచనలకు తెలుగు సాహిత్యమున ప్రత్యేకస్థానము కలదని సుస్పష్టమగుచున్నది.



# ప్రబంధ కావ్య ప్రశంస

ఆంధ్ర సాహిత్యములో ప్రబంధప్రక్రియ పదునారవ శతాబ్దినాటికి పరిపూర్ణ వికాసము నొందినది. ప్రబంధ శబ్దము క్రీ.పూ. 7వ శతాబ్దములో పాణిని అష్టాధ్యాయిలో కనిపించుచున్నది.[1] భరతుని నాట్యశాస్త్రములో ప్రబంధ శబ్దము లేదు. కాళిదాసు కాలములో దృశ్యకావ్యములకు ప్రబంధములను శబ్దము రూఢముగా నుండెనని తెలియుచున్నది. కాళిదాసు తన రఘువంశాది కావ్యములను ప్రబంధములుగా పేర్కొనకపోయినను, ఆనందవర్ధనుడు తన ధ్వన్యాలోకములో కాళిదాసు కావ్యములను ప్రబంధములుగ పేర్కొనెను. బాణుని కాలమున దృశ్యకావ్యములే ప్రబంధములుగా కాక, శ్రవ్య కావ్యములు సహితము ప్రబంధశబ్దముతో ప్రచారములో నున్నవి. దండి దశకుమారచరిత్రము, కావ్యాదర్శము, అవంతీ సుందరీ కథలకు ప్రబంధత్రయమని ప్రసిద్ధి జైన బౌద్ధ కవుల పేర మరికొన్ని ప్రబంధములు కలవని తెలియుచున్నవి. రుద్రటుడు తన కావ్యాలంకారములో కావ్యశబ్దమునకు ప్రబంధశబ్దము ప్రయోగించి, ప్రబంధ మనగా కావ్యమనియే స్పష్టపరచెను. రాజశేఖరుని కాలములో నాటకములు గూడా ప్రబంధ నామములతో చలామణియగుచుండెను. భోజుడు రామాయణచంపువును ప్రబంధ మనెను. జయదేవుడు 'గీతగోవింద'మను కావ్యమును ప్రబంధ మనెను. విద్యానాథుడు అలంకారగ్రంథమునకు ప్రబంధనామము వాడెను. రామాయణ మహాభారతాదులలో ప్రబంధ శబ్దము వాడబడినది.

---

1. "నా వద్యతనవ త్క్రియా ప్రబంధసామీప్యయోః"

— అష్టాధ్యాయి. అధ్యాయము-3 పాదము 3, సూత్రము 1651

ప్రబంధమనగా కల్పనా కథయని కొందరర్థము చెప్పుచున్నారు. కాని యీ అర్థ మెందును కన్పించదని డా॥ పల్లా దుర్గయ్య గారు తన ప్రబంధ వికాసములో అభిప్రాయపడిరి. ఆంగ్లములో ప్రబంధమనగా కల్పనాకథ అనగా 'A faigned story' అని అర్థము వ్రాయబడినది. "ప్రబధ్యతే ఇతి ప్రబంధః" కథాబంధము ప్రబంధమనియు, రచింపబడునది కావున ప్రబంధమని వాచస్పత్యము తెలుపుచున్నది. మొత్తముపై ప్రబంధ శబ్దము కడు ప్రాచీనమై క్రీ.పూ. 7వ శతాబ్దినుండి సంస్కృతమున, క్రీ.శ. 12వ శతాబ్దము అనగా నన్నెచోడుని కాలమునుండి తెలుగులో ప్రచారమునకు వచ్చినది.

## పూర్వాంధ్రకవుల ప్రబంధ స్వరూపము - ఒక సమీక్ష

నన్నెచోడుడు ప్రప్రథమమున తన 'కుమారసంభవము'న ప్రబంధశబ్దము నుపయోగించెను. తిక్కన విరాటపర్వములో ప్రబంధమండలియని ప్రయోగించెను కేతన 'దశకుమారచరిత్రము'లో ప్రబంధశబ్దమును ప్రయోగించెను పాల్కురికి సోమన తన 'బసవపురాణము'లో ఒకేఒకచోట ప్రబంధ శబ్దము వాడెను. ఎఱ్ఱన తన 'నృసింహపురాణము'ను ప్రబంధమని పేర్కొనెను. శ్రీనాథుడు భీమేశ్వర పురాణమును పురాణప్రబంధమనియు, హరవిలాసమును శైవప్రబంధమని పేర్కొనెను. ప్రబంధములు ఛందోభేదము ననుసరించి నాలుగు విధములు 1. గద్యప్రబంధము. 2. పద్యప్రబంధము. 3. పద్యగద్యప్రబంధము. 4. ద్విపద ప్రబంధము. వీనిని పురాణ ప్రబంధములు, భక్తిప్రబంధము లని మరల విభజింప వచ్చును. భక్తిప్రబంధములను శైవ, వైష్ణవభేదముచేత తిరిగి రెండువిధములుగా విభజింపవచ్చును. శృంగారరసమునే ఆధారముగా చేసికొని శృంగారప్రబంధ మని మరియొక భేదము కలదు.[1]

## ప్రబంధ నిర్వచనము

1. అల్లసాని పెద్దన అభిప్రాయానుసారము పురాణోక్తములును, కలి ధ్వంసములు నగు రసనమంచిత కథలను శిరీషకుసుమ పేశల సుధామయోక్తులతో వినసింపుగా చెప్పిన చతురరచనము ప్రబంధము.

1. ప్రబంధవాఙ్మయవికాసము. 66 పుట డా॥ పల్లా దుర్గయ్య.

2. ధూర్జటి "నవ్యభాషా శతధా నిగుంభన రసస్థితి నొప్పుదలిర్పగా" చెప్పిన కావ్యము ప్రబంధ మనెను.

3. "సాలంకారవర్ణన ప్రబంధ" మని శ్రీకృష్ణదేవరాయలు పలికెను.

4. "సకలలక్షణలక్షితంబును, అపూర్వకథాసంవిధానవైచిత్రీమహనీయంబును, శృంగారరసప్రాయంబును, పుణ్యవస్తువర్ణనాకర్ణనీయంబును, ప్రబంధ" మని పింగళి సూరన నుడివెను.

5. "పురాతన పుణ్యశ్లోక రాజర్షివర్ణనాకర్ణనోత్కంఠిత సకలజనసేవ్యముగా రసోచితచమత్క్రియాకల్పనాకల్పభవ్యముగా నొనర్పబడిన కేవల కల్పనలుగాని, మిశ్రకథలుగాని ప్రబంధము" అని రామరాజభూషణుడు సిద్ధాంతీకరించెను. దీనినే తెనాలిరామకృష్ణుడు, పిల్లలమర్రి పినవీరనలు సమర్థించిరి.

మొత్తముపై ప్రబంధమును నిర్వచించుటలో ప్రబంధకవులందరు యించుమించు యేకాభిప్రాయము కలిగియున్నారని తోచుచున్నది. తమతమ కావ్యములలో చూపించు నవ్యతాగుణములలో యించుక భేదము కనిపించుచున్నది సూరన తప్ప మిగిలినవారందరు ప్రబంధకథను పురాణములనుండి గ్రహింపవలెననిరి. ఆ పురాణకథ నిర్లేగాక, కవి తన యుక్తి చమత్కారకల్పనావిశేషములతో నలంకరించి మిశ్రకథగా చెప్పవలెననిరి. ప్రబంధకవులందరు వీనిని పుణ్యకావ్యములు, భవ్యకావ్యములని నుడివిరి.[1] కొందరు ప్రబంధములను పుణ్యశ్లోక రాజర్షివర్ణనలతో నుండవలయుననగా, మరికొంద రుత్తమశ్లోకులైన వైష్ణవ, శైవ దేవతావర్ణనలతో నొప్పవలయుననిరి.[2] కొందరు కథావైచిత్రికి ప్రాధాన్యము నొసంగిన, మరికొందరు కల్పనాచమత్కృతికి ప్రాధాన్యము నొసంగిరి.

## ప్రబంధ లక్షణములు

ఆంధ్రమున మొట్టమొదటి ప్రబంధలక్షణములు విన్నకోట పెద్దన తన "కావ్యాలంకారచూడామణి"లో చెప్పెను. ప్రబంధమందు పదార్థభావసంఘటనము

1. ప్రబంధవాఙ్మయ వికాసము డా॥ పల్లా దుర్గయ్య 82 పుట.
2. " " " "

అనగా చక్కని కూర్పు ముఖ్యమని చెప్పెను. కావ్యమున అష్టాదశవర్ణన లుండవలెనని సంస్కృతాలంకారికులు చెప్పిన లక్షణములు ప్రబంధములకు చెప్పి, అట్టి వర్ణనలు గల కావ్యములే భవ్యప్రబంధములని పేర్కొనెను. అప్పకవి ఇరువదిరెండు వర్ణన లుండవలెనని పేర్కొనెను. ప్రబంధములోని అంగిరసము శృంగార ముండవలెను. రాజే నాయకుడుగా నుండవలయును.

## ప్రబంధ వికాసము

అల్లసాని పెద్దన మొదటి ప్రబంధము రచించినను, అంతకుపూర్వ మిట్టి లక్షణములు గల కావ్యములు లేవనుట సత్యదూరమగును. నన్నయాదుల పురాణ స్వతంత్రానువాదములం దావాపింపబడిన ప్రబంధబీజములు, శ్రీనాథాదుల రచనలలో మొలకెత్తి బోదెవెట్టి, పెద్దననాటికి పెనువృక్షమై. శాఖోపశాఖలుగా విస్తరిల్లెను. అనువాదయుగమును పరిశీలించినపుడు యీ కాలపు సాహిత్యములో మూడు ముఖ్యవిషయములు పదునారవ శతాబ్దమునందలి ప్రబంధవికాసమునకు తోడ్పడినవని చెప్పవచ్చును. అందు మొదటిది అనువాదకవుల స్వతంత్రేచ్ఛ. రెండవది వారు వర్ణించిన శృంగారకథలు. మూడవది వారి రచనలలోని కావ్య వర్ణనలు. కావున ముఖ్యులైన కొందర నువాదకవులరచనలు ప్రబంధవికాసమునకు తోడ్పడిన అంశము నిట్లు పరిశీలింపవచ్చును.

### నన్నయభట్టు

భారతాంధ్రీకరణములో మార్పులు చేర్పులు కొన్ని శ్లోకముల కనువాదము చేయకుండ విడుచుట మరికొన్ని సంగ్రహముగా అనువదించుట చూడ నన్నయ అనువాదవిషయమున స్వాతంత్ర్యము నవలంబించినట్లు స్పష్టమగుచున్నది. ఈ సందర్భమున డాక్టరు పల్లా దుర్గయ్యగా రిట్లు వచించిరి.

"అనువాదమున పెంచుట, త్రుంచుట యను నిట్టి గుణములే తరువాత ...ల రచనలలో ముఖ్యముగా శ్రీనాథాదుల రచనలలో మరింత విస్తృతినొంది, ...రి కావ్యములకు ప్రత్యేక రూపములను ప్రసాదించి ప్రబంధప్రాయము లనిపించి ...గాబోవు ప్రబంధములకు మార్గదర్శకము లైనవి. కావున ప్రథమాంధ్రానువాద

కవియగు నన్నయభట్టే స్వతంత్ర కావ్యమగు ప్రబంధమునకు ప్రప్రథమమున మార్గదర్శియయ్యెనని చెప్పవచ్చును.[1]

## తిక్కన

అనువాదవిషయమున తిక్కన కూడా స్వతంత్ర ధోరణినినుసరించెను. ప్రముఖాంధ్రసాహిత్యవిమర్శకులనేకులు తిక్కన భారతాంధ్రీకరణముగూర్చి ముఖ్యముగా విరాటపర్వానువాదముగూర్చి విమర్శించి, అందు తిక్కన చూపిన స్వేచ్ఛను గుఱించి తమ అభిప్రాయములను వెల్లడించి యున్నారు.[2]

తిక్కన భారతము సంస్కృత భారతమునకు భాషాంతరీకరణ మను కొనుట గొప్ప పొరపాటనియు, సంస్కృతభారతమను బంగారుముద్దనుండి వలసినంత బంగారము తీసికొని, స్వర్ణకారుని బుద్ధివైభవముతో చేయబడిన స్వర్ణకమలము వంటిదీ యాంధ్రమహాభారతమని కొమఱ్ఱాజు లక్ష్మణరావు పంతులుగారి అభిప్రాయము.[3]

## ఎఱ్ఱన

ఆరణ్యపర్వశేషమును పూరించిన ఎఱ్ఱన సాక్షాత్ప్రబంధపరమేశ్వరుడే. ఈయన నన్నయ తిక్కనల అనువాదస్వాతంత్ర్యము ననుసరించుటయే గాక, వర్ణనలకు మార్గదర్శకుడయ్యెను. నృసింహపురాణము కథ బ్రహ్మాండాది పురాణాదులనుండి గైకొనినను, వివిధ కావ్యవర్ణనలు చేసి, దీనినొక స్వతంత్రకావ్యముగా రచించెను. రామాయణ భాగవత కవులచ్చటచ్చట నూతన వర్ణనముల చేయుచు ప్రబంధశైలిలో నడిపించిరి.

## శ్రీనాథ మహాకవి

పురాణయుగమునకు ప్రబంధయుగమునకు మధ్యగల పదునైదవ శతాబ్ది శ్రీనాథయుగముగా ఆంధ్రసాహిత్యచరిత్రలో పేర్కొనబడినది. ఇతర కవు

---

1. ప్రబంధవాఙ్మయవికాసము, డా॥ పల్లా దుర్గయ్య 165 పుట.
2. ఆంధ్రకవులచరిత్ర, మొదటి భాగము.
3. ఆంధ్రకవితరంగిణి. భాగము (2) 188 పుట.

లెవ్వరును శ్రీనాథుడు రచించినన్ని గ్రంథములు రచింపలేదు. ఈతని గ్రంథము లనువాదములే యైనను, విశిష్టమైన స్వతంత్రరచనామార్గము ననుసరించుటచేతను ప్రబంధవర్ణనలకు శ్రీనాథుని రచనలలోగల వర్ణనలకు సారూప్య ముండుటచేతను, ప్రబంధవికాసమునకు శ్రీనాథుని రచనలు విశిష్టమై మార్గదర్శకములుగా నుపయుక్తమైనవని చెప్పవచ్చును. ఇందువలన కొందరు సాహిత్య విమర్శకు లీ శ్రీనాథయుగమును పురాణ, ప్రబంధయుగములకు సంధియుగముగా పేర్కొనిరి. శ్రీనాథుని భీమఖండ, కాశీఖండములు శైవభక్తి లేక శైవక్షేత్రమహాత్మ్యమును తెలుపు గ్రంథములు. అనంతర ప్రబంధయుగమునందలి కాళహస్తి మాహాత్మ్యము, పాండురంగ మాహాత్మ్యములను భక్తిప్రబంధముల రచనలకు మార్గదర్శకములైన గ్రంథము లివి. హరవిలాసము శ్రీనాథుని స్వతంత్రరచనయే యైనను, కాళిదాసు కుమారసంభవ కావ్యప్రభావము కొంత యీ కావ్యముపై బడినదని చెప్పవచ్చును. కొంత ఖండానువాదము, మరికొంత స్వతంత్రరచన కలిగి తరువాతి ప్రబంధరచనకు ప్రేరణ కలిగించినదని చెప్పవచ్చును.

శ్రీనాథుని రచనలన్నింటిలో ప్రబంధరచనమునకు విశేషముగా దోహదముచేసిన దీతని శృంగారనైషధము. శ్రీహర్ష నైషధము సంస్కృతమున మిక్కిలి ప్రసిద్ధి గాంచినది. వస్తు, నాయక రసాదులందేగాక, కవితావిషయము నందును, సంస్కృత నైషధము పూర్తిగా ప్రబంధమార్గమునకు పరమావధిగా నున్నది. శృంగారనైషధము అనువాదగ్రంథమగుటచే ప్రబంధ లక్షణము లుండియు, మొదటి ప్రబంధము కాలేకపోయినది. శ్రీనాథుడు తన అనువాదము లందు పూర్వులగు పురాణకవులందరి కంటెను, విశేష స్వాతంత్ర్యమును వివిధ రీతుల కనబఱచి, తరువాతవారికిని ముఖ్యముగా ప్రబంధకవులకు మార్గదర్శకు డయ్యెను. ఇట్లాంధ్రమున ప్రబంధమార్గమున పునాదులను దృఢపరచినవారిలో శ్రీనాథుడు ముఖ్యుడు. ఈతని విశేషఖ్యాతి ననుసరించి తరువాతి కవులును, ముఖ్యముగా ప్రబంధకవులు శ్రీనాథు ననేకవిధముల ననుకరించిరి.

### పిల్లలమఱ్ఱి పినవీరభద్రుడు

శ్రీనాథుని అనంతరము జీవించిన కవులలో పిల్లలమఱ్ఱి పినవీరభద్రుడు ప్రబంధమార్గమున కతిసన్నిహితుడని చెప్పవచ్చును. శ్రీనాథునికంటె అనువాద

పద్ధతిలో నెక్కుడు స్వాతంత్ర్యము వహించి, యీ కవి ప్రబంధయుగపు కవుల కత్యంత సన్నిహితుడైనాడని చెప్పుట కితని శృంగారశాకుంతలమే ప్రమాణము. కృత్యవతారికలో కవి "మిశ్రప్రబంధ మగా శాకుంతలం బను ప్రబంధము చెప్ప బూనుకొని"నట్లు కలదు. పినవీరభద్రుడు భారతకథను కావ్యముగా రూపొందింప దలచి, కాళిదాసు నాటకకథను కొంత గ్రహించి, స్వబుద్ధిచే కొంత కల్పించి, స్వీయకవితాచమత్కృతిచే దాని నొక చక్కని స్వతంత్రకావ్యముగా నాంధ్రమున వెలయించి, సంస్కృత నాటకమును కావ్యప్రబంధముగా తీర్చిదిద్దుటలో నొరవడి పెట్టెను. ఇట్లు పినవీరన తన ప్రతిభననుసరించి శృంగార శాకుంతలమును మిశ్రప్రబంధముగా తీర్చిదిద్దెను.

క్రీ.శ. 16 వ శతాబ్దములో శ్రీకృష్ణదేవరాయల కాలమున ప్రసిద్ధిచెందిన ప్రబంధములు వెలసినవి. అష్టదిగ్గజకవులని ప్రశస్తిగాంచిన కవులలో ఒకరిద్దరు తప్ప మిగిలినవారందరు శ్రీకృష్ణదేవరాయల ఆస్థానము నలంకరించినవారే. ప్రథమాంధ్ర ప్రబంధమని ప్రసిద్ధి గాంచినది మనుచరిత్ర. స్వారోచిషమనుసంభవ మను నామాంతరముగల యీ ప్రబంధకథను పెద్దన మార్కండేయపురాణము నుండి గ్రహించి, తనకుగల ప్రతిభతో నొక చక్కని శృంగారప్రబంధముగా తీర్చిదిద్దెను.

ఆంధ్రభోజుడని కీర్తిగాంచిన శ్రీకృష్ణదేవరాయలు ఆముక్తమాల్యద (విష్ణుచిత్తీయము) అను ప్రబంధమును ద్రావిడ ప్రబంధాంతర్గత గోదాదేవికథ నాధారముగ ప్రౌఢప్రబంధముగా రచించెను. ఇందలి కథలు ప్రధానకథకు సంబంధము లేకపోయినను, తన విశేషపరిజ్ఞానము నుపయోగించి కవి ప్రధాన కథతో సంబంధము కలిగించెను.

రామరాజభూషణుని వసుచరిత్రలో గిరికా వసురాజుల వివాహము వర్ణితము. శ్రీకాళహస్తి మాహాత్మ్యము శైవభక్తి ప్రబంధము. దీనిని మహాకవి ధూర్జటి రచించెను ఈ ప్రబంధము క్షేత్రమాహాత్మ్యప్రతిపాదితము. పింగళి సూరన కళాపూర్ణోదయము కల్పనాప్రబంధము. తెనాలి రామకృష్ణకవి పాండురంగమాహాత్మ్యము పుండరీక క్షేత్రమాహాత్మ్యమును వర్ణించునది. ఇది వైష్ణవభక్తి ప్రబంధము. స్కాందపురాణాంతర్గతంబగు పుండరీకస్థలమాహాత్మ్య మిందు వర్ణింపబడినది.

అనంతర ప్రబంధయుగమునం దావిర్భవించిన మరియొక శృంగార ప్రబంధము విజయవిలాసము. చేమకూర వేంకటకవి కృతము. రాధికాసాంత్వన మను శృంగారప్రబంధము ముద్దుపళని రచితము. ఈమె భాగవతాంతర్గత రాధా కృష్ణుల కథను ప్రబంధముగా మలచినది.

ఇంతవరకు ప్రబంధస్వరూపము, నిర్వచనము, వికాసములగుఱించి క్లుప్త ముగా చర్చించనైనది. ఈ ప్రబంధవికాసము దృష్టితో (చతుర్థి) వేంకటనరసింహా చార్యుల ప్రబంధములను పరిశీలించు టవసరము. అదియే ప్రస్తుతాంశము.

ఆసూరి మరింగంటి వేంకటనరసింహాచార్యులు (చతుర్థి) మూడు ప్రబంధ ములు రచించిరి. 1. మాలతీవసంతము 2. సీలోద్వాహము 3. మిత్రవింద. వీనిలో మొదటి రెండు ముద్రితములు. మూడవది మిత్రవింద అముద్రితము, అసంపూర్ణముగనున్న ప్రబంధము. వ్రాతప్రతి పరిశీలనార్థము గ్రహింపబడినది.

## మాలతీ వసంతము

మాలతీవసంతమను ప్రబంధము శ్రీరాజా రాఘవరాజు రంగరాజు[1] గారి ధన సాహాయ్యముతో ముద్రింపబడినది. దీనిని ఆచార్యులవారు రాఘవరాజు రంగ రాజునకు దత్తపుత్రికగా నొసంగి, శ్రీకృష్ణపరమాత్మ కంకిత మొసంగెను. ఈ అంకితవిధానము పరిశీలింపదగినది.

### కథాంశము

మాలతీవసంతము ఐదాశ్వాసముల కావ్యము. ఇందలి కథాంశము పురా ణేతివృత్తప్రధానము.

భద్రపురమను సౌభాగ్యవంతమైన పట్టణమును మణిభద్రుడను సూర్య వంశపు రాజు పరిపాలించుచుండెను. ప్రభావతి యాతని భార్య. ఆ రాజు ధర్మ మును నాలుగుపాదముల నడిపించుచుండెను సంతానములేక ఆ రాజదంపతలు వ్రతములు, క్రతువులు, దానధర్మములు చేయుచు శ్రీహరిధ్యానమగ్నులై యుండిరి.

1. పశ్చిమగోదావరి జిల్లా చింతలపూడి తాలూకాలోని జీలకర్రగూడెము సంస్థా నాధిపతి. ముద్రణ క్రీ.శ. 1949.

మణిభద్రు డొకనాడు పేరోలగమున నుండ ఫలసిద్ధమహర్షి విచ్చేసెను. రాజుచేసిన అతిథిసత్కారములకు సంతుష్టుడై, మహర్షి రాజుకోరిక యెట్టిదైనను తీర్తుననెను. మణిభద్రుడు తనకు సంతానము ప్రసాదింపుడని ప్రాధేయపడెను. ఫలసిద్ధిమహర్షి రాజున కష్టాక్షరీమంత్రము నుపదేశించి, విధివిధానములు వచించెను.

రాజదంపతులు అష్టాక్షరీమంత్రమును జపించుచు, నియమము ననుసరించి దానధర్మములు చేసిరి. కొన్ని దినములకు ప్రభావతి గర్భము ధరించి, పండు వంటి బాలుని కనెను. రాజదంపతులు సంతసించి, పురోహితునిచే నా బాలునికి వసంతుడని నామకరణము చేయించిరి. ఈ సందర్భమున రాజు భూదాన, గోదాన, హిరణ్యదాన, అన్నదానములు చేయించెను. శుక్లపక్ష క్షపాకరునివలె పెరుగు చున్న యా రాకుమారున కుపనయన విద్యాభ్యాసములు గావించి, అనతికాలము లోనే సకలశాస్త్రపారంగతు డగునట్లు రాజు గురువుల నేర్పాటుచేసెను. మంత్రి కుమారుడగు బుద్ధిసాగరునితో రాజకుమారుడు విలువిద్య మున్నగు శాస్త్రములందు నిష్ణాతుడయ్యెను.

వసంతు డొకనాడు తండ్రి యనుమతి గైకొని, బుద్ధిసాగరునిగూడి, ససైన్యుడై జైత్రయాత్రకు బయలుదేరెను. మార్గమధ్యమున వివిధదేశాధీశుల జయించి వారిచే కప్పములుగొని, మార్గమునగల భారద్వాజాశ్రమము చేరెను. భారద్వాజముని ఛాత్రులతో విద్యాభ్యాసము చేయించుచు, క్రతువు లాచరించు చుండెను. వసంతుడు మహర్షిని సందర్శించి, వినయముగా పాదాభివందన మాచ రించి, ఆశీస్సుల నొందెను. అతిథిమర్యాదల నొంది విశ్రమించెను.

మరునాడు భారద్వాజుడు వసంతునితో తన ఆశ్రమప్రాంతమున దుర్మార్గు డగు రక్తదంతుడను రాక్షసుడు తన అనుచరులతో మునులను హింసించుచు, క్రతువులకు విఘ్నము కలిగించుచున్నాడని తెలిపి, వానిని సంహరించి ఆశ్రమ వాసుల కాపాడుమని కోరెను. వివిధాయుధముల ప్రయోగోపసంహారముల నుప దేశించుటయేగాక, రాక్షసమాయల ఛేదించు 'మాయావినాశినీ' మంత్రము గూడా ఋషి రాజకుమారున కుపదేశించి, ఆశీర్వదించి పంపెను.

వసంతుడు బుద్ధిసాగర సమేతుడై సైన్యముతో రక్తదంతునితో యుద్ధ మొనర్పుటకు వెడలెను. వసంతుడు మొదట రక్తదంతుని అనుచరుల మడియించి,

అనంతరము రక్తదంతునితో తలపడెను. అతడు రాక్షసునిపై వివిధాయుధముల ప్రయోగించినను, రాక్షసుడు వానికి ప్రతిక్రియలు చేసి, రాక్షసమాయలచే వసంతుని విరథుని గావించెను. చివరకు వసంతుడు అర్ధచంద్రశరముచే నా రక్త దంతుని శిరము ఖండించెను. దేవతలు ఋషులు సంతసించి, వసంతుని ప్రస్తుతింప భారద్వాజుడు శిష్యులతో వచ్చి వసంతు నాశీర్వదించి, త్వరలో నొక సుందరిని వరించెదవని పలికి వీడ్కొలిపెను. వసంతుడు సైన్యముతో కొంతదూరము ప్రయాణించి, కుంతలదేశరాజధాని సమీపమున సైన్యమును విశ్రమింపజేసి, బుద్ధి సాగరునితో సమీపమునగల ఉద్యానవనములో విహరించుచుండెను.

కుంతలదేశాధీశు డుదయార్కుడు మణిభద్రునకు సామంతుడు. ఈతని కుమార్తె మాలతి అతిలోకసుందరి చెలికత్తెలతో ఆ సమయిమున పుష్పాపచయ మున కుద్యానవనమునకు వచ్చెను. సంగీతసాధనచేయుచు పూదోటలో వీణ వాయించుచుండ, వసంతు డా మధురగానమువిని, అచ్చోట చేరి, ఆమె సౌందర్య మునకు ముగ్ధుడయ్యెను. ఆమె యందలి మోహముచే రాకుమారుడు పరవశుడై ఆమె చెంతకు చేరి వివరము లడిగెను. రాకుమారికూడ వసంతుని అందచందముల కాకర్షితయై సిగ్గుచే తలవంచుకొనెను. వీరిరువురు పరస్పరముగల ప్రేమను వెల్లడించుకొనుచుండగా చెలికత్తెలు వచ్చిరి. ఆరాత్రి మాలతీవసంతులు విరహ వేదన ననుభవించిరి. వారు చంద్ర మన్మథోపాలంభము లొనర్చిరి. ఇట బుద్ధి సాగరుడు వసంతుని, అట చెలికత్తెయగు మదనమంజరి మాలతిని సాంత్వన మొనర్చిరి.

మరునాడు మంత్రి కుమారుడు ఉదయార్కుని సభకేతెంచి, వసంతు ఆగమనము, రాక్షసవధ, మాలతినిజూచి ప్రణయోద్విగ్నుడగుట, మున్నగు వి యములుతెలిపి, వసంతునితో మాలతి వివాహము జరిపించుడని కోరెను. అంద లకు రాజు సంతసించి కుమార్తె అభిప్రాయము కూడ యిందు కనుగుణముగ నున్నదని మదనమంజరి చెలికత్తెవలన తెలిసికొనెను. రాజు వసంతునొద్దకు వచ్చి వివిధాభరణములతో సత్కరించి, అంతఃపురమునకు తీసికొనిపోయెను. ఆస్థాన జ్యోతిష్కుల రావించి వివాహముహూర్తము నిర్ణయించి, శుభలేఖలు వ్రాయించి మణిభద్రునకు పంపెను. శుభలేఖలు చూచి మణిభద్రుడు సంతసించి, వివిధాభర ణములు, క్రొత్త పట్టువస్త్రములు తీసికొని, కుటుంబపరివారసహితుడై కుంతలదేశ

రాజధాని చేరెను. వివాహపు టేర్పాట్లు చురుకుగా నిర్వహింపబడెను. సుముహూర్తమునకు మాలతీవసంతుల నభ్యంగనము చేయించి, మంగళవాద్యములతో వివాహవేదికపై కూర్చుండబెట్టిరి. పురోహితుల వేదమంత్రములతో వివాహము జరిపించి, వసంతునిచే మాలతిగళమున మంగళసూత్రధారణ చేయించిరి. వివాహము జరిగిన ఐదురోజులు యథావిధిగా కన్యాదాత నిరతాన్నదానము చేయించెను. అమూల్యాభరణములు, దాసదాసీ జనములు, కరితురగాదుల నల్లున కరణముగా నొసంగెను. శోభనముగది నలంకరించి, మాలతీవసంతుల ప్రథమసమాగమమున కేర్పాట్లు చేయబడెను. మూడురాత్రులు నూతనదంపతులు సుఖభోగముల నోలలాడిరి. తదనంతరము వసంతుడు తల్లిదండ్రులతో భార్యతో సపరివారుడై, భద్రపురమునకు తిరిగిపోయెను. మణిభద్రుడు తన కుమారునకు పట్టాభిషేకము చేసి, వానప్రస్థాశ్రమమునకు వెళ్ళెను. వసంతుడు ప్రజలను కన్నబిడ్డలవలె కాపాడుచు, వర్ణాశ్రమ ధర్మముల రక్షింపుచు, సుఖసంతోషములతో రాజ్యపాలన చేయుచు, ప్రపంచములో గొప్ప సార్వభౌముడుగా ప్రసిద్ధిగాంచెను. మాలతీవసంతమునందలి కథాసారాంశ మిది.

## కథాసంవిధానము

ఈప్రబంధకథ పూర్తిగా కల్పితమేయైనను, కొన్ని సన్నివేశములు, పాత్రచిత్రణములు ప్రాచీన కావ్యగాథల ననుసరించి యున్నవి. అయినను ఆ పాత్రలకు యీ కావ్యపాత్రల కెట్టి సంబంధము లేదు. ధర్మరక్షణార్థము ఋషులు యజ్ఞయాగాదులు చేయుచు, అధర్మవినాశమునకు, దుష్టశిక్షణకు రాజుల తోడ్పాటు గ్రహించుట ప్రాచీనకాలమునుండి వచ్చుచున్న సంప్రదాయము భారద్వాజముని రక్తదంతుడను రాక్షసుని చంపించుటకు వసంతుని సహకారము పొందుట, వసంతునకు కావలసిన అస్త్రశస్త్రముల ప్రయోగోపసంహారములు బోధించుట, రాక్షస మాయలు తొలగించుటకు 'మాయావినాశినీ' మంత్ర ముపదేశించుట, తద్వారా రక్తదంతుని చంపించుట కలదు. ఈ సన్నివేశము రామాయణమున విశ్వామిత్రుడు రామలక్ష్మణులద్వారా తాటకి, మారీచ, సుబాహువుల చంపించుటను తలపించును. సంతానములేని రాజదంపతులు మునుల నాశ్రయించి, పుత్రకామేష్టి మున్నగు యజ్ఞము లాచరించి సంతానము పొందుటయు ప్రసిద్ధమైన అంశమే. ఈ ప్రబంధ

ములో రాజదంపతులు ఫలసిద్ధి మహర్షి అష్టాక్షరీ మంత్రోపదేశమువలనను, దాన ధర్మములు చేయుటవలనను సంతానము పొందినట్లు కవి కల్పించెను.

యుద్ధవర్ణన విషయములో కవి రామాయణ, మహాభారతాదుల యుద్ధ వర్ణనల నాదర్శముగా గ్రహించెను. రక్తదంతవసంతుల ద్వంద్వయుద్ధ మిందుల కుదాహరణము. అస్త్రశస్త్రముల ప్రయోగోపసంహారములు, ఒకరి యస్త్రముల నొకరు ఖండించి విరథులను చేసిన విధము, అర్ధచంద్రబాణప్రయోగము మున్నగు సన్నివేశము లీ సందర్భమున గమనింపదగినవి.

వసంతుడు రక్తదంతుని చంపిన తరువాత భారద్వాజుడు ఆశ్రమవాసులతో నేతెంచి, వసంతు నాశీర్వదించి, త్వరలో నొక అతిలోకసుందరిని వరించగలవని పలికి వీడ్కొ [illegible] మునసే దేవతలు సంతోషముతో పుష్పవర్షము
చకము లగుచున్నవి. అంతిగోః
ుందుసాగుటకు దోహద మొనర్చు
సంతుడు కుంతలదేశముపోవుట,
ము జరుగుట మున్నగు వానిని
సంవిధానములో కవి ప్రదర్శించిన
ఉద్యానవనములో సంగీతసాధన
థాసంవిధానమున కుపయుక్తమైన

కావ్యప్రయోజనములలో ఆనందము ఒకటి అని లాక్షణికుల అభిప్రాయము కవి మాలతీవసంతముద్వారా నీ ప్రయోజనము సాధించెను. ఆధునికకాలములో ఆద్య సత్కథల గైకొని ప్రబంధములు రచించుట మాని, కల్పనాకథలచే ప్రబంధముల్లుటకు పూనుకొని కవి కృతకృత్యుడయ్యెను. ఇరువదవ శతాబ్ద ప్రథమార్ధభాగమున ఆంగ్లేయ సాహిత్యప్రభావమువలన వర్ణనాబాహుళ్యము గల [illegible]
రొరవడినవి. ఈ సమయమున
ల్పితకథను సృజించి, ప్రాచీన
ానవిధముగను, ప్రబంధనిర్మాణము కొన
ాగా సర్వాలంకారశోభితమైయున్నది. ఇందు ప్రతి

పద్యము సంస్కృతాంధ్రశబ్దసమ్మిశితమై యున్నది. నారికేళ ద్రాక్షాపాకముల రుచి నాస్వాదింపజేయుచు, పండిత పామర హృద్గ్రాహ్యమగుచు, ముదావహమొన రించుచున్నదనుటలో సందియము లేదు. ఆధునికకాలములో ప్రబంధరచనలు కొఱతయను అపవాదును తొలగించి కవి యీ ప్రబంధమును పాండిత్యస్ఫోరక ముగా పాఠకుల కందించెను.

పాత్రపోషణ

ఈ ప్రబంధములో వసంతుడు నాయకుడు. మాలతి నాయిక. ఈ రెండు పాత్రలు కవి కల్పితములే. పూర్వగాథలలోగాని, పురాణములలోగాని, యెచటను యీ పాత్రలు కనిపించవు. ఈ ప్రబంధములో వసంతుడు ధీరోదాత్తుడు.[1] ఇతడు రాజకుమారుడు సర్వశాస్త్రపారంగతుడు, వినయశీలి, సుక్షత్రియుడు. యవ్వనము ప్రవేశించగనే క్షత్రియధర్మము ననుసరించి జైత్రయాత్రకు తండ్రి యనుమతితో బయలుదేరెను. రక్తదంతసంహారమువలన ఈతని ధర్మాభినిరతి, ఆశ్రమరక్షణ కర్తవ్యము, అధర్మసంహారము, ధర్మరక్షణము మున్నగునవి వ్యక్తమగుచున్నవి.

రాజకుమారులకు గాంధర్వము, రాక్షసము మున్నగు వివాహములు సహజములేయైనను, వసంతుడు మాలతిని చూచి మోహించిన సందర్భమున కవి యీ నాయకపాత్ర పోషించిన తీరు మిక్కిలి ఉదాత్తముగా నున్నది. ఉద్యానవనములో మాలతి సోయగమును చూచి, ఆకర్షితుడై ఆమె గానమునకు ముగ్ధుడై పరవశించి యా రాజకుమార్తె వృత్తాంతము తెలిసికొనెను. ఆమెకు తనయెడగల ప్రేమను గ్రహించి కౌగిలించుకొనుట కుంకించియు, చెలికత్తెల రాకవలనను, నైతికధర్మము ననుసరించియు, సంయమనము పొంది ఆ ప్రయత్నము విరమించెను. మరుసటి రోజు మంత్రికుమారుడు బుద్ధిసాగరుని రాజుదగ్గరకు పంపి, తమ ప్రేమవృత్తాంతము తెలియపరచి వివాహప్రయత్నము చేయించెను. కుంతలదేశాధీశుడు తమకు సామంతరాజైనను సముచితగౌరవ మొసంగెను. వినయవిధేయతలతో వివాహ ప్రయత్నమున కుంకింపజేసిన వసంతుని ఔన్నత్యము చాటుటకు కవి ప్రయత్నించిన తీరు ఉదాత్తముగా నున్నది.

---

1. రాజులు నృపులు ధీరలలితనాయకులు, నాట్యశాస్త్రము, (704) పుట పోణంగి శ్రీరామఅప్పారావు.

ఈ ప్రబంధములో నాయిక మాలతి. ఈమె శృంగారనాయిక. రాకుమారుని పత్ని లలితగుణసంపన్న అత్యంతసౌందర్యవతి. గానకళలో ఆరితేరిన ముగ్ధ పుష్పాపచయము చేయుచు, చెలికత్తెలతో ఉద్యానవనమున విహరించుట ఈమె కలవాటు. కులస్త్రీల కుండవలసిన లక్షణము లీమెకు వన్నె కూర్చినవి. ఉద్యానవనములో వసంతుని చూచిన మాలతి యాతని సోయగమున కాకర్షితురాలయ్యెను. ఏకాంతముగా తన వివరము లతనికి తెలిపి, తన ప్రేమను ధైర్యముగా నా రాకుమారునకు తెలియపరచెను. రాకుమారు డుద్రేకములో కౌగిలింప ప్రయత్నించినపుడు నివారించిన సంయమనశీల. తనకు వసంతునిపై గలిగిన ప్రేమ విషయము తల్లిదండ్రులతో ధైర్యముగా చెప్పి వివాహప్రయత్నము చేయించిన ఉదాత్త. ఈమె వివాహానంతరము శోభనముగదిలో భర్తతో సుఖించిన సన్నివేశమున కవి యీమె నొక ప్రౌఢనాయికగా చిత్రించెను. ప్రబంధములో మిగిలిన పాత్రలను అనగా మణిభద్రుడు ప్రభావతి, ఫలసిద్ధమహాముని, భారద్వాజమహాముని, ఉదయార్కుడు, రక్తదంతుడు మున్నగువారిని కవి సందర్భోచితముగా పోషించెను.

## వర్ణనలు

ప్రబంధములలో అష్టాదశవర్ణన లుండవలయునని లాక్షణికుల మతము. మాలతీవసంతకర్త వేంకటనరసింహాచార్యులు యీ ప్రబంధములో పుర, ప్రయాణ, వన, ఋతు, సూర్యోదయ, చంద్రోదయ, విప్రలంభ, వివాహ, పుత్రోత్పత్తి, నాయకాభ్యుదయము, యుద్ధము, రతోత్సవము, మంత్రము మున్నగు వర్ణనలు చేసెను. సముద్రము, మధుపానము, ద్యూతము, శైలము, వర్ణనల కిందవకాశము లేదు. సరోవరము, నిశి, నది, ఆశ్రమము మున్నగు వర్ణనలు కవి సందర్భోచితముగా కావించెను. అష్టాదశవర్ణనల నియమ మున్నను కొందరు కవులు వానిలో కొన్నింటిని వర్జించి, మరికొన్నింటిని సందర్భోచితముగా చేర్చిరి. ఇట్టి వారిలో చతుర్థి వేంకటనరసింహాచార్యు లొకరు. సామాన్యముగా కవులు పురవర్ణన చేయునపుడు సౌధ, ప్రాకార, ఆరామ, అశ్వ, గజ, రథశాలలను విపులముగా వర్ణింతురు. వేంకటనరసింహాచార్యు లీ సందర్భము నిట్లే వర్ణించెను. భద్రపురవర్ణన దీని కుదాహృతము.

[1]సీ॥ జాతరూపస్తంభ సౌధాంచలస్నిగ్ధ
గాంగేయకలశాళి కాంతితోడఁ
గమనీయ నవరత్న కలితాలయోన్నత
ప్రాకార సోపాన పంక్తితోడ
వరనందనారామ భాసిత హసితోరు
పరిమళోర్వీరుహ వనులతోడఁ
గరిహయస్యందన శరచాపచక్రాది
సాధనశాలల సమితితోడ

గీ॥ రత్నమండపగోపురప్రతతితోడ
సురనదినిఁ దెగడెడు సరిత్ఝరులతోడఁ
బాకశాసను వాసమౌ స్వర్గపురినిఁ
బరిహసింపగఁజాలు నా భద్రపురము

బంగారు స్తంభములచే నిర్మింపబడిన సౌధముల పై గల బంగారు (కలశముల) గోపురముల కాంతితోను, శ్రేష్ఠమైన నవరత్నములచే కట్టబడిన ఉన్నతమైన ప్రాకారములకు కట్టిన సోపానపంక్తులతోను, నందనవనములోగల పరిమళవృక్షములతో సమానమైన వృక్షములుగల వనములతోను, కరులు, హరులు రథములు, శరచాపచక్రాది వివిధసాధనములతో నిండిన శాలలతోను, దేవనదిని పరిహసించెడు నదీనదములతోనున్న భద్రపురము దేవపురిని పరిహసించునట్లుండెనట. కవి భద్రపురమును వర్ణించిన తీరు పరిశీలించినచో మన కనేక ప్రధానవిషయము లవగతమగును. భద్రపురమును పాలించు రాజు మణిభద్రుడు. ఈయన చక్రవర్తి. భూమండలములోగల రాజులందరు ఈయనకు సామంతులు. వీరి పురములు చక్రవర్తి పురముముందు న్యూనముగా నుండును. కావున భద్రపురమును కవి భూమండలములో గల యితరపురములతో పోల్చలేదు. స్వర్గపురి శ్రేష్ఠమైనది. కవి భద్రపురమునకు మిక్కిలి శ్రేష్ఠత్వ మాపాదించుటకు స్వర్గపురిని పరిహసించుచున్నదని వర్ణించెను. ఇంతేగాక యీ నగరమునందలి నదులు దివిజగంగను తెగడున ట్లున్నవని చెప్పుటచే యీ పురము పరిపాలించు రాజు మణి

1. మాలతీవసంతము ప్ర. ఆ. 27 పద్యము

భద్రుడు దేవేంద్రునికంటె ఉన్నతుడని చెప్పుట కవి అభిప్సితమనిపించును. ఈ పురశోభను పొగడుటకు శేషఫణికి గూడా సాధ్యము కాదనుట యీ అభిప్రాయమున కుపబలకముగా నున్నది.

ఈ సందర్భమున మనుచరిత్రకారుడు అరుణాస్పదపురములోగల బ్రహ్మ, క్షత్రియ, వైశ్య, శూద్ర, వేశ్య, పుష్పలావికల నొక సీసపద్యములో క్లుప్తముగా వర్ణించెను.[1]

(అచటి విప్రులు మెచ్చ రఖిలవిద్యాప్రౌఢి .. ...........
........... .. ....అచట బుట్టిన చిగురుకొమ్మైనఁ జేవ.)

కాని వేంకటనరసింహాచార్యు లీ సందర్భమున పై జాతులవారిని వేర్వేరు పద్యములలో విపులముగా వర్ణించెను. వైశ్యజాతుల వర్ణన ఇట్టిది.

[2]సీ॥ సంతతోరఃస్థల స్థాయియై శ్రీరమా
ధీశుండు ఋణబాధఁ దీర్పఁడయ్యె
నిత్యానుభూతుడై నీలకంఠుం డిల
భిక్షాటనముఁ జేయ వెరవడయ్యె
నిఖిలంబు సృజియింప నేర్పుగల్గిన ధాత
గుడిగుండములు లేక మిడుకనయ్యె
ధనవంతుడను కీర్తి గొనిన కుబేరుండు
మృడుని విశ్వాసంబు విడువడయ్యె

గీ॥ అనుచు బింకంబు లాడుచు నతిశయించి
యుల్ల మలరెడు సిరులచే వెల్లి విరియఁ
గృషిని వాణిజ్యమును సల్పి కీర్తి వడసి
పరిఢవింతురు తత్పురి వైశ్యు లరయ

భద్రపురములోని వైశ్యులు వ్యవసాయములో, వాణిజ్యములో ఆరితేరిన వారై సిరిసంపదలతో తులదూగుచుండిరట నేటు వ్యవసాయము ప్రధానముగా

1. మనుచరిత్ర. ప్ర. ఆ. 50 పద్యము.
2. మాలతీవసంతము. ప్ర. ఆ. 31 పద్యము.

యితరవర్ణములవారు చేయుచున్నను, ఇరువదవ శతాబ్ద ప్రథమార్ధమున వైశ్యులు వాణిజ్యముతోపాటు వ్యవసాయముగూడా ప్రధానవృత్తిగా స్వీకరించిరని చెప్పుట కీ వర్ణన తోడ్పడుచున్నది. ఇంత ఉదాత్తభావములను కవి యీ పురవర్ణనలో ప్రవేశపెట్టి, ఆ పట్టణములోని వైశ్యుల సంపదను మిక్కిలి మనోజ్ఞముగా వర్ణించెను.

భద్రపురములోని కామినులను కవి వర్ణించిన వైచిత్రి ఇట్లున్నది.

[1]సీ॥ " సారంగముల తీరు సారంగములఁ గేరు
కర మొప్పు నడకలు కన్నుగవలు
చక్రంబులనుబోలు చక్రంబులను నేలు
చక్కని పిరుదులు చన్నదోయి
కాంచనంబును మీరు కాంచనంబును దూరు
వరదేహకాంతులు పరిమళములు
పుష్కరంబుల రీతి పుష్కరంబుల భాతి
కరచరణంబులు గౌనులరయ

గీ॥ రాజరుచినొప్పు వదనముల్ రదనములును
భృంగములకీడు నూగారు ముంగురులును
కదళికాస్తంభముల మించఁ గలుగుఁ దొడలు
దనర వర్తింతు రా ప్రోలి వనితలెల్ల "

ప్రతి చరణములో ఒకే పదమును రెండు మారు లుపయోగించి, భిన్నార్థములను సాధించుటలో కవి కృతకృత్యుడయ్యెను. వసుచరిత్రకారుడు తిమ్మరాజును వర్ణించినపుడు వ్రాసిన సీసపద్యము [2] నీ కవి అనుకరించెనని తోచును.

1. మాలతీవసంతము. ప్ర. ఆ. 36 పద్యము.
2. సీ॥ "ధాత్రీశ్వరులుగాని ధాత్రీశ్వరులు గారు..................
...............తిమ్మవిభు డాజి దోహలుండు."
వసుచరిత్ర ప్ర. ఆ. 41 పద్యము

ఇంతేగాక వేంకటనరసింహాచార్యు లీ నగర వర్ణన సందర్భమున స్త్రీలలోను అన్ని వర్ణములవారిని వేరువేరు పద్యములలో వర్ణించుట గమనింపదగిన విశేషము.

సూ ర్యో ద య వ ర్ణ న

ప్రబంధములలో సూర్యోదయవర్ణనలకు కవులు ప్రధానస్థాన మొసంగిరి. ద్యుమండలదేవతలలో సూర్యునకు ప్రత్యేక వైశిష్ట్యము కలదు. ఈ ప్రబంధములో ప్రథమాశ్వాసమున వసంతుడు చైత్రయాత్రారంభమునకు పూర్వము కవి సాయంకాల, నక్షత్ర, చంద్రోదయ వర్ణనల పిదప సూర్యోదయవర్ణన గావించిన తీరు సందర్భోచితముగా నున్నది.

1సీ॥ "పూర్వాశ యనుకాంత ముఖమునఁ గీలింప
పొసగిన కుంకుమ బొట్టనంగ
హరునిపాదాబ్జంబు లర్చింప నుమ చేతఁ
బూనిన దాసానిపువ్వనంగ
గురుతరకాఠిన్య కుచపాత నీరజా
స్త్రముల మొక్కలు దీర్చు సానయనగ
ఘనతరక్రోధుడై దనుజులఁ బరిమార్ప
శౌరి ప్రయోగించు చక్రమనగఁ

గీ॥ జటుల భయదోగ్రమౌ తమఃపటల మడపఁ
గోరి దివియొడ్డిన ఫిరంగి గుండనంగఁ
జెత్త మలరించు పగడపు గుత్తి యనగ
సురవిభునిదిశ బాలోష్ణకరుడు బొడిచె"

ఇందు కుంకుమబొట్టు, దాసాని పుష్పము, సాన, చక్రము, ఫిరంగిగుండు, పగడపుగుత్తి యను ఉపమానములు సూర్యబింబమను ఉపమేయమునకు వాడబడిన వి ఈ ఉపమానముల ప్రయోగ మీ సందర్భమున మిక్కిలి ఉదాత్తముగా నున్నది. సీసములోని మూడవ పాదములో కవి చక్కని ఊహ ప్రవేశపెట్టెను. రాత్రి సమయమున మన్మథుడు బాణములెక్కుపెట్టి స్త్రీల వక్షోజములపై వేయుట

1. మాలతీవసంతము. ప్ర. ఆ. 146 పద్యము.

వలన తెల్లవారువరకా బాణములు మొక్కవోయినవనియు, తిరిగి సాయంత్రము వరకా బాణములను పదను పెట్టుటకు కావలసిన సానగా సూర్యు డుపయుక్తమగుచున్నాడని కవి వర్ణించుట రమణీయముగానున్నది. గతములోగల మొదటి రెండు చరణములలో భయంకర తిమిరమును పారద్రోలుటకు ఆకాశమునుండి పడిన ఫిరంగిగుండుగా కవి వర్ణించుట వినూత్నమైనది. శ్రీనాథుడు భీమేశ్వర పురాణములో చేసిన సూర్యోదయవర్ణనను పోలిన దీ వర్ణన.[1] వేంకటనరసింహాచార్యులు సూర్యుని వర్ణించినతీరు యిందలి ఉపమానములు వినూత్నమైన రీతిలో చేయబడినది. ఇంచుమించు కవులందరు సూర్యోదయ వర్ణనను సీసపద్యములలో వర్ణించుట స్పష్టము. సూర్యబింబమును పదును పెట్టు సానతో పోల్చుట, చీకటిని చీల్చుటకు ఫిరంగిగుండుతో బోల్చుట యీ రెండును కవి నూతనోపమానములనుపయోగించెననుట యథార్థము. తిక్కన[2] పెద్దన[3] లనీ సూర్యోదయ వర్ణన సందర్భములో కవి అనుకరించెను. అంత్యప్రాసలతో సీసపద్యము లొకే విధముగా నుండుటవలన యీ విషయము సమర్థింపవచ్చును.

సూర్యోదయవర్ణననే కవి ద్వితీయాశ్వాసములో అలతి అలతి పదములచే గీతపద్యములో వర్ణించిన విధానము కవి సందర్భోచితవర్ణనకు తార్కాణము.

"[4]గీ॥ పూర్వ పశ్చిమ పర్వత పురుషయుగము
నిపుణతను గ్రీడఁ దేలగ నిలచి చేతఁ
బట్టినటువంటి యెట్టని బంతియనగ
అంబరంబున రవి దోచె సంబరమున"

---

1. సీ॥ "ప్రథమ సంధ్యాంగనా ఫాలభాగంబునఁ
జెలువారు సింధూరతిలకమనగ.........భాను డుదయించె
దేదీప్యమానుడగుచు." భీమేశ్వరపురాణము ద్వి. ఆ. 49 పద్యము

2. సీ॥ "నీరజాకరములు నిష్ఠమై చేసిన భవ్యతపంబుల ఫలమనంగ
..........భానుబింబంబు పూర్వాద్రిపై వెలింగె"
ఆం. మ. భారతము విరాటపర్వము. ద్వి. ఆ. 24 పద్యము

3. సీ॥ "సకుటుంబముగ వీరి చరమశైలము చేరు.........వేగుచుక్క పొడిచె"
మనుచరిత్ర, తృ. ఆ. 54 పద్యము

4. మాలతీవసంతము. ద్వి. ఆ. 36 పద్యము

ఇచట సూర్యబింబమును కవి బంతితో పోల్చెను. సూర్యుడు ప్రతినిత్యము తూర్పున ఉదయించి పశ్చిమమున అస్తమించును. ఈ సామాన్యవిషయమునే కవి క్రీడావిశేషముగా పోల్చి వర్ణించిన రీతి మిక్కిలి రమణీయముగా నున్నది.

చంద్రోదయవర్ణన

ప్రబంధకవులు చంద్రోదయవర్ణనలకు ప్రత్యేకప్రతిపత్తి నొసంగిరి. చంద్రోదయవర్ణనను వేంకటనరసింహాచార్యులు యీ ప్రబంధములో రెండు సందర్భములలో (12) పద్యములలో వర్ణించెను. ప్రథమాశ్వాసములో నొకమారు, తృతీయాశ్వాసములో మరియొకమారీ కవి చంద్రోదయవర్ణన గావించెను. తృతీయాశ్వాసమున వసంతుడు రక్తదంతుడను రాక్షసుని సంహరించిన తరువాత కవి చేసిన చంద్రోదయవర్ణన కథాగమనమున కనుకూలముగను, సందర్భోచితముగ నున్నది.

"[1]చ॥ పరబలనాయకుండయిన వైరిశరాళికిఁ దాళలేక దు
ర్భరపరితాపమున్గొని బలాయన మొందు స్వకీయసైన్యము
న్బురికొని మొగ్గరంబునకు మోహరిలం దగు యోధుడో యనన్
సరసిజవైరి రిక్కలకు సైగలొనర్చుచు వచ్చె మింటికిన్."

శత్రుసైన్యము నాశముచేయుచున్న వీరుని శస్త్రాళికి భరింపలేక పరితాపముతో పలాయనమై పోవు స్వసైన్యమును పురికొల్పుకొని యుద్ధమునకు వచ్చు ప్రతివీరునట్లుగా చంద్రుడు నక్షత్రములకు సైగలుచేయుచు ఆకాశమునకు వచ్చెనట.

సూర్యుడు కమలబాంధవుడనియు, చంద్రుడు కలువలరేడనియు, కవులు వర్ణింతురు. అదే విధముగా సూర్యుడు కలువల శత్రువనియు, చంద్రుడు సరసిజ వైరియనియు అనుట కవిసమయము. కవి పై పద్యములో మరొక విశేషము గూడా నిక్షిప్తముచేసినట్లు తోచును. సూర్యుడు పగలంతయు తన వాడికిరణముల చేత చంద్రుని అనుచరులైన చుక్కలను పారదోలుటవలన, భయముతో అక్కడక్కడ ఆకాశములో కనిపించు నక్షత్రములకు తోడ్పడుటకు ఆకాశమున రాత్రి

1. మాలతీవసంతము. తృ. ఆ. 82 పద్యము

సమయమున చంద్రుడు ఉదయించి, రిక్కలకు ధైర్యము కలిగించుటయేగాక, సూర్యునికి ప్రతికక్షిగా నిలబడి, తన అనుచరులను (రిక్కలను) ఉత్సాహపరచి, రాత్రియంతయు నిశ్చింతగా నుండునట్లు తన ప్రతాపము (చంద్రిక) చే కలువలకు, నక్షత్రములకు ఆనందము కలిగించుచున్నాడు. ఇది కథాసందర్భమున కనుగుణ ముగా నున్నది. దుర్మార్గుడైన రక్తదంతుడను రాక్షసుని సంహరించుటకు స్వసైన్య మును పురికొల్పి, చివరకు రాక్షసుని చంపి విశ్రమించు వసంతుని విషయ మిచట కవి పైపద్యములో చక్కగా ధ్వనింపజేసెను.

ప్రథమాశ్వాసములో కవి చంద్రోదయవేళ చేసిన చంద్రికావర్ణనము సుమధుర భావనకు తార్కాణము.

"[1]గీ॥ గగన కామిని విభుని రాకడను చూచి
సిగ్గు వలపును బెనుగొన జిత్తమందు
ధౌతవసనంబు ముసుగుగా దాల్చె ననగ
బండువెన్నెల లంతట నిండియుండె."

పలువురు ప్రబంధకవులు తమ కావ్యములందు చంద్రికను బహువిధములుగా వర్ణించియుండిరి. కాని యీ కవి కృత చంద్రికావర్ణనము అపూర్వముగా నున్నది. గగనమును కామిని యనుట, చంద్రుని విభుడనుట అతని రాక ముగ్ధయగు నాయికయందు వలపుతోడి సిగ్గును పెంచగా నామె తెల్లని వస్త్రమును తలపై ముసుగుగా ధరించెనని భావించుట శృంగారరసపుష్టికి హేతువై మధురోత్ప్రేక్షగా భాసించి సహృదయరంజకమగుచున్నది. నాయిక విభుని రాకకు తెల్లని ముసుగు దాల్చిన అంశము మధురముగా నున్నది.

ఉ ద్యా న వ ర్ణ న

ఈ ప్రబంధములో (13) పద్యగద్యములలో ఉద్యానవర్ణన గలదు. ఉద్యానములు, నగరములకు, అంతఃపురములకు అలంకారప్రాయములు. సాధా రణముగా నాయికానాయకులు కలిసికొనుట కీ ఉద్యానవనములు సంకేత స్థల

1. మాలతీవసంతము. ప్ర. ఆ. 132 పద్యము.

ములుగా నుపయోగించుకొందురు. ఈ ప్రబంధములో మాలతీవసంతుల ప్రథమ సమావేశమున కీ ఉద్యానవన ముపయుక్తమైనది. ఇంతేగాక ప్రేయసీప్రియుల అనురాగోద్దీపనమున కీ ఉద్యానము లుపకరించును. కావుననే కవులు ఉద్యానవన వర్ణనలకు తమ కావ్యములలో సముచితస్థాన మొసంగిరి. ఈ ప్రబంధములో కుంతలాధిపుని ఉద్యానవనవర్ణనలో భావశబలత కలదు.

"[1]గీ॥ బహుళ లతికాంగనమణు ల్పవను డనెడు
మరుని ధాకల కోర్వక విరహతాప
మునను జోకుచుఁ బాదపపురుషతతిని
కౌగిలించిరో యన నొప్పుగాంచ నచట. "

పై పద్యములో ఉద్యానవనమందలి నానావిధములైన లతలు మన్మథుడను వాయువు తాకిడికి తట్టుకొనలేక వృక్షముల కల్లుకొనినవి. వృక్షములను లత లల్లుకొను దృశ్యము మిక్కిలి రమ్యముగా కవి ఉత్ప్రేక్షించెను.

యుద్ధవర్ణన

ఈ ప్రబంధములో వసంత రక్తదంతుల యుద్ధము. (47) పద్యగద్యము లలో వర్ణింపబడినది. ఈ యుద్ధములో నానావిధాయుధోపయోగములు, ఉప సంహారములు, రథగజతురగపదాతులు నుగ్గగుట, రక్తప్రవాహములో తేలియాడు మున్నగు బీభత్సదృశ్యములు కవి యీ సందర్భమున వర్ణించెను. వసంతుని సైనికుల వీరాలాపములు, రాక్షససైన్యము దుందుడుకుచర్యలు, కవి మిక్కిలి రసవత్తరముగా వర్ణించెను. వసంతరక్తదంతుల ద్వంద్వయుద్ధము, శస్త్రాస్త్రముల ప్రయోగోపసంహారములు, వీరాలాపములు, ఒకరినిమించి మరియొకరు యుద్ధము చేయుట కవి కన్నులకు గట్టినట్లుగా వర్ణించెను. ఈ సందర్భమున మకుటాయ మానమైన కొన్ని పద్యము లివి.

[2]సీ॥ "శరముల తాకున సంభవించెడు నగ్ని
కణములు బిడుగులై గ్రాలుచుండ

1. మాలతీవసంతము తృ. ఆ. 88 పద్యము
2. మాలతీవసంతము తృ. ఆ. 22 పద్యము

మహితాస్త్ర సంధాన మౌర్వీనినాదంబు
పరికింప నురుముగా బరిఢవిల్లఁ
బొలుపుమీరిన శిలీముఖసంచయంబులే
యిల వ్రాలు వర్షధారలును గాగ
హయఖురక్షుభితమౌ యవనీపరాగంబు
ఘనతర గాఢ మేఘముగఁ దనర

గీ॥ దనుజగళముక్త శోణితంబును గణింప
వసుధ ప్రవహించు సెలయేరు పగిది మించి
తోచుచుండెను నయ్యెడ జూచువారి
కద్భుతాశ్చర్యమోదంబు లావహిల్ల "

"[1]సీ॥ ప్రధనభూమిని గూలు భద్రేభనికరముల్
గ్రాహంబులోయన నూహఁజూప
రణములో విరిగిన రథపతాకంబులు
శైవాలములరీతి ఠీవిఁ గొలుప
నావహంబునఁ ద్రెళ్ళు అశ్వంబు లొక్కట
మీనంబులోయన గానుపింపఁ
గదనస్థలిం బడు కరపాదఖండముల్
కూర్మాకృతులభంగిఁ గొమరుదీర్ప

గీ॥ నిటుల సమరాబ్ధి ఘోరమై యెసగ నందు
భూత భేతాళ గణములు ప్రీతి మీర
స్నానపానంబులను సల్పి సమ్మదమున
నృత్య మొనరింపుచుండెను నేర్పుఁ గదుర. "

ఇందు మొదటి పద్యములో రణరంగములో బాణము లొకదానికొకటి తగులుటవలన కలిగెడు అగ్ని కణములు పిడుగులవలె ప్రకాశించుచుండెను. మహాస్త్రములు సంధించునపుడు వింటి నారీధ్వని మేఘగర్జనముగా అతిశయిల్లెను.

1. మాలతీవసంతము తృ. ఆ. 23 పద్యము

కనుచూపుమేర దాటిపోయిన బాణసముదాయమే తిరిగి భూమిమీద పడునపుడు వర్షధారలుగా కనిపించుచుండెను. గుఱ్ఱపు డెక్కల తాకిడికి భూమిపై గల దుమ్ము పైకి లేచి, గాఢమగు మేఘముగా కన్పట్టుచుండెను. రాక్షసకంఠములు తెగుట వలన చిమ్ము శోణితము భూమిపై ప్రవహించు నదులమాదిరిగా తోచుచుండెను. ఇట్టి యుద్ధభూమి చూచువారి కద్భుతాశ్చర్యములు కలుగుచుండెనట.

ఇక రెండవ సీసపద్యములో యుద్ధభూమిలో కూలిన భద్రగజములు మొసళ్ళే యనున ట్లుండెను. యుద్ధములో విరిగిన రథములు, పతాకములు నీటిలో గల పాచి మాదిరిగా కనిపించుచుండెను. ఆహవములో పడిన తురంగములు చేపలవలెను, కరపాదఖండములు తాబేళ్ళ మాదిరిగను చూపట్టుచుండెను. ఇట్టి భయంకర యుద్ధభూమియను సముద్రమున భూతభేతాళగణయులు స్నానపానములు చేయుచు సంతోషముతో నృత్యమొనరించుచుండెనట.

పై రెండు సీసపద్యములలో కవి సమరభూమిలో గల బీభత్సదృశ్యము లను కన్నులకుగట్టినట్లుగను, సందర్భోచితముగను వర్ణించెను. ఇవి తిక్కన వర్ణనల కనుగుణములు.

"[1]సీ॥ బాణాది హేతిసంపాతజాతములగు మంట లర్కాం
శుల.............క్రమ్మ రక్తపూరంబులు ఘోరంబుగాగ "

"[2]సీ॥ కాలువలై పారు కీలాల జలములు............
కరపదంబుల నవఖండకములును. "

[3]సీ॥ కరి కళేబరములు..................నెత్తురు వెళ్ళువనీకుల
భూషణస్తోమాస్థిచయమున తిమురులినుక. "

---

1. ఆం. మ. భారతము. ద్రోణపర్వము, ప్ర. ఆ. 139 పద్యము
2. " " " " 386 "
3. " " " " 128 "

"1సీ॥ నెత్తుట జోగియు నిగిడి పోరెడి వీరు..................
సంగరాంగణము రమణీయమును భీషణము నయ్యె."

తిక్కన యుద్ధవర్ణన గావించు సందర్భమున ముఖ్యముగా భయానక బీభత్స దృశ్యములు వర్ణించు సందర్భమున సీసపద్యములు వ్రాయుట స్పష్టము. ఈ ప్రబంధములో కవి యుద్ధభూమిని అదేవిధముగా కనులకు గట్టినట్లు వర్ణించెను. ఈ సందర్భమును కవి తిక్కన యుద్ధవర్ణనలు పుణికిపుచ్చుకున్నట్లు వర్ణించినాడని చెప్పుటలో సందేహము లేదు. యోధుల వీరాలాపములు, వివిధాయుధోప సంహారములు, విరథుల గావించుట, మూర్ఛపుచ్చుట, అర్ధచంద్రబాణ ముపయోగించుట, మున్నగు విషయము లీ అంశమును బలపరచుచున్నవి. యుద్ధవర్ణన గావించు సందర్భములలో ప్రబంధకవులను గాక యీ కవి తిక్కననే అధికముగా అనుకరించినాడని తోచును.

ఋతు వర్ణన

ఈ ప్రబంధములో కవి వసంతఋతువును నామమాత్రముగా తృతీయాశ్వాసములో వర్ణించెను. వసంతుడు రక్తదంతుడను రాక్షసుని సంహరించి, ససైన్యుడై, కుంతలాధిపుని పట్టణసమీపమునగల ఆరామములో విడిది చేసినపుడు కవి వసంతఋతువును వర్ణించుట ప్రణయసన్నివేశములకు అనుగుణముగా నున్నది.

"2గీ॥ బహుళ రోగార్తు డౌషధప్రాప్తివలన
బాధ నెడఁబాసి సుఖమును బడసినట్టు
లెండిపోయిన వృక్షంబు లెల్లఁ దీగె
లపుడుఁ జిగురించె మధుమాస మావహిల్ల."

"3సీ॥ తన నామధేయంబుఁ దాల్చివచ్చిన జేని
సత్కరింపంగ వసంతు డనెడు

1. ఆం. మ. భారతము. శల్యపర్వము, ప్ర. ఆ. 129 పద్యము.
2. మాలతీవసంతము. తృ. ఆ. 98 పద్యము
3. మాలతీవసంతము, తృ. ఆ. 99 పద్యము.

భూజాని సెలవిడ భూజ లతాంగనల్
    శుకముల పల్కులు సొబగుఁ జెంది
సొంపైన కెంజిగురు కెంపులు దాపిన
    రమ్యపత్రపు పళ్ళెరములయందు
వికసిత సూన దీపిక లొప్పుగాఁ గూర్చి
    ధృతిమీర మంగళారతుల నీయఁ

గీ॥ జాలుగను నిల్చి రనుభ్రాంతి సందడింపఁ
గనులపండువుఁ గొలుపు నవ్యనవిచిత్ర
ములను చెక్కులు దిలకించి భూవిభుండు
నగణితాశ్చర్యమగ్నుడై యలరుచుండె. "

నానారోగములచే బాధపడు రోగికి ఔషధసిద్ధివలన రోగబాధపోయి సుఖము కలిగినట్లు, మధుమాసము వచ్చుటవలన ఎండిపోయిన వృక్షములు తీగెలు చిగురించినవట.

తన సనామ్ని వసంతుడనెడు రాజు వచ్చుటవలన, వసంతఋతువను రాజు అతిథిని సత్కరించుట కాజ్ఞాపించెను. ఆవనములోగల వృక్షములు, తీగెలు చిలుకపలుకులతో నలరి, అందమైన చిగురు కెంపులు దాపిన చక్కని ఆకులనెడు పళ్ళెరములయందు వికసించిన పుష్పములు చక్కగా కూర్చి, మంగళారతులిచ్చుటకు వరుసగా నిలబడినవని భ్రాంతి కల్పించెను. ఆ వనసీమ చిత్రవిచిత్రములను చూచి వసంతు డాశ్చర్యమగ్నుడయ్యెనట.

రోగి కౌషధము లభించనిచో రోగము ముదిరి ప్రాణము పోవును. ఔషధ ప్రాప్తివలన రోగము తగ్గి సుఖము చేకూరును. అదే విధముగా మధుమాసాగమనము (వసంతఋతువు) వలన అంతకుముందు హేమంతములో ఆకులు రాలి మోడులుగా నున్న వృక్షలతాదులు చిగురించినవని కవి వర్ణించుట సందర్భోచితముగా, సహజసుందరముగా నున్నది.

కవి వర్ణించు ఋతువు వసంతఋతువు. ఆ వనమునకు విచ్చేసిన రాకుమారుడు వసంతుడు. అతిథిమర్యాదలు చేయవలసిన బాధ్యత వసంతఋతువు (రాజు)

పైనున్నది. కావున తన భృత్యవర్గమైన శుకపికముల, వృక్షలతాదుల కత డాజ్ఞాపించి, సత్కారము చేయించెను. వరుసగానున్న వృక్షలతాదులు తమకుగల చిగురుటాకులు, పుష్పములు మంగళారతులగా అతిథిసత్కారము గావించి వసంతు నాశ్చర్యపరచినవని కవి ఊహించి వర్ణించుట మిక్కిలి రమణీయముగా శోభిల్లుచున్నది. వసంతఋతువులో వృక్షలతాదులు చిగురించుట, పుష్పించుట సహజసిద్ధమైనను, వసంతరాకుమారుడు ఆ వనమునకు వచ్చుటవలన, వసంత వసంతఋతువు ఆజ్ఞ (రాజాజ్ఞ) చే అతిథిసత్కారము గావించుటకొఱకే అవి (వృక్షలతాదులు) వరుసగా నిలబడి హారతులిచ్చుచున్న ట్లూహించుట సమయోచితముగను, సహేతుకముగ నున్నది. ఇట కవి వర్ణించిన మలయమారుతము హృద్యముగ నున్నది.

"[1]సీ। తన హయం బిటనుండు ననియెంచి పువుబోండ్ల
ముఖచంద్ర బింబము ల్తొంగిచూచుఁ
తన హరి చూపు లీ తావు నుండెనటంచు
సారసాక్షుల నేత్ర చలన మరయుఁ
తన తేజి పోకడ లనుకరించె నటంచుఁ
గాంతల నడతల వింతలెంచు
తన వాహనంబని వనితల కుచకుంభ
కలితమౌ సాంకవగంధ మంటు

గీ॥ మోదకలనప్రభావవిస్ఫూర్తిఁ గలిగి
ధరను మధుమాసశోభను స్థిరమొనర్చి
రాగవిభ్రమగంధపరాగపటల
మునను మలయ సమీరుండు దనరుచుండె."

మలయసమీరుండు తన హయమిటనుండునని స్త్రీల ముఖబింబములలోకి తొంగి చూచును. తన తురగము చూపు లీ ప్రదేశమున నుండునని స్త్రీలలోచనముల చలనము చూచును. తన తేజి పోకడ లిట్లుండునని స్త్రీలనడకల నెంచును. తన

1. మాలతీవసంతము. తృ. ఆ. 102-పద్యము.

వాహనంబని వనితల కుచకుంభముల నంటియుండు జవ్వాజి నంటును. సంతోషముతో భూమిపై మధుమాసశోభను స్థిరపరచుటకు అనురాగముతో సువాసనల వెదజల్లు పరాగపటలమును గూడి మలయ మారుతముండెనట. వసంతఋతువుతోపాటు మందమారుతవర్ణనము భావుకుల చిత్తము రంజిల్ల చేయుచున్నది.

వి యో గ వి ర హ వ ర్ణ న లు

ప్రథమపరిచయానంతరము ఆ రాత్రి అంతఃపురములో మాలతి, వనములో వసంతుడు విరహవేదన ననుభవింతురు. కవి వసంతుని విరహము (10) పద్యగద్యములలో, మాలతి విరహము (37) పద్యగద్యములలో విపులముగా వర్ణించెను. ఈ సందర్భమున చంద్ర, మన్మథ, మలయమారుతోపాలంభములతో కవి వర్ణించిన తీరు ప్రశంసనీయముగా, సందర్భోచితముగా నున్నది.

"[1]సీ॥ పికజాల మధ్వర్యు నికరమై భాసిల్ల
శుకములు హోతలై శోభిలంగ
మత్తాళి ఝుంకృతుల్ మంత్రంబులై యొప్ప
పూదోట సవనార్హ భూమి గాగ
కామప్రపారంబు ఘనఘృతంబటుఁగూర్చి
తన ధనుఃకాండంబు దర్విఁ బట్టి
లలితప్రసూనముల్ లాజాక్షతలఁ జేసి
తా సోమయాజియై దనరి మరుడు

గీ॥ యాగపశువులరీతి నా యవనిపతిని
రాకుమారిని భావించి ప్రాకటముగ
మోహమను త్రాట బిగగట్టి బొదవిపట్టి
విరహ యాగాగ్నిలోపల వ్రేల్చె నపుడు."

ఇచట విరహమును యజ్ఞమున కన్వయించి వర్ణించిన రీతి హృద్యము.

మాలతి విరహవేదన ఇట్లు వర్ణితము.

---

1. మాలతీవసంతము. చ. ఆ. 52 పద్యము.

"[1]మ॥ సరవి న్నాదు కపోలచుంబనకళాసంతృప్తి నర్థించు నీ
కరనీరేజముల న్విదల్చుకొని మూర్ధస్వాంతనై చేటి కా
తురత న్నిన్నెడబాసి, నిష్ఫల మనోదోదూయనై యిప్ప డీ
విరహోద్రేకభరంబున న్భొగలు తన్వి న్గావు ముర్వీశ్వరా."

అంతఃపురములో మాలతి విరహవేదన ననుభవించుచు, వసంతునితో తనకు ఉద్యానవనమున కలిగిన అనుభవము దలచుకొని (ఆలింగన, చుంబనాదులు లొలగించుకొనిన విధము) విరహవేదన ననుభవించుచుండెను. ఈ విరహవేదన నుండి కాపాడుమని వసంతు నర్థించుచు తన తప్పిదమునకు విచారించుట మాలతికి వసంతునియందు గల ప్రేమకు చక్కని దృష్టాంతము.

తరువాత మాలతి విరహవేదన భరింపలేక చంద్రోపాలంభము, ఆ తరువాత మన్మథోపాలంభము చేసిన సందర్భమున కవి వర్ణించిన తీరిట్లున్నది.

"[2]చ॥ ప్రళయదవాగ్నికీలికలభంగి భవత్కిరణప్రసారముల్
మలమలమాడ్చి నా తనువు మారణహోమ మొనర్చుచుండె నో
కలువలజేడ నా యుసురు గాంచి కృశింతువు నొక్క పర్వడి
న్బలువడి సర్పదంష్ట్రముల బాల్పడు దోయి నిశాధిపాధమా."

ప్రళయకాలదావాగ్నిజ్వాలలవంటి నీ కిరణముల వలన నా శరీరము మల మల మాడ్చి హోమముచేయుచున్న వో కలువలజేడ యీ నా యుసురు తగిలి యొకపర్వదినంబున నీవు సర్పదంష్ట్రలపాలబడి కృశింతువని మాలతి చంద్రుని శపించెనట.

"[3]గీ॥ కుసుమశరీర నీకు వనితలయుసురు తగిలి
హరుని ఫాలాగ్నికీలల ధరను ద్రెళ్ళి
మరల బ్రతికితి వా రతీతరుణి కరుణ
వలన లేకున్న మా కిట్టి పాటు గలదె."

---

1. మాలతీవసంతము, పం. ఆ. 14 పద్యము.
2. " " " 25 "
3. " " " 31 "

"[1]సీ॥ నీ కరంబున దాల్పు నెగడు కోదండంబు
ధరణిపై దునియలై విరిగి కూల
నీకు సాయ మొనర్పు నిపుణత జ్జెరిన
భటతండములు చెల్లపాలుగాను
నీ. ధనుస్సంధాన నిశితాస్త్రశస్త్రముల్
కమలారి ధాకల కుమిలిపోను
నీ కార్యభారంబు నిర్వహింపగ(జాలు
పరమాప్త వర్యుని హిమ బ్రమింగ

గీ॥ విరహిణీజనమారణభరుడవగుచు(
బఱగు నీ దేహ మగ్నిలోపలను గలయ
తగదు నీ కిట్టి దుర్బుద్ధి తగదు తగదు
సత్ప్రవర్తనమును గొమ్ము శంబరారి."

మాలతి వసంతుని వలన కలిగిన విరహవేదన ననుభవించుచు, మొదట చంద్రోపాలంభము గావించి, పిదప మన్మథోపాలంభము గావించెను. మన్మథుడు విరహిణీస్త్రీలను వేధించుటవలన వారి ఉసురు తగిలి, త్రినేత్రుని ఫాలాగ్నికీలల మరణించెననియు, తిరిగి రతీదేవి ప్రార్థించుటవలన శివుడు కరుణించి బ్రతికించె ననియు, లేనిచో స్త్రీలకీ మన్మథునిబాధ వుండకపోయెడిదని వ్యథచెంది, కోపమున మన్మథుని తిట్టుచున్నట్లు కవి వర్ణించెను.

వి వా హ వ ర్ణ న

ఈ ప్రబంధమున మాలతీవసంతుల వైవాహికోత్సవమును కవి ఇరువది పద్యగద్యములలో వర్ణించెను. కన్యాదాత కుంతలాధీశ్వరుడు మణిభద్రునకు వివాహసందేశమంపుట, మణిభద్రుడు సపరివారుడై వివాహమునకు విచ్చేయుట విపులముగా వర్ణింపబడినది. వివాహవేదికపై జరుగు ఆచారవ్యవహారములను వివరించు వర్ణన ఇట్లున్నది.

---

1. మాలతీవసంతము. పం. ఆ. 32 పద్యము.

"[1]ఉ॥ జీరగుడాక్షత ల్మొరువుచే నొకరొక్కరు మస్తకంబులన్
ధారణఁజేసి తచ్ఛుభవిధాయకమౌ తలఁబ్రాలు నిర్వురున్
గూరిమిమీర నంజలుల గుప్పుచు రొప్పుచు నెల్లవారి కిం
పారగఁ దద్వధూవరు లుదంచిత వేడుక దోఁచి రెంతయున్."

వైవాహికాచారముల పిదప కవి విందులు, వినోదములు, కట్నములు అర్పించుట విపులముగా వర్ణించెను.

## పుత్రోత్పత్తి వర్ణన

ఈ ప్రబంధములో ప్రథమాశ్వాసమున శ్రీహరివరప్రసాదమున మణిభద్రుని భార్య ప్రభావతి గర్భిణియగుట, ప్రసవము, వసంతుని జననము జాతకర్మవరకు గల విషయమును కవి పంద్రెండు పద్యగద్యములలో వర్ణించెను. మణిభద్రుని ఆనందమును వర్ణించు పద్య మిట్లున్నది.

"[2]గీ॥ పుట్టుగ్రుడ్డికి కనుచూపు పొసగినట్లు
మించు తృష్ణార్తు డుదకంబు గాంచుభంగి
ఖరకిరణతప్తు డొక చెట్టు గన్నపగిది
నందనావిర్భవానంద మొంది నృపుడు."

పుట్టుగ్రుడ్డికి కనుచూపు కలిగినట్లుండెనని కవి సరసముగా యీ పుత్రోద్భవానందమును వర్ణించెను.

## రతి వర్ణన

మాలతీవసంతుల వివాహము తరువాత రతోత్సవవర్ణన (15) పద్యగద్యములలో కవి వర్ణించెను. ఇందు శోభనగది అలంకారములు, భార్యాభర్తల ప్రథమసమాగమము, త్రిరాత్రులలో వారి సరససల్లాపములు, రత్యుపరతులు, ఆలింగన చుంబనాదులు మున్నగునవి కవి సవివరముగా వర్ణించెను. ఈ సంభోగ

1. మాలతీవసంతము. పం. ఆ. 83 పద్యము.
2. " " ప్ర. ఆ. 94 "

శృంగారమును కవి కొంత అధికముగా చేసెను. ఈ ఘట్టములలో ప్రబంధకవులు ముఖ్యముగా వసుచరిత్రకారుడు, విజయవిలాసకర్త సంభోగము నమితముగనే వర్ణించిరి. వసుచరిత్రలో గిరికావసురాజుల సంభోగశృంగారమును వేంకటనరసింహాచార్యు లనుకరించినట్లు కనిపించుచున్నది. మాలతీవసంతుల రతిని కవి అత్యంత మనోహరముగా నిట్లు వర్ణించెను.

"[1]సీ॥ గిలిగింతలకు జన్నులలవరింపనిదన్ని
యధిపుని యురమున న్నదమనేర్చె
అధర మాసగ మోము నవలద్రిప్పెడుకాంత
పలుకాటులకు నాసపడుచునుండె
స్పర్శకు న్నీతిల్లు నకియ మర్మస్థాన
ములు గోటఁజెనకంగ దలపునొందె
రతులకు న్వెనుదీయు రాకేందుబింబాస్య
యుపరతిక్రీడల కుత్సహించె

గీ॥ మణిరవంబులకడలు నా వనజగంధి
మంజుమంజీరకంకణపుంజరవళి
కద్భుతానందరసవారియలలలోన
మునిగి దేలుచు పతి ముంచె మనసుదీర."

పై సీసపద్యము పోతన భాగవతములో నరకాసురునితో యుద్ధము చేయుచున్న సత్యభామను వర్ణించిన రీతిలో నున్నది.[2]

---

1. మాలతీవసంతము. పం. ఆ. 96 పద్యము.

2. "సీ॥ వీణ చక్కఁగబట్టు వెరవెఱుంగని కొమ్మ
బాణాసనం బెట్లు బట్టనేర్చె
........ .. ....చారుచికురసీమ సత్యభామ."
శ్రీమదాంధ్రమహాభాగవతము, దశమస్కంధము, ఉత్తరభాగము 181 పద్యము

పైవర్ణనలేగాక యీ ప్రబంధములో ఆశ్రమ, నదీ, నిశి, సరోవరవర్ణనలు కవి సందర్భోచితముగా గావించెను. సరోవర్ణన ఇట్లున్నది

"1॥ రమణీయ కాసార రంగస్థలంబున
వీచికాయవనికల్ దోచుచుండ
మకరందరసపానమత్తాళినాదంబు
వీణాది వాద్యమై వెలయుచుండ
బవనపరంపరా ఘటనమూహము గొల్వ
కీరసభాజను ల్జేరుచుండ
విలసిల్లు పికముల కలకలారావముల్
సాహిత్యవిజ్ఞానసరణినుండ

గీ॥ సబ్జపత్రంబులనెడు సింహాసనముల
మించుమేడవసించు రాయంచలనెడు
నటకు లద్భుతభంగిని నాట్యమాడ
గనుల కింపుగ దిలకించి మనుజవిభుడు."

ఆశ్రమవాసమునందలి ప్రశాంతజీవనము, ఈర్ష్యాద్వేషములులేమి, కవి యీ సందర్భమున వ్యక్తీకరించెను. మహాభారతములో కణ్వాశ్రమము వర్ణించునపుడు నన్నయభట్టారకుడు చూపిన మార్గము తరువాతకవులు అనుసరించిరి. వేంకటనరసింహాచార్యులు వీరిలో ఒకరు.

## ర స పో ష ణ

ఈ ప్రబంధమునందు ప్రధానరసము శృంగారము, అందందు వీర, బీభత్స రసములను కవి చవిచూపించెను. ఐదాశ్వాసముల ప్రబంధములో చతుర్థ పంచమాశ్వాసములు రెండింటియందు (వివాహవర్ణనతప్ప) శృంగారవర్ణన కలదు ఇందు మాలతి సోయగము చూచి వసంతుడు భావించిన విధమును కవి (16) పద్యములలో వర్ణించెను. ఆ పిదప మాలతి వసంతుని చూచి ఆశ్చర్యమగ్నురాలై

1. మాలతీవసంతము. ద్వి. ఆ. 45 పద్యము.

యాతని అందము నూహించిన విధము కవి (6) పద్యములలో వర్ణించెను. వసంతుడు మాలతిని చూచి భావించిన విధము ఇట్లున్నది.

"[1]సీ॥ ప్రాపంచకంబను బలువైన గుంపటిన్
ప్రాణులన్ బొగ్గులవలెను నింపి
మరునిప్రతాపాగ్ని విరివిగా రవిలించి
మోహనాకారమ న్మూసఁజేసి
క్రొమ్మించుకాంతిని కూర్మితోఁ బుటమిడి
తమ్మిగద్దియయను దాకలిపయి
విధియను సొన్నారి వేమారు సౌందర్య
కళయను సుత్తెచే కమ్మిఁగొట్టి

గీ॥ బుద్ధిచాతుర్యమహిమను బొందుపఱచి
పొలతియాకృతి బంగారు బొమ్మ నిలను
జేసెగాబోలు లేకున్నఁ జెలియ కిట్టి
చక్కదన మెట్టులబ్బును నిక్క మరయ."

ప్రపంచమను బలువైన కుంపటిలో ప్రాణులను బొగ్గులనింపి, మన్మథాగ్నిని రగుల్కొల్పి, మనోహరాకారమను మూసచేసి, క్రొత్త మెఱుపుకాంతిని కూరిమితో పుటమిడి, పద్మము గద్దెయను దాకలిపై విధాత యను స్వర్ణకారుడు, సౌందర్య కళయను సుత్తెచే సాగగొట్టి, బుద్ధిచాతుర్యమును జోడించి, స్త్రీయాకృతిలో యీ బంగారుబొమ్మను (మాలతి) చేసెకాబోలు. లేనిచో మాలతి కిట్టి సౌందర్య మెట్లబ్బుననుచు వసంతుడు భావించెను. ఈ సందర్భమున కవి మాలతి అంగాంగ వర్ణన కావించెను. ముఖము, వేణి, అధరము, దంతపంక్తులు, లోచనములను వేరు వేరు పద్యములలో కవి వర్ణించెను. కుచకుంభములను వర్ణించుటకు కవి రెండు సీసపద్యము లొక గీతము నుపయోగించెను. నడుము, పాదయుగళము, శ్రోణియుగళము, వాఙ్మాధుర్యము వేరు వేరు పద్యములలో కవి మిక్కిలి రసవత్తరముగా వర్ణించెను.

1. మాలతీవసంతము. చ. ఆ. 22 పద్యము.

మాలతీవసంతు లుద్యానవనములో పరస్పరము అవలోకించుకొనినపుడు మాలతి సౌందర్యవర్ణన పిదప, వసంతుని చూచిన మాలతి ఆ రాకుమారుని సౌందర్యము చూచి ముగ్ధురాలైన సందర్భమును కవి వర్ణించిన రీతి ఇది.

"[1]సీ॥ తెలిదమ్మి పువ్వుల న్వెలివేయు గన్నులు
ఘ్రాణము సంపంగిసూన మగును
ఘన వజ్రపంజరం బనవచ్చు వక్షంబు
భద్రేభతుండముల్ బాహుయుగము
సురపతి చాపము న్నిరసించు కనుబొమల్
బురడించు చంద్రుని ముద్దుమొగము
చిరునవ్వు లొలకించు మొలక మీసల సొంపు
నుంగరంబుల బోలు ముంగురులును

గీ॥ కాహళంబులు జంఘలు గళముదరము
నరుణపల్లవరుచి నొప్పు జరణములును
సింహగాంభీర్యవిక్రమస్థితినిఁ దనరు
నీ మహాత్ముని వర్ణింప నెవరి తరము."

కన్నులు, నాసము, వక్షస్థలము, బాహువులు, కనుబొమలు, మోము మీసముల సోయగము, ముంగురులు, పిక్కలు, కంఠము, చరణములు, సింహపరాక్రమము గల యీ మహాత్ముని (వసంతుని) వర్ణింప నెవరితరమని మాలతి భావించుట హృద్యముగనున్నది. వసంతుని సోయగము కాంచినంతనే తనలో మోహము కలుగుట కతని భువనమోహనసౌందర్యమే కారణము. మొదట మాట్లాడుటకు మాలతి కొంత సందేహించినను, రాకుమారునిపై తనకుగల మోహమును చూడ్కుల ద్వారా వివరించి దరిచేరెను. ఈ సంఘటన జరిగిన తరువాత కొన్ని దినము లుభయులు విరహవేదన ననుభవించిరి. ఈ సందర్భమున కవి వర్ణించిన విప్రలంభ శృంగార మిట్లున్నది.

---

1. మాలతీవసంతము. చ. ఆ. 47 పద్యము.

## విప్రలంభము

వసంతుడు బుద్ధిసాగరునితో మాలతి సోయగము తెలిపి, ఆమెపై తనకు గల మోహమును వెలిబుచ్చి, ఆమె తననుండి విడిపోయిన విధము తెలుపు సందర్భము.

"[1]మ॥ అరవిందంబులపైన బ్రాలి మకరందాస్వాదనామోదబం
భరసందోహము నబ్బు దుగ్రుడగుచు న్బాధింపరీతిన్ మనో
హరి యాలింగనసంగతుండనగు నా యాసల్ వృథాపుచ్చి త
త్పరిచారాంగన లేగుదెంచి మము బాపంజాలిరో మిత్రమా."

మాలతి పరిచారికలు పుష్పాపచయము పూర్తి చేసికొని, తిరిగి అంతఃపురము వెళ్ళుటకు రాకుమారుని తీసికొని పోదమని వచ్చిరి. సహజమైన లజ్జచేత వారి ముందు ఆలింగనసౌఖ్యము పొందలేక మాలతీవసంతులు విడిపోయిరి. మాలతి వసంతుని విడిపోయి చెలికత్తెలతో అంతఃపురము ప్రవేశించి, శయ్యాతల్పమున చేరి విరహవేదన భరించలేక వసంతుని చిత్రఫలకము గీచుకొని, ఆఫలకమే నిజమైన వసంతునిగా భావించి, తన విరహమును వ్యక్తము చేయుచుండెను.

"[2]మ॥ సరవి న్నాదు కపోలచుంబనకళాసంతృప్తి నర్థించు నీ
కరనీరేజముల న్విదిల్చుకొని మూర్ఛస్వాంతనై చేటికా
తురత న్నిన్నెడబాసి నిష్ఫలమనోదోదూయనై యిప్పు డీ
విరహోద్రేకభరంబున న్పొగలు తన్వి న్గావు ముర్వీశ్వరా."

మాలతి విరహబాధ భరించలేక చిత్రఫలకమునే ప్రియునిగా భావించి ప్రాధేయపడిన తీరు కవి సహజసుందరముగా వర్ణించెను.

## సంభోగశృంగారము

ఈ ప్రబంధములో రెండు సందర్భములలో సంభోగశృంగారము వర్ణించబడినది. ప్రథమాశ్వాసమున నిశాసమయమున నొకసారి సంభోగము కవి వర్ణించిన విధ మిట్లున్నది.

---

1. మాలతీవసంతము. చ. ఆ. 101 పద్యము.
2. " " పం. ఆ. 14 "

"[1]సీ॥ తతహంసతూలికాతల్పాహవోర్విని
యవ్వనాశ్వారోహణంబొనర్చి
గజ్జెలందెలు రత్నకంకణక్వణనముల్
రణదుందుభులరీతిఁ దనరుచుండ
మధురాధరద్రవమదిరంబు తమిఁగ్రోలి
రతిసుఖాపేక్షయన్ క్రౌర్యమూని
పిల్లవాయువులను విపులసైన్యము గొల్వఁ
చతురశీత్యనుబంధ సాయకముల

గీ॥ విటులు విటకత్తెలను యుద్ధవీరు లపుడు
మదనశాత్రవు నెదిరించి మనసుదీర
నిచ్చవచ్చినరీతిని మచ్చరమునఁ
జిత్రవైఖరి బోరి రా రాత్రియందు."

స్మరసమరమును సమరముతో పోల్చుట, స్మరసమరసామాగ్రిని సమర సామగ్రితో పోల్చి, కవి కడు మనోజ్ఞముగా వర్ణించెను.

శోభన ఘట్టములో కవి (12) పద్యములలో విపులముగా సంభోగ శృంగారమును వర్ణించెను. మాలతీవసంతుల సంభోగము వర్ణించుచు కవి చెప్పిన పద్యము ఇట్లున్నది.

"[2]శా॥ నీవీబంధము జార క్రొమ్ముడి విడ న్నిరేజపత్రాక్షి బల్
ఠీవి న్దాల్చిన కంచుకంబు సడలన్ డెందంబున న్మోహ మెం
తో విభ్రాంతిని గొల్ప నయ్యతివ సంతోషంబు దీపింప పుం
భావస్ఫూర్తి నవోఢయై రతుల దేల్పన్ జాతె భూపాలునిన్."

ఈ పద్యమునకు పూర్వము మాలతీవసంతులు చౌశీతిబంధముల ననుస రించి మన్మథయుద్ధములో పాల్గొనినట్లు కవి వర్ణించెను. ప్రబంధయుగము చివరి

1. మాలతీవసంతము. ప్ర. ఆ. 139 పద్యము.
2. మాలతీవసంతము. పం. ఆ. 97 పద్యము.

దశలో కవులు కవయిత్రులు తమ ప్రబంధములందు సంభోగశృంగారమును వర్ణించుటకు వెనుకాడలేదు. అట్టివారిలో ముద్దుపళని రాధికా సాంత్వనము వంటి కావ్యముల[1] ప్రభావముచేత కాబోలు మరింగంటి వేంకటనరసింహాచార్యులు తమ యీ కావ్యమున పచ్చి శృంగారము వర్ణించెను.

వీ ర ర స ము

భారద్వాజముని ప్రేరితుడై వసంతుడు రక్తదంతుడను రాక్షసునితో యుద్ధమునకు ససైన్యుడై తలపడును. వసంత రక్తదంత సైన్యములు బాహాబాహి తలపడునపుడు జరుగు యుద్ధము కవి (60) పద్యగద్యములలో విపులముగా వర్ణించెను. ఈ సందర్భమున రాజసైనికులు, రాక్షసులు పరస్పరము బీరములాడుచు, వీరత్వము నెఱపుచు చేయు యుద్ధము ఆకాశములో దేవతలు నిలిచి చూచిరనుట యుద్ధతీవ్రతకు నిదర్శనము. ముఖ్యముగా వసంతరక్తదంతుల ద్వంద్వయుద్ధ సందర్భమున వారి వీరాలాపములు, శస్త్రప్రయోగములు, పరస్పరము జయించ వలయునను కాంక్షచే చేయు భీకరయుద్ధ మిచట వారు రణరంగములో చూపించిన వీరత్వమునకు మచ్చుతునక. వసంతునితో యుద్ధము చేయు రక్తదంతుని స్థితి దెల్పు పద్యమిది.

"[2]మ॥ భుజదండంబుల నప్పళించి రదనంబు ల్పెళ్ళునన్ గీటి ది
గ్విజయాపేక్షను మీసలన్నిమిరి గంభీరధ్వని స్జేయగా
నజరుద్రేంద్రసుపర్వసిద్ధయురగాధ్యక్షాళికి న్భీతి య
క్కజము ల్గగ్గెడుగా "నవశ్య మనుభోక్తవ్యం" బటం చుగ్రుడై"

భుజములు చరుచుకొనుచు, పండ్లు పటపట గొరుకుచు, విజయమునందాపేక్షగలవాడై, మీసముల నిమిరి, భయంకరధ్వనిచేయుచు, అజ, రుద్రామరేంద్ర,

1. సీ॥ నాతి యింతకుమున్నె.... ............ జారలాడకున్నె
అతివ యింతకుమున్నె ...... ......గుబ్బల కసిదీర గ్రుమ్మకున్నె
.................కొమ్మనిటుమున్నుతా దిద్దుకొనకయున్నె
రాధికాసాంత్వనము. ప్ర. ఆ. 117 పద్యము, (ముద్దుపళని)
2. మాలతీవసంతము. తృ. ఆ. 55 పద్యము.

సుపర్వ, సిద్ధ, యురగాళికి భయము ఆశ్చర్యము కలుగునట్లుగా రక్తదంతుడు భయంకరుడై అవశ్య మను భోక్తవ్యం, అని వసంతునితో యుద్ధమునకు తల పడెనని పద్యమునందు రసవంతముగా చిత్రింపబడినది.

భుజాస్ఫాలనము, పండ్లు కొరుకుట, మీసాలు మెలివేయుట, భయంకరధ్వని చేయుట రాక్షసుని పరాక్రమము సూచించు కృత్యములు. రక్తదంతుని వీరత్వము అజరుద్రామరేంద్రాదులు భయాశ్చర్యములు చెందిరనుటవలన ప్రదర్శింపబడినది. ఒకవిధముగ దైత్యేంద్రుని ఉద్ధతిని వర్ణించుటకు కవి యీ పద్ధతి నవలంభించి నాడని చెప్పవచ్చును. యుద్ధములో వీరుడు పరాక్రమము నెఱపినట్లు వర్ణించు టొక యెత్తు, ప్రధానశత్రువు భీతిల్లుట, చూపరులు సంభ్రమాశ్చర్యములు పొందుట మరియొక యెత్తు. ఒకదానికొకటి కూర్చి వర్ణించుట వలన యోధుని వీరత్వాతి శయరూపమును వర్ణించినట్లగును.

వసంతుడు ప్రదర్శించిన పరాక్రమమును వర్ణించు పద్యమిది.

"[1]చ॥ తనరెడు శక్తిబాణమున దైత్యుని ఱొమ్ముఁ బగిల్చి తచ్ఛరం
బును భువి ద్రెళ్ళనేసి మణిపుంభితమౌ కవచంబు డుల్చి సా
ధనముల నుగ్గునూచముగ ధారుణిపై బడదున్మి దేవతా
జనములు సన్నుతింప రథసారథి నొంచి జయాభిలాషచేన్"

వసంతుడు జయాభిలాషతో శక్తిబాణముచే రక్తదంతుని రొమ్ము చీల్చి, వానిచేతి శరమును భూమిపై బడవైచి, వరుసగా మణులుగల్గిన కవచము ఛేదించి, సాధనములన్నింటిని నుగ్గుచేసి, భూమిపైబడవైచి, సారథి నొంచిన, దేవతలు అతని పరాక్రమమునకు సన్నుతించిరని ఇందు వర్ణితము. కవి నాయకుని పరాక్రమము ప్రదర్శించుటకు రాక్షసునికి కల్గిన కష్టనష్టములతోపాటు దేవతల ప్రస్తుతిని వర్ణించి వసంతుని వీరత్వమునకు ప్రాధాన్యత కలిగించెను.

ఈ యుద్ధఘట్టములో కవి వర్ణించిన తీరు పరిశీలించినచో మహాకవి తిక్కన భారతయుద్ధఘట్టములను వర్ణించిన ప్రభావము మిక్కుటముగా పడినట్లు కని

1. మాలతీవసంతము. తృ. ఆ. 59 పద్యము.

పించును. నాటకీయశైలి, వర్ణనావైచిత్రి, యుద్ధరంగమున యోధులు చేసికొను వాదోపవాదములు, అస్త్రప్రయోగోపసంహారములు మున్నగు విషయములు భారతమున తిక్కన ప్రయోగముల ప్రభావము కవిపై నున్నదని యీ క్రింది రెండు పద్యములవలన స్పష్టమగును.

"[1]మ॥ గరుడాస్త్రం బదరించి సర్పశరమున్ ఖండించి తద్రాజశే
ఖరుపైఁ బావకసాయకంబు విడువన్ కాలానలజ్వాల ల
త్తరి రాజన్యసమూహము న్గవయ నా ధాత్రీశు డా మీదటన్
వరుణాస్త్రంబున దాని నొంచి భుజదర్పం బొప్ప నొక్కుమ్మడిన్"

"[2]సీ॥ ప్రధనభూమినిఁ గూలు భద్రేభనికరముల్
గ్రాహంబులోయన నూహజూప
రణములో విరిగిన రథపతాకంబులు
శైవాలములరీతి తీవిఁ గొలుప
నాహవంబునఁ ద్రెళ్ళు అశ్వంబు లొక్కట
మీనంబులోయన గానుపింపఁ
గదనస్థలింబడు కరపాదఖండముల్
కూర్మాకృతులభంగిఁ గొమరు దీర్ప

గీ॥ నిటుల సమరాబ్ధిఘోరమై యెనగ నందు
భూతభేతాళగణములు ప్రీతిమీర
స్నానపానమ్ములను సల్పి సమ్మదమున
నృత్య మొనరింపుచుండెను నేర్పుగదుర"

ఇందు మొదటి పద్యము మహాభారతమున కర్ణార్జునుల ద్వంద్వయుద్ధ సమయమున ఒకరిపై నొకరు ప్రయోగించు దివ్యాస్త్రములు, వాని నడిగించుటకు ప్రతిక్రియ చేయు అస్త్రములు వేయునపుడు తిక్కనగా రుపయోగించిన వర్ణనా

1. మాలతీవసంతము. తృ. ఆ. 68 పద్యము.
2. మాలతీవసంతము. తృ. ఆ. 23 పద్యము.

శిల్పము పోలిన శిల్పము కనిపించును.[1] ఇక రెండవ పద్యమును చూచినచో మహాభారతములోని ద్రోణపర్వమున యుద్ధభూమిని వర్ణించిన విధము తలపించు చున్నది.[2] ఈ యుద్ధఘట్టమున కవి తిక్కనగారి యుద్ధవర్ణన పుణికిపుచ్చుకున్నట్లు వర్ణించినారనుట స్పష్టము.

వసంతుడు రక్తదంతుని సంహరించినపిదప దేవతలు సంతసించి పుష్ప వర్షము కురిపించుట, భారద్వాజముని సంతసించి, ఆతని పరాక్రమమును ప్రశం సించి, త్వరలో కల్యాణప్రాప్తి కలుగునట్లు దీవించుట జరుగును. ఈ విధముగా నిచట వీరరసము ప్రధానరసమైన శృంగారమునకు అంగభూతమై యొప్పారినది. యుద్ధరంగమును వర్ణించిన సందర్భమున కొంత బీభత్సరసమును కూడా కవి చవిచూపించెను. శృంగారప్రబంధములలో రణవర్ణన, బీభత్సరసపోషణము విశిష్టమైనది. ఈ రసములన్నియు ప్రబంధములో ప్రధానరసమైన శృంగారము నకు లోబడియే చూడబడినవి ఈ విషయములో కవి ప్రత్యేకశ్రద్ధ చూపినట్లు పై అంశములవలన తేటతెల్లమైనది.

అలంకారములు

మాలతీ వసంతమను ప్రబంధమున కవి ఉపయోగించిన అలంకారములు స్థాలీపులాకన్యాయముగా కొన్నింటిని పరిశీలించుట అవసరము. ప్రబంధకవులకు ఉపమ, ఉత్ప్రేక్ష, అతిశయోక్తులందు మిక్కిలి మక్కువ. వీరివలెనే మాలతీ వసంతకర్త తన ప్రబంధములో పై అలంకారములను విరివిగా నుపయోగించెను వసంతుడు రక్తదంతుడను రాక్షసుని సంహరించిన సమయమున కవి చేసిన సాయంవర్ణన ఉపమాలంకారముల నుపయోగించుటలో కవికిగల కల్పనకు, ప్రతిభకు చక్కని దృష్టాంతము.

---

1 చ॥ "హయములఁ జంపి సూతుఁ దెగటార్చి పతాక ధరిత్రిఁగూల్చి
.. ...............పటుబల్లహతిం దల డొల్లనేసినన్."
ఆం. మ. భారతము. ద్రో. పర్వము. ద్వి. ఆ. 38 పద్యము

2. సీ॥ "కరి కళేబరములు ధరణీధరములు తురంగవ్రాత
మ్ములు గ్రాహసమితి....................."
ఆం. మ. భా. ద్రో. పర్వము. ద్వి. ఆ. 128 పద్యము

"[1]సీ॥ రాక్షసగళముక్త రక్తపాతము రీతి
సాంధ్యరాగము దిశల్ సంక్రమించె
నరపిశితాశన శరభవ ధూమంబు
పగిదిగాఁ దిమిరంబు జగతి నిండెఁ
బతివియోగార్తలౌ దితిజాంగనలభంగి
తామర కమలము ల్దలలు వంచె
రణభీరులగు దైత్యగణము బారినలీల
ద్విజచయంబులు గూండ్ల వెదకసాగె

గీ॥ విజయలక్ష్మినిఁ జేకొన్న వీరవరుల
పలుకులటుఁ దోచె పక్షుల కలకలంబు
రక్తదంతుడు భువిపైన వ్రాలినటుల
నమలతేజుండు హరిదశ్వు డస్తమించె."

ఇందు సాంధ్యరాగము, తిమిర మలముకొనుట, తామరలు తలవంచుకొనుట, పక్షులు గూళ్ళను వెదుకుట, పక్షుల కలకలారావంబు సూర్యాస్తమయమునకు వరుసగా రాక్షసగళరక్తము, రాక్షస శరభవ ధూమము, విధవలైన రాక్షసస్త్రీలు, పారిపోవు రాక్షసయోధులు (పిరికివారు) గెలిచిన వసంతుని సైనికుల ఆలాపములు ...క్తదంతుని మరణమున కుపమానములుగా కవి యుపయోగించెను. పై పద్య...ములో కవి ఉపయోగించిన ఉపమాలంకారము వంటిది ప్రబంధములలో చాలా ...రుదుగా కనిపించును. మహాభారతములో మహాకవి తిక్కన భీష్మద్రోణపర్వములలో యుద్ధఘట్టములలో వర్ణించిన ఉపమాలంకారముల ననుసరించినట్లు విశదమగుచున్నది.[2]

ఈ ప్రబంధమునందు కవి వాడిన ఉత్ప్రేక్షలు ప్రసిద్ధ ప్రబంధకవుల ప్రయోగముల కేమాత్రము తీసిపోవని తెలుపుట క్రింది పద్య మొక మచ్చుతునక

1. మాలతీవసంతము. తృ. ఆ. 80 పద్యము.
2 తే.గీ॥ జలరుహంబుల పాండవ సైనికుల.................
కరణి చీకటి.....................గవియు దెంచె.
ఆం. మ. భా. భీష్మపర్వము. ప్ర. ఆ. 300 పద్యము.

"[1]చ॥ వనిత ముఖంబు పద్మమను భ్రాంతిని షట్పదసంచయంబు వే
డ్కను జని గాంచి నాసమను గంధఫలీకుసుమంబు నుంటచే
తను భయమంది వెన్కకును దాగి శిరంబున కెక్కి బారుగాఁ
బెనుగొనుచున్నవో యనగ వేణిభరం బలరారు నింతికిన్."

మాలతి ముఖమును పద్మమను భ్రాంతిచే తుమ్మెదల సమూహము పోయి ముక్కును చూచి సంపెగ పూవని భయపడి వెనుకకు పోయి శిరమునకెక్కగ బారుగానున్న తుమ్మెదల సమూహమనునట్లుగా ఆమె వేణీభర మలరారుచుండెనట.

కవి మాలతి సోయగమును విపులముగా వర్ణించెను. నాయిక ప్రత్యంగము నొకటిరెండు పద్యములలో వర్ణించిన పద్ధతి చేమకూర వేంకటకవి విజయవిలాసములో చిత్రాంగద, సుభద్రల వర్ణనల తలపింపచేయును.[2] పై పద్యములో కవి తుమ్మెదల పిండుతో కల్పించి వర్ణించిన వైచిత్రి అమోఘము. ఇందు నాయిక (మాలతి) ముఖము, నాసిక, వేణీభరము మూడింటిని తుమ్మెదల క్రియలవలననే అతిశయము కలిగించి, సహజసుందరముగా పాఠకుల కందించెను. ఇందు పూర్వ కవుల కవిసమయములే ఉపయోగించినను, సహజవిషయములే మిక్కిలి రమ్యముగా నొకదాని కొకటి జోడించి, తనకుగల భావనాశక్తితో మనోజ్ఞముగా వర్ణించెను. ఇట్టి వర్ణనలను వసుచరిత్రకారుడు గిరికాసౌందర్యవర్ణన సందర్భమున

సీ॥ "జగములన్నియును దేజంబున వెలిగించి యపరాద్రి సేరిన
తపనుమాడ్కి..........శోభితు డభిమన్యుమూర్తి యధిప."
ఆం మ. ద్రోణ. ప. ద్వి. ఆ. 126 పద్యము.

ఉ॥ "నెత్తుట దోగి నేల యెఱనింగి .. ....చూపరు పిండి మాడ్కికిన్."
ఆం. మ. ద్రో. ప. ద్వి. ఆ. 127 పద్యము.

1. మాలతీవసంతము. చ. ఆ. 25 పద్యము.
2. "పంకేజాతములన్ దిసంతులడచున్ బాలామణీపాదముల్............
...............మదాళిమాలికల మాటాడించు వేణీరుచుల్."
విజయవిలాసము. ద్వి. ఆ. 16 పద్యము.
"కేళికాసరసిలో దేలియాడుట చేసి ..................
వికచకమలాక్షి నునుసోగ వెంద్రుకలకు."
వి. వి. ప్ర. ఆ. 100 పద్యము.

కురులను అళిసమూహములతో పోల్చి వర్ణించెను.[1] వేంకటనరసింహాచార్యులు ప్రబంధకవులు చూపించిన మార్గములో నొక అడుగు ముందువేసి భ్రమరసమూహము సాహాయ్యమున మాలతి ముఖమండలము, నాసిక, వేణీభరములను సమయస్ఫూర్తితో సహజసుందరముగా ఉత్ప్రేక్షల నుపయోగించి వర్ణించెను.

పద్మమువంటి ముఖము, సంపెంగవంటి నాసిక, తుమ్మెదలవంటి నల్లని వేణి సహజముగా కవిసమయసిద్ధములు. ఇందు కవి తుమ్మెదల బారు మొదట పద్మమను భ్రాంతిచే మాలతి ముఖముపై వ్రాలబోగా అచట నాసిక (సంపెంగ పూవువంటిది) యున్నది. సంపెంగపూవును చూచి తుమ్మెదలు భయపడి పారి, శిరము వెనుక బారులుదీర్చి దాగుకొనినవా అనునట్లు ఆమె నల్లని జడ కన్పించుచుండెను. సామాన్య విషయమును కవి ఊహించి (లోకోత్తరముగా) రసవత్తరముగా ఉత్ప్రేక్షించి చెప్పెను.

ఈ ప్రబంధమునందు కవి ప్రయోగించిన అతిశయోక్త్యలంకార మొకటి పరిశీలింపదగినది. ప్రథమాశ్వాసములో భద్రపురవర్ణన చేయుచు కవి, ఆ నగరములోగల గజఘటల నిట్లు వర్ణించెను.

"[2]చం॥ గిరులనుబోలి తుండములు గిఱ్ఱునఁ ద్రిప్పుచు మాటిమాటికిన్
సరసుల నీరు గ్రోలి వెదజల్లుచు నబ్జములెల్లఁ ద్రుంచి సం
బరమున సంచరించు మదవారణపంక్తులు తత్పురంబున
న్బరపిన కోటరీతి గనుపట్టెడు నిక్కము నెంచి చూడగన్."

ఆ భద్రకనామపురంబునగల మదపుటేనుగుల సమూహము పర్వతములను బోలి, తుండముల త్రిప్పుచు, సరస్సుల నీరుగ్రోలి, మాటిమాటికి వెదజల్లుచు, అందుగల తామరల దునిమి సంబరముతో తిరుగు ఆ యేనుగులు పురమునకు పెట్టనికోటగా నున్నవట.

---

1. "ఘనవేణికాభరము కమ్మని తావికి జిక్కి మ్రోయుచున్
ద్విరేఫములు..... .. ........వల్లభు చూపులప్రోవులో యనన్."
వసుచరిత్ర. తృ. ఆ. 76 పద్యము.

2. మాలతీవసంతము. ప్ర. ఆ. 39 పద్యము.

పై పద్యములో మదపుటేనుగులను పర్వతములుగాను, పెట్టనికోటలుగాను కవి వర్ణించుట అతిశయోక్తి. శ్రీకృష్ణదేవరాయలు ఆముక్తమాల్యదలో మధురా పురవర్ణన చేయుచు[1], రామరాజభూషణుడు వసుచరిత్రలో అధిష్ఠానపురవర్ణన చేయుచు[2], చేమకూర వేంకటకవి విజయవిలాసములో ఇంద్రప్రస్థపురవర్ణన చేయుచు[3] ఇట్టి వర్ణనలే చేసిరి. వేంకటనరసింహాచార్యులు వీరి నట్లే అనుక రించెను. మాలతీవసంతకర్త పై ప్రబంధకవులకు తీసిపోని విధముగా అలంకార ములను ప్రయోగించెను.

## భా ష

ఈ ప్రబంధమునందలి ప్రతి పద్యము సంస్కృతాంధ్రశబ్దసమ్మిశ్రితమై యున్నను, కేవలము నారికేళపాకముగా నుండక ద్రాక్షాపాకమునకు తావిచ్చుచు, పండిత పామరులకు హృద్గ్రాహ్యమగుచు ముదావహమగుచున్నది. ఇందలి శైలియు ప్రసిద్ధ ప్రబంధముల శైలి కే మాత్రము తీసిపోనివిధముగా నున్నది. సమాసములు ప్రయోగించిన తీరు ప్రశంసార్హము. ఈ ప్రబంధము ఛందోబద్ధమై లక్షణబద్ధమైన రచన యనుటలో సందేహము లేదు.

## జా తీ య ము లు

ఈ ప్రబంధములో కవి మొత్తము 22 సామెతల నుపయోగించెను. సామెతల నుపయోగించుటలో కవికి గల మక్కువ అమోఘము. సందర్భము ననుసరించి ఆయా విషయముల సమర్థించుట కీ సామెతలు మిక్కిలి ఉపయుక్తమైనవి. కొన్ని జటిలవిషయములు సహితము కవు లీ సామెతల నుపయోగించి

1. "పై ననిశంబు చల్లుకొను పాంసువు.............. మదేభములు ప్రాణము తోడి నగంబులో యనన్." ఆముక్తమాల్యద. ద్వి. ఆ. 25 పద్యము.
2. "పరబలభంగ బంగముల భంగురతుంగమతంగజంబుల ........................ మదంబు పేరిటన్."
   వసుచరిత్ర, ప్ర. ఆ. 100 పద్యము
3. "పెట్టనికోటగాదె గజబృందము లెందును రాజధానికిన్."
   విజయవిలాసము. ప్ర. ఆ. 74 పద్యము.

పాఠకుల మనస్సులకు హత్తుకొనునట్లు తెలిపిరి. ఈ సామెతలు మిక్కిలి సులభ శైలిలోను, లోకవాడుకలో గలవి. ఇంత చక్కటి సామెత లుపయోగించుటవలన కవికి కవిత్వరచనాప్రతిభతోపాటు లోకజ్ఞానము అపారముగా నున్నట్లు సుస్పష్టము ప్రబంధకవులుకూడా తమతమ ప్రబంధములలో కొన్ని సామెతలు వాడినట్లు, యీ కవి మాలతీవసంతములో నుపయోగించిన సామెతలు మనోరంజకముగా నున్న ట్లీ క్రింద నుదహరించిన సామెతలు పరిశీలించినచో తేటపడును.

| | | | |
|---|---|---|---|
| 1. "తగరు పొగరెక్కి కొండను తాకినట్లు" | మాలతీవసంతము | ప్ర. ఆ 21 | పద్యము |
| 2. "సంతతిలేనివారలకు సద్గతు లుండవటంచు | " | " 69 | " |
| 3. "అభ్యాగత స్స్వయం విష్ణు" | " | ద్వి. ఆ. 60 | " |
| 4. "పుట్టుగ్రుడ్డికిఁ గనుచూపు పొసగినట్లు" | " | ప్ర. ఆ. 94 | " |
| 5. "మించు తృష్ణార్తు డుదకంబు గాంచుపగిది" | " | " " | " |
| 6. "ఖరకిరణతప్తు డొక చెట్టు గన్నపగిది | " | " " | " |
| 7. "ధరణీరాజ్యము వీరభోజ్యము | " | " 112 | " |
| 8. "కులమునకు వన్నె దెచ్చెడు కొమరు డొకడె" | " | " 107 | " |
| 9. "కరి సింహంబును డాయునట్లు" | " | తృ. ఆ 46 | " |
| 10. "భుజంగంబు న్మెడం దాల్చు" | " | " " | " |
| 11. "చాంపేయ సుమంబుపై కరుగు భృంగంబట్లు" | " | " " | " |
| 12. భగ్గున మంటలో చేరు పతంగసంచయము" | " | " 50 | " |
| 13, "అవశ్య మనుభోక్తవ్యమ్" | " | " 55 | " |
| 14. "దండతాడనకృధ స్ఫగబట్టిన పన్నగక్రియన్" | " | " 61 | " |
| 15. "దావాగ్నికణంబులన్ వననమం దొప్పార బంధించు" | " | " 16 | " |
| 16. "అనలముఖంబునం దిడిన యాజ్యఘటంబు విధంబు" | " | చ. ఆ. 65 | " |
| 17. "లోహశలాకము న్గానెడు నైస్కాంతంబుభంగి" | " | " 70 | " |
| 18. "పానకమందు పుడుకమాదిరి" | " | " 92 | " |
| 19. "అవనిన్ తామరతంపరలట్లు" | " | పం. ఆ. 54 | " |
| 20. "నిండు పేదకు దొఱకు పెన్నిధివిధంబు" | " | " 68 | " |

21. "అంధునకు దృష్టి కలిగినట్లు" మాలతీవసంతము పం. ఆ. 68 పద్యము
22. "చవటభూమిని ప్రవహింపజాలినట్లు" " " " "

సామాన్యవిద్యావంతులకు సహితము పై సామెతలు సులభముగా అర్థమగునట్లు కూర్చి కవి తన సంస్కృతాంధ్రముల పాండిత్యమును చాటెను.

అ ను క ర ణ

మాలతీవసంతకర్త పై యితర ప్రబంధకవుల ప్రభావము గుఱించి క్లుప్తముగా నైనను పరిశీలించుట అసంగతము కాదు.

మణిభద్రుడు కొలువుకూటమునందున్నపుడు విచ్చేసిన ఫలసిద్ధమహర్షి వర్ణన ఇట్లున్నది.

"[1]సీ॥ కాషాయచేలంబు కటిసీమ నొప్పార
ముఖభాగమం దూర్ధ్వపుండ్ర మలరఁ
బదయుగంబున బాదుక ల్మెఱయంగఁ
గరమున జపమాల గ్రాలుచుండఁ
జెవుల పద్మాక్షలు సింగారమును జూప
శిరమునగల జడ ల్మెరువుగొల్పఁ
బృథుభుజాగ్రంబున గృష్ణాజినము దర్భ
లుండిన మూట కమండలంబు

గీ॥ దంబుమీరిన యోగదండంబు లమర
హరిపదధ్యాననిర్మలాహ్లాదహృదయుఁ
డైన ఫలసిద్ధనామ మహర్షి యటకు
నరగ విచ్చేయు టాలించి సంభ్రమించి."

1. మాలతీవసంతము. ప్ర. ఆ. 55 పద్యము.

అల్లసాని పెద్దన మనుచరిత్రలో ప్రవరాఖ్యు నింటికి విచ్చేసిన ఔషధ సిద్ధుని,[1] ధూర్జటి కాళహస్తి మాహాత్మ్యములో శివార్చనకు వచ్చిన శివబ్రాహ్మణుని[2] నంది తిమ్మన పారిజాతాపహరణములో శ్రీకృష్ణుని కడకు విచ్చేసిన నారదుని[3] వర్ణించిన వర్ణనలను వేంకటనరసింహాచార్యులు ఆకళింపు చేసికొని, మాలతీ వసంతములో ఫలసిద్ధమహర్షి వర్ణన గావించినట్లు సుస్పష్టము. ఇందు శ్రీవైష్ణవులు ధరించు వేషభాషల నన్నింటిని కవి సునిశితముగా వర్ణించెను. ఇట్టి సందర్భము లలో కవులందరు సీసపద్యములనే వాడుట గమనార్హము.

వసంతుడు తండ్రి యానతి గైకొని దండయాత్రకు బయలుదేరుటకు పూర్వము అంతఃపుర పరిచారిక లాయనకు తలంటి పోసిన వర్ణన ఇట్లున్నది.

"[4]సీ॥ మురువుగొల్చెడు మంచి ముత్యాలహారముల్
కులుకుగుబ్బలపైన గునిసియాడ
కరయుగ్మసంచల త్కంకణారావముల్
ఘల్లుఘల్లున తాళగతులఁ దనర
భృంగసన్నిభములౌ ముంగురు ల్ముఖమునఁ
దడబడి వింతగాఁ దాండవింపఁ
గమనీయ తాటంక విమలరత్నద్యుతుల్
జెక్కుటద్దంబులఁ జిక్కుటిల్ల

గీ॥ నడుము వడకాడ యలసటఁ దొడరుచుండ
స్వేదకణములు దనువునఁ జెమ్మగిల్ల

1. సీ॥ "ముడిచిన యొంటి కెంజడ మూయ............చేరె తద్గేహ మౌషధ సిద్ధు డొకడు" మనుచరిత్ర ప్ర. ఆ. 59 పద్యము.
2. సీ॥ "పంచాక్షరీపూత భసిత పుండ్రాంకిత .. ................ శివబ్రాహ్మణోత్తముండు" కాళహస్తి మాహాత్మ్యము తృ. ఆ. 94 పద్యము
3. సీ॥ "సరిగమపదనిస సంజ్ఞా స్వరంబుల........ ........ .. .... నారివేదంపు తపసి దైత్యారి కడకు"
పారిజాతాపహరణము ప్ర. ఆ, 44 పద్యము
4. మాలతీవసంతము ద్వి. ఆ, 4 పద్యము

స్వర్ణపాత్రను గలుగు సంపెంగ నూనె
పుడమిపతి కంత దలనంటె పొలతి యొకతె."

"[1]సీ॥ పరిమళమిళితమౌ పన్నీట జలకంబు
లారిచె మత్తేభయాన యొకతె
కేశాగ్రములనుండి క్రిందికి దిగజారు
నీరూడ్చె మరియొక్క నీలవేణి
పట్టుపుట్టంబుల బహువేడ్కఁ గొనితెచ్చి
క్షితిపున కిడె నొక్క చిగురుబోఁడి
సకలప్రసూనముల్ సరములుగాఁ గూర్చి
గళమున నిడె నొక్క కంబుకంఠి

గీ॥ నిలువుటద్దము పతిముందు నిలువబెట్టి
ఫాలతలమునఁ దిలకంబు గీలుఁగొలిపి
రత్నభూషణ తాతహారముల నెల్ల
నందమొలుకంగ నిడె నొక్క సుందరాంగి."

పై రెండు సీసపద్యములలో అంతఃపురపరిచారికలు వసంతునికి తలంటి, నలుగు పెట్టి, పన్నీట జలకమాడించి, అలంకరణ విషయములో ఒక్కొక్క రొక్కొక్కటి అందించి, చక్కగా నలంకరించినట్లు కవి వర్ణించెను. నంది తిమ్మన పారిజాతాప హరణములో పరిచారికలు శ్రీకృష్ణునకు తలంటి పోయు సందర్భమును[2], రామ రాజభూషణుని వసుచరిత్రలో వసురాజును పెండ్లికుమారుని చేయుటకు పూర్వము అప్సరసలు జలకమాడించి అలంకరించిన సందర్భమును,[3] ఆ కవు లిట్లే వర్ణించిరి.

---

1. మాలతీవసంతము. ద్వి. ఆ. 6 పద్యము
2. ఉ॥ "కంపనలీలమై నసదుగొ నసియాడ కుచద్వయంబు.....కంసవైరికిన్"
సీ॥ "చంద్రికపూవన్నె జిలుగుదువ్వలువను దడియొత్తె నొక్క
కాంతాలలామ" పారిజాతాపహరణము ద్వి. ఆ. 9, 12 పద్యములు
3. సీ॥ "ఆ గిరిజానక్తు సౌదల తడియార్చె నొక శరద్రమ్యరాజోజ్జ్వలాస్య."
వసుచరిత్ర పం. ఆ. 84 పద్యము

పై ప్రబంధములలో అన్ని సందర్భములందు నాయకుని తలంటి పోయుట, అలంకరించుటను కవులు సరసముగా సుందరముగా వర్ణించిరి వీరి ప్రభావము మాలతీవసంతకర్త పై బడినది. ఈ కవి ప్రబంధకవులను యథాతథముగా ననుకరించకపోయినను, ఆ ఛాయలు మాత్రము స్పష్టముగా కనుపించుచున్నవి.

మాలతి చెలికత్తెలతో నుద్యానవనములో విహరించు సందర్భమున కవి వర్ణించిన విధ మిట్లున్నది.

"[1]సీ॥ తన నాసకును సాటి తనరుచుండెనటంచుఁ
దిలపుష్పమును గాంచి తృప్తి నొందుఁ
దన నేత్రములఁబోలు నని యెంచి గొలకుల
పుల్లాబ్జముల చేత ముట్టి చూచుఁ
దన దేహపరిమళమున కుద్దియగు నంచు
గంధఫలసూనమున్ గాంచఁదొడఁగు
తన యూరువుల సామ్యమని చాల భావించి
కదళీద్రుమంబుల గదియనేఁగు

గీ॥ తనదు పేరున కీడుగా దగెనటంచు
వరుస గురువెంద తీవల వంచిపట్టు
నిటుల నెన్నెన్నియో పుష్పకుటజములను
నరవి వీక్షించె మాలతీసకియమిన్న."

ఇందు కవి మాలతి సోయగము వర్ణించిన తీరు నిరుపమానము. మాలతి చేయు క్రియల నాధారము చేసికొని, ఆమె క్రియలను వర్ణించుచు, తద్వారా నామె సోయగవర్ణన గావించెను. ఈ కవి ప్రాచీనకావ్యములు, ప్రబంధములన్నియు కూలంకషముగా చూచి తద్వారా పొందిన పాండిత్యమునకు తనకుఁగల సహజప్రతిభను జోడించి, చక్కని రసవత్తరమైన ప్రబంధమును రచించినట్లు సుస్పష్టము.

1 మాలతీవసంతము చ. ఆ. 6 పద్యము

చతుర్థాశ్వాసములో వసంతుని ఉద్యానవనములో కలిసి విడిపోవు సందర్భమున మాలతి తన చెలికత్తెలకు తెలియకుండ, వసంతునకు తన అభిప్రాయము తెలుపునపుడు చూపించిన చాతుర్యము కవి ఇట్లు వర్ణించెను.

"[1]చ॥ కుసుమములెల్లఁ దోచె నవిగో తిలకింపుము దివ్యసౌరభో
ల్లసితములై మనోహరవిలాసము క్రుంగగఁజేసి నీవు న
ల్దెసలకుఁ బర్వులెత్తగను దృప్తి లభింపదు నించుకేనియున్
రసికశిఖావతంసమ స్థిరంబుగ నుండు వసంతుడా యిటన్."

"[2]గీ॥ సాంధ్యరాగంబు లంతట సంఘటించె
వికసితాంభోజ మకరంద మొకటఁ గ్రోల
సాహసించిన ఫలమేమి షట్పదంబ
వేచియుండుము ప్రాభాతవేళకొఱకు."

"[3]చ॥ తడవొనరింపగా ఫలము తప్పక గాంతువు గాని తీవ్రతన్
దొదరిన హానిఁజెందెదవు తోయజబాంధవు డస్తమించుటన్
గడుసరి పోకడ ల్విడువగాదగు నిప్పుడు సూక్ష్మబుద్ధితో
విడచి చరింప మేలగునె భృంగవతంసమ వేయునేటికిన్."

"[4]చ॥ జిలిబిలిపల్కులన్ దెలియజెప్పుచు నీదు మృదుప్రసంగముల్
జెలువున నాలకింపుచును జిత్త మెలర్పగఁ బ్రొద్దుఁబుచ్చ నె
చ్చెలు లరుదెంచి రింక నిట జెల్లదు నుండగ తల్లిదండ్రులన్
గలసి మరొండు వేళ నిను గాంతును నమ్ముము రాజకీరమా."

వికసించిన తామరల మకరందము గ్రోల సాహసించిన ఫలమేమి? ఓ భృంగమా ప్రభాతసమయముకొఱకు వేచియుండుము. ఆలస్యము (ఓపిక) చేసినచో

1. మాలతీవసంతము. చ. ఆ. 80 పద్యము.
2. " " 81 "
3. " " 82 "
4. " " 83 "

ఫలము తప్పక పొందగలవు. తొందరపడినచో సూర్యుడస్తమించుటవలన కీడు కలుగును. గడుసరినడక మానుకొనకుండినచో మేలు జరుగునా? ఓ భృంగవశంవమా నీవు పలుకు జిలిబిలిపలుకులు తెలియచెప్పుచు, మృదువైన మాటల నాలకింపుచు, హృదయాహ్లాదము పొందుచు, ప్రొద్దుబుచ్చుచుండుటకు చెలికత్తెలు వచ్చుటచేత యిక సాగదు. ఆ పిదప తల్లిదండ్రులను కలిసి మరొకసారి నిను చూచెదను ఓ కీరరాజమా యని పై పద్యముల భావము.

చెలికత్తెలు వచ్చునప్పటికి మాలతీవసంతులు సల్లాపములాడుచుండిరి. విడిపోవుచు మాలతి, రామచిలుకను సంబోధించి పలికినట్లుగా చెలికత్తెలు వచ్చినారు, సాయంకాలమైనది, అంతఃపురము పోయి తల్లిదండ్రులను కలిసి తిరిగి వచ్చి కలిసికొనెదనని పలికెను. ఈ పలుకులు రాజకీరమా యని సంబోధించుట రాకుమారుడగు వసంతునికి వర్తించుట ధ్వనిగర్భితము. ఇంతటితో ఈ ప్రబంధమును గురించి చర్చ ముగింతును.

## నీలోద్వాహము

నీలోద్వాహమను నాలుగాశ్వాసముల ప్రబంధమును ఈ కవి క్రీ.శ. 1950 లో రచించినను ప్రచురణ క్రీ. శ. 1956 లో జరిగినది. వీరు సూర్యాపేటలో నున్నపుడు రంగాపురము గ్రామకరణముగారైన శ్రీ రుద్రవరపు వేంకటరామకృష్ణశర్మగారి ధర్మపత్నియైన శ్రీమతి కామేశ్వరమ్మగారి యందు శ్రీవీరవేంకటసత్యనారాయణస్వామివారు ఆవేశించెను. తదాలయ ధర్మకర్తయైన శ్రీకామేశ్వరరావుచే లేఖ వ్రాయించి, ఈ కవిని పిలిపించెను. నీలోద్వాహమను కృతి నాదేవున కంకిత మొసంగవలయునని స్వామివారే కామేశ్వరమ్మగారి పూనకములో తెలుపుటవలన, భగవదాజ్ఞానుసారము తన యీ కృతిని రంగాపుర సత్యనారాయణస్వామి కంకిత మొసంగినట్లు కవి విన్నవించుకొనెను. ఈ కావ్యముద్రణ చేయించుటకు కావలసిన ఆర్థిక సహాయము ఏలూరు పురపాలకసంఘాధ్యక్షులు, రావుసాహెబు బిరుదాంకితులు శ్రీ దామరాజు వెంకట్రావుపంతులుగారు చేసిరి. పండిత ద్వివేది నారాయణశాస్త్రి, కవిశిరోమణి అద్దేపల్లి కుటుంబరావుగారలు దీనికి అభిప్రాయముల వ్రాసిరి. ఈ కృతి గురించి కుటుంబరావుగారు వెలిబుచ్చిన అభిప్రాయము చివర వారిట్లు ప్రబంధప్రాశస్త్యము నుగ్గడించిరి.

"కం॥ కృతి నీలపెండ్లి త్రిజగ
త్పతి నీలాపతియ కృతికి పతి శ్రితతతి స
ద్గతి భక్తలోకరక్షా
రతమతి కృష్ణుండు శ్రీపరాత్పరుడు భళీ."

ఈ కవి ప్రబంధారంభమున కృతిప్రకాశకుల ప్రశంస చేసెను. ఇష్టదేవతా ప్రార్థనలో శ్రీసత్యనారాయణస్వామి, లక్ష్మీదేవి, హయగ్రీవు, విష్వక్సేను, ఆదిశేషు, శ్రీసుదర్శనుని, పాంచజన్యమును, గరుడాళ్వారును, పన్నిద్దరాళ్వారులను స్తుతించెను. పిదప తనతల్లిదండ్రులైన నరసమాంబా రాఘవాచార్యులు, వ్యాసవాల్మీకాదులగు సంస్కృతకవులను, నన్నయ తిక్కనాదులగు ఆంధ్రకవులను, ఆసూరి మరింగంటి వంశమూలపురుషుడగు సింగరాచార్యులను, ముడుంబ సింగరాచార్యులను వరుసగా నుతించెను. తరువాత తన వంశములో వేంకటరాఘవాచార్యుల నుండి తనవరకుగల ప్రసిద్ధవ్యక్తులను తెలుపుచు కృతికర్త వంశావళి వివరించెను షష్ఠ్యంతములలో కృతిని రంగాపుర సత్యనారాయణస్వామి కంకిత మొసంగెను.

క థాం శ ము

మిథిలానగరమును జనకమహారాజు పాలించుచుండెను. ఆ నగరమున కుంభకుడు యదువంశాగ్రణి తన భార్య ధర్మదవల్లన లేకలేక సంతానము పొందెను. కుమారునకు శ్రీధాముడు కూతురునకు నీలయను నామము లొసంగిరి. నందయశోదలు శ్రీకృష్ణబలరాములతో కుంభకాఖ్యు నింటికి వచ్చి పోవుచుండిరి. శ్రీకృష్ణుడు నీల సోయగమున కాకర్షితుడయ్యెను. శ్రీకృష్ణుడు కొంతకాలము తరువాత హస్తినాపురికి వెళ్ళివచ్చుచు, దారిలో మిథిలలో కొన్ని రోజులుండి, కుంభకాఖ్యునింట బంధుమర్యాదలు పొంది వెడలిపోయెను. నీల కూడ మేనబావయైన శ్రీకృష్ణునిపై మరులుగొనెను.

పూర్వము హరి తన చక్రాయుధముతో కాలనేమియను రాక్షసుని సంహరించుటవలన వాని యేడుగురు కుమారులు శ్రీహరిపై ప్రతీకారము తీసికొనదలచి వృషభములై జన్మించి శ్రీకృష్ణుని సంహరించుటకు వేచియుండిరి. మిథిలానగరములో యీ యేడువృషభములు చేయు ఆగడములు భరించలేక, ఆ నగరమందలి

యాదవులు జనకమహారాజునకు మొరపెట్టుకొనిరి. జనకుఁడు కుంభకుని రావించి, యా వృషభముల నరికట్టుటకుగాని, చంపుటకు గాని ప్రయత్నింపుమని ఆదేశించెను. కుంభకు డెందరిని పంపినను ఆ వృషభములు కట్టువడక వారిని త్రొక్కి చంపెను. చివరకు కుంభకుఁడా వృషభములను చంపిన వీరునకు వీర్యశుల్కముగా తన కూతురగు నీల నొసంగెదనని చాటింపించెను.

నారదుని వలన కుంభకుని ప్రతిన వినిన శ్రీకృష్ణుడు ససైన్యుడై మిథిలకు బయలుదేరెను. అంతకుపూర్వ మెందరో యదువీరు లా వృషభముల బంధించుటకు ప్రయత్నించిరి. వారిలో కొందరా వృషభములచే త్రొక్కి చంపబడిరి. మరి కొందరు కొమ్ములచే చీల్చబడిరి. మరికొందరు ప్రాణములపై ఆశతో పారిపోయిరి చివరకు శ్రీకృష్ణు డా యేడు వృషభములతో భయంకరముగా పోరి వానిని చంపి నీలను వివాహమాడెను. కుంభకుడు నీలాకృష్ణులకు అమూల్యాభరణాదు లరణముగా నొసంగి సాగనంపెను. నీలోద్వాహమను ప్రబంధము నీలాకృష్ణుల పరిణయ మితివృత్తముగా గలది.

## క థా సం వి ధా న ము

నీలవివాహ ఇతివృత్తము ఎఱ్ఱన హరివంశము పూర్వభాగములోను.[1] పోతన భాగవతములోను,[2] కూచిమంచి తిమ్మకవి నీలాసుందరీపరిణయమునను కలదు. వీనిలో ఎఱ్ఱన (1280–1355) హరివంశపూర్వభాగములో గల నీల పెండ్లి కథాంశమిది.

హరివంశ పూర్వభాగమున నీలాసుందరీపరిణయమును ఎఱ్ఱన (55) పద్య గద్యములలో రచించెను. విదేహదేశములో కుంభకునికి ధర్మదకు నీలా శ్రీధాములు జన్మించుట, కాలనేమి సుతు లాఁబోతులుగా జన్మించి, దుష్కృత్యము లాచరించుట, జనకు నాజ్ఞ గొని కుంభకు డా వృషభముల బట్టినవారికి తన కూతురగు నీలను వీర్యశుల్కముగా నొసంగునట్లు ప్రతిజ్ఞ చేయుట, యెందరో యువకులు ప్రయత్నించి విఫలమగుట, చివరకు శ్రీకృష్ణు డా వృషభములను చంపి నీలను పెండ్లాడుట, అను కథాంశములు సరసముగా చిత్రింపబడినవి.

1. హరివంశము, పూర్వభాగము 106 నుండి 116 పుటలు
2. భాగవతము, దశమస్కంధము. 555, 556, 557 పుటలు

పోతనామాత్యుని భాగవత దశమస్కంధమందు ఇటువంటి కథ చాలా క్లుప్తముగా (14) పద్యగద్యములలో వర్ణింపబడినది.

కోసల దేశాధీశుడు నగ్నజిత్తు తన కూతురు నాగ్నజితి యను కన్యకను, యేడు వృషభముల బట్టి మర్దించిన వీరున కొసంగుదునని సమయము చేసెను. శ్రీకృష్ణుడా నగ్నజిత్తు పట్టణ మేగి, యా వృషభములను గూల్చి నాగ్నజితిని వివాహమాడెను. ఈ కథలో ఏడు వృషభములు శ్రీకృష్ణుడు చంపుట, వీర్యశుల్కముగా కన్యను వివాహమాడుట యను కథ సమానము. కాని దేశము పేరు, కన్య, కన్య తండ్రి నామములు భిన్నముగా నున్నవి. భాగవతములో గల యీ కథ నీలాసుందరీపరిణయ కథను పోలియున్నది. కావున ఈ కథ గూడా నీలాసుందరీ పరిణయకథయని చెప్పుట అనౌచిత్యము కాదు. భాగవతకారుడు పురాణకథలను క్లుప్తముగా చెప్పుటయే మార్పులకు కారణము.

క్రీ. శ. (1690–1750) కాలములోగల కూచిమంచి తిమ్మకవి ప్రణీతమైన నీలాసుందరీపరిణయము అచ్చతెలుగు కావ్యము. కథ యించుమించు హరివంశములోని కథాంశము ననుకరించినది.

మిథిలను ధర్ముడను రాజు పాలించుచుండెను. విప్రుడు కుంభకుని పాలికి వచ్చి నీలను ఆశీర్వదించి, శ్రీకృష్ణుని లీల లామెకుం దెలిపి, ఆమె కా కృష్ణుని యందు వలపు తగులునట్లు చెప్పును. ఆ తరువాత విప్రుడు కృష్ణసాన్నిధ్యమున కేగి నీల సోయగము వర్ణించి, యామెను వివాహమాడుటకు యదునందనుని ప్రోత్సహించును. మిగిలిన కథయంతయు సమానమే.

మరింగంటి వేంకటనరసింహాచార్యులు "నీలోద్వాహము" ను ఎట్టిన హరివంశములోని కథను గైకొని, పెంచి నాలుగాశ్వాసముల ప్రబంధముగా రచించెను. ఈ కవి చేసిన మార్పు లీ క్రింది విధముగా వర్గీకరింపవచ్చును.

1. పాత్రల పేర్లు మార్చుట

కూచిమంచి తిమ్మకవి నీలాసుందరీపరిణయములోని మిథిల రాజు ధర్మునికి బదులు, జనకుడని కలదు. బ్రాహ్మణునికి బదులు నారదుని ద్వారా నీలా

కృష్ణులయందు పరస్పర ప్రేమను కలిగించి, వివాహమునకు బీజము నాటినట్లు కవి మార్చెను.

2. సన్నివేశములలో చేసిన మార్పులు

నందాదులు శ్రీధామ నీలలు జన్మించినపుడు కుంభకు నింటికి వచ్చుట, నీల యుక్తవయస్సు వచ్చిన తరువాత శ్రీకృష్ణుడు కరినగరమునుండి ద్వారకకు తిరిగి వచ్చుచు, మిథిలలో కుంభకు నింట ఆతిథ్యము గొనుట పేర్కొనవచ్చును.

3. ప్రణయసన్నివేశములు కల్పించుట

శ్రీకృష్ణుడు కుంభకు నింట ఆతిథ్యము కొనునప్పు డుద్యానవనములో వసంతునితో విహరించుచుండగా నీల చెలికత్తెలతో పుష్పాపచయము గావించు చుండెను. ఏకాంతమున శ్రీకృష్ణ నీలలు తమ ప్రణయభావమును వివరించుకొనుట కవకాశము కవి కలిగించెను.

4. చాటింపు

మిథిలానగరమున వృషభములు చేయు అగడముల నరికట్టు మార్గాంతరము లేక కుంభకుడా వృషభముల బంధించినవారికి వీర్యశుల్కముగా తన కూతురగు నీలనిచ్చి, వివాహము చేయుదునని చాటించుట కవి కల్పనయని చెప్పవచ్చును.

శ్రీకృష్ణుడు మిథిలలో వృషభములతో పోరు దృశ్యము ప్రేక్షకులతో పాటు నీల తిలకించుచు పొందిన మానసిక సంఘర్షణ కవి వర్ణించిన తీరు యీ కావ్యములో కవి అనుసరించిన నూతనమార్గముగా పేర్కొనవచ్చును.

పాత్రపోషణ

నీలోద్వాహము ప్రబంధములో శ్రీకృష్ణుడు నాయకుడు. నీల నాయిక. ఈ ప్రబంధకర్త శ్రీకృష్ణు నిందు భగవంతునిగాకాక సామాన్యముగా గొల్లవానిగా చిత్రించెను. బంధుప్రీతిగలవాడుగా శ్రీకృష్ణుడు కరినగరమేగుట, కుంతీపాండవుల యోగక్షేమములు విచారించి, తిరిగి మిథిలానగరములో కుంభకునింట కొన్ని

రోజులుండి, అతిథిమర్యాదలు పొందు టిందులకు దృష్టాంతము. కవి శ్రీకృష్ణు నిందు శృంగారనాయకునిగా చిత్రించెను. శ్రీకృష్ణు డింతకు పూర్వము అష్టభార్యలతో, పదహారువేల గోపికా స్త్రీలతో సకలసౌఖ్యము లనుభవించుచున్నను మేనమామ కుంభకుని కూతురు నీల సౌందర్యమునకు ముగ్ధుడై యామెను భార్యగా పొందగోరెను. వసంతునితో వనవిహార మొనరించుచు, నీలయందమునకు, ఆమె గానకళానైపుణ్యమున కాకర్షితుడై ప్రథమపరిచయ సన్నివేశమున యామెకు తన మనోభావములను వెల్లడించి, ఆమెకు గూడా తనపైగల ప్రేమను తెలిసికొనెను. శృంగార నాయకుడేయైనను శ్రీకృష్ణుడు వీరత్వము ప్రదర్శించిన తీరు కవి వృషభములతో శ్రీకృష్ణుడు పోరు సందర్భమున చక్కగా ప్రస్ఫుటమొనరింప చేసెను. వృషభములేడు కామరూపములో నున్న రాక్షసులు. వారి ధ్యేయము శ్రీకృష్ణుని చంపుట. తానొక్కడే ఆ యేడు వృషభములతో పోరు సందర్భమున కవి శ్రీకృష్ణుని శౌర్యగుణప్రదర్శనము ప్రదర్శించిన తీరు, చివర కా యేడు వృషభములను చంపి వీర్యశుల్కముగా నీలను పరిణయమై, ఆమెతో సంభోగ సౌఖ్యములు పొందిన విధము కవి చక్కగా చిత్రించెను.

నీల శృంగారనాయిక. ఆమెకు మేనబావయైన శ్రీకృష్ణునియం దమితమైన ప్రేమ. ఆయననే భర్తగా పొందవలయునని ఆమె సంకల్పము. గానవిద్యలో నైపుణ్యము గలది. చెలికత్తెలతో వనవిహార మొనరించు టామెకు మిక్కిలి యిష్టము ప్రథమమున శ్రీకృష్ణుడు ఉద్యానవనములో కలిసి మాట్లాడి నపు డామె మిక్కిలి ఓడియము ప్రదర్శించెను. అయినను తన మనోభావములను ప్రేమను ధైర్యముగా వెల్లడించెను. తన తండ్రి వృషభములను బంధించి చంపిన వానికి తనను వీర్యశుల్కముగా నొసంగెదనని ప్రకటించినపు డామె పొందిన యావేదనను కవి సహజకోమలముగా వర్ణించెను. చెలికత్తె లోదార్చినను, తన బావపై విశ్వాసమున్నను, నారదు డరుదెంచి శ్రీకృష్ణు నాగమనము తెలిపి, యాతని మనోనిశ్చయము, వీరత్వము తెలుపునంతవరకు విచారము నొందిన అబల. వృషభములు శ్రీకృష్ణు నితో పోరునపు డా దృశ్యమును చూచిన యా నీల మనోభావములు కవి సహజసుందరముగా చిత్రించెను. వివాహానంతరము శోభనము గదిలో శ్రీకృష్ణునితో సంభోగసమయమున శృంగారరసాధిదేవతగా కవి యీ నీలపాత్రను మనోజ్ఞముగా సృజించెను.

వర్ణనలు

వేంకటనరసింహాచార్యు లీ ప్రబంధమున నగర, వన, ఋతు, వివాహ, ప్రయాణ, సూర్యోదయ, విప్రలంభ, నాయకాభ్యుదయ, యుద్ధములు మున్నగు వర్ణనలు కావించెను. వర్ణన విధ మిట్లున్నది.

నగరవర్ణన

ఒకరిద్దరు ప్రబంధకవులు తప్ప మిగిలిన వారందరును కావ్యారంభము ననే నగరవర్ణనలు గావించిరి. ఇదేవిధముగా నీలోద్వాహ కర్త మరింగంటి వేంకటనరసింహాచార్యు లీ కావ్యారంభమున విదేహ పుర వర్ణన చేసెను. కవి మిథిలానగరమునందలి గణికలను, ప్రజలను, వాజులను, కరులను, మేడలను (14) గద్య పద్యములలో మిక్కిలి విపులముగా వర్ణించెను. ఈ సందర్భమున పుష్పలావికల వర్ణన ఇట్లున్నది.

"[1]సీ॥ కైదండపై ప్రేమగల్గిన ధనమిచ్చి
సంగ్రహింపగవచ్చు సత్వరముగ
బలు పొంక మెంచను బంతులిష్టంబె? నీ
వీ బంధనపు మాట లింక వలదు
మరియేమి శయ్యపై మాటలోగానుదో? చే
తోజాత కార్యమే తుదిలభించు
మరుమాటలాడక ధరగూడఁబెట్లు? నే
డిక ప్రొద్దుమించె నింకేల తడవు

గీ॥ ఇచ్చకములాడి మెప్పింప నేమిఫలము
మంచితావుల గోరంట మనసుఁబుట్టు
ననుచు మరు లుట్టిపడునట్టు లతుకఁబలికి
విడులనిత్తురు పుష్పలావికలు నెలమి."

1. నీలోద్వాహము. ప్ర. ఆ. 10 పద్యము.

చేతిపూలదండ (హస్తావలంబనము) పై ప్రేమగలిగిన అడిగిన ధనమిచ్చి వెంటనే తీసికొనవచ్చును. సొంకముగానున్న పూబంతులు (కుచములు) యిష్టమైనచో ధరవిషయ మాలోచింపవద్దు. మాటల చమత్కారముతో (పానుపుపై) యేమి వశపరచుకొందువో కోరినదే లభించును. మారుమాట్లాడకుండె ధర యెట్లు కలియును (మన్మథ విషయములు మాట్లాడకుండ స్త్రీపురుష కలయిక యెట్లు జరుగును.) ప్రొద్దుపోయినది మాటలతో ప్రయోజనమేమి మనసు కలిగినచో పూవులుకొనవలయునని (క్రియ కుపక్రమించవలయునని) పుష్పలావికలు పలుకుదురట. ఇచట కవి పుష్పలావికల సంభాషణా నైపుణ్యముతోపాటు వారుపయోగించు శ్లేషార్థములను, ప్రదర్శించు హావభావవిలాసాదులను కవి మిక్కిలి మనోహరముగా వర్ణించెను. పుష్పలావికల వర్ణనలు కావించిన ప్రబంధకవులలో ముఖ్యముగా శ్రీకృష్ణదేవరాయల ఆముక్తమాల్యదలో మధురాపుర వర్ణనయందు పుష్పలావికల వర్ణించిన విధము[1], రామరాజ భూషణుడు వసుచరిత్రలో అధిష్ఠానపురమును వర్ణించుచు అందలి పుష్పలావికలను వర్ణించిన తీరు,[2] చేమకూర వేంకటకవి విజయవిలాసములో ఇంద్రప్రస్థపురము వర్ణించుచు అందలి పుష్పలావికలను వర్ణించిన విధము[3] పోలిక ఈ కవి యీ ప్రబంధమునందలి నగర వర్ణన చేయుచు పుష్పలావికలను వర్ణించిన తీరులో కన్పట్టుచున్నవి. ఈ వర్ణనలు చేయుటలో కవి ప్రబంధకవుల మార్గము ననుసరించినాడనుట స్పష్టము.

ఋతు వర్ణన

శృంగారప్రబంధమునకు, ఇతివృత్తమున కనుగుణముగా కవి ఈ ప్రబంధమునందు ప్రథమాశ్వాసమున వసంతఋతువర్ణన గావించెను. శ్రీకృష్ణుడు

---

1. "వెలది యీ నీదండ వెలయెంత... అమ్మెదురు పుష్పలావికలప్పురమున"
ఆముక్తమాల్యద, ద్వి. ఆ. 19 పద్యము

2. "పొన్నపూవాడి నేలపొడివితే...... విరులు విలుతురు పుష్పలావికలువీట"
వసుచరిత్ర ప్ర. ఆ. 108 పద్యము.

3. "ప్రాయపునాయకుల్ వెలనెపాన .... కాయజు తూపులమ్మెదురు కందువమాటల పుష్పలావికల్" విజయవిలాసము. ప్ర. ఆ. 79 పద్యము.

మాపయగు, కుంభకునింటి కేగుదెంచియుండెను. మిత్రుడగు వసంతుడు, మరిది యగు శ్రీరాములతో యిష్టాగోష్టిగా ప్రవర్తించు సమయమున వసంతాగమన మయ్యెను. వసంతునిరాక తెలుపుచు. కవి ముందువాయువును వర్ణించి, తరువాత వృక్షలతాదుల నిట్లు వర్ణించెను.

"[1]చ॥ ప్రియతము డేగుదెంచిన వరించిన కాముకి మేల్ముసుంగుఁ దా
రయమునఁ దీసి చూచు విధి రమ్యలతావిటపాంగనామణుల్
జయకరుడౌ వసంతుని బ్రశాంతతఁ గాంచగ శుష్కపత్రసం
చయ పట మావలన్విడిచి స్వాగతమిచ్చిరటంచు దోచెడిన్"

తనకిష్టమైన ప్రియు డరుదెంచిన చూచి కాముకి తన మేల్మసుగు తొల గించుకొని చూచినట్లుగ వనములోగల వృక్షలతాదులు వసంతుని చూచుటకు శుష్కపత్రములు రాల్చి, చిగురుటాకులుదాల్చి స్వాగతమిచ్చినట్లు తోచుచున్నవట.

శిశిరము తరువాత వసంతఋతువువచ్చును ఋతువులు మారునపుడు ప్రకృతిలో మార్పు సహజము. వసంతఋతువు ఆరంభముకాగానే తరులతాదులు పండుటాకులు రాల్చి, చిగురించుట ప్రకృతి సహజము. స్త్రీ తాను వరించిన ప్రియా గమనము చూచి, సహజ బిడియమువదలి, ముసుగుతీసి అనురాగదృక్కులు ప్రస రించును. వృక్షలతాదులు పండుటాకులురాల్చి చిగురించుట, వసంతునిపైగల ప్రేమచే జరిగినట్లు కవి ఊహించి మిక్కిలి రమణీయముగా వర్ణించెను. ఇట్టి వసంతఋతువర్ణనలు 16 వ శతాబ్దారంభము నుండి ఇతర ప్రబంధములలో గూడా కనిపించుచున్నవి. శ్రీకృష్ణదేవరాయలు ఆముక్తమాల్యదలో వసంతఋతు వును వర్ణించుచు వృక్షలతాదులు పండుటాకులురాల్చి చిగురుటాకులు తొడిగి కొనుట వర్ణించబడినది.[2] నందితిమ్మన పారిజాతాపహరణములో వసంతఋతు వర్ణన ఇట్లే కలదు.[3] పై ప్రబంధములలోగల వసంతఋతువర్ణనలకి వేంకటనర

1. సీతోద్వాహము. ప్ర. ఆ. 84 పద్యము.
2. మదనస్యందనతా స్వవృత్తి ...... ....కనచ్ఛ్రక చ్ఛటాఛీత్కృతిన్"
ఆముక్తమాల్యద, పం. ఆ. 108 పద్యము
3. "చ॥ మలయసమీరణచ్యుత.... ....రమణీయవిలాస రేఖలన్"
పారిజాతాపహరణము, తృ. ఆ. 50 పద్యము

సి.హేచాచార్యుల నీలోద్వాహము నందలి వసంతఋతువర్ణనలు అనుకరణములు. ఈ శృంగార ప్రబంధమునందు వసంతఋతువర్ణన శ్రీకృష్ణ నీలలకు ప్రణయోత్సాహము కలిగించుట కుపయుక్తమైనది.

వ న వ ర్ణ న

ఈ ప్రబంధములో కవి వనవర్ణన (15) పద్య గద్యములలో వర్ణించెను. కుంభకుని పుత్రిక నీల చెలికత్తెలతో వనవిహార మొనరించు సందర్భమును పురస్కరించుకొని యీ వనవర్ణన గావించెను. నీల చెలికత్తెలతో శ్రీకృష్ణునియం దనురక్తయై, యాతని మాయాలీలలు ముచ్చటించుకొనుచు, పాటలు పాడుకొనుచుండు సమయమున కవి వనవర్ణన గావించిన విధ మిట్లున్నది.

"[1]సీ॥ కీరంబు లొకప్రక్క కృష్ణ కృష్ణా యని
బహు చమత్కృతి మీర బలుకుచుండ
కోకిల లొకప్రేవ కుహూకుహూస్వనములఁ
గలనాదమాధురిన్ దెలుపుచుండ
నీలకంఠము లొకమూలఁ బింఛంబుల
విప్పి సయ్యాటల వెలయుచుండ
కలహంసగణ మొక్క తలమున నృత్యంబు
లను వేడ్క నెఱపుచు దనరుచుండ

గీ॥ మత్తభృంగంబు లొకచాయఁ జిత్తవికల
మగువిధంబున ఝుంకృతు లద్భుతముగ
సలుపుచుండగఁ బ్రియలతో జలరుహాక్షి
పరవశోద్రేకభరితయై వఱలునపుడు."

రామచిలుకలు బహుచమత్కారముగా కృష్ణాయని ఒక ప్రక్క పలుకుచుండెను. కోకిల లొకవైపు మధురముగా కుహూకుహూధ్వానము లొనరించుచుండెను. మయూరములు సయ్యాటలాడుచుండ, కలహంసలు నాట్యమాడుచుండ, మత్తాళి

1. నీలోద్వాహము. ద్వి. ఆ. 15 పద్యము.

ఝుంకార మొనరించుచున్న వనశోభను తిలకించి, నీల తనచెలులతో పరవశ యయ్యెనట.

నీల శ్రీకృష్ణునియం దనురాగము కలిగి యాతని క్రీడల గురించి చెలికత్తెలతో ముచ్చటించుచు వనవిహార మొనరించుచుం, నా సమయమున చిల్లల పల్లులు కృష్ణా యనుచున్నవని నీల భావించెను. కోకిలాలాపములు మధురమైన మురళీ గానము తలపింపచేసెను. నెమళ్ళు సయ్యాటలాడుట కృష్ణుని తలపై గల నెమలి పింఛము సూచించెను. కలహంసల సమూహముల నాట్యము శ్రీకృష్ణుడు గోపికా స్త్రీలతో నాడు సయ్యాటలు తలపింపజేసెను. కృష్ణునియందు మనస్సు కలిగిన దగుటవలన, మధుపంబుల ఝుంకారమునకు పరవశయై యేది చూచినను ప్రకృతిలో నీలకు సర్వము శ్రీకృష్ణుని మూర్తిమత్వమే కనిపించుచున్నట్లు భావించుట ఆమెకు మేనబావయందుగల అనురాగపారవశ్యమునకు చక్కని తార్కాణము. ఆ సందర్భముననే శ్రీకృష్ణుడు వసంతసహితుడై విచ్చేసి, వనరామణీయకతతో పాటు నీల సౌందర్యమును చూచి మోహితుడగుట యీ విషయమునే బలపరచు చున్నది. ఈ వనవిహారవర్ణన నీలాకృష్ణుల హృదయములలో పరస్పరాను రాగమునకు అంకురార్పణ జరుగుట కాధారమయ్యెను.

## సూర్యోదయవర్ణన

కుంభకుడు వృషభముల చంపినవానికి తన కూతు నీల నొసంగుదునని ప్రకటించుటవలన వివిధప్రదేశములనుండి వచ్చిన గొల్లలు కుంభకుని విడిదిలో రాత్రి విశ్రమించిరి. మరుసటిరోజు వృషభముల మర్దించుటకు నిర్ణయించబడెను. రాత్రియంతయు గొల్లలు నీలను వరించుట గురించి తలపోయుచుండగా వేకువ యైనది. ఈ సందర్భమును పురస్కరించుకొని కవి సూర్యోదయవర్ణన గావించిన విధ మిట్లున్నది.

"[1]సీ॥ పూర్వాశ వెలవెలఁబోవగాఁ దొడగెను
శరదిందుచంద్రికల్ సన్నగిల్లె

1. నీలోద్వాహము. చ. ఆ. 35 పద్యము.

కుక్కుటధ్వానము ల్పిక్కటిల్లె పురాన
విటులుఁ గుందగ నిక్కె వేగుచుక్క
చరమశైలవిహార శశికాంతి దఱుగయ్యె
కోకంబులకుఁ గన్ను కూర్కుఁ గలిగె
పద్మకారాగార బంధంబు లెడఁబాయ
భృంగస్వనంబులు నింగి ముట్టె

గీ॥ కిలకిలారావములఁ బక్షికులము లొప్పె
తారకలు గ్రుంగె తమసంబు దరలి చనియె
జారచోరులు ముసుగిడి పాఱదొడగి
రంతఁ దపనుండు ప్రాగ్దిశయందు నిలిచె."

తూర్పు దిక్కు వెలవెలబోవుచుండెను. శరచ్చంద్రుని కాంతులు తగ్గెను. కుక్కుటధ్వానములు మ్రోగెను. విటులు కుందుచుండిరి. పశ్చిమ దిక్కున చంద్రుని కాంతి తగ్గెను. జక్కవలకు కునుకు వచ్చెను. పద్మముల బంధమునుండి వెలువడిన భృంగముల స్వనము నాకాశ మంటెను. పక్షుల కిలకిలారావములు నిండెను. నక్షత్రములు క్రుంకినవి. చీకటి తొలగిపోయెను. జారచోరులు ముసుగులు ధరించి పారిపోయిరి. అప్పుడు సూర్యుడు తూర్పుదిక్కున ఉదయించెనట.

సూర్యోదయాత్పూర్వము తూర్పున వెలుగు కనిపించును. తపనుని వెలుగు ముందు చంద్రుని వెలుగు వెలవెలబోవును. కోడి కూయగనే తారకలు వెలుగు కోల్పోవుట, పక్షుల కిలకిలారావములు వినిపించుట, జక్కవలు కన్నుమూయుట మున్నగు విషయములు సహజములు. ఒక విషయమును సమర్థించి చెప్పుటకు కవులు అనేక దృష్టాంతములు చూపుట ప్రబంధకాలమునుండి ఆచారముగా వచ్చుచున్నది.

ఈ కవి సూర్యోదయవర్ణన నంది తిమ్మన పారిజాతాపహరణములోని సూర్యోదయ వర్ణన ననుకరించిన ట్లున్నది.[1]

1. "కొలకొలమంచు మేతలకు.... నా బొడిచె గోకనదాప్తుడు పాటలద్యుతిన్."
నంది తిమ్మన, పారిజాతాపహరణము, ద్వి. ఆ. 70 పద్యము

ప్రయాణము

కవి ప్రయాణమును రెండు సందర్భములందు వర్ణించెను. ప్రథమాశ్వాసము నందు శ్రీకృష్ణుడు హస్తినాపురము ప్రయాణము చేయునపు డొక పద్యము తోడను, చతుర్థాశ్వాసమునందు కూడా శ్రీకృష్ణుడు మిథిలానగరమున కుంభకు నింటికి వచ్చునప్పుడు (7) పద్యగద్యములలో కవి ప్రయాణవర్ణన గావించెను. కుంభకు నాహ్వానము ననుసరించి శ్రీకృష్ణుడు, నందయశోదలు, బలరామ సాత్యకి ప్రభృతులతో ప్రయాణమై వెళ్ళు సందర్భమున వర్ణన యిట్లున్నది.

"[1]సీ॥ ఘనశైల సన్నిభాకార గంధగజేంద్ర
సముదయంబులు ముందు చక్కి నడుప
సూర్యాశ్వనిభ హయస్తోమంబు లిరుప్రక్క
లను వేగఁగదలి సొంపును ఘటింప
లయకులితవిక్రమ ధుర్యులగు వీర
భటతండము ల్బారాబరు లొనర్ప
పరమేష్ఠిసమవేదసారగోర్వీసుర
ప్రకరాశిషంబులుఁ బరిఢవిల్ల

గీ॥ సకలమంగళవాద్యనిస్వనము లంబ
రంబునందున మ్రోయ సంబరమున
నందు డాశ్రిత బాంధ వానందలీలఁ
గడురయంబున మిథిలకుఁ గదలె నంత."

కథానాయకుడగు శ్రీకృష్ణుడు నందయశోదలతో బంధుమిత్రులతో మిక్కిలి ఆడంబరముగా ప్రయాణము చేయుట కవి అలతిఅలతి మాటలచే సహజమనోహరముగా వర్ణించి, యీ ప్రయాణదృశ్యమును కన్నులకు గట్టినట్లు వర్ణించెను. మంగళవాద్యములు మ్రోగుట, భూసురాశీస్సులు వర్ణించి కవి శ్రీకృష్ణుని వివాహము సూచనప్రాయముగా తెలిపెను. కూచిమంచి తిమ్మకవి

1. నీలోద్వాహము. చ. ఆ. 8 పద్యము.

నీలాసుందరీపరిణయములో శ్రీకృష్ణుని కరిపుర ప్రయాణము లేదు. మిథిలా నగరమునకు శ్రీకృష్ణుని రాక యున్నను, కవి ప్రయాణమును వర్ణించలేదు. ఇట్టి ప్రయాణవర్ణన లితర ప్రబంధములలో గూడ కలవు. శ్రీకృష్ణదేవరాయలు ఆముక్తమాల్యదలో యామునాచార్య దిగ్విజయ యాత్ర సందర్భమున ప్రయాణ వర్ణన గావించెను.[1] నంది తిమ్మన పారిజాతాపహరణములో శ్రీకృష్ణుని స్వర్గ ప్రయాణమును వర్ణించెను. చేమకూర వేంకటకవి విజయవిలాసములో బల రాముడు లింద్రప్రస్థపురము వెళ్ళునపుడు ప్రయాణమును వర్ణించెను.[2] ఈ ప్రబంధములలోని ప్రయాణవర్ణన లేవియు నీలోద్వాహములో కవి అనుకరించ లేదనుట నిర్వివాదాంశము. కథ కనుగుణమైన రీతిలో యీ ప్రయాణవర్ణన గావించబడినది.

## నిశావర్ణన

ఈ ప్రబంధములో కవి రెండు సందర్భములలో సాయంకాలము తరువాత నిశావర్ణన గావించెను. ప్రథమాశ్వాసములో రెండు పద్యములలోను, చతుర్థా శ్వాసములో నాలుగు పద్యములలోను కవి యీ నిశావర్ణన గావించెను. వీనిలో చతుర్థాశ్వాసములో కుంభకుడు సప్తవృషభములను బంధించినవారికి తన కూతు నీల నొసంగెదనని చాటించిన పిదప, గోపాలురు మిథిలకు వచ్చుచుండిరి. ఇందు కొఱకే శ్రీకృష్ణుడు బంధుమిత్రులతో కుంభకు నింటికి విచ్చేసెను. అతిథిమర్యా దలు, కుశలప్రశ్నలు వేయునప్పటికి చీకటిపడెను. ఈ సందర్భమున కవి నిశను వర్ణించిన విధమిట్లున్నది.

"[3]సీ॥ వికచాబ్జషండము ల్ముకుళించె షట్పద
ప్రకరము ల్దమలోపల న్వసించ

1. "గజ ఘోట స్యందనాళి..........గావించె దిక్జైత్రయాత్రన్."
ఆముక్తమాల్యద. చ. ఆ. 185 పద్యము.
2. "గజ కంఖాణ శతాంగ పత్తి..........నటు లింద్రప్రస్థమున్ చేరగాన్."
విజయవిలాసము. తృ. ఆ. 174 పద్యము
3. నీలోద్వాహము. చ. ఆ. 19 పద్యము.

కుముదప్రసూనము ల్గొమరొప్పఁ దలలెత్తి
ప్రియునిరాకడఁ జూడ వేడ్కఁబడగ
సరవి దివాంధము ల్బరిదేవనము దక్కి
ననుకంప జనియింప ననుకరింప
జక్కవగవ మది నుక్కిరిబిక్కిరై
వలవంతలకుఁ జిక్కి కలతనొంద

గీ॥ నట్టి తిమిరావృతాధికం బుట్టిపడెడు
సమయమందున ప్రాగ్దిశ సాంద్రచంద్ర
చంద్రికలు గ్రమ్ముకొనివచ్చె సకలలోక
సమ్మదాస్పదలీలల నిమ్ముగాను."

చీకటిపడుటవలన తామరలు ముకుళించుట, కుముదము ల్వికసించుట, దివాంధము లానందపడుట, చక్రవాకములు కలియుట, చీకటి ఆవరించుట, చంద్రోదయ మగుట మున్నగు విషయములు సామాన్యమే.

కుంభకుడు మొట్టమొదట నీలను వేనల్లుడైన శ్రీకృష్ణున కొసంగుటకు నిర్ణయించెను. కాని క్రూరమైన యేడువృషభములను చంపినవానికి నీల నొసం దునని కుంభకుడు చాటించుటవలన నీల తాను శ్రీకృష్ణునకు భార్యనగుదునో కానో యను విచారముతో వ్యథచెందుచుండెను. రాత్రియగుటవలన తామరలు ముకుళించుకొనిపోయినపు డందు చిక్కుకొని కృశించు భృంగముల మాడ్కి నీల కృశించుచుండెను. ఆ సందర్భమున శ్రీకృష్ణుడు గూడా సభాంధవముగా యీ వృషభముల చంపుటకు కుంభకు నింటికి విచ్చేయుటవలన నీల (చంద్రుని చూచుట వలన కుముదము లానందము నొందినట్లు) సంతసించుచుండెను. నీలకు శ్రీకృష్ణుని పైగల మోహముతో విరహవేదన ననుభవించుచున్న విషయమును, చక్రవాకముల జంట మన్మథవ్యథతో ఉక్కిరిబిక్కిరై కలతనొందిన విధముగా నిరూపించెను. శ్రీకృష్ణుడు రాకపూర్వము విచారముతో నున్న నీల హృదయము చీకటిగను, చంద్రుని రాకవలన చీకటి పోయి వెలుతురు కలుగుటయను విషయము శ్రీకృష్ణుని రాకవలన నీలకు హృదయానందము కలుగుటయను భావము నీ సందర్భమున కవి మిక్కిలి ప్రతిభావంతముగా కథకు అనుగుణమైన రీతిలో యీ నిశావర్ణన

సమయోచితముగా కావించెను. తిమ్మకవి నీలాసుందరీపరిణయములో నిశావర్ణన గావించినను, యీ వర్ణన నీలలో విరహవేదనను వ్యక్తముచేయుటకు, చంద్ర మన్మథోపాలంభమునకు మాత్రమే యీ నిశావర్ణన ఉపయుక్తమైనది. అల్లసాని పెద్దన మనుచరిత్రలో నిశను వర్ణించెను.[1] నంది తిమ్మన పారిజాతాపహరణములో నిశను చాలా సునిశితముగా విపులముగా వర్ణించెను. నీలోద్వాహకర్త నిశావర్ణనలో నీలాకృష్ణుల విరహవేదనను చొప్పించుట విశేషము.

## వి వా హ వ ర్ణ న

ఈ ప్రబంధమున వివాహవర్ణన కవి (9) పద్యగద్యములలో గావించెను. శ్రీకృష్ణుడు ఏడువృషభములను చంపినపిదప నీల కృష్ణు ని మెడలో పూలమాలిక వేసెను. కుంభకుడు వీర్యశుల్కముగా నీలను కృష్ణునకొసంగి వివాహము చేయుటకు విప్రులచే సుముహూర్తము నిశ్చయించి, నగరము నలంకరించుట కేర్పాటు చేసెను. వివాహమంటపమలంకరించి, వేదోక్తప్రకారముగా కుంభకుడు నీలను కృష్ణునకు కన్యాదానము చేసెను. శ్రీకృష్ణుడు నీల మెడలో మంగళసూత్రము కట్టి, అగ్ని వేల్చి, యాహుతుల నిచ్చెను. అక్షతలు వధూవరు లొకరితలపై నొకరు పోసికొనిరి. వారి దాంపత్యము వర్ధిల్లునట్లు భూసురు లాశీర్వాదము లొసంగిరి. కుంభకు డల్లునకు యథోచిత బహుమానములు, సత్కారములు చేసెను. మిథిలానగరవాసులు నీలాకృష్ణుల దాంపత్యము మిక్కలి అనుకూలమగున భావించిరి. ప్రబంధకవుల వివాహవర్ణన నీ కవి అనుకరించెను.

## వి ర హ వ ర్ణ న

కవి యీ ప్రబంధములో ద్వితీయాశ్వాసమున నీల సౌందర్యము శ్రీకృష్ణుని ముఖతః (13) పద్యములలో వర్ణించెను. శ్రీకృష్ణుడు వనవిహార సందర్భమున నీలను చూచి ఏకాంతమున సల్లాపములు కావించినపుడు (నీల) పరవశయై శ్రీకృష్ణుని కరకమలములపై వ్రాలు సమయమున చెలికత్తెలు వచ్చుట వలన సరసమున కాటంకము కలిగెను. ఆ పిదప కృష్ణుడు పడిన విరహవేదనను కవి

1. "మృగనాభిపంకంబు మెయినిండ....కటిక చీకటిరోదసీగహ్వరమున."
మనుచరిత్ర. తృ. ఆ. 19 పద్యము

ఆరు పద్యములలో వర్ణించెను. తృతీయాశ్వాసములో నీల విరహమును (7) పద్యములలోను, చతుర్థాశ్వాసములో రెండు పద్యములలో కవి వర్ణించెను. కుంభకుడు వృషభముల పట్టినవానికి తన కూతురు నీల నొసంగుదునని చాటించిన విషయము నీల చెలికత్తెల ద్వారా విని శ్రీకృష్ణునిపై తనకుగల మోహమును భరించలేక చింతించిన విధ మిట్లున్నది.

> "[1]ఉ॥ ఎన్నఁడు వచ్చు శౌరి యిట కెన్నఁడు నన్నుఁ బరిగ్రహించు నిం
> కెన్నఁడు తత్పదాబ్జముల నే ననురక్తిని బూజసేతు న
> భ్యున్నతభంగి నెన్నఁడు మహోత్సవలీల తదాశ్రితాళిచే
> మన్ననలందుదాన నని, మాటికి మాటికి సంస్మరింపుచున్."

శ్రీకృష్ణుడెపుడు వచ్చునో తన్నెపుడు (నీలను) పరిగ్రహించునో, ఆతని పదములకు ప్రేమచే పూజచేయు భాగ్యమెన్నడుః కలుగునో, ఉత్సాహముగా ఆయన ఆశ్రితులతో మన్నన లెట్లు పొందుదునో యని మాటిమాటికి కృష్ణుని నీల స్మరింపుచుండెనట, ఇచట కవి నీల మనోభావముల కద్దము పట్టి శ్రీకృష్ణునిపై నీలకు గల మోహమును మిక్కిలి రమణీయముగా వర్ణించెను. భాగవతములో రుక్మిణీకల్యాణ ఘట్టములో పోతన వర్ణించిన విధ మీ కవి అనుకరించెను.[2] రుక్మిణి శ్రీకృష్ణుని భర్తగా పొందుటకు దేవతలను పూజించి దానధర్మములు చేసిన విధముగ నీల కూడా దేవతల పూజించి దానధర్మములు చేసిన విధ మీ అంశమును నిర్ధారించుచున్నది. ఇచట కవి నీలను భక్తితో కూడిన యనురాగము గల స్త్రీగ వర్ణించెను. కూచిమంచి తిమ్మకవి నీలాసుందరిని యీ ఘట్టములో కామాతురగ వర్ణించెను. మన్మథపూజ, చంద్రోపాలంభము, మున్నగు శైత్యోపచారములు వర్ణించుట కలదు. కాని నీలోద్వాహకర్త నీలను మధురభక్తిగల స్త్రీమూర్తిగనే చిత్రీకరించి పోతన మార్గము ననుసరించెను.

రసపోషణ

ఈ ప్రబంధములో శృంగారము ప్రధానరసమైనను, కవి వీర, రౌద్ర,

1. నీలోద్వాహము. తృ. ఆ. 55 పద్యము
2. "ఘనుడా భూసురు డేగెనో.........నా భాగ్య మెట్లున్నదో."
   భాగవతము. దశమస్కంధము 1724 పద్యము

భీభత్స రసములను క్లుప్తముగా పోషించెను. ముందు ప్రధానరసమైన శృంగార మును పరిశీలించి తరువాత మిగిలిన రసముల పరిశీలింతును.

శృ ం గా ర ము

ఈ ప్రబంధమున ప్రథమాశ్వాసములో మూడు పద్యములలోను, ద్వితీయా శ్వాసమున (13) పద్యగద్యములలోను కవి నీల సౌందర్యమును వర్ణించెను. ప్రథమాశ్వాసములో నీల సౌందర్యవర్ణన అప్పుడే యౌవనావిర్భావము సూచించు నదిగను, ద్వితీయాశ్వాసములో పూర్తి యౌవనవతియైనట్లుగను కవి వర్ణించెను. శ్రీకృష్ణుడు నీల సౌందర్యమున కబ్బురపడి ఊహించిన విధ మిట్లున్నది.

> "[1]చం॥ తరుణి ముఖాబ్జమున్ గని సుధాకరు డెంతయు సిగ్గునొంది భా
> సురరుచిరత్వహైన్యమున జొక్కుచు మిక్కిలి కృష్ణపక్షమం
> దరయగఁ గానరాకఁ దప మద్భుతరీతి నొనర్చి తత్ఫల
> స్ఫురణత శుక్లపక్షమున బొల్పువహించు నటంచు దోచెడున్."

నీల ముఖము చూచి సుధాకరుడు తేజోహీనమై కృష్ణపక్షమున కానరాక తపమాచరించి, యా తపోఫలమువలన తిరిగి శుక్ల పక్షమున తేజస్సు తాల్చినట్లు తోచెనట.

ఇచట కృష్ణపక్షమున చంద్రుడు కళావిహీనమై యుండుట, తిరిగి శుక్ల పక్షమున క్రమముగా కళలను పొందుట సహజము. కాని నీల ముఖచంద్రుని సౌందర్యము (తేజస్సు) చూచిన చంద్రుడు తన తేజోహీనతకు సిగ్గుపడి, విచార ముతో క్షీణించి కనిపించకుండపోయి, (కృష్ణపక్షమున చంద్రుని కళలు తరుగుచు అమావాస్యవరకు కనిపించకుండపోవును.) ఈ లోపల తపస్సుచేసి, తత్ఫలము పొంది, యా శక్తి వలన తిరిగి శుక్లపక్షమున క్రమముగా కళలు పొందుచుండెనని కవి ఊహించుట మిక్కిలి రమ్యముగా నున్నది. అంతేగాక పద్యమంతయు చంద్రుని గురించి వర్ణించినట్లే కనిపించును. కాని వాస్తవముగా నీల సౌందర్య

---

1. నీలోద్వాహము. ద్వి. ఆ. 24 పద్యము.

వర్ణన యిందు ప్రాధాన్యము వహించినది. ఈ సందర్భమున కూచిమంచి తిమ్మ కవి నీలాసుందరి ముఖవర్ణనకు[1] యీ కవి మెరుగులు దిద్దినాడని చెప్పవచ్చును.

చతుర్థాశ్వాసమున శ్రీకృష్ణ నీలల వివాహానంతరము ముత్తైదువు లా దంపతులను శోభనగృహము చేర్చిరి. ఈ సందర్భమున కవి సంభోగశృంగారమును వర్ణించిన విధ మిట్లున్నది.

"[2]మ॥ తనుమధ్యం బసియాడ క్రొమ్ముడివడన్ దంతక్షతవ్యాప్తి నొ
ప్పిన గండంబులు తేజరిల్లగను నీవీబంధమున్ జాఱ గ్ర
మ్మిన స్వేదాంకురముల్ స్రవింపగను బల్మిన్ చక్రిని న్దాకి నే
ర్చున కందర్పరణప్రవీణయను సొంపు న్దలె నత్తన్వియున్."

శోభనపుగదిలో నీలాకృష్ణులను చేర్చి శారదాది చెలికత్తెలు కృష్ణునితో నీల అమాయకురాలనియు, కుసుమకోమలియనియు, ప్రౌఢకాదనియు, అనుభవజ్ఞుడైన కృష్ణుడామెను మొరటుగా స్మరకేళిలో తేల్చకూడదని సూచనచేసి ఒక్కొక్కరే వెళ్ళిపోవుచుండిరి. నీల కూడా బిడియముతో వారి ననుసరించ ప్రయత్నింప, చెలులు తలుపులు గడియవేసుకొని వెళ్ళిరి. కొంతసేపు కృష్ణుడామెను శృంగారక్రియలచే కరిగించిన తరువాత దంపతులు రతిక్రీడలదేలిరి. పిదప నీలయే ప్రౌఢస్త్రీవలె ఉపరతికి సిద్ధమై పట్టుదలతో శ్రీకృష్ణు నితాకి స్మరయుద్ధము చేసినట్లు కవి వర్ణించెను. ఈ సందర్భమున కూచిమంచి తిమ్మకవి కృష్ణుడే నీలను కామకేళిలో తేల్చినట్లు వర్ణించెను.[3] ప్రబంధకవులలో ముఖ్యముగా వసుచరిత్రకారుడు

---

1. "మగువ మొగమున కెనగాక....తొగలచెలికాడు పదియారు తునియలయ్యె"
నీలాసుందరీపరిణయము. కూ. తిమ్మ కవి ద్వి. ఆ. 21 పద్యము
2. నీలోద్వాహము. చ. ఆ. 95 పద్యము.
3. "మరియు వెఱగొప్పు చెలువంపు దెఱగుపసుల... రేపెల్లగడి పెయంత."
నీలాసుందరీపరిణయము. తృ. ఆ. 109 పద్యము

గిరికావసురాజుల సంభోగమును[1] విజయవిలాసకర్త సుభద్రార్జునుల సంభోగము[2] నిట్లే వర్ణించిరి. నీలోద్వాహకర్త సంభోగశృంగారమును ప్రబంధకవుల వర్ణనలకు తీసిపోని విధముగా వర్ణించెను.

## వీరము

ఈ ప్రబంధములో చతుర్థాశ్వాసములో సప్తవృషభములతో ఘోషవంతుడు మరియు శ్రీకృష్ణుడు ఒకరి తరువాత నొకరు పోరాడునపుడు కవి వీరమును (16) పద్యములలో వర్ణించెను. శ్రీకృష్ణుడు సప్తవృషభములతో పోరాడునపుడు ప్రదర్శించిన వీర మిట్లున్నది.

"[3]సీ॥ కందుకక్రీడను గావించు నొకమారు
నొక్కొక్క ధేనువు న్నొడిసిపట్టి
కడువేడ్కతోఁ జక్రగతి నొప్ప నొకసారి
వృషాణములఁ బట్టి విసరి త్రిప్ప
పదతాడనంబులఁ గదుపుల నొకప్రొద్దు
బడదన్ని శకటంబు పగిది నీడ్చు
ముష్టిఘాతంబులఁ బొర్లించి యొకవేళ
నాబోతు లార్వంగ నవని వైచు

గీ॥ తనకు చిరకాల పరిచయంబున ఘటిల్లు
శైశవోచితలీల లా సమయమందు
స్ఫురణ మొదవంగ సంతోషభరితుడగుచు
ధేనుకామధ్యగతి వాసుదేవు డలరి."

---

1. "నొక్క పలుమొన బలుమొన నొక్క నేర్చె .... చెలువుడునవోఢ ప్రౌఢగా చేసెనపుడు" విజయవిలాసము. తృ. ఆ. 225 పద్యము
2. "నతిసాహిత్యరహస్య మీశువలనన్ ........ మౌర్యంబు దీపింగన్.' వసుచరిత్ర షష్ఠాశ్వాసము
3. నీలోద్వాహము. చ. ఆ. 56 పద్యము.

శ్రీకృష్ణుడు వృషభములతో పోరునపుడు వానిని విసరి వేయుచు, త్రిప్పుచు, ఈడ్చుచు, ముష్టిఘాతంబులతో పొడుచుచు, శైశవదశలో లీలలు చూపించినవి. జ్ఞప్తికి వచ్చి చేసినట్లు సంతోషముగా పోరాడుచు వృషభములమధ్య నుండెనట.

ఈ సందర్భమున కృష్ణుడు చేసిన బాల్యచేష్టలు అనగా ధేనుకాసురుని చంపుట, తృణావర్తుని గాలిలో తేల్చి చంపుట, శకటాసురుని తన్నిసంహరించుట, వృషభాసురుని సంహరించుట మున్నగు శైశవక్రీడల సమయమున ప్రదర్శించిన ఆమానుషలీలలను జ్ఞప్తికి తెచ్చుకొని యా యేడు వృషభములతో పోరాడుచుండుట, భాగవతకథలను తలపింపచేయుచున్నది. కవి ఈ సందర్భమున యలతి యలతి మాటలచే దృశ్యములను సహజసుందరముగా వర్ణించెను.

## రౌద్రము

ఈ ప్రబంధమున తృతీయాశ్వాసములో (4) పద్యములలోను, చతుర్థాశ్వాసములో (4) పద్యములలోను రౌద్రమును కవి వర్ణించెను. ఈ రెండు సందర్భములలోను కాలనేమి పుత్రులగు రాక్షసులు సప్తవృషభములుగా జన్మించి శ్రీకృష్ణునిపై పగ దీర్చుకొనుటకు మిథిలానగరములో భయాందోళనలు రేకెత్తించినవి. ఈ సందర్భమున రౌద్రమును కవి వర్ణించిన విధ మిట్లున్నది.

"[1]సీ॥ కొమ్ములఁ జిమ్మెనా గోపురప్రాకార
సౌధజాలము నేలచదరమగుట
తీంట్రించి తాకెనా దివ్యరత్నస్తంభ
వితతులు పెటపెట విరిగి పడుట,
వాలముల్ ద్రిప్పెనా పశుపాలకప్రాణ
వాయువు లొకవింత చనుట బాసి
కుప్పించి దుమికెనా కుంభకాభ్యుని యాల
మందలుఁ గలగుండు నంది వడుట
గీ॥ చెలగు నంభారవంబులఁ జేయునేని
భూనభోంతరకలితమై భూతజయద

1. నీలోద్వాహము. తృ. ఆ. 18 పద్యము.

మొదవు నయ్యేడు వృషభము లొక్కరీతి
భీతిలేకయె వర్తించు భూతలమున."

ఆ వృషభములు కొమ్ములతో ప్రాకారముల కూల్చుచు, స్తంభముల విరచుచు, పశుపాలకుల చంపుచు, ఆలమందలు భయపడునట్లుగా, భూనభోంతరములు మ్రోగునట్లుగా అంకెవేయుచు భయములేక తిరుగుచుండెను.

ఇచ్చట కాలనేమిపుత్రులు నారదుని సలహామేరకు వృషభాకారములు దాల్చి మిథిలలో నుండెను. కుంభకుని మేనల్లుడు కృష్ణుడు కావున, తరుచు కృష్ణుడు మేనమామ యింటికి వచ్చి పోవుచుండెను. మిథిలానగరములో పైరులకు, పశువులకు, జనులకు బాధ కలిగించుట వలన జనకుడు కుంభకు నాజ్ఞాపించి యాబోతులను పట్టించుమనెను. గొల్ల జట్టీలకు వానిని పట్టుట కలవికాకపోవుట వలన, వానిని పట్టినవానికి తన కూతురగు నీల నొసంగుదునని కుంభకుడు ప్రకటించెను. ఆది మొదలు వృషభములు రౌద్రాకారములు దాల్చి పట్టణమంతయు విపరీతమైన గగ్గోలు కల్పించినవి. శ్రీకృష్ణుడు వచ్చినాడని తెలిసిన తరువాత వీని యాగడములు మితిమీరి, రౌద్రాకారములు దాల్చి, ప్రళయకాలగర్జారవంబుల మాదిరిగా అంకెవేయుచు, అడ్డువచ్చినవారిని త్రొక్కుచు, నానా గగ్గోలు కల్పించినవి. ఈ సందర్భమున కవి రౌద్రమును చక్కగా పోషించి, వృషభముల క్రూర చేష్టలను మిక్కిలి సహజముగా చిత్రించెను. ఇట్టి యాబోతుల యాగడములు కూచిమంచి తిమ్మకవి తన నీలాసుందరీపరిణయములో వర్ణించెను.[1] ఈ సందర్భములో ఆబోతుల యాగడములు తిమ్మకవి కంటె వేంకటనరసింహాచార్యులు విపులముగను, కడు హృద్యముగను వర్ణించినట్లు స్పష్టము.

ఈ కవి ప్రకృతి భీభత్సముగూడ చతుర్థాశ్వాసములో నొక పద్యమున వర్ణించెను. కుంభకు నాదేశముతో కృష్ణుడు సప్తవృషభములతో పోరుటకు సిద్ధమైన సంధర్భమున ప్రకృతి వైపరీత్యములు జరిగినట్లు వర్ణించిన విధ మిట్లున్నది.

---

1. "ఆ రేయి కల్లరి యాలపోతుల పైడి .... గడగి తఱుముచు నెనలేని కడిమి జూపె." నీలాసుందరీపరిణయము ద్వి. ఆ. 55 పద్యము

"[1]మ॥ కులశైలంబులు క్రుంగె సప్తజలధుల్ ఘూర్ణిల్లె తారాగణం
బిలరాలెన్ దిశ లంధకారమయమై యేర్పాటులేకుండ సం
చలనంబందె జగంబు లద్భుతబలోత్సాహంబు లొప్పార నా
జలజాతాక్షుడు సప్తగోవృషములన్ చంచద్గతిన్ దాకినన్."

కులపర్వతములు క్రుంగినవి. సప్తసముద్రములు ఘూర్ణిల్లినవి తారలు ఆకసమునుండి రాలినవి. దిశ లంధకారము వ్యాపించి, ప్రపంచ మద్భుతముగా నుండెను. కృష్ణు డా యాబోతులతో పోరుట కుద్యమించు సమయమున పై వైపరీత్యములు జరిగినట్లుగా కవి వర్ణించెను. సహజవిషయములు జరుగునపుడు ప్రకృతివైపరీత్యములు సంభవింపవు. అద్భుతమైన, అపరూపమైన సంఘటనలు జరుగునపుడు మాత్రమే యిట్టి ప్రకృతివైపరీత్యములు సంభవించును. కాలనేమి పుత్రులు రాక్షసులు, క్రూరాత్ములు. వీరు జనాళికి యాపదలు కలిగించుచుండిరి. ఇట్టి వీరి యాగడముల నరికట్టుటకు గొల్లమల్లులు ప్రయత్నించి విఫలులైరి. కృష్ణుడు సామాన్యమానవుడు కాడు. కావున భగవంతుడే దుష్టనిగ్రహము శిష్ట రక్షణము చేయునపు డేమి ప్రళయము సంభవించునో యని ప్రకృతిశక్తులు తమ తమ స్థానభ్రంశము నొందుటయో లేక విపరీతముగా ప్రవర్తించుటయో జరుగును. అందుకే కవి యీ ప్రకృతివైపరీత్యముల నీ సందర్భమున సమయోచితముగా వర్ణించి, కథాభాగమునకు వన్నె కలిగించెను.

అ ల ం కా ర ము లు

నీలోద్వాహకర్త ఈ ప్రబంధములో అధికముగా ఉత్ప్రేక్షాలంకారముల నుపయోగించెను. అందుకొఱకు మొదట ఉత్ప్రేక్షాలంకారములు తరువాత మిగతా అలంకారములు.

[2]"చ॥ సుదతి ముఖంబు పద్మమని శోభిలు నా మృగనాభి సాటి ష
ట్పదమని భ్రాంతిఁజెంది యళిపంక్తులు తద్రసపానలాలసా

1. నీలోద్వాహము. చ. ఆ. 51 పద్యము.
2. నీలోద్వాహము. ద్వి. ఆ. 26 పద్యము.

స్ఫదమునఁ జేరి నాసయను చంపకము న్గన భీతిగల్గి పీ
పుదరి శిరంబుఁడాసె ననఁ బోలు దలోదరి కేశజాలముల్."

పై పద్యమున కవి నీలకేశజాలములు వర్ణించెను. నీలముఖమును పద్మమని భావించి, కస్తూరి బొట్టు షట్పదమని భ్రాంతితో, భ్రమరము లా రసాస్వాదనచేయుట కని ముఖముపై వ్రాలబోగా, యచటగల నాసిక చంపకపుష్పమును చూచి, భీతిజెంది, పారి తలపై చేరినదని కవి ఊహించి యా నల్లనిభ్రమర సమూహమే కేశజాలములా యనునట్లు తలపించెను. చంపకపుష్పముల చూచి భ్రమరములు భయపడి పాఱిపోవుట కవి సమయము. నీల కొప్పు భ్రమరముల సమూహము నల్లందనము కలిగియున్నదని ఉత్ప్రేక్షాలంకారము నుపయోగించిన ఊహ మిక్కిలి రమణీయముగా నున్నది. ఇట్టి వర్ణనయే యీ కవి మాలతీవసంత మను ప్రబంధములో మాలతి కురుల వర్ణించు సందర్భమున చేసెను.[1] ఇందువల్ల యిట్టి వర్ణనలందు కవికి ఉత్ప్రేక్షల నుపయోగించుట కొట్టిన పిండి. ఉత్ప్రేక్షల నుపయోగించుటలో యీ కవి ప్రబంధకవు లెవ్వరికిని తీసిపోడని చెప్పుటకు పై పద్యములు తార్కాణములు. ఈ ప్రబంధములో కవి ప్రత్యేకముగా స్త్రీలను వర్ణించునపు డీ ఉత్ప్రేక్షల నుపయోగించెను. వీరికి ఉత్ప్రేక్షలపై మక్కువ మిక్కిలిగా నున్నట్లు స్పష్టము.

ACC NO. 6044

మిథిలానగరమును వర్ణించుచు, అందలి గజముల వర్ణించు యీ క్రింది పద్యమందు ఉత్ప్రేక్ష నిట్లుపయోగించెను.

894.8131097
50=00 RAN

"[2]మ॥ సురరాడ్వ్రజవిఘాతభీతి నచలస్తోమంబు లా పట్టణాం
తరమం దింపుగఁ డాగియున్నవను చిత్రభ్రాంతి సంధిల్ల న
ప్పురికిం దీర్చిన కోటరీతి గజము ల్బృంహానుబంధస్థితిన్
సరవి న్యాసిలు మావటీంద్ర కనుసన్నం గాంచ నుద్యత్క్రియన్"

---

1. "వనిత ముఖంబు పద్మమను .... వేణిభరం బలరారు నింతికిన్."
మాలతీవసంతము చ. ఆ. 25 పద్యము

2. నీలోద్వాహము ప్ర. ఆ. 12 పద్యము.

ఈ పద్యములో కవి మిథిలానగరమున గల గజములను వర్ణించెను. ప్రబంధకవులందరు పురమునంగల గజము లా పట్టణమునకు పెట్టని కోటలని వర్ణించిరి. కాని ఇచట దేవేంద్రుని వజ్రఘాతమునకు భయపడి పర్వతముల పంక్తు లా పట్టణాంతరితముగా దాగియున్నవా యను మనోభ్రాంతి కలిగించుచున్న ట్లా యేనుగుల పంక్తులున్నవని ఊహించుట కవి భావనాపటిమకు తార్కాణము. ఇచట పర్వతముల నల్లందనమును యేనుగుల నల్లందనముతో పోల్చుటయే గాక, పర్వతములవరుసలు యేనుగుల వరుసలు గూడ యథాస్థితిగా నున్నవనియు, యేనుగులు పర్వతములు కాకపోయినను అనట్లున్నవని భ్రాంతి కలిగించిన విధము కవి ఉత్ప్రేక్షల నుపయోగించి చూపించిన చమత్కృతికి నిదర్శనము. ఇందుప యోగించిన సంస్కృతసమాసము లా యేనుగుల గాంభీర్యమును వ్యక్తపరచు చున్నవి.

మాలతీవసంతములో కవి ఉపమాలంకారము లధికముగా వాడినను, నీలో ద్వాహమందు ఉపమాలంకారములను కొలదిసందర్భములలో మాత్రమే ఉపయో గించెను. ఈ ప్రబంధమున చతుర్థాశ్వాసమునందు శ్రీకృష్ణుడు సప్తవృషభముల వధించినపిదప నీల పూలమాలను శ్రీకృష్ణుని మెడలో వేయుటకు వెళ్ళునపుడు నీలను వర్ణించు సమయమున కవి ఉపయోగించిన ఉపమాలంకార విధ మిట్లున్నది.

"[1]గీ॥ మేఘమండలమున దోచు మెఱపువోలె
సహజసౌందర్యతారుణ్యశరధియనగ
కుంభకాత్మజ చెలులతో గూడి రాచ
పాడిదప్పక కృష్ణుని పజ్జ కరిగి."

"[2]మ॥ ప్రమదం బొప్పగ శౌరి సన్నిధిని నీలాదేవి వర్తింప మే
ఘముతో గూడిన యా తటిల్లతవలెన్ గాన్పించె
వీక్షించువారి మనంబులకున్ ...................."

---

1. నీలోద్వాహము చ. ఆ. 67 పద్యము
2. " " 76 "

పై రెండుపద్యములలో గూడ నీలాదేవిని వర్ణించుచు, శ్రీకృష్ణునితో నున్న నీలను మేఘముతోనున్న మెఱుపుతో నుపమించుట కలదు. ఇచట శ్రీకృష్ణుడు నీలమేఘశ్యాముడు. నీలాదేవి శరీరసౌష్టవము బంగారువన్నె కలిగి మెఱుపుతీగమాదిరిగ నుండెను. మేఘమునకు మెఱుపున కెంత అవినాభావ సంబంధ ముండునో నీలాకృష్ణులకు సహిత మంత అన్యోన్యమైన అనురాగము కలదని చూపించుటకే కవి యి ట్లుపమించెను. నీలాకృష్ణుల వివాహము చూచిన మిథిలానగరవాసులే వీరిరువురి దాంపత్య మన్యోన్యమని పొగడుట యీ విషయ మును స్థిరపరచుచున్నది.

శ్రీకృష్ణుడు వసంతఋతువులో వనవిహార మొనరించు సందర్భమున నీలాదేవి చెలులతో వనవిహారమునకు వచ్చెను. శ్రీకృష్ణుడు నీలపజ్జ కేగి సం భాషింప నుంకింప యామె సిగ్గుతో మాటాడకుండెను అపుడు శారదయను చెలికత్తె మేనబావతో మాటాడినచో దోషములేదని తెలిపి, వారిరువురకు యేకాంతము కల్పించి మిగిలిన చెలికత్తెలతో పుష్పాపచయమునకు వెళ్ళెను. ఆ సమయమున కృష్ణుడు మోహముతో నీలాసుందరికి తన ప్రేమను గుఱించి వనలతాపుష్పముల చూపించుచు వివరించెను. అంతవరకు బేలగా కృష్ణుని మాటలు వింటున్న నీలలో కలిగిన అనురాగము తెలుపుటిట్లున్నది.

"[1]సీ॥ సరవి మీర వసంత సైన్యాధిపునిఁ గూడి
మలయానిలుండను మంత్రి గొలువ
శుకభటనికరముల్ శూరత దీపింపఁ
బికరుత పౌరుషోత్సుకత మెఱయ
ఇక్షుశరాసనం బింపుగా ధరియించి
తగ మదాళుల నల్లెత్రాడుఁ జేసి
భువనమోహినియైన యువిదపై పగఁజెంది
సాధింప మరుడను శాత్రవుండు

గీ॥ పుష్పవనమును సంగ్రామభూమిఁ జొచ్చి
కృష్ణసాన్నిధ్యమున నున్న కీరవాణి

1. నీలోద్వాహము ప్ర. ఆ. 65 పద్యము

తనువు జిల్లులుబడునట్లు సునిశితోగ్ర
సూనశరముల నొప్పింప బూనుకొనియె."

ఇంతకు పూర్వము నీల కృష్ణుని భగవంతునిగను, మేనత్త కొడుకను బంధుప్రేమతో మాత్రము సంభాషించెను. కృష్ణుని ప్రేమపూర్వకభాషణము కూడా ఆమెలో యెట్టి అనురాగోదయము కలిగింపలేదు. అట్టి స్థితిలో మన్మథుడు (శ్రీమహావిష్ణువు లక్ష్మిదేవి కుమారుడు) తండ్రియైన కృష్ణుని కోర్కె తీర్ప దలంచి తన సైన్యాధిపుడగు వసంతునితో, మంత్రియగు మందమారుతముతో, శుకపికారావములను భటుల సందడితో, చెఱకు వి ల్లెక్కుపెట్టి మదాశిని అల్లె త్రాడుగా చేసికొని, యందమైన నీలపై శత్రుభావముతో నోడింపదలంచి, కృష్ణుని దగ్గరనున్న యా నీల శరీరము చిల్లులుపడునట్లుగా పూలబాణములు వైచెను. పై అంశములన్నియు స్త్రీపురుషులలో అనురాగోదయము కలుగుటకు కారణభూతములు. ఎట్టి జితేంద్రియులైనను మన్మథబాణముల కోడిపోవుట సహజము. ఇందు నీలకు శ్రీకృష్ణుని యందు (తండ్రి కోర్కె తీర్చుటకు) అనురాగము కల్పించుటకు మన్మథుడు తన పరివారముతో విచ్చేసి, నీలపై పూల బాణము లేసి యామెలో శ్రీకృష్ణుని యందు ప్రేమ కలుగునట్లు చేసెను ఈ కారణములు సమర్థించుటకు ఆ తరువాత నీల కృష్ణుని కౌగిలి కోరి, ఆయన చేతులలో వ్రాలిపోవుట కవి వర్ణించెను. ఈ సందర్భమున కవి వర్ణించిన సుమశరుని బాణప్రయోగముల ఆర్భాటము, తత్ఫలితమే నీలలో శ్రీకృష్ణునిపై అనురాగము కలుగుటయని చెప్పవచ్చును.

## భాష — శైలి

కవి ఈ ప్రబంధమునందు సంస్కృత సమాసములు, తెలుగు సమాసములు సమయోచితముగా నుపయోగించెను. ఈ రచన ఛందోబద్ధమై అలంకారములతో కూడియున్నది. ఇందలి శైలి కదళీ, ద్రాక్షాపాకములతో కూడి పండిత పామరులకు సులభగ్రాహ్యముగుచున్నది.

ఈ కవికి సామెత లుపయోగించుటలో అనన్యమైన ప్రజ్ఞాపాటవములు కలవు. సామెతలు వాడుటకు కవికి మిక్కిలి లోకజ్ఞాన మవసరము. సామెతలు

తాను చెప్పదలచుకున్న విషయమును సమర్థించుటకు కవు లుపయోగింతురు. ఇందుకు కవికి సమయోచిత ప్రజ్ఞ మెక్కిలి యవసరము. లేనిచో సామెతలు పేలవముగా నుండును. ఈ కవి నీలోద్వాహములో వాడిన సంస్కృత, తెలుగు సామెతలు సందర్భశుద్ధి, సమయోచితప్రజ్ఞ, లౌకికజ్ఞానమున కద్దము పట్టుచున్నవి ఇందు కొన్ని ముఖ్యమైన సామెత లివి.

| | | |
|---|---|---|
| 1. | "ఆశ్రయము లేక పండితుం, డతివ, వల్లి శోభ నియతగొనవు." | ప్ర. ఆ. 57 పద్యము |
| 2. | "పొన్కమున కడ్డుగ దాకెడు నడ్డుపుల్లగన్." | ద్వి. ఆ. 78 పద్యము. |
| 3. | "పురోడాశంబు శునకంబున కిడెడు భంగి." | తృ. ఆ. 60 పద్యము |
| 4. | "కాకి ముక్కున దొండపండు." | " " " |
| 5. | "మాణిక్యము మసిపాత చెఱగున ముడచినట్లు." | " " " |
| 6. | "కుఠారధార నుర్విని బడు వృక్షమట్లు." | " 62 " |
| 7. | "అడవి కాచిన వెన్నెల" | " 70 " |
| 8. | "వేటుదప్పిన పులులట్లు" | చ ఆ. 50 పద్యము |
| 9. | "దండతాడనంబున బగబూను కోడెత్రాచు" | " " " |

పై సామెతలన్నియు ఆయా సందర్భముల కనుగుణముగా నుపయోగించ బడినవే. అనవసరమైనవి, సందర్భశుద్ధిలేని విందు మచ్చుకైనను కనిపించవు. సమాజములోని జనులు నిత్యజీవితములో వాడుకొను సామెతలు కావున వీనిని గ్రహించుటలో క్లిష్టత కనిపించదు.

"[1]కం॥ కృతి నీలపెండ్లి త్రిజగ
త్పతి నీలాపతియ కృతికి బతి శ్రితతతి స
ద్గతి భక్తలోకరక్షా
రతమతి కృష్ణుండు శ్రీపరాత్పరుడు భళీ"

ఈ కావ్యము పేరు నీలోద్వాహము. దీని కృతిపతి గూడా శ్రీమన్నారాయణుడే. ఈ కావ్యనాయకుడు భక్తులపాలిటి కల్పవృక్షమైన శ్రీకృష్ణుడే. ఇట్టి

1. నీలోద్వాహకావ్యము గుఱించి అద్దేపల్లి కుటుంబరావుగారి అభిప్రాయము.

కావ్యమును రచించిన కవి గూడ సామాన్యుడు గాక పరమవైష్ణవ భక్తుడు. అందు కొఱకే వీరి గ్రంథము లన్నియు పరమాత్మునికే అంకిత మొసంగబడినవి (ఒకటితప్ప). కవి తన కృతి గద్యమున శ్రీమదలమేలుమంగానమేత శ్రీవేంకటేశ్వరస్వామి కృపాప్రసాదితలబ్ధసరసకవితాధురంధరుడ నని చెప్పుకొనుట యీ విషయమునే సమర్థించుచున్నది.

## మిత్రవింద

మిత్రవింద కావ్యము అసూరి మరింగంటి వేంకటనరసింహాచార్యుల అవసాన కాలమున ప్రారంభింపబడినది.[1] కావ్యము వీరి అవసాన కాలము, (60) సంవత్సరముల వయస్సు,లో దాదాపు 1961 ప్రాంతములో నల్లగొండలోని రామగిరిలో నున్న సందర్భమున వ్రాసియుండిరి. వ్రాయుచున్నపుడు పరమపదించుట వలన కావ్యము పూర్తి కాలేదు. ఇదే వీరి చివరి కావ్యము. ఇందు ప్రథమాశ్వాసమున (104) పద్యగద్యములు. ద్వితీయాశ్వాసమున (20) పద్యగద్యములు మాత్రమే రచింపబడినవి.

"మిత్రవింద శ్రీకృష్ణుని అష్టభార్యలలో నొకతె. కృష్ణుని మేనత్తయైన రాజాధిదేవి కూతురు. ఈమె సోదరు లవంతిదేశాధీశ్వరులైన విందానువిందులు. వీరి చెలియలగు మిత్రవిందకు స్వయంవరము ప్రకటింపగా శ్రీకృష్ణు డా స్వయంవర సమయమున రాజుల నోడించి మిత్రవిందను వివాహమాడినట్లు భాగవతములో కలదు.[2]

ఈ చిన్నగాథను గైకొని కవి ప్రబంధరచన కుపక్రమించెను. ఈ ప్రబంధమును కవి వేంకటేశ్వరస్వామి కంకిత మొసంగెను. అవతారికలో ఇష్టదేవతాస్తుతి చేయుచు వేంకటేశ్వరస్వామి శ్రీమన్నారాయణ, లక్ష్మీదేవి, హయగ్రీవ, విష్వక్సేన, సుదర్శన, పాంచజన్య గరుడాళ్వారు, రామానుజాచార్యుల స్తుతించెను. తనవంశములో ప్రసిద్ధకవులను స్తుతించి కథను ప్రారంభించెను.

1. అముద్రితము. అసంపూర్ణము. వ్రాతప్రతి యీ వ్యాసకర్త వద్ద నున్నది.
2. శ్రీమదాంధ్రభాగవతము. దశమస్కంధము 555 పుట.

## ఇ తి వృ త్త ము

ద్వారకాపురిని శ్రీకృష్ణుడు బలరామ సాత్యకులతో కలిసి పరిపాలించుచుండెను. అష్టభార్యలగూడి శ్రీకృష్ణుడు సుఖసంతోషములతో నోలలాడుచుండెను మధురానగరిలో నుగ్రసేనుడు రాజ్యపరిపాలన చేయుచుండెను. వ్రేపల్లెలోని జనులు, గోపికాస్త్రీలు శ్రీకృష్ణసందర్శనాకాంక్షులై మిక్కిలి యార్తి పొందిరి. ఈ విషయము తెలిసిన యుగ్రసేను డక్రూరుని రావించి, పౌరజనుల కోరిక ననుసరించి శ్రీకృష్ణభగవానుని మధురానగరమునకు తోడితెమ్మని రథమునిచ్చి పంపెను. అక్రూరుడు మిక్కిలి భక్తి రసప్రపూర్ణుడై శ్రీకృష్ణసందర్శనాకాంక్షగలవాడై, ద్వారక చేరి, శ్రీకృష్ణుని చూచి, వినమితాంగుడై నమస్కరించి, యుగ్రసేను డొసంగిన మణిమయభూషణాదు లొసగెను. ఉగ్రసేనుని పనుపు నివేదించి మధురానగరికి దయచేయవలయునని కోరెను. వాసుదేవు డక్రూరు నుచితరీతి సత్కరించి రుక్మిణి యంతఃపురములో విడిది యేర్పరచి, యా రాత్రి విశ్రమింప చేసెను. ఉదయమే శ్రీకృష్ణసహితుడై అక్రూరుడు రథారూఢుడై మధురానగరికి బయలుదేరెను. దారిలో వనములగుండ ప్రయాణము చేయుచున్నపుడు శ్రీకృష్ణుని రాక చూచి, సంతోషముతో యమున ఉప్పొంగినట్లు చెప్పిన పద్యముతో ప్రబంధ రచన మాగిపోయినది.

ఈ ప్రబంధమును కవి మూడు నాల్గాశ్వాసములలో వ్రాయవలయునని సంకల్పించినట్లు కనిపించుచున్నది. కాని దురదృష్టవశాత్తు ఆచార్యు లస్తమించుట వలన నీ ప్రబంధము సంపూర్ణస్వరూపము వెలుగు చూడలేకపోయినది.

## వ ర్ణ న లు

ఈ ప్రబంధములో నగర, ప్రయాణ, సూర్యాస్తమయ, నిశా, చంద్రోదయ సూర్యోదయ, వన, ఋతువర్ణనలు కలవు. మిగిలిన వర్ణనలు ప్రబంధము పూర్తియైనచో చోటు చేసికొని యుండెడివి. అయినను ఉన్నంతవరకు పరిశీలించుటుచితము. ఇందలి ద్వారకానగరవర్ణన మిట్లున్నది.

"[1]సీ॥ కరి హయ రథ భటోత్కరములే సంపూర్ణ
యవయవంబులరీతి నలరుచుండ
సకలవర్ణాశ్రమాచారకృత్యంబులే
భూషణంబులభాతి బొల్పెసంగ
పరిసరాబ్ధితరంగ పఙులతో నుప్పొంగి
శుకరుతంబను పల్కు సొబగుగుల్క
ఘనమంది రోద్యానవనపుష్పవర్తిత
షట్పదద్యుతి శిరోజముల నొంది

గీ॥ బహుళవృక్షలతాంకురపటము దాల్చి
సురగణాహ్లాదసౌందర్యగరిమ గలిగి
సకలసౌభాగ్యమను నిండుజవ్వనమున
కన్నెపడుచన ద్వారక యెన్నబడియె."

పై పద్యములో కవి ద్వారకానగరమును వర్ణించెను. కరి, హయ, రథ భటులు, వర్ణాశ్రమధర్మములు పాటించు జనులు, అబ్ధితరంగములు, పుష్పోద్యానములు, వృక్షలతాదులు నగరశోభను పెంచును. ద్వారకానగరముతో సమానమైనది ముల్లోకములలో లేదని కవి వర్ణించెను. ఇంతేగాక ఈ నగరమును సకల సంపూర్ణావయవములు కలిగి, యాభరణములు ధరించి మధురాలాపము లాడు నిండు జవ్వనముననున్న కన్నెపడుచుతో కవి పోల్చెను. ద్వారకానగరమువంటి నగరము త్రిలోకములలో లేదని కవి ముందు పద్యములో వర్ణించెను. శ్రీకృష్ణుడు పాలించిన నగరము స్వర్గముకంటె అత్యున్నతమైనదిగా చెప్పుట కవి ఉద్దేశ్యము పురుషోత్తముడైన కృష్ణుడు పాలించు నగరము ద్వారక. ఈ పురాంగన నాయకాపేక్షచే శ్రీకృష్ణుని చెట్టపట్టుటకో యనునట్లు సకలశోభితయై పాలింపబడు చుండెను. సర్వాంగసుందరియైన జవ్వని తను కోరిన నాయకుని పొందు లభించి నపుడు జన్మసార్థకతయని భావించును. అట్లే ద్వారకానగరమను కాంత కృష్ణ పరమాత్మచే పాలింపబడుచున్నపుడు పొందిన యానందము కవి ఊహించినతీరు, వర్ణించిన విధము మనోహరముగా నున్నది. మొదటి పద్యములోనే శ్రీకృష్ణుడు

1. మిత్రవింద. ప్ర. ఆ. 2 పద్యము.

ద్వారకకు ప్రియుడని చెప్పుటవలన కావ్యములో నాయిక (మిత్రవింద)కు ప్రియుడుగా నాయకుడుగా చేయబడునను కావ్యార్థమును గూడా కవి నగరవర్ణనములోనే కథాసూచనము గావించెను.

ఇతర ప్రబంధకవులును పురవర్ణన చేసినారు. శ్రీకృష్ణదేవరాయలు విష్ణుచిత్తీయములో మధురానగరవర్ణన గావించెను.[1] ఇందు మధురానగరము మనోహరమైనదని చెప్పెను.

వసుచరిత్రకారుడు అధిష్ఠానపురమును వర్ణించుచు సకలసంపదలతో విలసిల్లుచు, మనోహరమైన ఉద్యానవనములతోను శుకపికారావములతో విలసిల్లుచున్నదని వర్ణించెను.[2] విజయవిలాసకర్త ఇంద్రప్రస్థపురమును వర్ణించుచు లక్ష్మీనివాసముగా నున్నదని చెప్పెను.[3] పై ప్రబంధకవుల నగరవర్ణనలకు తీసిపోని విధముగా కవి యీ ప్రబంధములో నగరవర్ణన గావించెను.

ప్రథమాశ్వాసములో అక్రూరుని ప్రయాణము శ్రీకృష్ణుని కొనివచ్చుటకు కవి రెండు పద్యములలో వర్ణించెను. అక్రూరుడు శ్రీకృష్ణునితో తిరిగి మధురా నగరము ప్రయాణము చేయునపుడు కవి వసంతఋతువు, వనవర్ణనలు గావించెను పిదప సూర్యాస్తమయ, నిశా, చంద్రోదయ, సూర్యోదయ వర్ణనలు కవి గావించెను. వరుసగా యీ వర్ణన లిట్లున్నవి.

సూర్యాస్తమయ వర్ణన

అక్రూరుడు ఉగ్రసేను నానతి గైకొని శ్రీకృష్ణుని మధురానగరము తీసికొని వచ్చుటకు ద్వారక వెళ్ళెను. రుక్మిణీమందిరములో కృష్ణుని కలిసి, యోగ

---

1. సీ॥ "ఏ వీట సతుల పాలిండ్లపై......దక్షిణమధురసాంద్రదుమధుర."
అముక్తమాల్యద. ద్వి. ఆ. 2 పద్యము.

2. "వర సుమనోభవ్య తరుల కావాల....భూరివరణం బధిష్ఠానపురవరంబు."
వసుచరిత్ర ప్ర. అ. 93 పద్యము

3. "చంద్రప్రస్తరసౌధ........రమా హేలాకళావాసమై."
విజయవిలాసము. ప్ర. ఆ. 66 పద్యము

క్షేమములు విచారించి, కానుకలర్పించి, భోజనాది కృత్యంబులు తీర్చుకొని, భాషించుకొనుచు కాలక్షేపము చేయుచుండగా సాయంకాల మయ్యెను. ఈ సందర్భమును పురస్కరించుకొని కవి సూర్యాస్తమయము నిట్లు వర్ణించెను.

"[1]చం॥ కడువడి పశ్చిమాద్రియను కాంతను గూడి దివాకరుండు నే
ర్పడర స్వకీయ రశ్మలనునట్టి వసంతముఁ జల్లులాడగా
దొడరుచునుండెనో యనగ దోచెడు నద్దిశలందు దట్టమై
గడలుకొనెన్ మనోహరముగాఁ దిలకింపగ సాంద్రరాగముల్."

ఈ పద్యములో పశ్చిమమున సూర్యుడస్తమించుట, సాంధ్యరాగము లలుముకొనుట సామాన్యవిషయములే. కాని కవి పశ్చిమదిక్కాంతను కలిసికొనుటకు సూర్యు డేగినపుడు వేడి కిరణములను విసర్జించి, స్వకీయమైన రశ్మలు వసంతములుగా వెదజల్లుచుండెననియు, స్త్రీపురుషులు కలిసినపుడు ఆనందముతో వసంతోత్సవములాడుటవలనను, సాంధ్యరాగము లలుముకొనుటవలన ప్రేయసీప్రియుల కనురాగోద్దీపనము కలుగుననియు, కవి ఊహించి వర్ణించుట మిక్కిలి రమణీయముగా నున్నది. సూర్యుడు ప్రకృతిశక్తులలో నొకడైనను, సామాన్యమానవభావన కలిగించి, ప్రియురాలుపై అనురాగము చూపించుటకు తన వాడి కిరణములు మాని రాగోదయము (ప్రేమ) కలిగి పశ్చిమ కాంతను చేరినట్లు చెప్పుట చమత్కారయుతముగా నున్నది. అల్లసాని పెద్దన మనుచరిత్రలో[2] నంది తిమ్మన పారిజాతాపహరణములో[3] భట్టుమూర్తి వసుచరిత్రలో సూర్యాస్తమయములను[4] వర్ణించిరి. ఈ కవి పై ప్రబంధకవుల సూర్యాస్తమయ వర్ణనలకు మెరుగు పెట్టినాడనుట సహృదయైక వేద్యము.

---

1. మిత్రవింద ప్ర. ఆ. 80 పద్యము.
2. "తరుణి ననన్యకాంత....... నభోమణి దాల్చె కషాయధీదితిన్."
మనుచరిత్ర. తృ ఆ. 10 పద్యము
3. "ఆయతతేజము ల్దరిగి యంబుజబాంధవు ........ శకుంతరవంబు చెలెంగె నెల్లెడన్"
పారిజాతాపహరణము. ద్వి. ఆ. 30 పద్యము
4. "భపదనుజాత్మజన్ ....... లోకబాంధవు డెఱిగింపబోయినవిధంబున నేగె పయోధిచెంతకున్."
వసుచరిత్ర. చ. ఆ. 4 పద్యము

## నిశావర్ణన

సామాన్యముగా కవులు ప్రబంధములలో సూర్యాస్తమయముపిదప నిశను వర్ణింతురు. కొందరు కవులు నిశను, నిశాధిపతియనియు, తమిస్రనాయకుడనియు పురుషునిగా భావించి వర్ణించిన, మరి కొందరు నిశను రాత్రికాంతయని స్త్రీగా భావించి వర్ణించిరి. మిత్రవింద ప్రథమాశ్వాసములో కవి నిశను వర్ణించిన విధ మిట్లున్నది.

"[1]చం॥ దినకరచంద్రులన్ గెలువ ధీరత లేమి తమిస్రనాయకుం
డనిశము బెగ్గడిల్లుచు మహాగ్రుసియింపుచు నెట్టకేలకున్
వనరుహమిత్రుడేగ గని స్వార్థఫలంబును వృద్ధిజేయగాఁ
దన కలుషప్రచారమున తాండవమాడగ సంభ్రమించుచున్."

"[2]మ॥ తిమిరాధీశ్వరు డెల్ల దిక్తటములన్ దీపించి నిర్భీతి న
శ్రమభంగిన్ నిజరాజ్యపాలనరతారంభక్రియన్ దోప శీ
తమయూఖుం డరిగర్వధూర్వహణసంత్రాసంబు యోచించి
శౌర్యము దీపింపగ తారకాదళములన్ రావించు నొక్కుమ్మడిన్"

పై రెండు పద్యములలో చీకటి నాయకుడు సూర్యచంద్రుల తాకిడికి కృశించి, సమయము చూచి ప్రపంచమంత యాక్రమించి తన పరిపాలన సాగించు కొనవలయునని చీకటి క్రమ్ముకొనెను. ఆకసమున రిక్కలు వచ్చుట చంద్రుని పంపున వచ్చినట్లు భావము.

పగలు సూర్యుడు తన తేజముతో ప్రపంచమును వెలిగించును. రాత్రి చంద్రుడు తన వెన్నెలతో లోకమునకు వెన్నెల (వెలుగు) చూపును. ఇక రాత్రీ నాథుడు తన ప్రతాపము చూపుటకు అవకాశము లేకపోయినది. సూర్యచంద్రుల ముందు (అంధకారము) తమిస్రనాయకునకు ధైర్యము లేక తన శక్తి చూపించ లేక కృశించెను. సూర్యాస్తమయము తరువాత కృష్ణపక్షములో చంద్రోదయమగు

1. మిత్రవింద. ప్ర. ఆ. 80 పద్యము.
2. " " 84 "

టకు కొంత సమయము పట్టును. ఈ లోపల నిశానాథుడు తన ప్రతాపము చాటు కొనుటకు సమస్త ప్రపంచమున చీకటులలమికొనజేసి, జాఱ, చోర మున్నగు కలుషకృత్యములు చేయువారికి సహకరించుచుండెను. అందుకొఱకే వసుచరిత్ర కారుడు తమోనిశాటుడని ప్రయోగించెను.[1] రాత్రి చుక్కలు ప్రకాశించును. ముఖ్యముగా ఆకాశములో చంద్రుడు లేనప్పుడు మరింత దేదీప్యమానముగా ప్రకాశించును. చంద్రోదయాత్పూర్వము ప్రకాశించుచున్న రిక్కలను కవి ఉడు రాజు పంపిన సైన్యముగా భావించెను. కారణము స్పష్టము. రాజు యెపుడైనా యుద్ధరంగమునకు మొదట సైన్యమును పంపి, చివరకు మాత్రమే తాను యుద్ధములో పాల్గొనును. రాజు తన సైన్యము శత్రువును నిర్జించలేకపోయినపుడు మాత్రమే తాను యుద్ధరంగమునకు వెళ్ళును. ఇచట తమిస్రనాథుడు చంద్రునకు శత్రువు. కావున మొదట తన సైన్యమైన నక్షత్రములను చంద్రుడు పంపించెను. కాని తారలు నిశానాథుని గెలువలేకపోయెను. (చుక్కలవెలుగు చీకటిని పాఱద్రోల లేకపోయెను) కావున ఇక రాజైన చంద్రుడు తన శత్రువైన చీకటి నోడించుటకు యుద్ధమునకు వెళ్ళక తప్పలేదు. ఇంత చక్కని చమత్కారమైన ఊహచేసి కవి యీ నిశావర్ణన గావించిన తీరు రమణీయముగా నున్నది.

### చంద్రోదయవర్ణన

'మిత్రవింద' ప్రథమాశ్వాసమున పై సందర్భములోనే కవి చంద్రోదయ మేడు పద్యములలో వర్ణించెను. వీనిలో యీ క్రింది పద్యములలోని వర్ణన మిట్లున్నది.

"[2]చం॥ జలజనివేశయంబులను షట్పదచోరగణంబు డాయుచున్
జలిమి మరందవిత్తము నపార రయంబున తస్కరించి వి
చ్చలవిడిగా చరింప గని చంద్రసమాహ్వయశాసకుండు సం
చలితసరోజపత్రచెరసాలల దోషుల గట్టివైచుచున్"

---

1. "తమోనిశాటుండు పరవకుండ" వసుచరిత్ర. చ. ఆ. 7 పద్యము
2. మిత్రవింద. ప్ర. ఆ. 89 పద్యము

"[1]చ॥ తన పరిపాలనవ్రతవిధానము లోకముదావహంబుగా
దనర సుధాకరుం డమితధార్మికవృత్తి నిశాలతాంగి కో
ర్కెను దమిఝుంపజేయగ సరిత్పతిపుత్రుని రాజ్యవైభవం
బును గనులార జూచు తమి బొంగదొడంగె తరంగపంక్తులన్"

పై రెండు పద్యములలో కవి చంద్రుని గొప్పదనమును వర్ణించెను. పై మొదటి పద్యములో కవి నిక్షేపించిన రమణీయమైన ఊహ యిది.

పగలంతయు తామరలు వికసించియుండెను. అప్పుడు భృంగములు బలిమితో కమలములలో ప్రవేశించి, మకరందము స్వీకరించి విచ్చలవిడిగా సంచరించుట చూచి చంద్రుడు వీని యాటలు కట్టించుటకు పూనుకొని, యా సరోజములలోనే భృంగములను బంధించెను. అనగా నీ పద్యభావము నిట్లర్థము చేసికొనవచ్చును. రాత్రి సమయమున చోరులు బలవంతముగా ధనవంతుల యిండ్లలో ప్రవేశించి, వారి ధనములను కొల్లగొట్టి విచ్చలవిడిగా చరించుట సహింపలేని రాజు యా చోరుల యాటలు కట్టించి, బంధించి చెఱసాలలో పెట్టెను. పగలు తామరలు వికసించును. తామరలలో గల మకరందము షట్పదములు గ్రోలుచు, ఝుంకారము చేయుచు విచ్చలవిడిగా తిరుగుచుండును. మత్తెక్కిన తుమ్మెదలు సమయ వివేచనలేక, కమలములయందే మధువు గ్రోలుచుండగా సూర్యాస్తమయము జరుగును. కమలములు ముకుళించుకొనును. అపుడా భృంగము లా కమలములయందే బంధింపబడి రాత్రియంతయు చెఱసాలలో నుండవలసివచ్చును. సామాన్య విషయమునే కవి మిక్కిలి కమనీయముగా ఊహించి, చంద్రుడను రాజు కమలములలోని మకరందమను ధనమును, భృంగములను చోరులు సంగ్రహించి విచ్చలవిడిగా తిరుగుట సహించలేక, వారిని దండించుటకు కమలములను చెఱసాలలో బంధించెనని వర్ణించుట మనోజ్ఞముగా నున్నది. ఇంతేకాక ద్వారకను పరిపాలించు శ్రీకృష్ణుడు కూడ చోరులను దండించి ప్రజలకు కష్టములు కలుగకుండ రాజ్యపాలన చేయుచుండెనను ధ్వని చూపట్టును.

రెండవ పద్యములో చంద్రుని లోకపాలనము, ధార్మిక దృష్టి, ప్రమోదము మున్నగు విషయములు చర్చించబడినవి. ముఖ్యముగా చంద్రుడు శ

1. మిత్రవింద. ప్ర. ఆ. 92 పద్యము

పక్షమున చంద్రికలు వెదజల్లుచు లోకమున కానందము కలిగించును. అమృత కరుడు కావున ఓషధులలో రసము నింపును. ధార్మికవృత్తిచే నిశాలతాంగి (స్త్రీజాతి) కోర్కెలను దీర్చును. ఇట్టి వ్రతము గల చంద్రుని (సముద్రుని కుమారుడు) పరిపాలనను చూచుటకా యనునట్లు తండ్రి సముద్రుడు తరంగములతో పొంగి, నింగి కెగయుచుండును. చంద్రోదయము సమయమున సముద్ర ముప్పొంగును. ముఖ్యముగా పౌర్ణిమ, యితర పర్వదినములలో సముద్ర ముప్పొంగునని కవులు వర్ణింతురు. ఈ విషయమునే కవి సహజసుందరముగా వర్ణించుట మూతని లోకజ్ఞతకు తార్కాణము. చంద్రోదయము నితరప్రబంధకవులు గూడ వర్ణించిరి అల్లసాని పెద్దన మనుచరిత్రలో[1], నంది తిమ్మన పారిజాతాపహరణములో[2], రామరాజభూషణుడు వసుచరిత్రలో[3] చంద్రోదయమును వర్ణించిరి. ఈ వర్ణన లన్నింటిని పరిశీలింపగా మిత్రవింద కర్త చంద్రోదయవర్ణన పై ప్రబంధకవుల వర్ణన సరసన చోటుచేసికొనదగినదని చెప్పవచ్చును.

## సూ ర్యో ద య వ ర్ణ న

'మిత్రవింద' ప్రథమాశ్వాసములో కవి సూర్యోదయమును యెనిమిది పద్యములలో వర్ణించెను. పై సందర్భము ననుసరించియే యీ సూర్యోదయవర్ణన గావించబడినది. సూర్యునకు చంద్రునందు శత్రుభావ మాపాదింపబడిన యీ క్రింది పద్య మిట్లున్నది.

"[4]సీ॥ తన రాకడను గోరుకొను చక్రవాకాళి
కనుచూపు బాపిన కఠినతనము

1. "మరున కొసంగ గాలము...... వెలుగగాంచె సుధానిధి నెత్తె నత్తరిన్."
మనుచరిత్ర. తృ. ఆ. 21 పద్యము
2. "దినపరిణామలక్ష్మికి.........శీతకరుం డుదయించె నత్తరిన్."
పారిజాతాపహరణము. ద్వి. ఆ. 44 పద్యము
3. "హరిదంబోరుహలోచనల్ ........ హరిణాంకాకృతి వొల్చె రేకయిసగం బై బింబమై తూర్పునన్."
వసుచరిత్ర. చ. ఆ. 17 పద్యము
4. 'మిత్రవింద' ప్ర. ఆ. 96 పద్యము.

తన దర్శనోత్సాహతను వేడ్క వికసించు
తోయజంబుల వేచు దుండగంబు
తన మనఃప్రీతిని గను తేంట్ల జలరుహ
చెఱలను బంధించు చిలిపితనము
తన యోషధులనెల్ల కనుసన్నలను ద్రిప్పి
పటుశక్తి నిలిపిన కుటిలబుద్ధి

తే॥గీ॥ తన విశాల మహోన్నతాస్థానసీమ
నాక్రమించి జరించు దురాగతాది
దోషముల కెల్ల బాత్రుడై తుహినకరుడు
పద్మినీభర్త కత్యంతవైరియైన."

పై పద్యములో కవి సూర్యునకు చంద్రు డేయే కారణములవలన శత్రువుగా భావించినాడో విపులముగా వర్ణించెను. సామాన్యముగా కవులు కారణములు చూపించి కార్యము తెలుపు టొక పద్ధతైన, కార్యము తెలిపి కారణములు చూపించుట మరియొక పద్ధతి. ఇందు కవి మొదట కారణములు వివరించి, చివరకు కార్యము తెలిపెను. కాలవిభాగములో దినమును సగము, రాత్రి సగముగ విభజింపవచ్చును. రాత్రి చంద్రుడు, పగలు సూర్యుడు ప్రకాశించుచు లోకమునకు వెలుగు ప్రసాదింతురు. సూర్యుని వెలుగునకు హెచ్చుతగ్గులు లేవు. కాని చంద్రుని వెలుగునకు హెచ్చుతగ్గులు కలవు సూర్యచంద్రులు ప్రకృతిలో నొకభాగము సూర్యుడు రాత్రిగాని, చంద్రుడు పగలుగాని ప్రకాశింపకపోవుటవలన కవులు వీరుభయులకు వైరమని, ఊహచేసి తమ కావ్యములలో కవిసమయములుగా సూచించుట జరుగుచున్నది.

చక్రవాకములకు రాత్రి కనులు కనిపించవు. పగలు కనిపించును. చంద్రుడు రాత్రి ఉదయించి ప్రకాశించుటచే చక్రవాకముల (సూర్యుని రాకడ గోరుట అనగా వానికి కన్నులు పగలు మాత్రమే కనిపించును.) కన్నులు కనుపింపక తపించును తామరలు సూర్యుని దర్శనమునే కోరుచుండును. కావున సూర్యోదయముతో తామరలు వికసించి, సూర్యాస్తమయముతో ముకుళించుకొనును. అనగా రాత్రి యంతయు ముకుళించుకొనియుండును. పగలు తామరలు విప్పుకొనియుండుటవలన

యందలి మకరందము గ్రోలి భృంగము లాహ్లాదముగా నుండును. ఇట్టివి రాత్రి సమయములలో తామర పుష్పములలో బంధింపబడియుండుట కూడా కవిసమయములే. పగలంతయు ఓషధులు సూర్యకిరణముల వాడికి వానిలోని రసము కోల్పోవును. రాత్రి చంద్రుడు తిరిగి ఓషధులు కోల్పోయిన శక్తిని ప్రసాదించును. పగలు సూర్యుడాకాశమున సంచరించిన, చంద్రు డా స్థానమును రాత్రి యాక్రమించుకొనును. వాస్తవముగా పై విషయములన్నియు ప్రకృతిసహజవిషయములే కాని కవి వీని నన్నింటిని చంద్రునియందు నేరములుగా సూర్యునకు చేసిన యపచారములుగా నాపాదింపజేసి, యీ కారణముల వలననే సూర్యునకు చంద్రుడు శత్రువను భావము నిట స్థిరపరచి చూపెను. ప్రకృతిసహజసిద్ధమైన విషయము లింత అపురూపముగా సమయస్ఫూర్తితో కవి వర్ణించెను. ఈ సూర్యోదయవర్ణన నితర ప్రబంధకవు లెట్లు గావించిరో పోల్చి చూచినచో యీ కవి వైశిష్ట్యము గోచరించును. అల్లసాని పెద్దన మనుచరిత్రలో[1], నంది తిమ్మన పారిజాతాపహరణములో[2], భట్టుమూర్తి వసుచరిత్రలో[3] సూర్యోదయమును వర్ణించిరి. ఈ ప్రబంధకవుల నెవ్వరిని సూర్యోదయవర్ణనలలో ననుకరింపక 'మిత్రవింద' కర్త విశిష్టమైన పద్ధతిలో నీ సూర్యోదయవర్ణన గావించెను.

## వనవర్ణన

'మిత్రవింద' కావ్యములో ద్వితీయాశ్వాసమున కవి వనవర్ణన పది పద్యములలో గావించెను. అక్రూరుడు ఉగ్రసేను ననుమతితో ద్వారకనుండి శ్రీకృష్ణుని మధురానగరమునకు తోడితెచ్చు సందర్భమున రథారూఢులై వచ్చుచు, వనశోభను తిలకించు సందర్భమును పురస్కరించుకొని కవి యీ వనవర్ణన నిట్లు గావించును.

---

1. "ఉరుసంధ్యాతపశోణమృత్తులితమై ........ మార్తాండుండు దోచెన్ దివిన్."
మనుచరిత్ర తృ. ఆ. 59 పద్యము
2. "కొలకొలమంచు మేతలకు........ బొడిచె గోకనదాప్తుడు పాటలద్యుతిన్."
పారిజాతాపహరణము. ద్వి. ఆ. 70 పద్యము
3. "కుముదాధారవిహారముల్........ బ్రొద్దుబొడిచెన్ బంధూకబంధుచ్ఛవిన్."
వసుచరిత్ర చ. ఆ. 136 పద్యము

"1సీ॥ నిగనిగలాడు కెంజిగురాకు ఛాయల
చక్కదనంబున బిక్కటిలుచు
ఫలపత్ర దళపుష్ప భర్మనిర్మితరత్న
భూషలు ధరియించి పొలుపు మీర
వివిధప్రసూనముల్ విటులకుఁ దమిఁగూర్చు
వేలిముసుంగుల లీలఁ దనర
శుకపికషట్పదప్రకరప్రపూరిత
ధ్వనులు గాన మృదంగ పటిమ నొప్ప

తే॥గీ॥ తీగె వెలకాంత ననురక్తి దిద్దుకొనుచు
వేళగని మారుతంబను మేళగాడు
దేవదేవునివాత్సల్యతృప్తి వడయ
ఆటలాడించు తనకున్న పాటవమున."

"2ఉ॥ పాదపభూసురాంగనలు పత్రసువర్ణపుఁ బళ్ళెరంబులన్
మోద మెలర్చు పల్లవసమూహపు దీపికలన్ వెలార్చి పు
ణ్యోదయమంగళారతుల నొప్పుచు నూత్నసుమాక్షతాళి దా
మోదరుమీద జల్లిరి మహోన్నతకాంతుల నుల్లసిల్లుచున్."

పై పద్యములలో వాయువను మేళగాడు తీగెయను వెలకాంత నలంక రించి, వాసుదేవునికి తృప్తి కలిగించునట్లు యాడించుచుండెననియు, పాదపముల నెడు భూసురాంగనలు పత్రములనెడు పళ్ళెరములలో పల్లవములనెడు మంగళా రతులతో పుష్పములనెడు యక్షతలు దామోదరునిపై చల్లుచున్నారని భావము. సృష్టిలో అన్ని భూతములకు పరమాత్ముడు ఆర్యాధ్యదైవము. ముఖ్యముగా మానవ జీవితాధారములైన పంచభూతములను భారతీయులు దేవతలుగా ఆరాధించుట వేదకాలమునుండి వచ్చుచున్నది. పంచభూతములలో వాయుదేవుడు గూడ నొక కావున ఇచట వాయుదేవుడు తన అధిదేవతయైన శ్రీకృష్ణపరమాత్మను సంత

1. 'మిత్రవింద' ద్వి. ఆ. 16 పద్యము.
2. " " 17 "

పరచుట పరమావధిగా పెట్టుకొనెను. కావుననే వనములో గల లతలను వెలకాంతలను, చిగురుటాకువలె నిగనిగలాడు శరీరవర్ణము కలవిగను, ఫల, పత్ర పుష్పములనెడు బంగారు ఆభరణములు ధరింపచేసి, వివిధ సూనములను మేలి ముసుగుగా కలిగి (విటుల నాకర్షించుటకు కనిపించీ కనిపించని శరీరము కలిగి పుష్పసువాసనలు విరజిమ్మువానిని వెలకాంతలు ధరించుట సహజము) వనములో చెంతనే యుండు శుక, పిక, షట్పద నికరములు చేయు ధ్వనులు గాన మృదంగములుగా చేసి, వాయువు తాను మేళకాడై శ్రీకృష్ణుని సంతుష్టిపరచుట కాడించుచుండెను. సాధారణముగా దేవాలయములలో బ్రహ్మోత్సవము, అధ్యయనోత్సవము సందర్భమున సేవలముందు నర్తకీమణులు (వేశ్యలు) అలంకరించుకొని గానవాద్యముల సహకారముతో నర్తించి దేవుని తృప్తిపరచుట పూర్వముండెడిది. భక్తి నవవిధములు ఇందు వాత్సల్యభక్తి యొకటి. కావున వాయు వీ విధమున శ్రీకృష్ణుని తృప్తిపరచుటకు ప్రయత్నించెనని కవి వర్ణించెను. ఇందు మరియొక విశేషము కలదు. లతలను వెలయాండ్రతో పోల్చుట చూడ వీరు చంచలమనస్కులనియు, విచ్చలవిడిగా వర్తించువారనియు, పోషించువారికి వశవర్తులై యుందురనియు భావింపవచ్చును. లతలు ఆధారముపై స్వేచ్ఛగా ప్రాకుట, వాయు తాకిడికి చలించుట, వృక్షముగాని, పందిరిగాని, కర్రగాని ఆధారముండినచో దానికి యల్లుకొనుట చూతుము. ఈ విధముగా కవి వెలయాండ్రకు వనలతలకు, మేళగానికి వాయువునకు పోలికలు పొసగించి, ఈ రెంటికి వాత్సల్యభక్తితో సంబంధము కలిగించి వర్ణించిన తీరు వినూత్నమని చెప్పవచ్చును.

ఆ వనములో గల వృక్షములు తమ పత్రములనెడు పళ్ళెరములలో చిగుళ్ళను హారతులిచ్చుచు, కుసుమములను సేసలు శ్రీకృష్ణునిపై రాల్చుచుండెను ఈ సన్నివేశమునే కవి మిక్కిలి రమణీయమైన భావనచేసి యిందు వర్ణించెను. భూసురాంగనలు వెలయాండ్రవలె గాక పుణ్యాంగనలై పరమాత్ముడైన కృష్ణునకు మంగళారతులిచ్చుట, సేసలు చల్లుట చేసిరి. హైందవులలో శుభకార్యముల సందర్భమున మంగళారతులొసంగుటకు అక్షతలు చల్లుటకు ప్రత్యేక ప్రాధాన్యము కలదు. దీని ఉద్దేశ్య మా వ్యక్తికి శుభము జరుగవలెనని యాకాంక్ష వ్యక్తము చేయుట. కవి యిందు పాదపముల కొక విశిష్టప్రతిపత్తి నొసంగి భూసురాంగనలతో

పోల్చి వర్ణించెను కవి ఇట్టి ఊహల వ్యక్తము చేయుటలో యితర ప్రబంధకవుల ననుకరింపక ప్రత్యేకరీతిలో మనోరంజకముగా వర్ణించెను.

వ స ం త ఋ తు వ ర్ణ న

కవి 'మిత్రవింద' కావ్యములో ద్వితీయాశ్వాసమున (8) పద్యములలో వసంతఋతువును వర్ణించెను. అక్రూరుడు శ్రీకృష్ణునితో రథారూఢుడై మధురా నగరము వెళ్ళు సందర్భమున వనగమనము చేయుచుండిరి. ఈ సందర్భమును పురస్కరించుకొని కవి వసంతఋతువును వర్ణించిన విధ మిది.

"[1]ఉ॥ అంత వసంతనాయకుని యానతి వృక్షలతానికుంజసీ
మంతు లనేకరూపముల మంజుల పుష్ప సుభూషణాంబరా
క్రాంతితవేషలై ప్రకృతి రమ్యవిలాసవికాసవంతలై
వింతగ నిల్చి రా విపినవీధి మురారికి స్వాగతంబిడన్."

వసంతనాయకుని యాజ్ఞానుసారము వనములోగల వృక్షలతానికుంజములు మంజులపుష్పములు ధరించి, విలాసముగా వారి కా వనములో స్వాగతము పలుకు చున్నవట.

కాలగమనమున హేమంతము తరువాత వసంతఋతువు వచ్చును. హేమంతములో వృక్షలతాదులు పండిన యాకుల రాల్చును. వసంతమున తిరిగి చిగుర్చి, పుష్పించి ఫలించును శ్రీకృష్ణుడు ప్రయాణము చేయు కాలము వసంత ఋతువు కావున వనములో వృక్షలతానికుంజములు చిగుర్చి, పుష్పించి కమనీయ ముగా నుండెను. కవి యీ వనదృశ్యములనే సహజకోమలముగా వర్ణించెను. ఇట మరియొక విశేషము కలదు. మన్మథుడు కృష్ణుని కుమారుడు. వసంతుడు మన్మ థుని బంటు. ఇతనికి మలయమారుతము శుకపికాదులు సహచరులు. వసంతునకు తన నాయకుడైన మన్మథుని తండ్రికి స్వాగతము పలికి మెప్పించుట విధి. అందు కొఱకే తన సహచరుల కాజ్ఞాపించి శ్రీకృష్ణునకు సంతృప్తి కలిగించువిధముగా స్వాగతపు టేర్పాట్లు చేయమని యాజ్ఞాపించెను. వసంతనాయకాజ్ఞానుసార మా

1. 'మిత్రవింద' ద్వి. ఆ. 9 పద్యము.

వనములోగల వృక్షలతానికుంజములు చిగురించి పుష్పించుట వలన యాకర్షణీయ మైన వేషములు ధరించినట్లుండెను. విలాసవంతమైన యా వృక్షలతానికుంజము లా వనవీధిలో వరుసగా నుండి శ్రీకృష్ణునకు స్వాగతము పలుకుట కలంకరించు కొని యున్నవని కవి ఊహించి వర్ణించుట సహజసుందరముగానున్నది.

రసదృష్టి

ప్రబంధములో ప్రధానరసము శృంగారమేయైనను, రచన ఒకయాశ్వాసము పై యిరువది పద్యములు మాత్రమే చేయబడినది. రచించినంతవరకు భక్తి యధికము. శృంగారము స్వల్పము. ముందు శృంగారము పిదప భక్తిరసము పరిశీలింపబడును. కవి ద్వారకానగరమును వర్ణించుచు, ద్వారక నొక శ్రీమూర్తిగను, పాలకుడైన శ్రీకృష్ణుని నాయకుడిగను భావించి వర్ణించిన సందర్భములో కొంత శృంగార మున్నను విశేషాంశములు లేవు. కాని యీ సందర్భముననే రాధ శ్రీకృష్ణు నారాధించిన ప్రణయసన్నివేశమును కవి వర్ణించిన విధ మిట్లున్నది.

శృంగారము

"[1]చ॥ నవరసరాగభావరతనంబుల జక్కని ప్రేమతంతువున్
దవులగ మాలఁగూర్చి సుకృతంబు ఫలింప దలంచి రాధికా
కువలయపత్ర నేత్ర యదుకుంజరు కంఠమునందు వైచి మ
క్కువ దిలకించు సంతతము కోరిక లీరికరెత్త నర్మిలిన్."

పై పద్యములో రాధకు శ్రీకృష్ణునియందు గల ప్రణయమును కవి వర్ణించెను. రాధాకృష్ణుల ప్రణయము ప్రేయసీప్రియుల కాదర్శవంతమైనది. దీనిని మధురభక్తియని కూడ చెప్పవచ్చును. రాధాకృష్ణుల ప్రేమ అజరామర మైనది. రాధ శ్రీకృష్ణుని యష్టభార్యలలో నొక భార్య గాదు. పదహారువేల గోపికా స్త్రీలలో నొకతె గాదు. కాని శ్రీకృష్ణునియందు ఆమెకుగల ప్రణయము సాటిలేనిది కాని యీ ప్రణయము శారీరక సౌఖ్యము కంటె అతీతమైన మానసికానందమని చెప్ప నుచితము. రాధకు కృష్ణునిపై గల అనురాగము చక్కని ప్రేమతంతువుగా

1. 'మిత్రవింద' ప్ర. ఆ. 28 పద్యము.

మాలగూర్చి, తన పూర్వజన్మసుకృతఫలంబునందదలచి, (శ్రీకృష్ణునిలో లీన మగుట లేక పరమపదప్రాప్తి పొందుట ధ్యేయముగా గలిగి) ఆ ప్రేమమాలను శ్రీకృష్ణు కంఠమునందు వైచి ప్రేమతో చూచుచుండెను. ఇచట జీవాత్మ పరమాత్మలో లీనమగుటకోరును దీనినే ముక్తియందురు. అదే విధముగా యిచట రాధ తనకు శ్రీకృష్ణునందు గల ప్రణయము (మధురభక్తి) తో సంశ్లేషణ పొందుట కోరుకొనినది. అంతేగాని శారీరకసుఖము కోరి మాత్రము కాదు. ఈ విషయమునే కవి పై పద్యమునందు సుమధురముగా సూచించెను.

భక్తి

మధురావాసుల కోర్కె ననుసరించి ఉగ్రసేను డక్రూరు రావించి ద్వారకా నగరమున కేగి శ్రీకృష్ణుని కొనిరావలయునని యాజ్ఞాపించెను. అక్రూరుడు రథారూఢుడై ద్వారకకు పయనమైపోవు సందర్భమున కృష్ణు నారాధించిన సందర్భములో గల పద్య మిట్లున్నది.

"[1]శా॥ శారీరాలయమందు చిత్తమను భాస్వద్రత్నపీఠంబుఁ జే
కూర న్నం దుపవిష్టుఁ జేసి హరినిన్ గోవిందసంకీర్తనా
కారస్వచ్ఛజలంబు లర్ఘ్య మిడుచున్ సంస్తూయపుష్పాళి నిం
పారన్ పూజల సల్పుచున్ జనెను నయ్యక్రూరభక్తుం డొగిన్."

పై పద్యమునందు అక్రూరునికి శ్రీకృష్ణునందుగల భక్తిని కవి వివరించెను అక్రూరుడు శ్రీకృష్ణుని పరమభక్తుడు. కాని మధురానగరములో నుండెను. శ్రీకృష్ణుని బాల్యములో నొకసారి కంసుని పంపున బలరామకృష్ణుల కొని తెచ్చుటకు వ్రేపల్లె కేగెను. తిరిగి ఉగ్రసేనుని పంపున కృష్ణుని కొనితెచ్చుటకు ద్వారకకు పోవుచుండెను. భక్తిభావము మానవులకు పూర్వజన్మసుకృతఫలముననే లభించును. ఇచట అక్రూరునకు శ్రీకృష్ణపరమాత్మను చూడవలయునను కోరికతో పాటు రాజాజ్ఞవలన వాయువేగ మనోవేగములతో ద్వారకకు వెళ్ళు చుండెను. ఆ సందర్భములో అక్రూరుడు తన మనస్సులో శ్రీకృష్ణుని పూజించిన విధము కవి మిక్కిలి హృదయరంజకముగా చెప్పెను. తన శరీరమను నాల

1. 'మిత్రవింద' ప్ర. ఆ. 51 పద్యము.

యములో చిత్తమను రత్నపీఠమునందు హరి నుపవిష్టు చేసి, గోవిందసంకీర్తనము లనెడు స్వచ్ఛమైన జలముల నర్ఘ్యమిడుచు, స్తుతులను పుష్పాళిచే పూజల చేయుచు ద్వారకకు చనెను. అనగా ప్రయాణము చేసినంత తడవు గోవిందనామకీర్తన చేయుచు, తన మనమందా హరిని నిల్పుకొని పూజించుచు, ధ్యానించుచు, యితరాలోచనలు లేక యా అక్రూరుడు ద్వారకకు వెళ్ళుచుండెను. ఆ సమయమున శ్రీకృష్ణు నెపుడు చూతునా యను తహతహ భక్తుడగు అక్రూరుని మనస్సులో నుండెను. దీనినే సమయోచితముగా తనకు పరమాత్మునియందుగల భక్తిని యాతురతను జోడించి కవి భక్తిపారవశ్యములో మునిగి, భక్తిరసములో తా నోలలాడుటయే కాక పాఠకులను గూడా నోలలాడించెను.

'మిత్రవింద' కావ్యములో కవి భక్తి, వైరాగ్యవేదాంతముల కమిత ప్రాధాన్యము నొసంగెను. దీనికి వీరి వయస్సు పరిపక్వత కారణమని భావించవచ్చును. ఈ కావ్యరచనాకాలమువరకు ఆచార్యులవారికి అరువది సంవత్సరముల వయస్సు కలిగి జీవితములో నెన్నియో కష్టసుఖముల ననుభవించి, యిక జీవితశేషమును పూర్తిగా పరమాత్మను స్తుతించుటలోనే గడుపవలయునని నిర్ణయించుకొనినట్లు కనిపించుచున్నది. అందుకే వీరి చివరికాలము పూర్తిగా రామగిరి శ్రీసీతారామచంద్రాలయములో పురాణకాలక్షేపము చేయుచుండిరి. ఈ కాలముననే వీరి 'మిత్రవింద' కావ్యరచన సాగినది. కావున యిందుగల వేదాంత వైరాగ్యములకు మచ్చున కొక పద్యమిది.

"[1]సీ॥ వివిధరూపంబుల వెలయు శరీరముల్
భయముఁ గొల్పెడు ఘోర వనులు గాగ
కామాది గుణములు కరి సింహ శార్దూల
భల్లూక మర్కట ప్రతతి గాగ
పుత్ర మిత్ర కళత్ర భోగ రాగాదులు
కుదిలపరచెడు ముండ్లపొదలు గాగ
విషయవాంఛానంద విరచిత దుష్కృతుల్
ఘనతర శైలదుర్గములు గాగ

1. 'మిత్రవింద' ప్ర. ఆ. 63 పద్యము.

తే॥గీ॥ దనరు సంసృతిబాధలఁ దగఁ గృశించి
తీవ్ర సంతాప వేదనార్తిని వహించు
భక్తజీవుల యజ్ఞానపదముఁ బాపి
మోక్షనిలయంబునకు జేర్చిఁ బ్రోతు వనగ."

పై పద్యములో అక్రూరుడు శ్రీకృష్ణుని స్తోత్రముచేసి, భక్తుల నే విధముగా యా పరమాత్ముడు కటాక్షించి, మోక్షము ప్రసాదించునో కవి విపులీకరించెను.

వివిధరూపములలో నున్న మానవకోటి శరీరములను భయంకరారణ్యములు గను, కామక్రోధాది యరిషడ్వర్గము లా యరణ్యములో తిరుగు సింహ శరభ శార్దూలాది మృగములుగను, పుత్రమిత్రులు, భార్యాది భోగము లీ యరణ్యము లోని ముండ్లపొదలుగను, కోరికలవలన చేయు దుష్కృత్యము లీ యరణ్యము లోని శైలదుర్గముల మాదిరిగను, బాధపడుచు సంసారసాగరములో కృశించు భక్తజనాళికి అజ్ఞానాంధకారము పోద్రోలి మోక్షము ప్రసాదింతువని అక్రూరుడు శ్రీకృష్ణుని ప్రార్థించెను. మానవజీవితము నింత స్పష్టముగా వివరించి, మోక్షమున కవరోధములను తెలిపి, జీవకోటికి భక్తివలన మాత్రమే మోక్షము కలుగునను నుపదేశము చేయు వైరాగ్యభావ మిందు సలక్షణముగా ఉదాహరణలతో చూపించి కవి ధన్యుడయ్యెను.

ప్రథమాశ్వాసములోనే అక్రూరుని మానసికస్థితిని మానవ జీవితమును వేదాంతమునకు సమన్వయముచేసిన విధ మిట్లున్నది.

"1సీ॥ పంచభూతవ్యాప్తిఁ బరగు దేహము దివ్య
రత్నసౌధములీల గ్రాలుచుండ
విజ్ఞానవంతమై విలసిల్లు హృదయంబు
సింహాసనమురీతిఁ జెలగుచుండ
తరుగని నవవిధ దాస్యప్రవృత్తులు
కుసుమాక్షతల వింతఁగొలుపుచుండ

1. 'మిత్రవింద' ప్ర. ఆ. 50 పద్యము

కడుభక్తిఁ గొనియాడబడు కీర్తనంబులు
యభిషేకజలములై యలరుచుండ

తే॥గీ॥ భావరాజ్యము నిచ్ఛానువర్తనమున
బాలనముసల్పఁ గృష్ణుని పట్టభద్ర
పదవి కర్హుని గావించి భవభయారి
షట్కమును ద్రోసిఁ జనుచుండె సదయు డతడు."

పై పద్యములో కవి అక్రూరుని మానసికస్థితిని వేదాంతార్థములో ప్రవచించెను. మానవశరీరము పంచభూతములతో కూడినది. ఇట్టి శరీరమును కవి రత్నసౌధముతో పోల్చెను. శరీరములోని విజ్ఞానవంతమైన హృదయము సింహాసనమువలె నుండెను. రాజసింహాసనము న్యాయాన్యాయ విచారణమెట్లు చేయునో హృదయము విజ్ఞానముతో మంచిచెడుల వితర్కించి నిర్ణయించును. మానవుని నవవిధదాస్యప్రవృత్తులు కుసుమాక్షతలతో భగవత్సేవ చేయుచుండును. భక్తితో పరమాత్మని స్తుతించు కీర్తనలే భక్తుడు అభిషేకజలములుగా నుపయోగించును. అరిషడ్వర్గములను జయించిన భక్తుడు (అక్రూరుడు) తన చిత్తానుసారము శ్రీకృష్ణుని తన హృదయమునందే స్థిరపరచుకొని ప్రార్థించుచుండెను. ఇచట అక్రూరుని హృదయములోగల భగవద్భక్తిని వేదాంతరూపములో కవి తన మానసిక ప్రవృత్తిని వ్యక్తీకరించెను.

## అ లం కా ర ము లు

ఈ ప్రబంధములో ముఖ్యముగా కవి అర్థాంతరన్యాసము, ఉత్ప్రేక్ష, ఉపమాలంకారముల నుపయోగించెను. అలంకారములన్నియు అప్రయత్నముగనే కావ్యములో చోటుచేసికొనుట కనిపించుచున్నది. వరుసగా పై యలంకారముల నొకదాని తరువాత నొకటి మచ్చున కుదహరించనైనది.

"[1]ఉ॥ సుందరుడైన పూరుషునిచూచి మరుల్గొనుచుండు రంగనా
బృందము లా విధంబె యరవిందదళాక్షుని యాశ్రయాప్తి నిం

1. 'మిత్రవింద' ప్ర. ఆ. 17 పద్యము

పొంది సచేతనస్థితిని బోలుచు ద్వారవతీలతాంగి గో
విందుని గోరు టబ్బురమె? విజ్ఞుల కయ్యది నైజమేయగున్."

పై పద్యములో సామాన్యము విశేషముచే సమర్థించబడినది. కావున అర్థాంతరన్యాసము. సుందరపురుషుని చూచి స్త్రీలు మోహపడునట్లే, ద్వారకా నగరమను స్త్రీ శ్రీకృష్ణుడను సుందరపురుషుని నాయకునిగా కోరి వరించినదనియు విజ్ఞు లెప్పుడు మంచినిర్ణయమే గైకొందురనియు, కవి ద్వారకానగరము వర్ణించు సందర్భమున సుమధురభావన నిట ప్రవేశపెట్టెను. కవి పలు పద్యములలో అర్థాంతరన్యాసముల నుపయోగించెను. మరియొకచో "యుద్ధతుల మధ్య చరింపగ నల్పు డోపునే" యని ప్రయోగించెను. ఈ ప్రయోగము "ఉద్ధతులమధ్య నిరుపేద కుండదరమె"[1] యను ప్రయోగము ననుకరించినట్లు కనిపించుచున్నది.

"[2]చం॥ వనరుహమిత్రు డుద్ధతిని వారిజవైరిని ద్రోసిరాజనం
గను మది కోపతాపభరకంపితచిత్తము తత్తరింపగా
తన కిరణప్రసారభటతండములన్ బురికొల్పుచున్ రయం
బున జనుదెంచె పూర్వగిరి పుణ్యతపఃఫలపుంజమో యనన్."

పై పద్యమున కవి సూర్యోదయమును వర్ణించెను. ఇందు సూర్యుడు చంద్రునిపై కోపముతో తన కిరణములను భటసమూహముల పురికొల్పి తూర్పు కొండ పుణ్యతపఃఫలసూ యనునట్లు సూర్యుడు తూర్పున ఉదయించెనని కవి చక్కని ఊహ నిందు ప్రవేశపెట్టిన ఉత్ప్రేక్ష మిక్కిలి రమణీయముగా నున్నది. ప్రబంధకవు లిట్టి ఉత్ప్రేక్షలు కోకొల్లలుగా నుపయోగించిరి. 'మిత్రవింద' కర్త గూడ యీ అలంకారప్రయోగములలో ప్రబంధకవుల ననుసరించెను.

శ్రీకృష్ణుని చూడవలయునని యుగ్రసేనుడు చూపిన కుతూహలము కవి వివరించు విధమిట్లున్నది.

"[3]చం॥ తన హృదయాబ్జపత్రమున తాండవమాడెడు వాసుదేవహం
సను దరిఁజేర్చి సాధుజనసంస్తవచర్యల తృప్తిఁగూర్చు వాం

1. కవికర్ణరసాయనము. సంకుశాల నృసింహకవి.
2. 'మిత్రవింద' ప్ర. అ. 98 పద్యము.
3. " " 36 "

ఛను గొని యుగ్రసేను డనిశంబు దలంపుచునుండె పూర్ణచం
ద్రుని గన గోరు చాతకముతో సరిబోలుచు నిండు వేడుకన్."

పై పద్యములో కవి యుగ్రసేనుడు శ్రీకృష్ణుని చూచుట కే విధముగా కాంక్షించెనో వివరించెను. ఉగ్రసేనుని హృదయమను యబ్జముపై శ్రీకృష్ణుడను హంస తాండవమాడుట యనగా సర్వకాలసర్వావస్థలయం దుగ్రసేనుడు శ్రీకృష్ణుని మానసికముగా నారాధించుచుండెను. కాని తన పట్టణములో గల సాధుజనులందరికి యా కృష్ణపరమాత్మ దర్శనము చేయించి, వారిచేత సంస్తవము చేయించి తృప్తి కలిగించదలచెను. ఈ వాంఛనే కవి చాతకములు పూర్ణ చంద్రుని చూడవలయునను కోరికతో నుపమించెను. చాతకములు చంద్రుని చంద్రికలను మాత్రమే యారగించి తృప్తి పడునని కవిసమయము. ఇదే విధముగా సాధుజనులకు శ్రీకృష్ణపరమాత్మ దర్శనభాగ్యము వలననే తృప్తి కలుగునను విషయమును కవి హృదయరంజకముగా చూపించెను.

ఈ కావ్యములో కవి చూపిన నూతనత్వము గుఱించి మరియొక విషయ మిచట చూపించవలసియున్నది. ద్వారకలోగల శ్రీకృష్ణుని మూర్ఖు లే విధముగా కానలేరో వివరించు యీ క్రిందిపద్య మిట్లున్నది.

"[1]చం॥ జలమున బుట్టి నందనము సారసమున్ జతగూడి యుడిచన్
జలజమరందమాధురిమ సంగ్రహణస్థితి బేకకోటికిన్
దెలియదు భృంగ మెల్లపుడు దృప్తిగ గ్రోలును తద్విధంబె మూ
ర్ఖులు హరిగాన రార్యులు నిగూఢత కృష్ణు ని జేరుచుండెడున్."

పై పద్యములో సీటికప్ప తామరలోని మకరందము స్వీకరించలేక పోవుట, నీట పుట్టకపోయినను భృంగ మా మకరందమును స్వీకరించుటను మూర్ఖులు హరి గానలేకపోవుటతో కవి పోల్చి వర్ణించెను. శ్రీకృష్ణుడు ద్వారకానగరములో దుష్టుల శిక్షించి, శిష్టుల కాపాడుచు రాజ్యపరిపాలనచేయుచుండెను. ఉగ్రసేనుడు అక్రూరుడు, గోపికాస్త్రీలు మున్నగువారు శ్రీకృష్ణుని దర్శనభాగ్యముకొఱకు వేయికన్నులతో యెదిరిచూచుచుండిరి. మరియొకవంక శిశుపాల జరాసంధాది

1. 'మిత్రవింద' ప్ర. ఆ. 32 పద్యము.

దుర్మార్గులు శ్రీకృష్ణు నసహ్యించుకొనుచు శత్రుభావముతో నుండిరి. ఈ విషయ మునే కవి జలములో పుట్టిన కప్ప తామరతో సాహచర్యము గరిపినను తామరలో గల మకరంద మానలేకపోవును. కాని జలములో పుట్టకపోయినను భృంగ మా తామరలోగల మకరందమును సదా యాస్వాదించుచుండును. ఇదే విధముగా మూర్ఖులైనవారు (హరిని) శ్రీకృష్ణదర్శనభాగ్యము నోచుకొనలేక కప్పలవలె నిరర్థకమైన జీవితము గడుపుదురు. ఈ భావమునే కవి మిక్కిలి చతురతతో సాదృశ్యమును చూపించి, తనకుగల భక్తిభావము నీ సందర్భమున ఉదాత్తమైన రీతిలో ప్రకటించెను. ఇట్టి రచనాచతురత అనుభవము పండిన కవులకు మాత్రమే సాధ్యము. ఇట్టివారిలో 'మిత్రవింద' కర్త ఒకరని చెప్పవచ్చును.

శ్రీకృష్ణు డక్రూరునితో కలిసి మధురానగర మేగునపుడు దారిలో యమునానది ఉప్పొంగినపుడు కవి వర్ణించిన యీ క్రింది పద్య మిట్లున్నది.

"[1]మ॥ పతిసంశ్లేషసుఖానుభూతిగొను దాంపత్యానురాగోన్నతిన్
ధృతిమీరన్ యమునాలతాంగి పరమప్రీతిన్ విలాసక్రియన్
చతురత్వంబున స్వాగతంబిడుచు నిష్టన్ గృష్ణు సేవింప స
మ్మతినూహించెనొ నాగ పెల్లుబికి సన్మానార్హత న్మెప్పుచున్."

భర్తపై అనురాగముతో సంశ్లేషసుఖమును పొందుటకు యమునయను లతాంగి విలాసముగా భర్తకు స్వాగతమిడుచున్నదా యనునట్లు యమునానది శ్రీకృష్ణుని సేవించవలయునను నాతురతతో సమ్మానపూర్వకముగా నుప్పొంగెనట.

ఈ పై పద్యము కవి వేంకటనరసింహాచార్యుల చివరి రచన. దీని తరువాత వీరు యే విధమైన రచన కొనసాగించిన యాధారము లేదు. తన జీవితము చివరికాలము కావున ఒక విధముగా యీ పద్యములో కవి జీవాత్మ పరమాత్మ సిద్ధాంతమును ప్రతిపాదించినట్లు కనిపించుచున్నది, జీవాత్మ పర మాత్మనుండి సృజింపబడి, సంసారసాగరములో కష్టసుఖము లనుభవించినప్పటికి

1. 'మిత్రవింద' ద్వి. ఆ. 20 పద్యము.

చివరకు తనను సృజించిన పరమాత్మలో లీనమగుటకు కోరుకొనును. జీవుడు పరమాత్మునిలో లీనమగుట చివరి గమ్యము. ఎందుకనగా పరమాత్మలో లీనమైన జీవునకు పునర్జన్మ యుండదు. దీనినే మోక్షమందురు. జీవునకు సంసారసాగరము తరించి, మోక్షము పొందుటకు పరమాత్మలో నైక్యమగుటయే ప్రధాన వ్యాసంగము. కవి చివర పరమాత్మలో లీనమగుట తన ధ్యేయమగుటవలన మోక్ష మాసించి. యమునానది యే విధముగా నైతే శ్రీకృష్ణుని సంశ్లేషము నాశించి యుప్పొంగి యాతనిలో కలియుటకు ప్రయత్నించినదో, అదే విధముగా తన జీవాత్మ పరమాత్మలో లీనమగుట కువ్విళ్ళూరుచున్నదను భావము కవి యీ పద్యమందు ధ్వనింపజేసెను.



# నాటకోత్పత్తి - వికాసము

"కావ్యేషు నాటకమ్ రమ్యమ్" అని విమర్శకుల మతము. ఆంధ్రసాహిత్యములో దృశ్యకావ్యములకు, శ్రవ్యకావ్యముల కొక విశిష్టస్థానము కలదు. శ్రవ్యకావ్యములు పండితులను, విద్యావంతులను, మాత్రమే రంజింపజేయును. కాని దృశ్యకావ్యములు నిరక్షరాస్యులనుండి పండితులవర కానందింపజేయగలవు. ఈ దృశ్యకావ్యములనే నాటకములు, రూపకములనియు అందురు.

భారతీయ నాటకకళ విజ్ఞాన సర్వస్వమని భావించుచున్నది భరతుని నాట్యశాస్త్రము. ఇది క్రీస్తుశకారంభములో రచింపబడినది. యుగసంధిలో మానవులు కామక్రోధాది అరిషడ్వర్గములచే పశుప్రవృత్తి కలిగి, స్వధర్మములను పరిత్యజించి, భ్రష్టులగుట చూచి దేవతలు బ్రహ్మను ప్రార్థించి, మానవులను స్వధర్మనిరతులుగా చేయుట కొక సాధనమును ప్రసాదించుమని కోరిరి. బ్రహ్మ నాట్యవేదమును సృజించి భరతమునికి బోధించెను. భరతముని యీ నాట్యశాస్త్రమును తన నూర్గురు శిష్యులకు బోధించి వారివారి యోగ్యతల ననుసరించి వారికి పాత్రల నొసంగి, ఇంద్రోత్సవసమయమున "అసురపరాజయ" మను మొదటి నాట్యప్రదర్శనము గావింపజేసినట్లును, దీనిని దేవదానవులు చూచి ఆనందించినట్లొక ఐతిహ్యము కలదు.

నాట్యమొక సమాహారకళ ఇందు లలిత కళలు సంగీతము, సాహిత్యము, శిల్పము, చిత్రము, నృత్యము, మరియు గీతవాద్యకళలు మేళవించుటవలన ఈ నాట్యకళ మిక్కిలి ప్రశస్తమైనదని చెప్పవచ్చును. నాటకప్రయోగము యజ్ఞ

తుల్యమైనది. అందుకొఱకే కవికులగురువగు కాళిదాసు నాటకమును చాక్షుష క్రతువని పేర్కొనెను.

నా ట క ని ర్వ చ న ము

'నట్' అను ధాతువునుండి నటుడు, నాట్యముసుత్పన్నమైనట్లు మొదటి సారిగా పాణినీయమందు కనిపించుచున్నది. నిఘంటుకారుడగు అమరసింహుడు "తాండవం, నటనం, నాట్యం, లాస్యం, నృత్యం చ నర్తనే[1] అని పేర్కొనుట వలన నాడు తాండవ, నటన, నాట్య, లాస్య, నృత్యములు సమానార్థకముగా ప్రయోగింపబడెడివని తెలియుచున్నది. నటునిచే నటింపబడుచున్నది కావున నాటక మనియు, నటునియందు రామాద్యవస్థల యారోపణ జరుగుచున్నది. కావున రూపకమనియు భావించవచ్చును. మానవుని సుఖదుఃఖసమన్వితమైన యీ లోక స్వభావము ఆంగికాద్యభినయోపేతమై నాట్యమగుచున్నది.[2] దీనినే గ్రీకులు డ్రామా యని వ్యవహరించిరి. పాశ్చాత్యులీ నాటకమును 'ప్లే' యనిరి. సంస్కృతా లంకారికులీ రూపకమును దృశ్యకావ్యమనిరి. నన్నయాది తెలుగు కవులీ రూపక మునకు నాటక మను తెలుగు పద ముపయోగించిరి.

నా ట క భే ద ము లు

ఆలంకారికులు దశవిధరూపకములు చెప్పిరి.

1. నాటకము. 2. ప్రకరణము. 3. భాణము. 4. ప్రహసనము. 5. డిమము. 6. వ్యాయోగము. 7. సమవాకారము. 8. వీధి. 9. అంకము 10. ఈహామృగము.

నాటకము దశవిధరూపకములలో నుత్తమమైన రూపకము. సంస్కృత ములో క్రీ. పూ. ప్రథమ శతాబ్దికి చెందిన అశ్వఘోషుని మొదలుకొని క్రీ. శ. 10వ శతాబ్దికి చెందిన రాజశేఖరునివరకు గల కవులందరు సంస్కృత నాట కములు రచించిరి. ప్రాచీనాంధ్రదేశములో చాళుక్యుల కాలములో కుమార శ్రీకంఠుడు 'ఆర్యక్రీడ' యనెడు (7) అంకముల నాటకము రచించెను. కాక

1. అమరకోశము. ప్ర. కాం. నాట్యవర్గము. 9 సూత్రము.
2. నాట్యశాస్త్రము. ప్ర. అ. 119 శ్లోకము.

తిరుగుల కాలములో జాయప సేనాని 'నృత్తరత్నావళి' రచించెను. విద్యానాథుడు ప్రతాపరుద్రకల్యాణమనెడు నాటకము రచించెను. రెడ్డిరాజుల కాలములో సింగ భూపాలుడు రసార్ణవసుధాకరమను లక్షణగ్రంథమును, కందర్పసంభవమనెడు రూపకమును రచించెను. కుమారగిరిరెడ్డి వసంతరాజీయమను నాట్యశాస్త్రమును రచించెను. విజయనగరరాజుల కాలములో కృష్ణరాయలు స్వయముగా ఉషాపరిణయము, జాంబవతీ కల్యాణ మనెడు నాటకములు రచించెను.[1]

## తెలుగు నాటకరచన ఆరంభము – వికాసము

తెలుగులో తొలిరూపకము క్రీడాభిరామము. తెలుగు రూపకలక్షణములను ప్రత్యేకించి చెప్పిన ప్రథముడు చిత్రకవి పెద్దనార్యుడు. ఆధునిక తెలుగు నాటక వికాసమునకు పూర్వమాంధ్రదేశములో దృశ్యకళారూపకములు భామాకలాపము పగటివేషములు, నృత్యనాటకములు, కూచిపూడి, బొమ్మలాటలు, యక్షగానములు. కురవంజి, విప్రవినోదము మున్నగు రచనాప్రక్రియలు కొనసాగి ప్రదర్శింపబడుచుండెడివి.

తెలుగు సాహిత్యముపై సంస్కృత సాహిత్యప్రభావము కలదను విషయము జగమెరిగిన సత్యము. ప్రాచ్యపాశ్చాత్య నాటకముల ప్రభావము తెలుగునాటక వికాసమునకు దోహద మొనరించినది. నాటకములకు పూర్వరూపములైన యక్షగానములు తంజావూరు నాయకరాజుల కాలములో విరివిగా రచింపబడి ప్రదర్శింపబడినను, క్రీ. శ. పందొమ్మిదవ శతాబ్ద పూర్వార్ధమువరకు నాటకరచన ఆరంభించబడలేదు. క్రీ. శ. 19వ శతాబ్ది ఉత్తరార్థమున ఒక వంక సంస్కృతనాటకముల ప్రభావము మరియొక వంక పాశ్చాత్యభాషాసాహిత్యప్రభావము ఆంధ్రదేశములో కవులు నూతన ప్రక్రియలను చేపట్టుటకు కారణభూతములైనవి. ఈ కాలములోనే ఆంధ్రకవిపండితులలో క్రొత్త యూహలు బయలుదేరినవి. అట్టివారిలో కోరాడ రామచంద్రశాస్త్రి, కొక్కొండ వెంకటరత్నం పంతులు, పరవస్తు వెంకటరంగాచార్యులు ముచ్చురు తెలుగు నాటకప్రక్రియలను ప్రవేశపెట్టిరి. ముచ్చురును ప్రథమమున సంస్కృత నాటకము లాంధ్రీకరించిరి. వీరిలో కోరాడ

---

1. తెలుగు నాటకవికాసము, డా. పో. శ్రీరామఅప్పారావు. 91 నుండి 116 పుటలు

రామచంద్రశాస్త్రి ప్రథమమున తెలుగులో స్వతంత్ర నాటకరచన గావించెను. 'మంజరీ మధుకరీయము' వీరి తొలి తెలుగు నాటకము దీనిని వీరు క్రీ.శ. 1860 ప్రాంతమున రచించిరి. ఇది శృంగారప్రధానమై స్వకపోల కల్పనలచే నిండి యున్నది.

రామచంద్రశాస్త్రిగారి శిష్యులు వావిలాల వాసుదేవశాస్త్రిగారు షేక్స్పియరు ఆంగ్లనాటకము 'జూలియస్ సీజరు' సీజరు చరిత్రమను పేర క్రీ. శ. 1875 లో నాంధ్రీకరించిరి. ఈ కవియే 'నందకరాజ్య' మను స్వతంత్ర సాంఘిక నాటకమును క్రీ. శ. 1880 లో రచించెను. ఇది చారిత్రక నాటకము కాదు. కల్పిత సాంఘిక నాటకము. వీరే 'ఉత్తరరామచరితము', 'మృచ్ఛకటికము' అను సంస్కృత నాటకముల నాంధ్రీకరించిరి. పై నలుగురు నాటకకర్తలు నాటక రచనా ప్రక్రియారంభదశలో నాటకములు రచించిరి. వీనిని సంస్కృతరూపకానువాదములు ఆంగ్లరూపకానువాదములు స్వతంత్ర తెలుగు నాటకములని మూడు విధములుగా విభజింపవచ్చును. (ఈ నాటకములు ప్రదర్శన కుపయుక్తమైనట్లు కనిపించుట లేదు.)[1]

కందుకూరు వీరేశలింగం పంతులు తెలుగు సాహిత్యములో వివిధప్రక్రియలు చేపట్టిరి. వీరు మొత్తము (16) రూపకములు రచించిరి. వానిని అనువాద నాటకములు, స్వతంత్రనాటకములని వర్గీకరింపవచ్చును. వీరి నాటకములు నాటక సమాజమువారిచే ప్రదర్శింపబడినవి. గురజాడ రామమూర్తిగారు 1880 లో వెన్నీసు వణిజనాటకము (సుహృత్సుభాషితము) అను పేర ఆంగ్లనాటకము నను వదించిరి. పద్యగద్యములతో రంగస్థలమున రక్తి కట్టవలయునను భావనతో రామమూర్తిగారు వివిధ ఛందస్సుల నీ నాటకములో నుపయోగించిరి. కొండు భొట్ల సుబ్రహ్మణ్యశాస్త్రిగారు (31) నాటకములు రచించినను వానియం దొక్క టియు ముద్రణాభాగ్యమునకు నోచుకొనలేదు. వీని వ్రాతప్రతులు గూడా నేడు లభించుట లేదు. వడ్డాది సుబ్బారాయకవికి తెలుగు నాటకకర్తలలో విశిష్ట స్థానమున్నది. వీరు మొత్తము (7) నాటకములు రచించిరి. ఇవన్నియు సంస్కృతాను

---

1. తెలుగునాటకవికాసము. 196 పుట. డా. పో. శ్రీరామ అప్పారావుగారు.

వాదములే. ఇందు వేణీసంహారమను నాటకము ఆంధ్రదేశములో అర్థశతాబ్దము పాటు దాదాపు అన్ని నాటకసమాజములవారిచే ప్రదర్శింపబడినది.

బందరు హిందుస్థానీ నాటకసమాజము వారి కోరిక ననుసరించి నాదెళ్ళ పురుషోత్తమకవి (32) హిందుస్థానీ నాటకములు (1884 1886) రెండు సంవత్సరము లీ మధ్యకాలములో రచించెను. వీరి అహల్యాసంక్రందనము రామ దాసు చరిత్రము చంద్రహాస చరిత్రము, సీమంతినీ చరిత్రము, అపూర్వ దాంపత్యము, కీర్తిమాలినీ ప్రధానము మున్నగునవి ముఖ్యమైన నాటకములు. వీరు స్వయముగా నటులు. తెలుగు నాటకములలో పద్యములతోపాటు పాటలు ప్రవేశపెట్టిన దీ కవియే. హిందూస్థానీ నాటకములలో తురుష్కుల భాషను తెలుగు నాటకములలో ప్రవేశపెట్టుట కూడా గమనార్హము. ఇది తెలుగు నాటకరంగ మున (ద్వితీయదశ) పరిణామదశగా భావించవచ్చును.

తెలుగ నాటకవికాసదశలో ప్రధాననాటకకర్తలుగా ప్రసిద్ధి చెందినవారిలో ధర్మవరం కృష్ణమాచార్యులు (1853–1912) అగ్రగణ్యులు తెలుగు నాటక వికాసమునకు వీరిసేవ అమోఘమైనది. కావుననే వీరు ఆంధ్రనాటకపితా మహుడుగా ప్రసిద్ధిగాంచిరి. నాటకరంగమునకు క్రీ.శ. 1886 పూర్వము జరిగిన కృషి ఒకయెత్తు అయిన ఆచార్యులవారి కృషి మరియొకయెత్తు. వీరు బళ్ళారి ప్రాంతమువారు. ఈయన సంస్కృతాంగ్లాంధ్ర నాటకములను క్షుణ్ణముగా చదివి మొట్టమొదట 1879 లో నీత్యుపదేశకమగు 'ఉన్మాదరామప్రేక్షణికము', మదన విలాసమను చిన్ననాటకములు రచించెను వీరు 1886 లో సరసవినోదిని యను సభ నేర్పరచి, మిత్రుల ప్రోత్సాహమున దాని కధ్యక్షులుగా నుండిరి. వీరు నాటకకర్తలేగాక మంచినటులు. వీరు కన్నడభాషలో స్వప్నానిరుద్ధమను పేర ఉషాకల్యాణము రచించి, సరసవినోదిని ద్వారా ప్రదర్శింపజేసిరి. 'చిత్రనళీయము' 1887 లో రచించి ప్రదర్శించిరి. వీరి నాటకములు (30) కి పైగా నుండునని రాళ్ళపల్లి అనంతకృష్ణశర్మగారు తమ నాటకోపన్యాసములలో అభిప్రాయపడిరి. లభించినంతవరకు వీరి ముద్రిత నాటకములు (14), అముద్రితములు (6) వర కున్నట్లు తెలియుచున్నది. ఆచార్యులవారు ఆంగ్ల విషాదనాటకముల సంప్రదాయము పూర్తిగా జీర్ణించుకొని, తెలుగులో 'విషాదసారంగధర', 'పాదుకాపట్టాభిషేకము'

'అజామిళ', యను నాటకములను పూర్తిగా విషాదాంతములుగా రచించిరి. వీరి నాటకములన్నింటిలో విషాదసారంగధర (1889) మిక్కిలి ప్రసిద్ధమైనది.

చిలకమర్తి లక్ష్మీనరసింహము పంతులుగారు (1867–1946) ప్రసిద్ధ నాటకకర్తగా, సంఘసంస్కర్తగా ఆంధ్రులకు చిరస్మరణీయుడు. వీరు (13) నాటకములు రచించిరి. ఇందు కొన్ని పౌరాణికములు, మరికొన్ని సంస్కృతాంధ్రీకరణములు. వీనిలో మిక్కిలి ప్రసిద్ధిగాంచిన నాటకము గయోపాఖ్యానము తెలుగు దేశములో గల నాటకసమాజములన్నియు యీ నాటకమును యెన్నియో మారులు ప్రదర్శించినవి. ఇంకను ప్రదర్శింపబడుచున్నది. గయోపాఖ్యాననాటకము లెందరో కవులు వ్రాసినను వీరి నాటకమునకుగల ప్రశస్తి యే యితర కవుల నాటకమునకు రాలేదు.

వేదము వేంకటరాయశాస్త్రి (1853–1929) మహాపండితుడు అలంకారికుడుగా నేగాక ఉత్తమ నాటకకర్తగా ప్రసిద్ధులు. వీరు పదినాటకములు రచించిరి వీనిలో ప్రతాపరుద్రీయమను నాటకము వీరికి చాలా కీర్తిప్రతిష్ఠలు తెచ్చిపెట్టినది దీనిని వీరు (1896–1897) లో రచించిరి. వీరి కాలములో నెల్లూరులో ఆంధ్ర భాషాభిమానసమాజము నెలకొల్పబడి, శాస్త్రిగారి నాటకములు మాత్రమే ప్రదర్శించుటకు నిర్ణయించినది. వీరి అనువాద నాటకములు, స్వతంత్రనాటకములు భాషాసారళ్యము కలిగి ప్రదర్శనయోగ్యములుగా నున్నవని విమర్శకుల అభిప్రాయము. వీరు మిక్కిలి హాస్యప్రియులు. నాటకములో పాత్రోచితభాషాప్రయోగము ప్రవేశపెట్టిన దీ కవియే. వీరి ప్రతాపరుద్రీయము ప్రథమచారిత్రకనాటకమని కొందరు విమర్శకుల అభిప్రాయము.

ఆచంట వేంకటరాయసాంఖ్యాయనశర్మ (1864–1933) నాటకరంగమునకు విశిష్టసేవ చేసిరి. మూడు సంస్కృతానువాద నాటకములు, ఒకటి సాంఘిక నాటకము రచించుటయేగాక, నాటకసర్వస్వమను లక్షణగ్రంథము గూడా రచించిరి. క్రీ. శ. 1929 లో ఆంధ్రనాటకకళాపరిషత్తు స్థాపించి దాని కధ్యక్షులైరి

కన్యాశుల్కకర్తగా గురజాడ వేంకటఅప్పారావుగారు (1861–1915) ఆంధ్రులకు సుపరిచితులు. వీరి కన్యాశుల్కమను సాంఘిక నాటకము వీరి కైన

లేని కీర్తిని తెచ్చినది. బాల్యవివాహము, కన్యలను డబ్బు కమ్ముకొనుటయను సాంఘిక దురాచార మితివృత్తముగా గ్రహించి, అప్పారావుగారొక చక్కని సాంఘిక నాటకము రచించిరి. కందుకూరు వారు సంఘసంస్కారమునకు చేసిన సేవ గురజాడవారు భాషాసంస్కారమునకుచేసిరి. వేదమువారు ప్రతాపరుద్రీయములో ఉర్దూ పదములు వాడినట్లుగా, అప్పారావుగారు కన్యాశుల్కములో ఆంగ్లపదములు వాడిరి. గిరీశముపాత్రచే హాస్యము నుప్పతిల్లజేసి, సాంఘిక సమస్యల కద్దముపట్టినట్లు చూపించిన అప్పారావుగారి దేశభక్తి పారంలేనిది.

కోలాచలం శ్రీనివాసరావు (1854–1919) గారి కాలమువరకు తెలుగు నాటకచరిత్ర తెలుగుసీమను దాటలేదు. కాని వీరు ప్రపంచనాటకచరిత్రయను ఆంగ్లగ్రంథమును రచించి విశ్వవిఖ్యాతి నార్జించిరి. వీరి కాలమువరకు తెలుగు నాటకరంగము మూడు పూవు లారు కాయలుగా వికాసము నొందుచున్నది. వీరికి నాటకకర్తగా విశేషకీర్తి ప్రతిష్ఠలు నార్జించినది రామరాజుచరిత్రమను చారిత్రక నాటకము. వీరు దాదాపు ముప్పది నాటకములు రచించిరని తెలియుచున్నది. వీరి నాటకములను పౌరాణికములు, సాంఘికములు, కల్పితములని వర్గీకరింపవచ్చును వీరు ధర్మవరం కృష్ణమాచార్యులవలెనే నాటకరంగమునకు అమితమైన సేవ చేసిరి. వీరి నాటకము లన్నియు బళ్ళారి సుమనోరమవారిచే ప్రదర్శింపబడినవి. వీరు తమ నాటకముల చివర పాటలు చేర్చెడివారు. శౌర్యము, సాహసము, భక్తి పతివ్రతాధర్మము, సత్యము, అహింస మున్నగు నీతులను బోధించు నాటకము లీ కవి రచించెను.

పానుగంటి లక్ష్మీనరసింహారావు (1865–1940) గారు మనకు రెండు విధముల కనిపింతురు. ఒకటి సాక్షి వ్యాససంపుటముల రూపమున, రెండవది వీరి నాటకముల రూపమున. వీరు హాస్యప్రియులు. వీరికి ఆంగ్లనాటకకర్త షేక్స్పియరు ఆదర్శనాటకకర్త. వీరు దాదాపు (30) నాటకములను రచించిరి. వీరు యెక్కువ వరకు స్వతంత్రనాటకములు రచించిరి. భక్తిరసపోషణలో తప్ప వీరి నాటకములలో పాటలు యెక్కువగా వాడలేదు వీరి నాటకములలోని అంకములన్నియు ఏకైకరంగములు. వీరిదొక ప్రత్యేకశిల్పము. సంవాదకౌశలము. "శైలీసౌలభ్యమునకు తిరుపతి వేంకటకవులను, సందర్భసన్నివేశనైపుణ్యమునకు ధర్మవరం

లలిత వంటి సాంఘికేతివృత్త నాటకము 'సుందరీవిలాసము' వంటి ప్రసనము రచించెను. సమకాలిక సాంఘికజీవనములో నిత్యము చూచు సంఘటనలు కవికి లలిత (సాంఘికనాటకము) 'సుందరీవిలాసము' (ప్రహసనము) వంటి రచనలు చేయుటకు ప్రేరణ కలిగించియుండవచ్చును. క్రీ. శ. 1920 నుండి 1960 మధ్య కాలమున ఇట్టి సాంఘిక జీవనమున కద్దముపట్టు రంగస్థలప్రదర్శనానుకూలమైన నాటకరచనలు హరిజనసమస్య, వివాహసమస్య, స్త్రీస్వాతంత్ర్యసమస్యలతో కూడినవి అరుదుగా నున్నవి. నిజాం నవాబునకు వ్యతిరేకముగా ప్రజలు జరిపిన తెలంగాణా పోరాటము కవి స్వయముగా చూచుట జరిగినది. ఆ కాలమున జమీందారులు నిజాం నవాబున కనుకూలురై ప్రజలపై చేయు దౌష్ట్యములు, ప్రజ లనుభవించిన కష్టములు కవి 'లలిత' నాటకములో అద్దముపట్టినట్లు చూపించెను. ప్రభుత్వమునకు వ్యతిరేకమైన సాంఘిక రాజకీయ ఇతివృత్తమును గైకొని నాటకము వ్రాయుటకు కవికి ఎంతో ధైర్యము కావలసియుండును. ఈ కవికి యిట్టి ధైర్యము కలదని చెప్పుటకు 'లలిత' సాంఘికనాటకము దృష్టాంతము. సమకాలిక సాంఘిక ఇతివృత్తముగలది సుందరీవిలాసమను ప్రహసనము. ఇందలి ఇతివృత్తము సమకాలిక వైశ్యులలోగల వేశ్యావ్యామోహము. వైశ్యులకే యీవ్యామోహ మధికమని యీ ప్రహసనముబట్టి స్పష్టముగా చెప్పవచ్చును. దీనిని మాన్పించుటకు కవి యిచ్చిన సందేశము యీ ప్రహసనములో ప్రధానమైనది. పై రెండు నాటకములు కవికిగల సామాజిక స్పృహకు తార్కాణములు.

ఈ కవి (8) నాటకములు, ఒక వీధినాటకము ఈ శతాబ్దప్రథమార్ధమున రచించెను. వీని వివరములివి.

| | | |
|---|---|---|
| 1. | పద్మవ్యూహము (సైంధవవధ) | పౌరాణికము |
| 2. | ఉషాపరిణయము (అనిరుద్ధవిలాసము) | " |
| 3. | సుచిత్రాభ్యుదయము | " |
| 4. | సుమాలినీపరిణయము | " |
| 5. | శశికళ (సుదర్శనీయము) | " |
| 6. | ప్రద్యుమ్నవిజయము (వీధినాటకము) | " |
| 7. | కూర్మనారాయణచరిత్ర | " |

8. లలిత (సాంఘికనాటకము)

9. సుందరీవిలాసము (ప్రహసనము) కల్పితము

పై తొమ్మిది నాటకములలో లలిత (సాంఘికనాటకము) తప్ప మిగిలిన వన్నియు ముద్రితములే. వీరి నాటకములన్నియు క్రీ. శ. 1930–1960 మధ్య కాలమున రచింపబడినవి. వీరి నాటకములు పద్యగద్యములతో కూడినవి. కొన్నింటికి అనుబంధములలో పాటలు చేర్చబడినవి. వీరి నాటకములన్నియు నాలుగు లేక ఐదు అంకములు కలిగియున్నవి. నాటకలక్షణముల కనుగుణముగా నాంది, ప్రస్తావన, అంకవిభజనము, పంచసంధులు కలిగియున్నవి. ఇవన్నియు రంగస్థలముపై ప్రదర్శనానుకూలమైన రచనలు.

వీరి మొదటి రచనలైన పద్మవ్యూహము, ఉషాపరిణయము నాటకములు నేడు లభించుటలేదు. రచనాకాలము బట్టి కూర్మనారాయణ చరిత్ర నాటకము తృతీయము. కావున మొదట పరిశీలనార్హము.

## కూర్మనారాయణచరిత్ర

కూర్మనారాయణచరిత్ర ఐదంకముల నాటకము. ఈ నాటకము క్రీ. శ. 1934 లో రచింపబడినది. మహబూబునగరు జిల్లా కల్వకుర్తి తాలూకా జూపల్లి గ్రామాధికారులగు మ॥రా॥శ్రీ॥ రంగినేని హన్మంతరావు దేశముఖుగారి ద్రవ్య సాహాయ్యమున యీ నాటకము క్రీ. శ. 1936 లో ముద్రింపబడి, శ్రీ తిరుపతి వేంకటేశ్వరస్వామి కంకితమొసంగబడినది. నాందిలో శ్రీతిరుపతి వేంకటేశ్వర స్వామి సభికులకు శుభములిచ్చుగాక యను ఆశీస్సులు కలవు. ప్రస్తావనలో నాటకముపేరు, కవిపేరు, కవికీర్తిప్రతిష్ఠలు సూత్రధారునిముఖతః చెప్పించుట జరిగినది. సమకాలిక నాటకములు పరిశీలించినచో భక్తిరసప్రాధాన్యముగల యీ కూర్మనారాయణచరిత్ర నాటకము వైవిధ్యముగా నున్నదని చెప్పవచ్చును. కూర్మనారాయణచరిత్ర నాటకములోని ఇతివృత్త మిట్లున్నది.

ఇ తి వృ త్త ము

కూర్మనారాయణుడు భూసురుడు. వేంకటేశ్వరస్వామి భక్తుడు. ఈతని భార్య సుగుణవతి. వీరికి మాధవుడను కుమారుడు, హేమలతయను కుమార్తె కలరు. వీరిరువురు బాల్యమునుండి శ్రీరామచంద్రుని భక్తులు కూర్మనారాయణుడు సతీసుతులతో తీర్థయాత్రలకు బయలుదేరెను. తుకారాం వేంకటేశ్వరస్వామి భక్తుడు, ధనవంతుడు. దానధర్మములు చేయుట, భాగవతుల కైంకర్యము చేయుట, సతతము నారాయణస్మరణము చేయుట యీతని నిత్యకృత్యము. మిత్రుడగు దామోదరశాస్త్రివంటి నాస్తికు లెంత చెప్పినను వినక వైరాగ్యము పొంది, పురములోనున్న దైవభక్తి కాటంకములు కలుగునని భావించి, అరణ్యమునకు వెళ్ళి, పర్ణకుటీరము నిర్మించుకొని దైవధ్యాన మొనరించుచుండెను.

సకుటుంబముగా తీర్థయాత్రలకు బయలుదేరిన కూర్మనారాయణు డరణ్యములో ప్రయాణముచేయుచున్నపు డొక మాంత్రికుడు సుగుణవతి యందము చూచి మోహితుడై, సర్పరూపమున కూర్మనారాయణుని కాటువేసెను. చావుబ్రతుకులలో నున్న కూర్మనారాయణుని పైబడి విలపించుచున్న సుగుణవతిని పొందుటకు మాంత్రికుడు ప్రయత్నించగా వేంకటేశ్వరస్వామి మాంత్రికుని తన చక్రాయుధముచే సంహరించెను. అడవిలో విలపించుచున్న సుగుణవతిని, పిల్లల నూరడించి, తుకారాం వేంకటేశ్వరస్వామిని ప్రార్థించి, కూర్మనారాయణునికి ఉపచారములు చేయగా నాతడు పునర్జీవితుడయ్యెను. ఆ రాత్రి తుకారం పర్ణకుటీరములో విశ్రమించి కూర్మనారాయణుడు మరునాడు సకుటుంబముగా సమీపమునగల జయపురము చేరెను.

జయపురమును తొండమానుడను రాజు పాలించుచుండెను. అతని మంత్రి వినయవంతుడు. వీరసింహుడను దుష్టుడు సేనానాయకుడు. తొండమానుని సభలో కూర్మనారాయణుడు ప్రవేశించి రాజుకు తన సతీసుతులను తాను తీర్థయాత్రల నుండి తిరిగి వచ్చువరకు సంరక్షించు బాధ్యత నప్పగించి వెడలిపోయెను. రాజు మూడుమాసములవరకు సరిపోవు ఆహారపదార్థము లొసగి, విడిది చూపించి సుగుణవతి కన్ని సౌకర్యములు సమకూర్చెను. వీరసింహుడు (సేనానాయకుడు

సుగుణవతి సోయగము చూచి మోహితుడై యామెను పొందుటకు ప్రయత్నించు చుండెను. విదర్భపురములో కూర్మనారాయణుడు రాత్రి విశ్రమించుచుండగా కొందరు దొంగలు దొంగసొమ్ము నాతని వద్ద వేసి పారిపోయిరి. రక్షకభటు లా కూర్మనారాయణుడే దొంగయని తలంచి రాజు అనుమతితో నాతని బంధించి చెఱసాలలో నుంచిరి. కూర్మనారాయణు డీ చెఱసాలలో భగవన్నామసంకీర్తనము చేయుచు కాలము వెళ్ళబుచ్చుచుండెను.

జయపురములో మూడు మాసములు గడచుటవలన గ్రాసము లేమిచే సుగుణవతి బిడ్డలు ఆకలితో నలమటించుచుండిరి. సుగుణవతి దురపిల్లుచు వేంకటేశ్వరస్వామిని తలంచెను. ఆ స్వామియే సేవకుని రూపమున వారికి తినుబండారము లొసంగి చనెను. భోజనము సిద్ధముచేసి సుగుణవతి పూజకొఱకు పుష్పములు తెచ్చుటకు ఉద్యానవనమునకు వెళ్ళెను. అచట సుగుణవతిని చూచిన వీరసింహుడు ఆమెను బలాత్కరించి పొందలేక క్రోధముతో నా రాత్రి సుగుణవతిని మాధవుని, హేమలతను తన ఖడ్గముచే ఖండించెను. భయంకరమైన హత్యలు చేసి సంతృప్తహృదయుడైన వీరసింహుని వేంకటేశ్వరస్వామి తన చక్రాయుధముచే ఖండించి, సుగుణవతి, యామె బిడ్డలశవములు కుళ్ళిపోకుండ భద్రపరచి అదృశ్యుడయ్యెను.

ఈ మధ్యకాలముననే కూర్మనారాయణుడు చెఱసాలలో చేయని నేరమునకు నికృష్టజీవితము గడుపుచు శ్రీమన్నారాయణుని ధ్యానించుచుండెను. తన భక్తుడగు కూర్మనారాయణుని బంధవిముక్తి కలిగింపదలచి వేంకటేశ్వరస్వామి యా రాజు కలలో కూర్మనారాయణుని నిర్దోషిత్వము తెలిపి విడుదలచేయమని ఆదేశించెను. మరునాడు రాజు సేవకుల రావించి కూర్మనారాయణుని బంధవిముక్తి చేయించి గౌరవించి సాగనంపెను.

సంవత్సరము గడిచిన పిదప కూర్మనారాయణుడు సతీసుతులను చూచుటకు జయపురము వచ్చి, రాజసభలో విచారించెను. తొండమానుడు వీరసింహుని అకాలమరణమునకు కారణములు విచారించుచుండ, కూర్మనారాయణుని రాక తెలిసికొని, మంత్రియగు వినయవంతునితో విచారించి, కూర్మనారాయణుని కుటుంబము విడిదికి పోయి విచారించి రమ్మని పంపెను. మంత్రి పోయి వచ్చి

రాజునకు రహస్యముగా జరిగిన విషయములు తెలిపి, వేంకటేశ్వరస్వామి అను గ్రహము పొంది కూర్మనారాయణుని కుటుంబసభ్యుల పునర్జీవింపచేయుమని నలహాః నొసంగెను. రాజు కూర్మనారాయణునితో ఆయన సతీసుతులు రాజాంతః పురస్త్రీలతో తిరుపతి వేంకటేశ్వరస్వామిని సేవించుకొనుటకు వెళ్ళిరనియు, పది దినములలో తిరిగి వత్తురనియు చెప్పి ఆనగరమందే యుంచెను. తొండమానుడు స్వయముగా సుగుణవతి, హేమలత, మాధవుల శవముల గైకొని వేంకటేశ్వర స్వామి ఆలయమున పడవైచి, భగవంతుని ధ్యానించి, యా బ్రాహ్మణుని కుటుంబము పునర్జీవితుల చేయుమని ప్రార్థించెను. స్వామి తన మొరాలకించక పోవుటవలన నా స్వామి సమక్షమున ఆత్మత్యాగ మొనర్చుకొనుటకు రాజు సిద్ధ పడెను. ఇంతలో స్వామి ప్రత్యక్షమై, యా శవముల నాకాశగంగ, గోగర్భాది పుణ్యతీర్థములలో స్నానముచేయించి, అష్టాక్షరి పఠించుటచే పునర్జీవితులగునట్లు వర మొసంగెను. రాజు తన సంకల్పము నెరవేర్చుకొని సుగుణవతి, హేమలత, మాధవులతో తిరిగి జయపుర మరుదెంచెను.

తొండమానుడు పేరోలగంబున కూర్మనారాయణునకు సుగుణవతిని, మాధవుని, హేమలతను అప్పగించెను. మాధవుడు నాకలోక విశేషములను హేమలత నరకలోక విశేషములను, సుగుణవతి సత్యలోక విశేషములను చెప్పుట చేత కూర్మనారాయణుడు మరియు సభికు లీ యలౌకిక సంఘటనల కాశ్చర్య మొందిరి. కూర్మనారాయణుడు వీరి మాటలు యథార్థములు కావని త్రోసిపుచ్చెను. కాని ఆకాశవాణి వారి మాటలన్నియు యథార్థములే నని పల్కెను. ఆ పిదప తొండమానుడు జరిగిన విషయములన్నియు పూసగ్రుచ్చినట్లు కూర్మనారాయణునికి నివేదించి, తప్పు క్షమింపుమని ప్రాధేయపడెను. కూర్మనారాయణుడు తనకర్మ కెవరును బాధ్యులు కారనియు, వేంకటేశ్వరస్వామియే తన నీ విధముగా కాపాడె నని భావించి, ఇందెవరి దోష మేమియు లేదని తెలిపి, సకుటుంబముగా అరణ్య ములో గల తుకారాం పర్ణకుటీరము చేరెను. తుకారాం కుటీరములో నారాత్రి విశ్రమించి, మరునాడు కూర్మనారాయణుడు నిజపురమునకు చేరి శ్రీమన్నారా యణుని భజించుచుండెను. కూర్మనారాయణుని భక్తికి మెచ్చి, వేంకటేశ్వరస్వామి ప్రత్యక్షమై వరము కోరుకొనుమనెను. ఆ భక్తులు మోక్షముతప్ప తమ కితర కోర్కెలు లేవనుటవలన స్వామి వారికి మోక్ష మొసంగుటయేగాక ప్రపంచము

లోని నరులు సత్ప్రవర్తనులై, సుఖసంతోషములు కలిగియుందురని భరత వాక్యము చెప్పుటతో నాటకము సమాప్తమయ్యెను.

ఈ నాటకములోని కథ పాత్రములు కల్పితములే. తొండమానుడు తుకారాంవంటి పాత్రలు కొన్ని చారిత్రకములుగా కనిపించుచున్నను, వానికి వీనికి సంబంధమున్నట్లు కనిపించదు.

పాత్ర చిత్రణ

ఈ నాటకములోని కథావస్తువు కల్పితమేయైనను, నాటకములోగల వేంకటేశ్వరస్వామిపాత్ర దైవము. ఈ స్వామి దివ్యమహిమ లిందు కవి వర్ణించెను. దుష్టశిక్షణ, శిష్టరక్షణ, ధ్యేయముగాగల శ్రీనివాసుడు (వేంకటేశ్వరస్వామి) భక్తుడగు కూర్మనారాయణుని మాంత్రికుడు సర్పరూపమున కాటువేసినపుడు తన చక్రాయుధముచే సంహరించెను. తుకారాం ద్వారా సర్పదష్టుడు భక్తుడగు కూర్మనారాయణుని బ్రతికించెను. ఆకలితో నలమటించు సుగుణవతి బిడ్డలకు తొండమానుని సేవకుని రూపములో ఆహారపదార్థము లందించి ఆదుకొనెను. దుర్మార్గుడగు వీరసింహుడు సుగుణవతిని, బిడ్డలను చంపినపుడు, స్వామి చక్రాయుధముచే నా కుటిలుని సంహరించెను. కారాగారమునుండి కూర్మనారాయణుని విడిపించి, తొండమానుని ప్రార్థనను మన్నించి, సుగుణవతిని, బిడ్డలను బ్రతికించెను. భక్తుల నాదుకొనుటలో స్వామి చూపిన చొరవను కవి యీ నాటకములో ప్రత్యక్ష నిదర్శనముగా చూపించెను. కలియుగదైవమైన వేంకటేశ్వరస్వామి భక్తపరాధీనత్వము స్థాపించుట యీ నాటకములో ముఖ్యముగా కనిపించుచున్నది. ఇందుకు కవిగారి ఇలవేల్పు వేంకటేశ్వరస్వామియగుట కూడా కొంత ప్రోద్బలకమైనది.

ఈ నాటకములో కథానాయకుడు విప్రుడు. పేరు కూర్మనారాయణుడు. కల్పితపాత్ర. నిష్కల్మషమైన విష్ణుభక్తుడు. గృహస్థుగా భగవదారాధనలు, భజనలతో తృప్తినొందక సతీసుతులతో తీర్థయాత్రలు చేసి మోక్షము పొందసంకల్పించెను. తన ప్రయత్నములో నెన్ని విఘ్నములు కలిగినను వెనుదీయని దృఢసంకల్పుడు. ఆపదలో కూడ భగవద్భక్తిని వీడని మహాభక్తుడు. తాను చేయని దొంగతనమునకు తనను చెఱసాలలో బంధించినపుడు విధి బలీయమని

భావించి, కారాగారములో స్వామి భజన చేసిన పరమభాగవతోత్తముడు. భక్తి జ్ఞాన వైరాగ్యములతోపాటు గృహస్థుగా తన సతీసుతుల ఆహారపానీయముల గురించి శ్రద్ధ చూపిన ఆదర్శగృహస్థుడు చివరకు వేంకటేశ్వరస్వామి ప్రత్యక్షమై వరము కోరుకొమ్మనినపుడు సంసారబంధవిముక్తి కోరిన విరాగి. నాటకకర్త కూర్మనారాయణుని పాత్రను చక్కని ఉదాత్తశీలముగల పరమభాగవతోత్తము నిగా చిత్రించెను.

ఈ నాటకములో తుకారాం మరియొక భక్తుడు. ఈతడు తన యావత్సం పదను దానధర్మముల కుపయోగించి, సంసారబంధములను తెంచుకొని అరణ్య ములో పర్ణకుటీర మేర్పరచుకొని, వేంకటేశ్వరస్వామిని భజించుచుండెను. సిరి సంపదలు మానవునకు ప్రశాంతత చేకూర్చవనియు, దానధర్మములు, భగవద్భక్తి ఆపదలలోనున్నవారి నాదుకొనుటయను సత్కర్మలు మానవునకు పరమధర్మము లని తుకారాం ద్వారా కవి సందేశ మొసంగెను.

తొండమానుడు జయపురము రాజు. వేంకటేశ్వరస్వామి భక్తుడు. తొండ మానుడు ఆకాశరాజు (పద్మావతి తండ్రి) సోదరుడనియు, వేంకటేశ్వరస్వామి చినమామయనియు, నారాయణపురము రాజధాని యనియు, ఈయనే వేంక టేశ్వరస్వామి యాలయములు తిరుపతి కొండపై కట్టించినట్లు శ్రీవేంకటాచల మాహాత్మ్యములో నున్నది.[1] నాటకములోని తొండమానుడు కూడా స్వామిభక్తుడే యైనను యిరువు రొక్కరో కారో తెలియుటలేదు. తొండమానుడు వేంకటేశ్వర స్వామి భక్తుడగుటయేగాక పరమభాగవతోత్తముల కాశ్రయ మిచ్చిన రాజు. నిగర్వి, త్యాగశీలి. కూర్మనారాయణుని సతీసుతుల కాశ్రయమిచ్చి, మూడు మాస ములకు సరిపోవు ఆహారపదార్థము లొసగిన దాత. రాజ కార్యనిమగ్నుడై సంవ త్సరమైనను వారి బాగోగులు చూడక, వారు హత్యచేయబడుట చూచి, తన ఆశ్రితరక్షణము వ్యర్థమైనదని భావించి పశ్చాత్తాపము నొందెను. వారి శవములను తిరుపతికి కొనిపోయి స్వామిముందుంచి, వారిని పునర్జీవితుల చేయుమని స్వామిని ప్రార్థించి విఫలుడై, తను ఆత్మహత్య చేసికొనుటకు వెనుకాడని సాహసుడు. స్వామిని మెప్పించి వారిని పునర్జీవితుల గావించుకొని కూర్మనారాయణుని కప్ప

1. శ్రీవేంకటాచలమాహాత్మ్యము. తృ. ఆ. 109, 113 పుటలు

గించిన ఆశ్రితవత్సలుడు. తొండమాను పాత్రద్వారా కవి మానవులు భగవంతు నారాధించుటతోపాటు భాగవతోత్తముల నారాధించుట గొప్ప విశేషమను విషయము నుద్బోధించెను.

సుగుణవతి కూర్మనారాయణుని భార్య శీలవతి, భక్తురాలు. కష్టములెదురైనను ధైర్యమువీడని సాహసవంతురాలు. దైవభక్తి, పాతివ్రత్య మామెకు ప్రాణతుల్యములు. సుఖభోగములకాశించని విరాగిని. భర్త కూర్మనారాయణుని దైవసమానముగా నారాధించెడిది. బిడ్డలను ఆప్యాయతతో చూచుకొనెడిది. తొండమానుడు మూడుమాసములకు సరిపడు ఆహారము పంపినపిదప, సంవత్సరము గడచుచున్నను ఆహారములేక అలమటించుచున్న బిడ్డలనుచూచి, ఆమె పొందిన దుఃఖము వర్ణనాతీతము. ఈ స్థితిలో భగవంతుని ధ్యానించి, వేంకటేశ్వరస్వామిద్వారా (భటుని రూపములో) పిల్లలకాహారము సమకూర్చిన ఇల్లాలు. ఈమె కుమారుడు మాధవుడు, కూతురు హేమలత చిన్నతనమునుండి రామభక్తులు. ఈ విధముగా నాటకకర్త మొత్తము కూర్మనారాయణుని కుటుంబమును భగవద్భక్తులుగా తీర్చి దిద్దినట్లు విదితమగుచున్నది.

ఈ నాటకములో పాత్రోచితభాషనుపయోగించి కవి కొంత హాస్యమును గూడా ప్రవేశపెట్టెను. తుకారాం దగ్గరగల హుసేన్‌సాహెబు సేవకుని ద్వారా, చిత్రకేతుని దగ్గరగల సాహెబు రక్షకభటుని ద్వారా ఉర్దూభాష మాట్లాడించి నాటకములో కొంత హాస్యమునకు స్థానము కల్పించెను.

[1]హుసేన్‌సాబు. "తోబ తోబ సైతాన్ పకళ్ళియే తో తోడీ దేర్కేబాదు ఛోడింగె. ఏ పకిళ్ళియేతో ఛోడ్నేకా బొహత్ ముష్కిల్."

[2]సాహెబు. "తోబ తోబ హాండ్లకి సూసి మాది ప్రాణా ల్వాడు గుండెల్ గబ్రాయించివాడు. మై క్యాజోల్నా, మై క్యాకరూం మియా."

పై మ్లేచ్ఛ ఉచ్చారణగాక ఎల్లిగాడు, పుల్లిగాడను దొంగల జానపదరీతి సంభాషణ ద్వార మరికొంత హస్యము కల్పించుట జరిగినది. వేదము వేంకట

1. కూర్మనారాయణచరిత్ర. ప్ర. అం. 22 పుట
2. " " ద్వి. అం. 52 "

రాయశాస్త్రిగారి ప్రతాపరుద్రీయములోని పాత్రోచిత భాషాప్రయోగము నీ నాటక కర్త అనుకరించెను. సమకాలిక నాటకకర్త లిట్టి ప్రయోగములు చేసినా రనుటకు కన్యాశుల్కములో గిరీశము ఆంగ్లభాషాప్రయోగము పేర్కొనవచ్చును.

నాటకకర్త యీ నాటకములో రచనాకాలము నాటి సామాజిక దృక్పథము సూచించిన తీరు వీరికి గల వర్తమానము సామాజికస్పృహకు తార్కాణము. తొండమానుని పాత్ర ద్వార రాజు తన సుఖములేగాక తన్నాశ్రయించిన ప్రజల బాగోగులు చూడవలయునను సాంఘిక ధర్మమును చాటెను. కవి నాటి సాంఘిక స్థితి పరస్త్రీవ్యామోహము నాస్తికమతప్రచారము మున్నగు దురాచారములను రూపుమాపుటకు కవి గావించిన ప్రయత్న మీ నాటకములో స్పష్టముగా కనిపించు చున్నది. వీరసింహుడు, మాంత్రికుడు. దామోదరశాస్త్రి మున్నగు పాత్ర లిందు కుదాహరణములు. అతిథుల కాశ్రయ మొసంగుట, ఆపదలలోనున్నవారికి సహాయ పడుట పరమధర్మములను విషయములు నాటకకర్త ,తొండమానుడు, తుకారాం పాత్రలద్వారా ఋజువుచేసెను. సంసారసుఖములు మానవులకు చంచలమనియు, భక్తి జ్ఞాన వైరాగ్యములతో మానవులు మోక్షము పొందుట పరమలక్ష్యమను ఆదర్శమును కవి యీ నాటకములో చాటెను. తీర్థయాత్రలు, వ్రతములు, దానధర్మములు ప్రశస్తమైనవని కవి యీ నాటకములో సూచించెను.

## రసపోషణ

ఈ నాటకములో అంగిరసము భక్తి. శృంగార, భయానక, అద్భుత, కరుణ మున్నగు రసములను కవి యీ నాటకములో సమయోచితముగా నుపయోగించెను

భక్తి రసమగునా కాదా యను విషయములో పండితులలో అభిప్రాయ బేధము లున్నవి. భక్తి రసవాదమును సమర్థించినవారిలో ముఖ్యులు ఉజ్జ్వలనీల మణికర్తయగు రూపగోస్వామి, భగవద్భక్తిరసాయనకర్తయగు మధుసూదన సరస్వతి. తరువాతవారు భక్తిని రసముగా అంగీకరింపకపోయినను, రసజనక సామాగ్రి భక్తిపట్ల సమృద్ధిగనే యున్నది. ధనంజయ, మమ్మట హేమచంద్రా దులు భక్తిని భావముగానే అంగీకరించిరి. మధుసూదన సరస్వతి భావము

శ్రీ యన్. వి. జోగారావు గారు తమ " భక్తి తత్త్వము – వాఙ్మయము " అను వ్యాసములో నిట్లు చెప్పిరి.

"సాక్షాత్సుఖవిరుద్ధములయ్యు అనుభవమాత్రము చేతనే శోక క్రోధ భయాదులు రసములుగా పరిగణింపబడుచుండగా, అనుభవసిద్ధమై సహస్రధా రస్యమానమగుచున్న భక్తిని రసము కాదని అపలపించుట తగదు. అది భావ మాత్రమని రసకోవిదు లంద్రుగాక జీవుని లక్షణములు కలిగి పరమానందము కలిగింపజాలని యితర దేవతలపట్ల అది యట్లు కావచ్చును. కాని పరమానంద స్వరూపుడగు పరమాత్మునిపట్ల యట్లు కాదు. (భావము కాదు. రసమేయగును) కాంతాది విషయములగు రసములందు పూర్ణసుఖము లేదు. అవియన్నియు క్షుద్ర రసములు. భక్తి యొక్కటే పూర్ణరసము. అది ఖద్యోతములకంటె సూర్యకాంతి వలె కడమ రసములకంటె బలవత్తరమైనది."1

భక్తిరసప్రసక్తి లేని యొక గొప్పకావ్యము చదువు నప్పటికంటె, భక్తిభా వోజ్జ్వలమగు నొక చిన్న కీర్తన విన్నను, ఒక శతకము చదివినను చాలును. అ యనుభూతి మేల్తరముగ నుండును. భావుకుడైనవాడు భక్తిని రసముగా అంగీక రించుటయే లెస్స. భావుకప్రవృత్తి సమృద్ధిగా నున్నవారందరికి అనుభవైక వేద్యము. ఆ యనుభవము సర్వాతిశాయియై పరమానందపర్యవసాయియగు రస స్వరూపమున జాలువారుచుండును.

ఈ నాటకములో కూర్మనారాయణుడును అతని భార్య సుగుణవతియు వేంకటేశ్వరస్వామి భక్తులు. వీరికి తగినట్లు వీరి కుమారుడగు మాధవుడును కూతురగు హేమలతయును చిన్నతనమునుండి భగవద్భక్తియలవరచుకొనిరి. వీరి భగవద్భక్తితోనే పుణ్యక్షేత్రములు దర్శించుటకు తీర్థయాత్రలు చేయుటకు సంకల్పించిరి. వీరికిగల భక్తిపారవశ్యము ఈ పద్యమువలన తెలియును.

---

1\. శ్రీ రామానుజ కీర్తికౌముది. "భక్తి తత్త్వము – వాఙ్మయము." వ్యాసము. శ్రీ. యన్. వి. జోగారావు. 99 పుట

1"సీ॥ కేశవనామంబు కీర్తించుటకు జిహ్వ
మధువైరి నెంచగ మానసంబు
శ్రీధరు నర్చించ చెన్నారు కరములు
వీనులు హరికథల్ వినుటకొరకు
శ్రీకృష్ణరూపంబు సేవింప గనుదోయి
హరిమందిరము కేగ నంఘ్రియుగము
చెలగి శ్రీశుని పాదతులసిపై ఘ్రాణంబు
శిరము మాధవ నమస్కృతులగాని

గీ॥ తెలియ కీ రీతి మూఢులై కలుషమతులు
నీతిబాహ్యులు మనుజులు నిశ్చయముగ
దలపుచుందురు సర్వాంగములును తమ శ
రీరసౌఖ్యార్థమంచును పృథ్వియందు."

ఈ పద్యము పోతన భాగవతములోని "కమలాక్షునర్చించు కరములు కరములు" అను సీసపద్యమున కనుకరణము.

భక్తుడగు తుకారాం తన యావదాస్తిని భగవద్భక్తులకు దానముచేసి, భార్య చెప్పినను, మిత్రుడగు దామోదరశాస్త్రి చెప్పినను వినక, భగవచ్చింతన చేయుటకు వనమునకు వెళ్ళును. ఈ సందర్భమున తుకారాం దామోదరశాస్త్రితో పలికిన పలుకులు గమనార్హములు.

1"గీ॥ జలజపత్రంబునందుండు జలకణంబు
లట్లు ప్రకృతికి దూరులై యాహరహంబు
లందు హరి దివ్యసంశ్లేష మనుభవించు
వారలేగాని ఇతరులు చేరువారె."

1. కూర్మనారాయణచరిత్ర. ప్ర. అం. 19 పుట.
2. " " 27 "

భక్తులైనవారు హరిసంశ్లేష మాశింతురు గాని ఐహికభోగము లాశింపరను విషయము తెలుపుచు సంసారములోనున్నను నీటితామరయట్లుండవలయుననెను. సంసారబంధ మున్నంత వరకు బాధలు తప్పవని సర్వసంగపరిత్యాగ మొనర్చి తుకారాం నారాయణుని స్మరించుచు వనమునందలి పర్ణకుటీరములో నుండెను. భగవంతుని కొలుచువారికి సంసారబంధములు తృణప్రాయములను విషయము కవి యీ తుకారాం పాత్రద్వారా ప్రబోధించెను.

అనాదినుండి భగవంతుడు భక్తుల కాపాడినట్లు వేంకటేశ్వరస్వామి కూర్మ నారాయణుని కుటుంబమును ఎన్నియో సందర్భములందు కాపాడెను. కూర్మ నారాయణుడు సకుటుంబముగా తీర్థయాత్రలు చేయుచు వనములో విశ్రమించి యుండగా సర్పదష్టుడై విలపించుచు, స్వామిని ధ్యానించి విగతజీవుడయ్యెను. సుగుణవతి బిడ్డలతో దుఃఖించుచు వేంకటేశ్వరస్వామిని ప్రార్థించుచుండెను. స్వామి భక్తుల మొరాలకించి, సర్పరూపములో నున్న మాంత్రికుని సంహరించుటే గాక, తుకారాంద్వారా కూర్మనారాయణుని పునర్జీవితుని గావించెను. ఈ సందర్భమున స్వామి మాంత్రికుని సంహరించుటకు చూపిన చొరవకిది దృష్టాంతము

1 "ఓరీ! కుటిలహృదయా! పరమభక్తుండైన వానిని ద్రోహచింతనచే క్రూరపన్నగవిషానల జ్వాలలచే మృతినొందింపబూనుకొన్న నిన్నీ సుదర్శనధారాహతుని గావించి, నాభక్తశిఖామణిని రక్షింతునుగాక"

సుగుణవతి బిడ్డలతో ఆహారములేక అలమటించుచు పరాత్పరుని ధ్యానించును. ఆ సమయమున వేంకటేశ్వరస్వామి రాజభటుని రూపములో వచ్చి రాజుగారు భోజనసామాగ్రి పంపించినాడని విన్నవించి, ఆహారపదార్థము లిచ్చి వారిని ఆదుకొని కాపాడెను.

కూర్మనారాయణుని విదర్భరాజభటులు అన్యాయముగా బంధించి చెఱ సాలలో నుంచిరి. చెఱసాలలో యెన్నియాతనలను భరించుచున్నను అతడు హరి నామస్మరణ చేయుచునే కాలము గడుపుచుండెను. భగవంతు డాతని భక్తికి

---

1. కూర్మనారాయణచరిత్ర ద్వి. ఆం. 34 పుట

చ్చి రాజు చిత్రకేతుని కలలో భగవంతుడు కనిపించి కూర్మనారాయణుడు పరాధీనుడనియు, వెంటనే చెఱసాలనుండి విముక్తి కలిగించవలయుననియు దేశించెను. అదే విధముగా రాజు కూర్మనారాయణుని సగౌరవముగా తోడితెచ్చి మాపణ చెప్పికొని సత్కరించి పంపెను.

కూర్మనారాయణుడు విదర్భనుండి తిరిగి వచ్చి తొండమానునివద్ద నుంచిన సుతుల నడిగెను. వారిని తీసికొని వత్తునని రాజు స్వయముగా వెళ్ళి, అంతకు ందే వీరసింహునిచేత కడతేర్చబడిన సుగుణవతి, మాధవుడు, హేమలతల వములను గైకొని తొండమానుడు వేంకటేశ్వరస్వామినిట్లు ప్రార్థించెను.

"1మ॥ శరణం జెందిన ద్రౌపదిన్ శబరినిన్ సారంగరాజున్ ధరా
మరుడౌ బీద కుచేలునిన్ గరుణతో మన్నించి తీ వయ్య హా
మరుడన్ హేయసుఖావలంపటుక దుర్మార్గుండ నీ దాసుడన్
కరుణ న్జూడగ వేడుచుంటి నను వేడ్కం గావు మో శ్రీహరీ."

భగవంతుడు భక్తుల నెపుడు పరీక్షించి, యోగ్యులకు మాత్రమే తన కరుణ ప్రసాదించును. ఇదే విధముగా స్వామి తొండమానుని పరీక్షింపదలచి మిన్నకుండెను. తాను ఆశ్రయ మిచ్చిన విప్రకుటుంబమును తిరిగి సురక్షితముగా అప్పగించలేని తన రాజరికము వ్యర్థమని భావించి తొండమానుడు ఖడ్గముచే స్వామి సమక్షమున తన శిరచ్ఛేదము గావించుకొన నుంకించెను. అప్పుడు స్వామి తొండమానుని భక్తికి మెచ్చి, కూర్మనారాయణుని ఆలుబిడ్డలను బ్రతికించి భక్తుని మాట నిలబెట్టెను. ఈ ఘట్టములో పరమభక్తుడు మృత్యువును సహితము జయింప వచ్చునని కవి నిరూపించెను.

తీర్థయాత్రలనుండి తిరిగి వచ్చి కూర్మనారాయణుడు ఆలుబిడ్డలతో వేంకటేశ్వరస్వామి నారాధించుచుండెను. స్వామి ప్రత్యక్షమై వరములు కోరుకొమ్మనగా కూర్మనారాయణుడు, సుగుణవతి తమ కోరికల వ్యక్తీకరించిన తీ రిట్లున్నది.

---

1. కూర్మనారాయణచరిత్ర చ. అం. 98 పుట

[1]"చం॥ నిరతము నీ పదాబ్జములు నిస్తులభక్తిని పూజసేయుచున్
కర మనురక్తి దోప నిను గాంచుచు నెంచుచు నీదు యాజ్ఞలన్
శిరమున దాల్చు భాగ్యమును జేర్పగ వేడెద మంతెగాని యే
పరమును గోరబోము మునివందిత ప్రోవర వేంకటేశ్వరా."

[2]గీ॥ అమిత సంసారసాగరమందు గూల
ద్రోసి శ్రమపెట్టనేటికి తోయజాక్ష
నిన్ను జేరుటె మా కోర్కె నిక్కముగను
వేఱు మాట లికేటికి వేంకటేశ."

నిర్మలమైన భక్తులు ఐహికసుఖసంపదల కాశించక మోక్షమునే కోరుదురు. ఇట్లే కూర్మనారాయణుడు సుగుణవతి వేంకటేశ్వరస్వామికి భగవంతుని సేవ చేయుచు మోక్షము పొందుటకన్న తమకు కావలసిన వేమియు లేవని వినయ పూర్వకముగా మనవి చేసికొనిరి. కవి యీ సన్నివేశములో భక్తజనులకు మార్గ దర్శకుడయ్యెను.

భగవంతుడు తనను నమ్మిన భక్తుల కడుకడుగున కలుగు ఆపదల తొల గించుచు, చివరకు ప్రత్యక్షమై వారిని భగవత్సాయుజ్యము పొందించుట యీ నాటకములోని విశేషాంశము.

తొండమానుని సేనానాయకుడు వీరసింహుడు సుగుణవతి అందచందము లను చూచి మోహించిన సన్నివేశములో కవి వర్ణించిన శృంగార మిట్లున్నది.

"[3]సీ॥ బిబ్బోకవతి గబ్బిగుబ్బల వీక్షించి
చక్రవాకంబులు జతను గోరు
పల్లవాధరి కేశబంధంబు దిలకించి
సారంగగణములు సరస జేరు

1. కూర్మనారాయణచరిత్ర పం. అం. 120 పుట
2. " " " " "
3. " " ద్వి. అం. 48 "

సఖి ముఖంబును జూచి చంద్రుండు తలనొంచి
సమముగానని మదిన్ సంశయించు
పొలతి కీడుగ నేను బోజాలనని యెంచి
కనకంబు వెంటనే కళను దొరగు

గీ॥ కలికి పలుచాలు మొల్ల మొగ్గల హసించు
లేమ కాజ్జేతు లరయంగ లేజివుళ్ళు
కల్కి పల్కులు చిల్కల నుల్కజేయు
అన్నుమిన్న సురలకన్నె లెన్ను మిన్న."

పై పద్యములో వీరసింహుడు సుగుణవతి సోయగము వర్ణించిన తీరు ప్రబంధకవుల కావ్యములలోని నాయికావర్ణనల కే విధముగను తీసిపోదు. ప్రబంధకవుల శృంగారవర్ణనలకు సరితూగు యీ శృంగారవర్ణన ఒక మచ్చుతునకగా మాత్రమే చూపించనైనది.

కూర్మనారాయణుడు మాంత్రికునిచే సర్పదష్టుడై పడిపోయిన సందర్భమున అతని భార్య సుగుణవతి దుఃఖమును కవి వర్ణించినపుడు కరుణరసము స్రవించిన విధ మిట్లున్నది.

"1సీ॥ ఏ పాప మెరుగని యీ పుణ్యచరితుని
మనుపంగ రండిదే మౌనులార
ఈ యుత్తమోత్తము నింపార బ్రోవరే
చెలగి సత్కృపమీర సిద్ధులార
సర్వేశ్వరుని పూజ సలుపు నీ మహనీయు
నరసి పాలింపరే యక్షులార
నా మనోహరు నేలి నన్ను మన్నింపరే
వేల్పులార పుడమివేల్పులార

గీ॥ నగములార ఘోర పన్నగములార
విమలమతులార యోషధీవితతులార

1. కూర్మనారాయణచరిత్ర ద్వి. అం. 35 పుట.

శ్రీమనోనాథ నీనామచింతనమున
వెలయు మ్రొక్కియు నేలు మో వేంకటేశ."

సుగుణవతి తన భర్త విగతజీవుడగుట వలన దుఃఖమున మునులను, సిద్ధులను, యక్షులను, దేవతలను, నగములను, పన్నగములను మున్నగువారిని తన భర్తను పునర్జీవితుని చేయుమని చివరకు వేంకటేశ్వరస్వామిని ప్రార్థించెను. సామాన్యముగా మానవున కాపద కలిగినపుడు యెవరు ఆపద తొలగించుటకు సమర్థులో, యెవరు కారో యను విచక్షణ లేక, సమీపస్థు లందరితోను తనకు కలిగిన యాపదగురించి వివరించి వారి సహాయమర్థించును. ఇట్లే పై సన్నివేశ మున సుగుణవతి విలపించినపుడు కవి కరుణరసమును చక్కగా పోషించెను.

కూర్మనారాయణుడు సతీసుతులతో తీర్థయాత్రల కేగునపుడు క్రూరమృగ ములను వర్ణించునపుడు భయానకరసమును, వీరసింహుఁడు సుగుణవతిని హేమ లతామాధవులను శిరచ్ఛేదములు చేసినపుడు భీభత్సరసమును, సుగుణవతి, మాధ వుడు, హేమలతలు పునర్జీవితులై. తమతమ సత్యలోక, నాకలోక, యమలోకాను భవములను వరుసగా సభాసదులకు తెలియపరచునపుడు అద్భుతరసమును కవి చక్కగా పోషించెను.

కవికి సంగీతముపై గల అభిమానమును తెలుపుటకీ క్రింది పద్య ముదా హృతము.

"[1]సీ॥ శంకరాభరణంబు సరిమాగు నీ వేణి
చక్కగ ముడివైతు టక్కులాడి
సింహేంద్రమధ్య నీ చెక్కిలి నొక్కంగ
మది వాంఛగలిగెను ముదితమిన్న
కల్యాణిరో నీవు కఠినంబుగా జూడ
బ్రతుకంగజాలనే రాజవదన
కన్నడశేయక మన్నింపవే నన్ను
కరుణారసంబున కంబుకంఠి

1. కూర్మనారాయణచరిత్ర. తృ. ఆం. 63 పుట

గీ॥ మలయమారుత మిట్లు వీచ మదిచలించె
తోడివారలు జూడగ వేడుకలర
మోహనాకారి నాతోటి ముచ్చటాడి
కీరవాణిరో ననుగూడి కీర్తి గొనుము,"

పై సీసమునందు ప్రతి చరణారంభములో నొక రాగము చేర్చి, వీర సింహునిచేత సుగుణవతి సౌందర్యము వర్ణించిన తీరు కవికి సంగీతముపై గల అభిమానమునకు తార్కాణము.

ఈ నాటకములో కవి తెలుగు, సంస్కృత సామెత లుపయోగించిన తీరు శ్లాఘాపాత్రము. భాష సరళముగా నుండి సమకాలిక నాటకములలోగల సౌకు మార్యము తొణికిసలాడుచున్నది.

దశరూపకములలో యీ నాటకము ప్రకరణమునకు చెందినది. ఐదంక
ములు కలిగి విప్ర. వణిక్. సచివ, పురోహితులలో నొకరిని నాయకునిగా చేసి
నానారసములు కలిగియున్న నాటకము ప్రకరణమునకు చెందును. కూర్మనారా
యణచరిత్రము పై లక్షణములన్నియు కలిగియున్నది. కథానాయకుడు కూర్మ
నారాయణుడు విప్రుడు. కథావస్తువు కల్పితము. నానారసోపేతము. నాటకలక్ష
ణములలో ముఖ్యమైనవి పంచసంధులు. ముఖసంధి, ప్రతిముఖసంధి, గర్భసంధి,
విమర్శసంధి, నిర్వహణసంధి అను పంచసంధులు నాటకములో చక్కగా ప్రయో
గించబడినవి. గార్హస్థ్యోచిత పురుషార్థమగు మోక్షమునకు సాధనమైన ఇతివృత్తము
కలదు. కావున నాటకకర్త లక్షణములను చక్కగా పాటించినాడని చెప్పవచ్చును.

## సుమాలినీ పరిణయము

ఈ కవి రచించిన నాటకములలో సుమాలినీపరిణయము నాలుగవది. ఈ
నాటకము తారణసంవత్సర వైశాఖమాసములో ముద్రింపబడినది. (క్రీ.శ. 1946—
47) ఈ నాటకము నంతకుపూర్వమే రచించినను ధనాభావముచే ముద్రించుటలో
ఆలస్యము జరిగినదని కవిగారే స్వయముగా పీఠికలో మనవిచేసికొనిరి. ఈ
నాటక ముద్రణకు ఆర్థికసాహాయ్య మొనరించినవారు శ్రీ రంగినేని రామచంద్రా

రావు జూపల్లి (తాలూకా కల్వకుర్తి, జిల్లా మహబూబునగరము) వాస్తవ్యులు. ఇది నాలుగంకముల నాటకము. కవి దీనిని శ్రీ వెంకటేశ్వరస్వామికి అంకిత మొసంగెను.

కృతిపోషకుని వంశానుక్రమణిక నాటకారంభమున నాలుగు పుటలలో పదమూడు పద్యములలో కవి వర్ణించెను. చివర నామగర్భితసీసమాలికలో కృతి పోషకుని పరమాత్ముడు సకలసౌభాగ్యములు గూర్చి సాకుగాతయని ఆశీస్సులు పలికెను. నాటకములో ప్రస్తావనలేదు. అనగా నటి సూత్రధారులద్వారా నాటకము పేరు కవి పేరు చెప్పించి, పాత్రలు ప్రవేశపెట్టుట జరుగలేదు. (విష్కంభము లేదు. అంకవిభజన, రంగవిభజన కలదు. నాటకాంతమున వీరవర్మద్వారా కవి భరతవాక్యము చెప్పించెను. ఈ నాటకములో పాటలులేవు) కథావస్తువు పౌరాణికము. జైమిని భారతము నందలి అష్టమాశ్వాసమునుండి గ్రైకొనబడినది. ఇందు వీరవర్మ కథ యను పేరగల చిన్నకథ నీ కవి గ్రైకొని నాలుగంకముల నాటకము రచించెను. ఈ నాటకములోని కథాంశము క్లుప్తముగా నిట్లున్నది.

కథాంశము

సారస్వతపురరాజగు వీరవర్మకూతురు సుమాలిని, చేటిక కమల వన విహారము చేయుచుండురు. నారదడు ప్రవేశించి వారిచే పూజలనొంది, అశీస్సు లొసంగి సుమాలినికి తగినభర్త దండపాణియని వచించి, యాతని చిత్రపటమును సుమాలినికి చూపించెను. సుమాలిని కంగీకారమేయైెను తనవంటి మానవకన్యను దేవతలలో నొకడగు యముడు వరించుట అసంభవమని నిరుత్సాహము నొందెను కాని నారదుని ప్రేరణతో కాలుని భర్తగా పొందుట కంగీకరించెను. నారదుడు సుమాలినికి యమసూక్తమను మంత్రోపదేశము గావించి, త్రిరాత్రోపవాసము నియమబద్ధముగా చేసి మంత్రమునను ష్ఠించినచో కోరిన యముడు వశవర్తి యగు నని తెలిపి సంచారార్థము యమలోకమేగెను. యముడు సభలో దోషులను శిక్షించు సమయమున నారదుడు ప్రవేశించి, యాతనిచే పూజింపబడి, మానవ లోకములో వీరవర్మ కూతురు సుమాలిని అందచందములు వర్ణించి, యామె దండధరుని పలచినరూపు తెరంగెరెంగించెను. ఈ సమయమున ధర్మరాజు నారదునికి భూలోకమునుండి తెచ్చిన పాపులను చూపి, వారుచేసిన పాపములు

వేర్వేరుగా నిరూపించి తగిన దండన యొసంగుటచూపించెను. చివరకు నారదుడు
ధర్మరాజును సుమాలినిని వివాహమాడుటకు ప్రేరేచి, తగు ప్రయత్నము చేయు
మని సూచించి, నిష్క్రమించును.

అంతఃపురమునందు సుమాలిని యమధర్మరాజుపై గలిగిన వలపు భరించ
లేక విరహవేదన ననుభవించెను. ఈ సందర్భమున సుమాలిని చంద్రోపాలంభము
మన్మథోపాలంభమును చేసెను. ఇంతలో చేటి కమల వచ్చి రాకుమారి విరహ
వేదనకుగల కారణము తెలిసికొని, యామెకు ధైర్యము చెప్పి, శీతలోపచారములు
చేసి ఊరడించెను. అంతఃపురములో వీరవర్మ తన భార్య మణిమాలతో సుమా
లిని పరిణయము గురించి సంభాషించు సందర్భమున కమల సుమాలినితో ప్రవే
శించెను. సుమాలిని తల్లిదండ్రులతో తాను వరించిన యమునిదక్క తక్కొరుని
వివాహమాడనని పలికెను. తల్లిదండ్రు లీ విషయములో ( మానవమాత్రురాలిని
దేవతలు వివాహమాడుట అసంభవమని) ఆందోళన పడుచుండగా దేవముని ప్రవే
శించి, వారిచే పూజితుడై వారి యాందోళనకు కారణము గ్రహించి, యా రాజుతో
యముడు తప్పక సుమాలినిని వివాహమాడుటకు భూలోకమునకు వచ్చునని, వారి
వివాహము జరుగునని భవిష్యత్తు చెప్పి నిష్క్రమించెను.

యమధర్మరాజు చిత్రగుప్తునితో కలిసి భూలోకమున సారస్వతనగరము
వెలుపలగల పూదోటలో విహరించుచుండెను. అంతకు పూర్వమే సుమాలిని
కమలతో పుష్పాపచయనిమిత్త మా తోటలో విహరించుచుండెను. కాలుడు సుమా
లినిపైగల మోహమున విరహవేదన ననుభవించుచు, చంద్రుని మన్మథుని దూరు
చుండెను. యముడు చిత్రగుప్తుని వదలి వనములో సుమాలినీ కమలలు విహరించు
ప్రదేశము చేరి, సుమాలినీసౌందర్యమున కచ్చెరువంది, వారితో మాట్లాడు
చుండెను. చేడియ వారికి యేకాంతము కల్పించి దూరమేగెను. దండపాణి యా
కుసుమకోమలి కరము గ్రహించి తన ప్రేమను వెల్లడించెను. సుమాలిని కూడా
తన ప్రేమను వ్యక్తీకరించి, తల్లిదండ్రుల యనుమతితో వివాహమాడుమని
ప్రార్థించెను. ఇంతలో తిరిగి కమల వచ్చి రాకుమారిని గైకొని అంతఃపురము
జనెను. కాలు డీ విషయము చిత్రగుప్తునితో తెలిపి, సుమాలినీ పరిణయమునకు
కావలసిన యేర్పాట్లు చేయుమని కార్యభార మా చిత్రగుప్తునిపై పెట్టెను.

సులోలుడు, కువలయుడు, సులలుడు (వీరవర్మ కుమారులు) మువ్వురు అస్త్రపాణులై యరణ్యములో నుందురు. వారి సంభాషణ సందర్భమున యముడు సుమాలినిని తనకు భార్యగా నొసంగుమని కోరుటయు అందులకు ప్రతిఫలముగా వీరవర్మ తనకు వాసుదేవసందర్శన మొనరించుట కవకాశము కలిగించుమనుటయు యము డందుల కంగీకరించుటయు వెల్లడి యయ్యెను. ఈ ముప్పురు ధర్మరాజు అశ్వమేధయాగమునకు వదలిన అశ్వమును బంధించిరి. ఈ అశ్వమును కాపాడుచు కృష్ణార్జునులు, మేఘవర్ణుడు, (ఘటోత్కచుని పుత్రుడు) వృషకేతుడు, ప్రద్యుమ్నుడు, తామ్రధ్వజుడు, బభ్రువాహనుడు మున్నగు యోధులు వచ్చుచుండిరి. వీరవర్మ కుమారు లా యజ్ఞాశ్వము బంధించి, దానివెంట వచ్చు వీరులతో పోరాడి మూర్ఛపుచ్చిరి. బభ్రువాహనుడు ఆ వీరకుమారులను యుద్ధములో నోడించి, మూర్ఛపుచ్చెను.

రక్తసిక్తమైన గాయములతో తూలుచున్న (కువలయుడు, సులలుడు, సులోలుడు) రాకుమారుల విషయము భటులవలన తెలిసికొన్న వీరవర్మ కాలుని సహాయుడై అర్జునునితో యుద్ధమునకు వచ్చెను. కాలుడు పాండవసైన్యమును నాశముచేయుచుండెను. అర్జునుడు శ్రీకృష్ణునితో కాలుడు వీరవర్మకు సహాయపడుటకు గల కారణ మడిగెను. వీరవర్మ కూతురు సుమాలినిని యమునకు భార్యగా నొసంగుమని యముడు కోరుటయు, అందుకు వీరవర్మ తనకు శ్రీకృష్ణ సందర్శనము కలిగించినచో తన కూతునిత్తునని అంగీకరించుటయు ఆ కారణము చేతనే యము డీ యుద్ధములో వీరవర్మకు సహాయముగా వచ్చెనని శ్రీకృష్ణుడు అర్జునునకు తెలిపెను. అర్జునుడు వీరవర్మతో ఘోరయుద్ధము చేయుచుండెను. అర్జునుని దివ్యాస్త్రములన్నియు వ్యర్థమగుట, వీరవర్మ బాణములచే శరీరము రక్తసిక్తమగుట భరింపలేక అర్జునుడు శ్రీకృష్ణుని శరణువేడెను. శ్రీకృష్ణుడు రథమునడుపుచుండగా వీరవర్మార్జునులు భయంకరయుద్ధము సాగించిరి. వీరవర్మ బాణవృష్టి అర్జునుని ముంచివైచెను. అర్జునుడు శ్రీకృష్ణుని శరణువేడెను. శ్రీకృష్ణుడు అర్జునుని గర్వభంగమైనదని భావించి వీరవర్మ రథముపై లంఘించి యాతని తలను దన్నెను. ఈ సమయముననే యెదిరి చూచుచుండిన వీరవర్మ కృష్ణుని పాదములు పట్టుకొని, అపరిమితమైన భక్తితో ప్రార్థించి, చేతులు జోడించి పూజించెను. అంతట కృష్ణు డా వీరవర్మను కనికరించి ఉభయపక్షము

లలో మృతులైనవారిని పునర్జీవితుల చేసెను. వీరవర్మ కోరిక ననుసరించి కృష్ణార్జునులు ససైన్యముగా సారస్వతపురము పోయి, సుమాలినీదండపాణుల పాణిగ్రహణము జరిపించి ఆశీర్వదించిరి. పురోహితుడు మంత్రాక్షత లొసంగ నారదుడు విచ్చేసి తాను కల్పించిన నాటకము మిక్కిలి రసవత్తరముగా యుద్ధమై చివరకు సుఖాంతమైనందుకు సంతసించి వధూవరులపై అక్షతలు చల్లెను. వీరవర్మ భరతవాక్యముతో నాటకము సమాప్తమగును.

జైమినిభారతకథకు సుమాలినీపరిణయనాటకకర్త చేసిన మార్పులు

జైమినీభారతములో వీరవర్మ కూతురు సుమాలిని స్వయముగా యమధర్మరాజును వలచి యమసూక్తములతో నాతని నారాధించుచుండెను. కాని సుమాలినీపరిణయ నాటకములో నాటకకర్త సురమౌని వీరవర్మకు పాండవులకు కలహము కల్పించి కలహభోక్త యను నామము సార్థకము చేసికొనుటకు తానే ఒక వైపు సుమాలినిని, మరియొకవైపు దండధరుని ప్రేరేపించి, ఒకరిపై నొకరికి మరులు కల్పించి కలహమునకు నాంది పలికెను. ఇందుకొఱకు నారదుడు రెండు తడవలు సారస్వతపురము, ఒకసారి యమలోకము సందర్శించెను.

జైమినీభారతములో సుమాలినీ యముల వివాహము తరువాత వీరవర్మార్జునుల యుద్ధము జరిగినట్లు కలదు. కాని నాటకములో యుద్ధము తరువాత శ్రీకృష్ణుని దయవలన యుద్ధములో మృతిచెందిన వారిని పునర్జీవితుల చేసి, ఆ తరువాత వీరవర్మ పట్టణములో సుమాలినీ దండపాణుల పాణిగ్రహణము జరిగినట్లు నాటకకర్త మార్పు చేసెను. దీనివలన వీరవర్మ కోరిక శ్రీకృష్ణసందర్శనము నెరవేరినది.

జైమినీ భారతములో యముడు దళవాయి రాజయక్ష్మునితో సారస్వత నగరము పోయినట్లు కలదు. కాని నాటకములో యముడు చిత్రగుప్తునితో వీరవర్మ నగరము పోయి, ఉద్యానవనములో విహరించి, మరునాడు రాజసభకు పోయి, సుమాలినీ పాణిగ్రహణము గురించి విచారించినట్లు కలదు. యమలోకములో చిత్రగుప్తుని గురించిన పౌరాణికవిషయములు సామాన్యులకు సహితము

తెలియును. కాని రాజయక్ష్మనిగురించి తెలియదు. కావున నాటకకర్త యీ నాటకములో పరిచయపాత్రను ప్రవేశపెట్టి సులభగ్రాహ్యమగుటకు తోడ్పడెను.

జైమినీభారతములో లేని విషయము సుమాలినీ కాలుల విరహవేదనలను వివరముగా వర్ణించుట, వసంతఋతువర్ణనలు చేయుట, చంద్రమన్మథోపాలంభములు నాయకీనాయకులచేత చేయించుట నాటకకర్త కల్పించిన నూతనాంశములు ఈ సందర్భమున నాటకకర్త చేసిన కొన్ని వర్ణనలు ప్రబంధవర్ణనల తలపించుచున్నవి.

జైమినీభారతములో శ్రీకృష్ణార్జునులకు బభ్రువాహనుడు, ఆంజనేయుడు సహాయులుగా నున్నట్లు కలదు. కాని నాటకములో ఆంజనేయపాత్రను తొలగించి ప్రద్యుమ్న, వృషసేన, తామ్రధ్వజ, మేఘవర్ణాదుల పాత్రలను అదనముగా ప్రవేశపెట్టి నాటకకర్త నాటకమునకు వన్నెపెట్టెను. వీరవర్మభార్య మణిమాల, సుమాలిని చెలికత్తె కమలయను స్త్రీపాత్రలు నాటకకర్త అదనముగా ప్రవేశపెట్టెను. యమలోకములో పాపుల చూపి వారికి విధించు తగిన దండనల గురించి నాటకర్త కాలుని ద్వారా నారదునికి సవివరముగా వర్ణించి చెప్పుట యీ నాటకములో నొకప్రత్యేకతయని చెప్పవచ్చును.

పాత్రపోషణ

నాటకము ననుసరించి సుమాలినీదండధరులు నాయికానాయకులు. నాయికయగు సుమాలిని రాకుమార్తె. సౌందర్యవతి. దేవతలలో నొకడైన సమవర్తిని వరించినది, నారదప్రేరితురాలై యముని చిత్రపటము చూచి, యాతని అందమునకు వలచినట్లు నాటకకర్త సూచించెను. వీరవర్మ మణిమాల తమ కూతురు వివాహముగురించి విచారించుచుండగా సుమాలిని కమలతో అచ్చటికి వచ్చెను. వా రామెయెట్టివరుని కాంక్షించుచున్నదో తెలుపుమనినపుడు కమల సమవర్తి నామె వరించినదనెను. తల్లిదండ్రు లామె యభిప్రాయమునకు నివ్వెఱపడి, కాలుని కాక వేరే రాకుమారుని వరించి సుఖపడుమని ప్రాధేయపడిరి. కాని సుమాలిని తన దృఢసంకల్పము వ్యక్తీకరించిన విధ మీ క్రింది పద్యమువలన వ్యక్తమగును

"[1]చం॥ త్రికరణశుద్ధిగా పితృపతిన్ వరియించితి నాదు ప్రాణనా
యకు డతడే యిహంబు పర మాతడె దైవము తోడునీడ ర
క్షకుడు గురుండు సర్వవిధసౌఖ్యరతుం డతడే యటంచు న
మ్మకమునునుందు నే నితరమానవమాత్రుల గోరనెంతునే."

తనమనస్సులో నొక దివ్యపురుషుని వరించిన శరీరము తదితరుల కివ్వ ననియు, పరేతనాథు డంగీకరించనిచో ప్రాణత్యాగము చేయుదునని తన దృఢ సంకల్పము తల్లిదండ్రులకు వ్యక్తీకరించెను. ఈ సందర్భములో సావిత్రి సత్య వంతుల నాటకములో అశ్వపతిరాజుతో సావిత్రి తన మనోసంకల్పము అర్థా యుష్కు డైనను, సత్యవంతునే వివాహమాడుదునని తెలిపిన సన్నివేశమును తల పించుచున్నది.

సుమాలిని సురమౌని చూపించిన చిత్రపటము చూచి యమునిపై మరులు గొని యేకాంతమున విరహవేదన ననుభవించును. ఈ సందర్భమున సుమాలిని చంద్ర, మన్మథుల నుపాలంభించునపుడు నాటకకర్త చూపిన ప్రతిభ నాయిక చతురురాలగుటకు చక్కని దృష్టాంతముగా చెప్పవచ్చును.

"[2]ఉ॥ చల్లనివాడు చంద్రుడని సజ్జను లెంతయు బల్కుచుందు రా
చల్లదనం బొకింతయు నిశాచర నీయెడ లేదు చూడ ని
ల్వెల్ల విషంబె నీకు గల దేమి వచింపగజాలుదాన ని
న్నల్లదె మింటగన్న యొడలంతయు భగ్గున మంట మండెడున్."

విరహిణులకు శరీరము వేడెక్కుటవలన శీతలోపచారములు చేయుట సాధారణవిషయము. రాత్రి వెన్నెలలో చల్లదనమునకు తిరుగుట సామాన్యము. దేవదానవులు సముద్రమును మథించినపుడు మొదట హాలాహల ముద్భవించుట, ఆ తరువాత చంద్రుడు, లక్ష్మి, ఐరావతము, ఉచ్చైశ్శ్రవ ముద్భవించుట జరిగినది హాలాహలము తరువాత వచ్చినవాడు చంద్రుడు. కావున చంద్రునకు నిలువెల్ల విషమని కవి సుమాలినిచేత అనిపించుట మిక్కిలి రమణీయముగా నుండి,

1. సుమాలినీపరిణయము. ద్వి. అం. 30 పుట.
2. " " " 24 "

సందర్భోచితముగా నున్నదని చెప్పవచ్చును. నాయిక సుమాలినికి చంద్రుడు చల్లదనంబు నొసంగుటకు బదులు (ఉష్ణము) విరహము నధికముగా చేయుచున్నాడని నిందించుచు, ఆ తరువాత గురుద్రోహియనియు, సోదరిగృహంబు దహించినవాడనియు, మేనల్లుని విరోధియగు గరళకంఠుని శిరంబున నాట్యమాడువాడనియు, ఆక్షేపించి యిట్టివానికి దయాధర్మములుండవని నిందించును. ఈ సందర్భమున నాటకకర్త నాయికనొక ప్రబంధనాయికగా తీర్చిదిద్దినట్లు స్పష్టమగుచున్నది. నాయిక ధీరగుణమున కుదాహరణముగా చెప్పవలసివచ్చినచో ద్వితీయాంకమునందు సుమాలిని విరహావేశ మనుభవించు సందర్భమున తాను వలచిన యముడు సాక్షాత్కరించి తనచేయి పట్టుకొనెను. విరహిణియైనను తన కోరిక బహిర్గతము చేయక ప్రియునితో తాను అస్వతంత్రురాల ననియు, తన తల్లిదండ్రుల అనుమతితో వివాహమాడినచో తన కభ్యంతరములేదని చెప్పి చేయి విడిపించుకొని పోయిన ధైర్యవంతురాలు.

మిగిలిన స్త్రీపాత్రలలో వీరవర్మ భార్య మణిమాల చెలికత్తె కమల పేర్కొనదగినవారు.

పురుషపాత్రలలో కథానాయకుడు యమధర్మరాజు. దేవతలు మానవులు నాటకములో పాత్రలగుట విశేషము. సమవర్తి దేవతలలో నొకడైయుండి మానవ మాత్రురాలైన రాకుమారి సుమాలినిని ప్రేమించుట జరిగినది దీనికి నారద ప్రేరితము కారణము. మానవుల పాపపుణ్యముల ననుసరించి దండించవలసిన యముడు మానవకాంతనే ప్రేమించుట నాటకములోని ప్రధానాంశము. ఈ నాటకములో నాటకకర్త నాయకున కొసంగవలసిన ప్రాధాన్యము నొసంగినను, తృతీయ, చతుర్థాంకములలో నాయకుని ప్రాధాన్యత కొంత తగ్గినది.

కాలుడు నారదుని సలహామేరకు సుమాలిని యమసూక్తము నుచ్చరించుట వలన కలిగిన శక్తికి బద్ధుడై చిత్రగుప్తునితో భూలోకము విచ్చేసి, సారస్వతనగర బహిఃప్రాంతమునగల ఉద్యానవనములో విహరించుచుండెను. చిత్రగుప్తుడు విశ్రమించి నిద్రపోయెను. యమునికి నిద్రరాక భావజుని పుష్పబాణముల తాకిడికి విరహవేదన ననుభవించుచుండెను. యముడెంత భయంకరుడైనను మానవలోకములో నొకరాకుమారి కొఱకు నిద్రాహారములుమాని సంచరించును. ఈ సందర్భ

ములో కృతాంతుడు చేసిన చంద్రమన్మథోపాలంభములు ప్రబంధములలో కవులు వర్ణించిన విప్రలంభశృంగారమును తలపింపజేయుచున్నది.

ఉద్యానవనములో కమలాసుమాలినులు విహరించు సందర్భమున దైవ స్వతుడు పొదచాటునదాగి వారి సంభాషణ వినుచుండెను. సుమాలిని తను వలచిన ప్రియుడు లభించునో లేదోయని వంతలగుందుచుండగా కృతాంతుడు బయటపడి పల్కిన పలుకులు పరిశీలించినచో "ఆడదాని చూడ అర్థంబుచూచిన బ్రహ్మకైన పుట్టు రిమ్మతెగులు" అను సామెత అక్షరాలా నిజమనిపించును.

"[1]ఉ॥ దాపగనేల నివ్వలచి దండధరుండిదె వచ్చియున్నవా
డో పడతీలలామ మదినోజ్జ్వల శస్త్రవిఘాతపాత సం
తాపము జెందనేల ప్రమదావనసీమను నిన్నువేచు నా
పాపుని రూపడంచెదను పల్లవపాణిరో ధైర్యమూనుమా."

పై పద్యమునందు నాయకు డాపదలోనున్న ఒక స్త్రీని ఆదుకొనుట కాతురతపడుచున్నట్లు కనిపించుచున్నను, కామాతురుడైన కాలుడు సుమాలినిని కాముని బారినుండి కాపాడుటకు బద్ధకంకణుడైనట్లు తలపింపజేయుచున్నది. మోహము వ్యక్తముచేయుచునే నిస్సహాయురాలైన ఒక స్త్రీని కాపాడుటకొఱకే కాలు డా విధమైన అభయప్రదానము చేసినట్లు చూపించుట సహజసుందరముగా శోభిల్లుచున్నది.

"కామాతురాణాం న భయం న లజ్జా" యనునట్లు కాలుడు తన కోరికను సుమాలినికి తెలిపి యామె అంగీకారమును పొందలేక, చివరకు సిగ్గువిడచి మదనతాపము భరింపలేక ఆమెను ప్రాధేయపడిన విధ మిట్లున్నది.

"[2]గీ॥ సర్వజీవుల శాసించు జముని నన్ను
నీదు స్వేచ్ఛానుసారంబు నాదరమున
నేలుకొనుమని బల్కగ నించుకైన
కరుణచూపింప విది యేమి సరస మబల."

---

1. సుమాలినీపరిణయము. ద్వి. ఆ. 41 పుట.
2. " " " 44 "

చండశాసనుండైన పరేతనాథుం డే విధముగా నొక సౌందర్యమూర్తి నారాధించి ప్రాధేయపడుట నాయకునికి నాయికయందుగల ఆదరాభిమానములను, ప్రేమకు తిరుగులేని తార్కాణము.

తాను వలచిన సుమాలినిని వివాహమాడుటకు వీరవర్మ విధించిన షరతు పూరించుటకు కృతాంతుడు స్వయముగా పాండవసైన్యమును యుద్ధములో యెదుర్కొని, వీరవర్మకు బాసటగా నిల్చి బంధుప్రీతిని ప్రదర్శించెను. ఈ ఘట్టములో కాలుడు చూపించిన వీరత్వమునకు కృష్ణార్జునులు సహితము ఆశ్చర్యమగ్నులైరి. చివరకు వీరవర్మ కోరిక వాసుదేవసందర్శనము నెరవేర్చి, సుమాలినిని శాస్త్రోక్తముగా వివాహమాడిన కృతాంతుని పాత్రను నాటకకర్త మొదటినుండి సముచిత రీతిలో పోషించెను.

ఈ నాటకములో నాయకీనాయకపాత్రల తరువాత నారదుడు, వీరవర్మ, శ్రీకృష్ణుడు, అర్జునని పాత్రలు కొంతవరకు ప్రాధాన్యతగల పాత్రలని చెప్పవచ్చును. నారదుడు కలహభోక్త యను నామము సార్థకము చేసికొనదలచి పాండవసైన్యమునకు, వీరవర్మకు యుద్ధము కల్పించి, పబ్బము గడుపుకొనినట్లు సుమాలినీయమధర్మరాజుల వివాహసందర్భమున ప్రకటించును. వీరవర్మ మహాయోధుడేగాక శ్రీకృష్ణభక్తుడుగను, ధైర్యశాలిగను, కుమారులు యుద్ధరంగమునందు పడిపోయినను చలించని మేరుసముడుగను నాటకకర్త చిత్రీకరించెను మొదట తన కూతురును యమునకిచ్చుటకు సందేహించినను, నారదుని సలహా మేరకు అంగీకరించుటలో పరిస్థితుల ప్రభావమున కనుగుణముగా నడుచుకొను స్వభావము ఆ రాజునందు కవి స్థిరీకరించెను. గర్విష్ఠిగను, పరాక్రమసంపన్నుంగను, చిత్రించి, అనువుగానియపుడు శ్రీకృష్ణుని శరణుజొచ్చి తనకు, తన సైన్యమునకు కల్గిన ఆపదను తొలగించుకొని, సమయస్ఫూర్తిగలిగిన వ్యక్తిగా కవి అర్జునుని పాత్రను చిత్రీకరించెను. శ్రీకృష్ణుని పాత్రను జగన్నాటకసూత్రధారిగానేగాక, అఘటనాఘటనసమర్థునిగా నిరూపించి, భక్తులపాలిటి కల్పవృక్షముగను, దుష్టుల శిక్షించువానిగను, మాయామానుషవిగ్రహునిగ చూపించి, కవి తనకు నాటకరచనలోగల ప్రతిభను చాటెను.

రస పోషణ

ఈ నాటకములో ప్రథమ, ద్వితీయాంకములలో శృంగారము, తృతీయ చతుర్థాంకములలో వీరము ప్రాధాన్యము వహించినవి. నాటకమున శృంగారమే అంగిరసము. బీభత్సము, హాస్యము, భక్తి మున్నగు రసములు చాలా స్వల్పముగా పోషించబడినవి. మొదట వీరమును పరిశీలించి పిదప శృంగారమును పరిశీలించనైనది.

వీరము

తృతీయ చతుర్థాంకములలో కవి వీరమును పోషించెను. అర్జునుడు యాగాశ్వము వెంట బభ్రువాహన, ప్రద్యుమ్న, తామ్రధ్వజ, వృషసేన, మేఘవర్ణ మున్నగు యోధులతో సారస్వతపురప్రాంతములో ప్రవేశించెను. వీరవర్మ కుమారులు సులలుడు, కువలయుడు, సులోలుడు యజనాశ్వమును బంధించిరి. మొదట ప్రద్యుమ్నుడు వృషసేనుడు, మేఘవర్ణులు రాకుమారులతో భీకరయుద్ధ మొనరించిరి. ఈ సందర్భమున వీరవర్మ పెద్ద కుమారుడు సులోలుడు ప్రద్యుమ్నునితో పల్కిన యీ వీరాలాపములు తిలకించినచో యుద్ధరంగములో వీరు లెంత పరాక్రమము చూపించిరో విశదమగును.

"1సీ॥ రణభూమియే నేడు రమణీయవైభవా
 ర్థంబగు యజ్ఞవాటంబుగాగ
జగములు గంపించు సైనికారావముల్
 తరియించు వేదమంత్రములుగాగ
శరవేగమునగల్గు సాంద్రాగ్నికణములే
 భాసిలంగను హోమవహ్నిగాగ
సంగరావని గూలు శాత్రవకరపాద
 శీర్షంబు లింధనాక్షతలుగాగ

గీ॥ బాణ తూణీర కవచ విభ్రాజతేజ
పూజనీయుండ నే సోమయాజినగుచు

1. సుమాలినీపరిణయము. తృ. అం. 54 పుట

యాగపశువులరీతిగా నలరు మిమ్ము
వ్రేల్చి రణయజ్ఞ మొనరింతు విపులముగను."

యుద్ధరంగములో యోధులు ఒకరిపై నొకరు శరముల నిగుడ్చి పలుకు వీరాలాపములు, ప్రతియోధులను తిరస్కరించి నీచముగా మాట్లాడు యీ క్రింది పద్యము లుదహరించు టనావశ్యకము కాదు. ప్రద్యుమ్నుడు కువలయునితో యుద్ధము చేయుచు

"[1]మ॥ అరెరే బాలక యేల ప్రేలెదవు గర్వాలాపముల్ మూర్ఖ సం
గరసీమ న్నిలు మీ క్షణంబుననె నీ కంఠం బిదే ద్రుంతు దు
ర్భరదుఃఖానలతప్తులై ధరను నీ వారెల్ల శోకింపగా
శరసందోహవిఘాతపాతమున నీచా మాట లింకేలరా."

పలికిన వీరాలాపములలో కువలయుని తన వాడి బాణములతో సంహరించి యాతని బంధువులను దుఃఖసముద్రములో ముంతుననియు, వృథా ప్రలాపంబులు చాలించి కొంత సేపు యుద్ధభూమిలో నిలబడి పోరినచో కంఠచ్ఛేదము కావింతునని ప్రద్యుమ్నుడు పలికెను.

బభ్రువాహనుడు కువలయునితో యుద్ధముచేయు సందర్భమున ఒకరి బాణము లొకరు ఖండించుకొనుచు నిష్ఠురోక్తులతో సమస్థాయిలో పోరుచుండిరి. కువలయుని అగ్నిబాణము తన వారుణాస్త్రముతో చల్లార్చి, ఒక దివ్యబాణ మెక్కుపెట్టి బభ్రువాహనుడు చేసిన ప్రతిజ్ఞాపూర్వకమైన వీరాలాపములు, కవి యుద్ధరంగము కన్నులకు కట్టినట్లు వర్ణించిన విధ మిట్లున్నది.

"[2]సీ॥ చతురంగబలశవసంఘంబు నిండిన
కదనభూమియె నీకు గద్దెగాగ
నీ చావు మదిగోరి నిలచిన రాబందు
చయ మెన్న నంగరక్షకులుగాగ
జంబుకారావముల్ డంబుమీరగ నీకు
బహువిధతూర్యరావములుగాగ

1. సుమాలినీపరిణయము. తృ. అం. 54 పుట
2. " " " 61 "

ఈ వనజంతువులెల్ల నీ కనురక్తి
సలిపెడు మత్సవజనులుగాగ

గీ॥ కాకి రెట్టలు చందనాక్షతలుగాగ
అపర యమలోకమట్టుల నలరు నిచట
నీదు శిరమును తెగత్రుంచి నిశ్చయముగ
ప్రేతభూమికి నిన్నిదే విభుని జేతు."

వీరవర్మార్జునులిద్దరు ద్వంద్వయుద్ధమునకు తలపడిరి. మొదట అర్జునుడు వీరవర్మ బాణములకు తట్టుకొనలేక శ్రీకృష్ణుని శరణు కోరెను. అర్జునుని గర్వ భంగమైనదని భావించిన శ్రీకృష్ణుడు అర్జునునకు సమధికోత్సాహము కలిగించి యుద్ధభూమిలో వీరవర్మ నెదుర్కొనెను. అర్జునుడు వీరవర్మను కించపరచుచు, తన పరాక్రమము వ్యక్తపరచుచు, అవక్రపరాక్రమముతో యుద్ధములో వీరవర్మ మదమణగింతునని పలుకుచు, పాఱక నిలువుమని పరుషోక్తులాడిన సందర్భమున కవి అర్జునుని ముఖతః చెప్పించిన యీ పద్యమిట్లున్నది.

1"చం॥ పురహరుడంతవాడు రణభూమిని నా నిశితాస్త్రపంక్తికిన్
దెరిపి యొకింతలేక కడు దీనత నోడెనటంచు మున్ను నీ
వెరుగనివాడవౌట నిపు డించుకనైనను భీతిలేక సం
గరమున దాకనెంచితివిగాక క్షణంబున నీల్గకుందువే"

పురహరుడంతటివాడు అర్జునునితో పోరలేక ఓడిపోయెననియు, అట్టి యోధునితో యుద్ధము చేసినచో క్షణములో నశింతువని పలికిన అర్జునుని పలుకులకు వీరవర్మ యొసంగిన సమాధానమున నా వీరపురుషుని పరాక్రమము సువ్యక్తమగుచున్నది.

"2ఉ॥ ముప్పదిమూడుకోట్ల సురపుంగవులన్గాని పాకశాసనుం
డిప్పుడు నిన్ను గావ మదినెంచి దురంబున నన్ను దాకినన్
తప్పదు నీ కనర్థకము దైవకటాక్షము కల్గెనేని నే
జెప్పునదేమి యింక నిను జెండి ధరాస్థలి కీర్తి నొందెదన్."

1. సుమాలినీపరిణయము. చ. అం. 79 పుట
2. " " " " "

లర్జునుని కాపాడుటకు ముప్పదిమూడుకోట్ల దేవతలతో సురేంద్రుడొచ్చి నను వీరవర్మ బారినుండి తప్పించలేరనియు, దైవకృపగలిగినచో అర్జునుని యుద్ధరంగమందు చెండాడుదునని వీరవర్మ సమాధానము పై రెండుపద్యములలో నొక విశేషము కవి సూచించెను. విజయుడు పరమశివునితో సమానమైతే, వీర వర్మ త్రైలోక్యాధిపతిని మించినవాడనియు, కావున పరాక్రమములో వీరవర్మార్జునులు సమానప్రతిభకలవారను విషయము నాటకకర్త యీ సందర్భమున పాఠకుల కందజేసిన విశేషాంశము.

## శృంగారము

ఈ నాటకములో శృంగారరసమునకు ప్రత్యేకప్రతిపత్తి యొసంగబడినది. శృంగారము ప్రథమ, ద్వితీయాంకములలో పోషింపబడినది. శృంగారమునకు నిలయములైన ఉద్యానవనములలోని లతలు, మల్లెపొదలు, సరస్సులు, మలయ మారుతములు పుష్కలముగా వర్ణింపబడినవి. నాయకీనాయకులైన సుమాలినీదండధరుల విప్రలంభమే యిందు ప్రధానస్థాన మాక్రమించినది.

నారదప్రేరితయై సుమాలిని యముని చిత్రపటమును చూచుకొనుచు, యిట్టి అకలంకధర్మమూర్తి పతిత్వము తనకు లభించునో లేదో యనుకొనుచు తనలో తాను మొదట విరహవేదన ననుభవించి, చంద్రమన్మథుల నుపాలంభించెను. తరువాత విరహము తట్టుకొనలేక తన మోహము తీరునో లేదో, తన జీవితనౌక గమ్యము చేరునో లేదో, యముడు భర్తగా లభించునో లేదో యను అనుమానముతో మలయపవనమును, విధిని దూరుచు పల్కిన సుమాలిని పల్కులిట్లున్నవి.

[1]"మ॥ పవనుం డియ్యెడె వెచ్చగాడ్పులను వీవన్గల్గి నా దేహమె
ల్ల విదారింపఁ దొడంగినా డకట కాలంబెంతలో మారిపో
యె విధిప్రేరిత మెట్టులున్నదొ దలం పేరీతి సిద్ధించునో
భువి నా జీవితనౌక మోహజలధిన్ బొర్లించునో దెల్పునో."

1. సుమాలినీపరిణయము. ద్వి. అం. 25 పుట.

ఇచట నాయిక సుమాలిని సమవర్తిపై మోహముతో విరహవేదనకు లోనైనది. ఇంతలో శీతలపవనములు వీచినవి. అయినా ఆమె శరీరమున కా మలయపవనములు చల్లదనమును కూర్చుటకు బదులుగా విరహవేదన కలిగించినవి కాని ఆమె కోరిక నెరవేరే అవకాశ మా సమయమున లేకపోయినది. అందు కొఱకే సుమాలిని తన జీవితనౌక యీ మోహజలధిలో మునుగునో తేలునో యని అనగా తన ప్రియుడగు కాలునితో తనకు సమాగమభాగ్యము కలుగునో లేదో యను డోలాయమానస్థితిలో పడినది. ఈ సందర్భమున సుమాలిని మానసికస్థితి భాగవతములో రుక్మిణి శ్రీకృష్ణుని వలచి, బ్రాహ్మణుని రాయబార మంపి, ఆలస్యమునకు విచారించుచు, శ్రీకృష్ణుడు వచ్చి తనను వివాహమాడి గైకొని పోవునో లేదో యను అనుమానము వ్యక్తమొనరించిన ఘట్టమును తలపింపజేయు చున్నది. ముఖ్యముగా విహారఘట్టములో ప్రేయసీప్రియులను కలుపు సన్నివేశము వసుచరిత్రలో గిరికావసురాజుల ప్రణయవృత్తాంతమూ తలపింపజేయుచున్నది. ఈ సందర్భమున సుమాలిని మానసికస్థితి ప్రతిబింబించని విప్రలంభశృంగారమునకు తారాక్కాణము.

సుమాలిని చెలికత్తెతో ఉద్యానవనములో సంచరించునపుడు కాలుడు వారికి దర్శన మిచ్చెను. అతని అందచందములు చూచి సుమాలిని తనలో భావించిన తీరిట్లున్నది.

"1సీ॥ ఒక్కసారి తడు చెక్కిలి నొక్కిన
స్వర్గాదిసుఖములు బడయనేల
ఒక్కసారి తడు ప్రక్కనఁజేరిన
కలుములజవరాలి చెలిమియేల
ఒక్కసారి తడు చక్కగ బల్కిన
పరతత్త్వమహిమ గుర్తెరుగనేల
ఒక్కసారి తడు దక్కి యధరము గ్రోల
క్షితిని సురాపానసేవ యేల

---

1. సుమాలినీపరిణయము. ద్వి. అం. 42, 43 పుటలు

గీ॥ ఇన్ని యేటికి నేడు నాకున్న వ్యథను
మాన్పి సరసోక్తులం దేల్చి మదనగర్వ
మడచినం జాలు ధరణిలో నఖిలభోగ
భాగ్య మన్నను నాదిపో భాగ్యమగును."

కాలుడు మానవాతీతమైన దేవతలలోని వాడు. కావున ఇట్టి కాలునితో సంభోగము సుమాలినికి యిహలోక సర్వసౌఖ్యముల కంటె శ్రేష్ఠమైనవని భావించెను.

సమవర్తి సారస్వతపురోద్యానవనమున సంచరించు సమయమున సుమాలిని కనిపించెను. నాయకుని చూచిన నాయిక లజ్జచే ముకుళించుకొని పోయిన మొగ్గ పోదిరి ఒదిగియుండెను. దండధరు డామె సోయగమున కానందపరవశుడై తన మోహమును యీ క్రింది పద్యములో వ్యక్తీకరించిన విధము —

"[1]చం॥ దినమొకయేడుగా గడిపితిన్ భవదీయ విరాళి నోర్వకన్
మనమునఁ జాలిఁ దూలి యవమానము న్యూనము హానివృద్ధులన్
కనుగొనక న్నిరంతరము కామశరంబుల పీడితుండనై
నినుగనవచ్చినాడ తరుణీ యిక దాపగనేల మర్మమున్."

పరిశీలించినచో మానవులేగాక దేవతలు సహితము కామమునకు వశవర్తులగుదురను విషయము నాటకకర్త స్పష్టీకరించినాడు. కామించినవాడు మానవుడైనను, దైవమైనను అవమానము, న్యూనము, హానులు పొందునను, అభిప్రాయమును కవి యీ సందర్భమున పాఠకున కందజేసిన సందేశమని చెప్పవచ్చును. "ఆడదాని జూడ ........ బ్రహ్మకైన పుట్టు రిమ్మతెగులు" అను సామెత నీ సందర్భమున కవి చక్కగా వర్తింపజేసెను. కవి విప్రలంభశృంగారము మాత్రమే పోషించెను. సుమాలినీ కృతాంతుల వివాహానంతరము సంభోగశృంగారవర్ణన కవకాశమున్నను నాటకకర్త దీనిని పోషించలేదు. వసంతఋతువర్ణన, మన్మథ చంద్రోపాలంభములు, మలయమారుతము మున్నగు శృంగారవస్తుసముదాయము లన్నింటిని సమకూర్చి కవి శృంగారమును శోభాయమానముగా పోషించెను.

1. సుమాలినీపరిణయము. ద్వి. అం. 44 పుట

నాటకములో ప్రతిబింబించు సామాజిక పరిస్థితులు

కవి కావ్యసృష్టిలో అప్పటి సామాజిక పరిస్థితులు ప్రతిబింబించుట సర్వ సాధారణము ఈ నాటకములో మనకు రెండుమూడు విషయములు కనిపించు చున్నవి. సంఘములోగల దురాచారములు పరస్త్రీవ్యామోహము, అధర్మప్రవర్తన మున్నగువానిని చూపించి వానికి నరకములో లభించు శిక్షలను వివరించి, తప్పుడు మార్గములనుండి మానవులను కాపాడి సుగతికి అనగా మోక్షము పొందుమార్గము చూపించుటకు యీ నాటకకర్త ప్రయత్నించిన విధ మీ క్రింది పద్యములలో నిట్లున్నది.

"1సీ॥ అగ్నిసాక్షిగ గొన్న అతివను విడనాడి
పరకాంతలను గోరు పాపు డతడు
ధనమున కాసించి తన పుత్రి నొరులకు
విక్రయించినయట్టి విప్రుడతడు
తల్లిదండ్రుల గొల్వ కిల్లాలు విలపింప
వేశ్యల వెన్నంటు వెట్టి యతడు
ద్రవ్యాభిలాషచే ధర్మదూష్యంబుగా
కూటసాక్ష్యము లిచ్చు కూళ యతడు

గీ॥ ధేనువుల బట్టి చంపెడు హీను డతడు
కనకమును దొంగిలించిన కలుషు డతడు
కన్నబిడ్డల పరిమార్చు కఠిను డతడు
గాన వారలు దండ్యులు మౌనివర్య."

"2సీ॥ తప్పుడులెక్కల నొప్పించి పౌరుల
కష్టపెట్టుచునుండు కరణ మితడు
భువిని న్యాయాన్యాయములు గుర్తెరుంగక
బాధించుచుండెడు ప్రభువితండు

1. సుమాలినీపరిణయము ప్ర. అం. 19 పుట
2. " " " " "

తన తప్పు లెరుగక ననయంబు పరనింద
సలుపుచు నుండెడు తులువ యితడు
శాత్రవు లెదిరింప సంగరస్థలి వీడి
పారిపోయిన రణభీరు వితడు

గీ॥ ఇట్టి దుర్మార్గులెందరో యిచట గలరు
నాదు కింకరు లనయంబు నరకమందు
వారినెల్లర దండింత్రు ఘోరముగను
తెలుపజాలను వేయేల ధీవరేణ్య."

"[1]సీ॥ పతిలేనిసమయంబు వెతకి వీధులకెక్కి-
యుపభర్తలను బొందు యువతి యిదియె
సవతిపుత్రులకు విషంబు గుడువగబెట్టి
చావగొట్టినయట్టి చాన యిదియె
విధవగర్భంబును విచ్ఛిత్తిగావింప
సాహసించిన మంత్రసాని యిదియె
విటకాంక్షగూడ విభుని కంఠము ద్రుంచి
వగలచే బొగిలిన వనిత యిదియె

గీ॥ వర్ణభేదంబు లెంచక పాపరతిని
భ్రూణహత్యకు బాల్గొన్న వెలది యిదియె
వారి వీరిని వేర్వేర బట్టి నాదు
భటులు బాధింపుచుందురు మౌనితిలక."

అలనాటి సాంఘికదురాచారములను యముడు తన నరకలోకములో పాపులను వారికి విధించిన శిక్షలను నారదునకు చూపించి చెప్పినట్లు నాటకకర్త సవివరముగా చూపించి, ప్రబోధాత్మకమైన మంచినడవడికను పాఠకుల కందజేసెననుట అతిశయోక్తి కానేరదు.

1. సుమాలినీపరిణయము ప్ర. అం. 20 పుట

సమకాలీన సమాజములో స్త్రీలకు సంఘములో స్వతంత్రము లేకుండెను. కాని స్త్రీలుగూడా స్వతంత్రనిర్ణయము గైకొనవలయునను సందేశ మొసంగుటకు నాటకకర్త ప్రయత్నించెను.

వీరవర్మ మణిమాలలు తమ కూతురు సుమాలిని కృతాంతుని వలచినదని విని, కోపించి యే రాకుమారునైన వివాహమాడి సుఖపడవలయునని, హితబోధ చేయుచు మందలించిరి. కాని సుమాలిని తన పట్టు విడువలేదు. ప్రాణులకు భయంకరుడైన కాలుని వివాహమాడుట కూడదని నయాన, భయాన బోధించుచున్న తల్లిదండ్రులకు తన నిర్ణయము దెల్పిన విధ మిట్లున్నది.

"1గీ॥ కన్య గోరిన పురుషుని గౌరవమున
బెండ్లి చేసిన సుఖమబ్బు బిడ్డకవని
గాని యొరు నంటగట్టిన గలదె హితము
కరుణ యోచింపదగుగాదె కన్నతండ్రి."

గురజాడ, కందుకూరు వారు బాల్యవివాహములను రూపుమాపి, స్త్రీస్వాతంత్ర్యముకొఱకు పోరాడిన తరువాత కొంతవరకు బాల్యవివాహములు తగ్గినవి. స్త్రీ యుక్తవయస్సు వచ్చిన తరువాత తన భర్త నెంచుకొనుటలో తన అభిప్రాయమునకే ప్రాధాన్య మొసంగవలయునుగాని, తల్లిదండ్రులు బలవంతముగా తమ యిష్టమును కూతుళ్ళపై రుద్దగూడదను హితోపదేశము చేసి. స్త్రీస్వాతంత్ర్య ప్రచారమునకు నాటకకర్త యథోచితముగా కృషి చేసినాడని చెప్పవచ్చును.

చతుర్థాంకములో సుమాలినీకృతాంతుల వివాహసమయమున వివాహము చేయు పురోహితుల వాదోపవాదములు, ఆనాటి సంఘములో బ్రాహ్మణులలో వృత్తిస్పర్ధలు మిక్కిలి సునిశితహాస్యముతో నాటకకర్త ప్రదర్శించెను. ఆనాడు విప్రులు సభలో అగ్రతాంబూలవిషయములో కలహించుకొనుట సర్వసామాన్యము. దీనినే నాటకకర్త గోవిందశాస్త్రి దీక్షితుల వాదోపవాదముల రూపమున నాటకములో సునిశిత హాస్యమును ప్రదర్శించెను. ఆ తరువాత గణపతిపూజ మంగళాష్టకములు మున్నగు వివాహతంతు జరిపించినట్లు నాటకములో స్పష్టమగుచున్నది. ఈ విధముగా

1. సుమాలినీపరిణయము. ద్వి. అం. 31 పుట

నాటకకర్త అలనాటి సాంఘికాచారములు, సంఘములోగల అవినీతి పనులను నాటకములో అద్దముపట్టినట్లు చూపించుటలో కృతకృత్యుడయ్యెను.

ఈ నాటకము నాటక, ప్రకరణ లక్షణముల వలన యేర్పడిన భేదమగు నాటికలక్షణములు కలిగియున్నది. ఇందు నాలుగంకములుండుట, పంచసంధులలో ముఖసంధి, ప్రతిముఖసంధి, గర్భసంధి, నిర్వహణసంధి యను నాలుగు సంధులు మాత్రమే యున్నవి. విమర్శసంధి లోపించినది. నాటకములో ప్రస్తావన, విష్కంభము మున్నగునవి లోపించినను, ఆనాడు రంగస్థలముపై ప్రదర్శించు నాటకముల కే విధముగను తీసిపోదని చెప్పవచ్చును. కవి సహజపాండిత్యప్రకర్ష, ప్రతిభ, వ్యుత్పత్తు లీ నాటకములో సుస్పష్టముగా కనిపించుచున్నవి. ఆనందోపదేశములు రెండును పాఠకుల కందించుననుటలో నేమాత్రము సంశయము లేదు. ఇంతటితో యీ నాటిక పరిశీలన ముగించి తరువాత నాటకమును పరిశీలనకు గైకొనబడినది.

## సుచిత్రాభ్యుదయము

నాటకరచనలలో ఐదవదియైన "సుచిత్రాభ్యుదయము" నాలుగంకముల నాటకము. ఈ నాటకము క్రీ.శ. 1943 కి పూర్వమే రచించినను, మహారాజశ్రీ వెల్లంకి పట్టాభిరామస్వామిగారి ( కొత్తగండిగూడెము మొఖాసాదారు, పశ్చిమ గోదావరి జిల్లా చింతలపూడి తాలూకా ) ఆర్థిక సాహాయ్యముచే అక్టోబర్ 1948 లో ముద్రింపబడినది. కథాంశము జైమినిభారతమునందలి తామ్రధ్వజుని చరిత్రము సమకాలిక నాటకకర్తలు పౌరాణికేతివృత్తముల నాధారముగా చేసికొని నాటకములు రచించుచుండిరి. ఈ కవి దీని కనుగుణముగనే ఈ నాటకములో పార్థుని గర్వభంగము నాపాదించుచు, బాలవీరుడగు సుచిత్రుని బాహుబలపరాక్రమసాహసములతోపాటు శ్రీకృష్ణునిపై గల భక్తిప్రభావ ముగ్గడించుచు మయూరధ్వజుని సత్యవ్రతాచరణము, దానశీలము, ఔదార్యము చాటునట్లు యీ నాటకమును ఆసూరి మరింగంటి వేంకటనరసింహాచార్యులు తీర్చిదిద్దెను.

ఈ నాటకము శ్రీకృష్ణపరమాత్మ కంకిత మొసంగబడినది. నాటకారంభమున కృతిపోషకుల వంశప్రశంస గావించి, వారికి శ్రీకృష్ణుడు సకలైశ్వర్యము

లొనసంగి కాపాడుగాక యని కవి ఆశీస్సు లొనసంగెను. నాటకారంభమున నాంది యున్నది. ప్రస్తావన లేదు. ఈ కవి రచించిన మొదటి రెండు మూడు నాటకము లలో ప్రస్తావన, సందర్భోచితముగా పాటలు అనుబంధములో నొసంగబడినవి. కాని యీ నాటకములో పాటలు లేవు, ప్రస్తావన లేదు. కారణము రచయిత తన గురించి పాఠకు (ప్రేక్షకు)లకు చిరపరిచితుడను భావము కలుగుటయే ననిపించు చున్నది, నాటకము చివర భరతవాక్యమున్నది. అంకవిభజనము, రంగవిభజ నము విష్కంభములున్నవి. దీనినిబట్టి నాటకకర్త నాటకలక్షణములను కొంతవరకే పాటించెనని చెప్పవచ్చును క్లుప్తముగా నాటకములోని కథాంశ మిట్లున్నది.

క థా ం శ ము

శ్రీకృష్ణార్జునులు యాగాశ్వము వెంట ససైన్యులై బయలుదేరిరి. మాటల సందర్భమున అర్జునుడు కృష్ణునితో తనంత వీరుడు లేనట్లుగా గర్వముతో మాట్లాడెను. వారు అశ్వపురి వెలుపల అశ్వముతో పోవుచుండిరి. రత్నపురిరాజు మయూరధ్వజుడు. అతని కుమారుడు సుచిత్రుడు (తామ్రధ్వజుడు). నకులధ్వజు డీతని స్నేహితుడు. వీ రుభయులు పరిసరారణ్యములో సంచరించుచు, అర్జునుని యాగాశ్వమును చూచి, దాని ముఖమునగల బిరుదు ఫలకము చదివి బంధించిరి. పాండవసైన్యములోని యోధులు హంసధ్వజ, నీలధ్వజులకు నయాన, భయాన చెప్పి యాగాశ్వమును విడిపించుటకు ప్రయత్నించిరి. కాని యా బాలకులు వినక వారితో పోరుకు సిద్ధమైరి. సుచిత్రుడు హంసధ్వజునితో, నకులధ్వజుడు నీల ధ్వజునితో భయంకరముగా యుద్ధముచేసి మూర్ఛపుచ్చిరి.

కృష్ణార్జునులు యాగాశ్వమును గానక ముందుకు పోయి సుచిత్ర నకుల ధ్వజులు తమయోధుల నోడించి మూర్ఛపుచ్చుట చూచిరి. వారే యా బాలకులపై యుద్ధమునకు సిద్ధమగుచుండగా బభ్రువాహనుడు, వృషసేనుడు అడ్డువచ్చి. వారి బాలకులపైకి పరాక్రమవంతులైన కృష్ణార్జును లవసరము లేదని, తామే వారి నోడించి అశ్వమును గొనివత్తుమని పలికి సుచిత్ర నకులధ్వజులతో యుద్ధమునకు కడంగిరి. సుచిత్రు డొకడే బభ్రువాహనునితో ద్వంద్వయుద్ధము చేయుచు వీర విహార మొనరించుచుండెను. ఆ సమయమున ప్రద్యుమ్నవృషసేనాది యోధు లందరు కలసి సుచిత్రునిపై విరుచుకపడిరి. నకులధ్వజుడు గూడా సుచిత్రునకు

బాసటగా యుద్ధములో పాల్గొనెను. సంగరరంగము మిక్కిలి భయకంకరముగా నొప్పెను. యోధు లొకరినొకరు నిశితముగా విమర్శించుకొనుచు, ఒకరి యస్త్రముల నొకరు ఖండించుకొనుచుండిరి. సుచిత్రుడు సింగముకొదమమాదిరి విజృంభించి బభ్రువాహనాది యోధుల నోడించి, హయమును వృక్షమునకు బంధించి మిత్రులిరువురు విశ్రాంతి గైకొనుచుండిరి.

అర్జునుడు సుచిత్రునిపైకి యుద్ధమునకు పోయి, తన పరాక్రమము నుడివి, యిట్టివానితో పోరుసల్పుట బాలుడగు సుచిత్రునకు ప్రాణాంతకమగునని, హిత బోధచేసి యుద్ధమునుండి మరల్పబూనెను. అసహాయశూరుడగు సుచిత్రు డా మాటల కోడక, అర్జునుని పరాక్రమము కించపరచి మాట్లాడి, రెచ్చగొట్టుచు యుద్ధమునకు సిద్ధమయ్యెను. అర్జునుడు తన పూర్వపరాక్రమములను వివరించగా సుచిత్రు డా ఘనకార్యములన్నియు నీచమైనవని నిందించుచు, నిష్ఠురవాక్యముల తోనేగాక వాడిబాణములతో నాతని శరీరము నొప్పించెను. కోపముతో ధనుంజయుడు దివ్యాస్త్రములన్నియు సుచిత్రునిపై ప్రయోగించినను ఫలితము లేక పోయెను. చివరకు సుచిత్రుడే అర్జునుని మూర్ఛపుచ్చెను. యాగాశ్వము గైకొని పోవు సుచిత్రునిపై శ్రీకృష్ణుడు యుద్ధమునకు పోయెను. మొదట శ్రీకృష్ణు డు శరముల ప్రయోగించి, నిప్పులుడై, చక్రముగైకొని సుచిత్రునిపై కురికెను. కాని సుచిత్రు డా కృష్ణుని పాదములు గ్రహించి భక్తితో పూజించుట కుపక్రమించగా కృష్ణు డాతని తన్నెను. వెంటనే సుచిత్రు డాగ్రహముతో శ్రీకృష్ణుని చక్రము నడ్డుకొని, బంధించి, వృక్షమునకు కట్టివైచి, క్రతుహయమును గైకొని రత్నపురికి వెడలిపోయెను. ఈ లోపల అర్జునుడు మూర్ఛదేరి శ్రీకృష్ణుని వెదకికొనుచు వచ్చి, యాతని దుస్థితి చూచి పాదములపై బడి క్షమింపుమని ప్రార్థించెను శ్రీకృష్ణుని కట్లు విప్పి తన యసమర్థతకు సిగ్గుపడి, యెట్లైనా యాగాశ్వము తెప్పించి ధర్మరాజు యాగము నిర్విఘ్నముగా కొనసాగింపుమని కృష్ణుని ప్రార్థించెను. శ్రీకృష్ణు డర్జునునితో రత్నపురిలో ప్రవేశించెను.

కృష్ణార్జునులు విప్రవేషములతో రత్నపురి రాజమార్గములో సంచరించుచు యా పట్టణములో గల జనులందరు భగవద్భక్తులని గ్రహించిరి. వేశ్యావిటులు గూడా సురతసమయమున భగవానుని ప్రార్థించుట విని యాశ్చర్యపోయిరి

మరునా డుదయము స్నానానుష్ఠానములు ముగించుకొని, మయూరధ్వజుడు యజ్ఞ వాటికలో నుండగా విప్రరూపములోనున్న శ్రీకృష్ణుడు ఆ రాజు నాశీర్వదించెను మయూరధ్వజు డా బ్రాహ్మణులకు అతిథిమర్యాద లొనరించి వారి రాకడకు కారణ మడిగెను. మాయావిప్రుడగు శ్రీకృష్ణుడు తన కుమారుని అడవిలో సింహము పట్టినదనియు, ఆతనిని వదలవలయుననినచో మయూరధ్వజుని శరీరములో సగభాగ మాతని సతీసుతులచే రంపముతో కోయించి తెచ్చి యిచ్చినచో యా విప్రబాలకు నొదలుదునని సింహము పలికినదనియు చెప్పి తన కుమారునకు ప్రాణదాన మొసంగవలెనని రాజుతో ప్రాధేయపడెను. రాజందులకు సమ్మతించి, భార్యను కుమారుని తన శరీరమును రంపముతో కోయుడని యాజ్ఞాపించెను. సుచిత్రుడు తానే యాసింగమున కాహారమగుదుననియు, నకులధ్వజు డీ మాయావిప్రుని మాటల కంగీకరించకూడదనియు పలికిరి. కాని ధర్మాత్ముడైన రాజు వారిని వారించి తన శరీరమును కోసి యివ్వవలయునని భార్యకు, కుమారున కుపదేశించెను. శ్రీకృష్ణుడు రాజును నిష్ఠురములైన మాటలతో వేధించుచుండగా రాజు శరీరమును భార్య కుముద్వతి, కుమారుడు సుచిత్రుడు కోయుట కుపక్రమించిరి. ఆయన దాతృత్వమునకు మెచ్చి కృష్ణార్జునులు నిజస్వరూపములతో సాక్షాత్కరించి యా రాజు భక్తిని, దాతృత్వమును వేనోళ్ళ పొగడిరి. రాజుచే యజ్ఞమును పూర్తి చేయించి, యజ్ఞపూజలొంది సంతృప్తులైరి. యాగాశ్వముతో వారిని ధర్మరాజు చేయు యాగమునకు రమ్మని ఆహ్వానించి వెళ్ళుటతో నాటకము సమాప్తమైనది.

## జైమినీభారతములోని కథకు నాటకములో చేసిన మార్పులు

నాటకకర్త జైమినీభారతాంతర్గత కథను గైకొని విస్తరించి నాలుగంకముల నాటకమును రచించెను. జైమినీభారతములో యీ కథ నూరుపద్యగద్యములలో మాత్రమే కలదు. దీనిని నాటకకర్త తనకుగల రచనానుభవమువలన చక్కని ప్రదర్శనకు యోగ్యమైన నాటకమును రచించెను. జైమినిభారతములో పినవీరన అర్జునుని గర్వభంగమను విషయము సూచించలేదు. కాని యీ నాటకములో కవి శ్రీకృష్ణుని ముఖతః గర్వోష్ఠియైన అర్జునునకు గర్వభంగముకొఱకే యీ సన్నివేశము కల్పించినట్లు కవి స్పష్టముగా చూపించెను. జైమినీభారతములో

సుచిత్రుడు శ్రీకృష్ణు నోడించినట్లు కలదు. కాని వృక్షమునకు కట్టివేసినట్లు లేదు ఈ నాటకములో తాను(శ్రీకృష్ణుడు) వృక్షమునకు బంధించబడియుండ అర్జునుడు నిస్సహాయుడై, తన అసమర్థతకు సిగ్గుపడునట్లుగా సన్నివేశము కల్పించి, కవి అర్జునుని స్థితిని మిక్కిలి దైన్యముగ చూపించెను. అర్జునుని గర్వభంగము ప్రధాన విషయము కావున కవి చేసిన యీ మార్పు ఆయనకు గల సమయోచిత ప్రతిభకు తార్కాణము. జైమినిభారతములో మయూరధ్వజుని భార్య కుముద్వతి తన శరీరమును సింగమున కాహారముగా నిత్తునని ముందుకు వచ్చును. కాని యీ నాటకములో కవి కుముద్వతితో యిట్టి వాక్యములురానీయలేదు. జైమినిభారతకర్త, యీ నాటకకర్త ఉభయులు కూడా కుముద్వతి కొసంగవలసిన ప్రాధాన్యము నొసంగలేదనియే చెప్పవలయును.

నాటకములోని చతుర్థాంకములో విప్రవేషములోగల శ్రీకృష్ణుడు మయూరధ్వజుని శరీర అర్ధభాగము కోయించుసందర్భమున, అడుగడుగున అనవసరముగా నిందించు ఘట్టము బలిజేపల్లి లక్ష్మీకాంతకవి విరచితమైన సత్యహరిశ్చంద్ర నాటకములోని విశ్వామిత్రుడు హరిశ్చంద్రుని రాజ్యము గైకొని, నక్షత్రకుని ద్వారా అప్పుకు వేధించునపుడు కల్పించిన ఘట్టమును పోలియున్నది. దీనినిబట్టి బలిజేపల్లి లక్ష్మీకాంతకవిగారి రచనాప్రభావ మీ కవిపై గలదనుట నిర్వివాదాంశము. ఈ నాటకమునందు కవి కొన్ని పద్యములను భారతభాగవతాదులలోని పద్యముల ఒరవడిలో వ్రాసిన ట్లీ క్రింది పద్యములవలన తెలిసికొనవచ్చును.

[1]"సీ॥ తరుణులముందు తైతక్కలాడుటగాదు
రిపులతో సంగరక్రీడగాని
వీనుల కింపైన వీణారవముగాదు
భయదమౌ శింజినీస్వనముగాని
మేటి శూరుడవని మాటలాడుటగాదు
శరములన్ విడుచు కౌశలముగాని
నర్తనంబొనరింప నాట్యరంగముగాదు
పోరుసల్పెడు యుద్ధభూమిగాని

1. సుచిత్రాభ్యుదయము. తృ. అం. 43 పుట.

గీ॥ పేడివాడవు నీ వేడ వీరలోక
వినుతబలశౌర్యవిక్రమాన్వితసుచిత్ర
కరవినిర్ముక్తసాయకోత్కరవిదార
పటిమ సైరించుటది యేడ పార్థ నీవు."

1"సీ॥ ఎవ్వాని సాయకం బెవ్వేళ పరిపంథు
లకు ప్రక్కబల్లెమై లక్ష్యముంచె
ఎవ్వాని చూపు లెవ్వేళ శాత్రవులకు
నగ్ని కణంబులై యతిశయిల్లె
ఎవ్వాని చాప మూర్వీనాథకోటికి
కాలోరగముభంగి గానుపించె
ఎవ్వాని వాక్యంబు లీ పాండుపుత్రుని
గుండెలో పిడుగులై గోడుపటిచె

గీ॥ అట్టి భూరిప్రతాపవీరాధివీరు
డగు సుచిత్రుండు నిర్జించె నాజి మమ్ము
దానసత్యవ్రతానూనజ్ఞానభక్తి
గలిగి మమ్ముల నిప్పుడు గెలిచి తీవు."

పై పద్యములోని నడక ఆంధ్రమహాభారతములోని "ఎవ్వాని వాకిట నిభ మదపంకంబు........మర్త్యుడే ధర్మసుతుడు"[2] అను పద్యమును పోలియున్నది. మహాకవుల తిక్కనగారి ప్రభావము సహిత మీ కవిపై గలదని చెప్పవచ్చును. మహాకవుల ప్రసిద్ధరచనలు చదివి వారి ఒరవడిని గ్రహించి తన ప్రతిభకు వ్యుత్పత్తిని చేర్చి రచనావ్యాసంగము కొనసాగించుట కవులకు సర్వసామాన్యము. వారివారి ప్రతిభా వ్యుత్పత్తుల ప్రభావము వారి రచనలలో కొట్టవచ్చినట్లు కనిపించును. ఈ నాటక కర్త కూడా యిందు కతీతుడు కాడు. పై రెండు పద్యములు భాగవత, భారతాది పద్యములను పోలియున్నను కవి తన ప్రత్యేకరచనాశిల్పము చొప్పించినాడని చెప్పవచ్చును.

1. సుచిత్రాభ్యుదయము తృ. అం. 44 పుట.
2. ఆంధ్రమహాభారతము. విరాటపర్వము, ద్వి. ఆ. 191 పద్యము

పాత్రపోషణ

సుచిత్రాభ్యుదయము నాటకములో నాయకుడు సుచిత్రుడు. ఇతనికి మరియొక పేరు తామ్రధ్వజుడు. రత్నపురిరాజైన మయూరధ్వజుని కుమారుడు నాటకములో యుద్ధరంగమందు అర్జునాదు లీతనిని కుమారా, బాలకా, క్షీరకంఠా యని సంబోధించుటచేత నీతడు పిన్నవయస్కుడైనను, మిక్కిలి పరాక్రమవంతుడు. ధైర్యశాలి, శ్రీకృష్ణభక్తుడు, పౌరుషవంతుడు, సద్గుణరాశి.

సుచిత్ర నకులధ్వజు లిరువురు రత్నపురి బాహ్యారణ్యప్రాంతములో సంచరించుచుండగా ధర్మజుని యాగాశ్వము వచ్చెను. మొదట దాని ముఖపత్రము నందుగల బిరుదఫలకము చూచి అందు[1] ధర్మరాజు అశ్వమేధయాగము చేయుటకు యాగాశ్వము నొదలినాడనియు, దాని రక్షకుడుగా నిటలాక్షుని గెలిచిన ధనంజయుడు వచ్చుచున్నాడనియు ధాత్రిలో పరాక్రమవంతులున్నచో యాగాశ్వము పట్టవలయుననియు కలదు. నిటలాక్షుని గెలిచిన జోదు అర్జునుని పేరు విని భయపడవలయునని బిరుదఫలకముండెను. కాని సుచిత్రు డీ ఫలకము చూచి రెచ్చిపోయి, తన ప్రతాపము చూపింతునని యశ్వమును బంధించెను. ఈ సందర్భమున బాలుడగు సుచిత్రుడు నకులధ్వజునితో పలికిన పలుకు లాతని ఆత్మస్థైర్యమునకు తార్కాణము. "సరసిలో చేరి మదగజంబు పద్మనాళముల బెరికినట్లు నేను పాండవసైన్యమును చికాకుపరచి యా విజయుని కూల్తునని" పలికెను. మాటల లోనే గాక చేతలలోగూడా తనశక్తి సామర్థ్యము లన్నియు ప్రదర్శించెను.

తృతీయాంకములో సుచిత్రునితో పోరాడి అర్జునుడు మూర్ఛపోయెను. శ్రీకృష్ణు డడ్డుపడి సుచిత్రుని యుద్ధమునకు ప్రేరేచును. కాని సుచిత్రు డాతని పదములపై వ్రాలి 'పాహి మాం' అని భక్తిపురస్సరముగా పూజించును. శ్రీకృష్ణుడు పరుషవాక్యములాడుచు పౌరుషహీనుడవనియు, రణభీరుడవనియు, పలికినను తనకుగల భక్తితో సుచిత్రు డా పరమాత్మని లోకారాధ్యుడవగు నీవేడ

1. ఉ॥ "దుర్జయరాజమండలవిధుంతుదమూర్తి యుధిష్ఠిరక్రతుం .... .... .... రయంబున ధాత్రి గల్గినన్" జైమినిభారతము 7 ఆశ్వాసము 148 పద్యము సుచిత్రాభ్యుదయము ప్ర. ఆ. 8 పుట ఈపద్యమే

బాలకుండనగు నేనేడ యని పలికి యెందరో తాపసులు ఎండవాననక తపస్సు చేసినను లభించని శ్రీకృష్ణదర్శనము తన కింత సులభముగా లభించినదని, తన జీవితము ధన్యమైనదని భావించి, తా నింక యుద్ధము చేయనని, విజయము కోరనని ప్రాధేయపడెను. ఈ సందర్భమున నాటకకర్త వీరుడైన సుచిత్రుని పరమభక్తునిగా తీర్చి దిద్దెను. ప్రాణభయముచే తన్ను శరణుకోరినాడని కృష్ణుడా సుచిత్రుని పాదతాడనము చేయగా, వెంటనే క్రోధముచే ధనుష్టంకారము చేయుచు శ్రీకృష్ణునంతవాని నోడించి, బంధించిన పరాక్రమశాలి. ఈ సందర్భమున శ్రీకృష్ణుని ఘనకార్యము లన్నింటిని చులకనగా పొట్లాడుటకు సందేహించని ధీవిశారదుడు.[1]

చతుర్థాంకములో శ్రీకృష్ణార్జునులు విప్రరూపములో తన తండ్రి మయూరధ్వజుని అర్థశరీరము రంపముతో కోసి యిచ్చునపుడు సుచిత్రుడు తన శరీర మా సింగమున కాహార మొసంగుదుననియు, "యో వై పితా సా పుత్రా" యను ప్రమాణము ననుసరించి, తన తండ్రికి బదులు వచ్చి విప్రకుమారుని ప్రాణములు కాపాడుదునని ముందుకొచ్చిన త్యాగబుద్ధి కలవాడు త్యాగనిరతిలో తండ్రికి తగిన పుత్రునిగా సుచిత్రుని పాత్ర నీ నాటకకర్త అద్వితీయముగా పోషించెను.

ప్రాధాన్యత ననుసరించి అర్జునుని పాత్రను యీ నాటకములో కవి మిక్కిలి గర్విష్ఠిగా చిత్రించినాడు. అందుకే జైమినీభారతకథాంతర్గత వస్తువునకు కవి అదనముగా అర్జునగర్వభంగ విషయమును చేర్చినాడు. ప్రథమాంకములో అర్జునుడు గతములో తన ఘనవిజయములకు శ్రీకృష్ణుడే కారణమని నుడివెను. కాని శ్రీకృష్ణుడు తాను నామమాత్రసహాయమే చేసినానని పాండవుల పరాక్రమమే, ముఖ్యముగా అర్జునుని అస్త్రవిద్యానైపుణ్యమే వారి విజయములకు

---

1. "పాలీయ వచ్చిన పడతి కూల్చుటగాదు, చిదుక ద్రొక్కగ నీటి చిలువగాదు
....... ........బీరమేటికి ద్వారక చేరబొమ్మ."

"కంసభీతికి ద్వారకాపురంబున గొల్లపిల్లల జతగూడి పెలసినావు ........
చెప్పుకొననేల నీ వృత్తి సిగ్గుచేటు"

సుచిత్రాభ్యుదయము తృ. అం. 48, 49, 50 పుటలు

కారణమని నుడివెను. అప్పటికే విజయునికి గర్వ మెక్కి మీసము మెలివేయుచు,[1] భీష్మాది కురువీరుల జయించుట తనకు తప్ప యితరులకు సాధ్యము కాదనియు, హయమేధ మొనరించుట దానిని బంధించిన రాజుల గెలుచుట, సామంతరాజులచే కప్పములు గొనుట యితరులకు సాధ్యము కాదనియు, పరాక్రమములో, దైవ భక్తిలో తనకు మించినవారు లేరనియు ప్రగల్భములు పలికెను. అపుడే శ్రీకృష్ణునకు అర్జునగర్వభంగము కలిగించవలయునని సంకల్పము కలిగెను. తన పరాక్రమము గురించి అపరిమితవిశ్వాసము కలిగిన అర్జునుడు యాగాశ్వమును బంధించిన సుచిత్రునితో యుద్ధమునకు ముందు చాలా తేలికగా భాషించెను. యుద్ధములో సుచిత్రునిపై ప్రయోగించిన దివ్యాస్త్రములన్నియు నిష్ప్రయోజనమైనపుడు మాత్రమే అర్జునునకు గర్వభంగమై కనువిప్పుకలిగినది. ఈ సందర్భమున కృష్ణుడు యాగాశ్వములేకుండా ప్రాణములతో కరిపురి పోవుదమనినపుడు అర్జునుడు నిస్సహాయుడుగా సిగ్గుపడి, తన శక్తి భగవచ్ఛక్తిముందు నిరర్థకమను వాస్తవము గ్రహించెను. ఎట్లైన యాగాశ్వము నిప్పించి అశ్వమేధము పూరించుమని శ్రీకృష్ణుని ప్రాధేయపడెను. ఈ ఘట్టములో ఎంత గొప్పవారికైనా గర్వము పనికిరాదనియు, గర్వమువలన అనర్థములు సంభవించుననియు, భగవంతుని నమ్మినవారికి సర్వకార్యములు సఫలీకృతములగుననియు, నాటకకర్త చక్కని సందేశ మొసంగెను. మానవులకు గర్వము కలిగినపుడు భగవంతుడు వారికి తగినవిధముగా గర్వభంగము గావించునను విషయ మిచట నిర్ధారించెను.

నాటకములో శ్రీకృష్ణుని పాత్రను కవి మిక్కిలి ప్రతిభావంతముగా పోషించెను. మాయామానుషవిగ్రహునిగను, భక్తపరాధీనుడుగను, ధర్మరక్షకుడుగను, అఘటనాఘటనసమర్థుడుగను కవి యీ భగవానుని పాత్రను చిత్రించెను. ప్రథమాంకములో అర్జునుడు గర్వముతో విఱ్ఱవీగుచు పలికిన వీరాలాపములకు శ్రీకృష్ణుడు సుచిత్రునితో అర్జునునకు యుద్ధము కల్పించి, యందు ఓటమిని చవిచూపించెను. భక్తపరాధీనుడగుటకు తృతీయాంకములో సుచిత్రునితో నర్జునుడు

---

1. "భీష్మాదికురువీరవితతిని రణములోపల జంపు టన్యుల కలవియగునె
...... అన్యుల కబ్బునే కంసవైరి"

సుచిత్రాభ్యుదయము ప్ర. అం. 3, 4 పుటలు

మూర్ఛపోయిన తరువాత బాణాసనము చక్రము గైకొని తానే సుచిత్రునితో యుద్ధము చేయును. ఈ సందర్భమున తాను వేసిన దివ్యాస్త్రములన్నియు సుచిత్రుని మెడలో పూలమాలలగుట చూడగా భగవంతుడు భక్తుల కెపుడు మేలే గాని కీడు చేయలేడనుట సువిదితమగుచున్నది. తుదకు చక్రాయుధముతో సుచిత్రునిపై కురికి అతనిచే బంధితుడై వృక్షమునకు కట్టివేయబడెను. ఈ సన్నివేశము మనకు భగవంతుడు భక్తపరాధీనుడను విషయము స్పష్టము చేయుచున్నది. పిదప అర్జునుడు యాగపరిసమాప్తము చేయుటకొరకు శ్రీకృష్ణుని ప్రార్థింపగా. విప్రవేషములు దాల్చి అఘటనమును ఘటించునట్లుగా, మయూరధ్వజుని అర్ధ శరీరము దానము గైకొని, భక్తుడైన ఆ రాజును పరీక్షించి, రాజు భక్తికి మెచ్చి, యాతనికి సర్వశుభములొనగూర్చి, యాగము పూరించి, పార్థుని యాగాశ్వమును గ్రహించి సఫలీకృతుని గావించెను. ఇట్టి అనూహ్యమైన కార్యములు సాధించుట భగవంతునికితక్క సామాన్యులకు సాధ్యము కాదను సందేశ మీ ఘట్టములో కవి యొసంగెను.

ఈ నాటకములో మయూరధ్వజుని పాత్ర చతుర్థాంకములో మాత్రమే యున్నది. కాని నాటకములో యీ పాత్ర తలమానికమువంటిది. రత్నపురి పాలించు యీ రాజు పరాక్రమవంతుడేగాక త్యాగశీలి. ఈ రాజు సామంతరాజులను గెలిచి హయమేధము చేసెను. శ్రీకృష్ణభక్తుడు అతిథిసేవాపరాయణుడు. అడిన మాట తప్పని సత్యసంధుడు. చతుర్థాంకములో యజ్ఞశాలయందుండి సుచిత్రుని విజయము తెలిసికొని అభినందించెను. కాని శ్రీకృష్ణుని బంధించినందుకు దుఃఖించి,[1] ఎవరి గుఱించి యజ్ఞముచేయుచున్నామో ఆ పరమాత్ముని బంధించి చేయరాని పాపము చేసినావని కుమారుని నిందించును. భుజబలమువలన అపకృత్య మాచరించుట తగదని గర్హించెను. మందభాగ్యుడవై అజ్ఞానాంధకారమున యుక్తాయుక్తములు తెలియని మూఢుడవైతివనియు, అపవిత్రుడవై పవిత్రసవనాలయమున నుండతగదని వెడలనంపెను.

1. మ॥ 'క్రతుపూజార్హుని దుష్టదైత్యజనగర్వధ్వంసు........దోర్గర్వంబు నీ కొప్పునే" సుచిత్రాభ్యుదయము చ. అం. 65 పుట

శ్రీకృష్ణుడు మాయావిప్రునిరూపములో తన కుమారుని సింహము పట్టుకొనినదనియు, వానిని విడిపించుటకు మయూరధ్వజుని సహాయము కావలసి వచ్చినదనియు అర్థించెను. ఆ రాజు తన ప్రాణమైన నొసంగి విప్రకుమారుని కాపాడుదునని మాటనొసంగెను. మాయావిప్రుడు తన కుమారుని వదులుటకు మయూరధ్వజుని శరీరార్ధభాగము ఆతని సతీసుతులు రంపముతో కోసి యొసంగిన సింగము విప్రకుమారుని వదలునను షరతుకు రాజంగీకరించెను. సుచిత్రుడు, నకులధ్వజు లడ్డుచెప్పినను వినక యర్ధశరీరమును దానమొసంగిన వదాన్యుడు. భార్య కుముద్వతి కుమారుడు సుచిత్రుడు రంపముతో తన శరీరము కోయు సందర్భమున రాజు చేతులు జోడించి హరినామస్మరణ చేసినతీరు శ్లాఘాపాత్రము[1] మాయావిప్రునదలింపుతో సతీసుతులు రంపముతో రాజు శరీరము గోయు సందర్భమున రాజు కుడికంట కన్నీరు వచ్చెను. దీనికి రాజు తలవంచుకొని విచారపడుచుండెను. ఇది గమనించిన విప్రరూపములోనున్న కృష్ణుడు రాజును నిందించి, దుఃఖముతో విధిలేక నొసంగు దానము దానముకాదనియు ఇట్టి దానము సింగము గ్రహించదనియు పరుషములాడి, యాగ్రహముతో వెడలిపోవుచున్న విప్రునితో మయూరధ్వజు డాడిన మాట లాతని సత్యసంధతకు, త్యాగశీలమునకు, విశేషించి నాటకమునకే తలమానికమువంటిదని చెప్పినచో అతిశయోక్తి కానేరదు. మయూరధ్వజుడు చేతులు జోడించి క్షమాపణ గోరుచు, తన మనవి యాలకించవలసినదని ప్రాధేయపడిన విధ మిట్లున్నది.

"[2]మ॥ అపకారం బొనరింపలే దిట మహాత్మా నా శరీరంబులో
నపసవ్యాంగము దానయోగ్యమయి సవ్యాంగంబు గాకున్న దుః
ఖపడెన్ అంపముకాటుకైన నిరువంకల్ భాష్పముల్ రావె స
త్కృప నీ భాగము గైకొనందగును పృథ్విన్ గృష్ణశర్మాహ్వయా"

శ్రీకృష్ణుని యాగ్రహమునకు బదులుగా మయూరధ్వజుడు తన కుడికంటి నుండి కన్నీరు వచ్చుటకు కారణము తాను ప్రాణత్యాగమునకు భయపడి

---

1. మ॥ "హరి నారాయణ కేశ వాచ్యుత నృసింహా శౌరి దామోదరా.........
మాం పాహి దీనావనా" సుచిత్రాభ్యుదయము చ. అం. 78 పుట
2. సుచిత్రాభ్యుదయము చ. అం. 79 పుట

దుఃఖించుట లేదనియు, తన శరీరములోని అపసవ్యాంగమైన సగభాగము దానమునకు యోగ్యమై, మిగిలిన సగభాగము సవ్యాంగము దానయోగ్యము కాకపోవుటచే విచారము కలిగి, యీ సవ్యభాగములోగల కుడికంటినుండి నీరు వచ్చుచున్నది. కాని వేరు కాదనియు, ఒకవేళ తనకు ప్రాణముల మీద తీపియుండి, భయమున్నచో రెండు కన్నులనుండి కన్నీరు రావలసియుండుగాని; అట్లు రాకపోవుట తన కుడిభాగమునకు విచారహేతువై కుడికంటినుండి మాత్రమే నీరు వచ్చుచున్నదని సహేతుకముగా నొప్పించి, మాయావిప్రుని శాంతునిచేసిన మహాత్యాగశీలి. ఈ సన్నివేశములో మయూరధ్వజుని త్యాగశీలత శిబి, దధీచుల త్యాగమును సహితము మించునట్లగ నాటకకర్త మిక్కిలి నైపుణ్యముతో తీర్చిదిద్దెను. ఈ నాటకములో యిది విశేషాంశము. ఇట్టి సన్నివేశములు సామాన్యముగా నాటకములలో చాలా అరుదుగా కన్పించును. ఈ ఘట్టములో కవి ప్రదర్శించిన ప్రతిభ అద్వితీయమైనదని ఘంటాపథముగ చెప్పవచ్చును. ఈ నాటకములో స్త్రీపాత్రలలో కుముద్వతి పాత్ర యొకటి కలదు. కాని యీ పాత్రకు నాటకములో యెట్టి ప్రాధాన్యము కనిపించదు. కావున స్త్రీపాత్రపోషణగురించి పరిశీలించలేదు. మిగిలిన పాత్రలకు ప్రాధాన్యము లేకపోవుటచేత యీ పాత్రపోషణ చర్చ ముగించనైనది.

## రస పోషణ

నాటకములో అంగిరసము వీరము. భక్తి, కరుణ, బీభత్సములు స్వల్పముగానున్నవి. నాటకములోని మొదటి మూడంకములలో వీరరసమును కవి చక్కగా పోషించెను. ధర్మరాజు యాగాశ్వముఖఫలకము చూచినదాదిగా సుచిత్ర నకులధ్వజులు పౌరుషముతో నా హయమును బంధించిరి. ఆ క్రతుహయవిముక్తి చేయుటకు మొదట హంసధ్వజ, నీలధ్వజులు సామముతో ప్రయత్నించి విఫలులైరి. తప్పనిసరి వీరికి సుచిత్ర, నకులధ్వజులతో సంగరమొనర్పవలసివచ్చెను. నీలధ్వజుడు సుచిత్రునితో శ్రీకృష్ణార్జునుల పరాక్రమముల నుగ్గడించునపుడు, సుచిత్రు డాశ్చర్యముతో వారి పరాక్రమమును పొగడుటకు నీ నాలికొకటి చాలదు. దానిని వేయి చీలికలు చేసినచో వేయి విధముల పొగడవచ్చునని ఆక్షేపించెను. బాలురని తమ మీద కనికరము చూపించవలదని పోరక రణరంగములో నిలచిన పోరిగొందుననుచు వీరాలాపములాడెను. ఈ సమయమున నకులధ్వజుడు హంస

ధ్వజునితో పోరుచు,[1] ఊరక యంత్రపు బొమ్మల మాదిరి దివ్యాస్త్రములు ధరించి యుద్ధభూమిలో నిలుచుండుట రణధర్మము కాదనియు, దేహమశాశ్వతమనియు, వ్యర్థప్రలాపములు చేయక యుద్ధములో పారక నిలిచినచో తనపరాక్రమము జూపింతుననియు వీరాలాపములు పలికి భీకరయుద్ధ మొనర్చెను. సుచిత్ర నకుల ధ్వజులు హంసధ్వజ, నీలధ్వజులను యుద్ధములో బాణవర్షముచే మూర్ఛపుచ్చిరి

ద్వితీయాంకములో అర్జునుడే స్వయముగా సుచిత్రునితో యుద్ధమునక తలపడ నుకింపగా బభ్రువాహను డడ్డువచ్చి, " ఊరబిచ్చుకపై బ్రహ్మాస్త్రమా యని తానే యా బాలుని రూపడంచి హయమును గొనివత్తునని వీరాలాపములాడి వృషసేనునితో కలిసి సుచిత్ర నకులధ్వజుల నెదుర్కొనెను. బలముగలదే యుద్ధ మొనర్పుము లేనిచో ధనుంజయునకు తురగ మప్పగించి శరణాగతి పొంద మని బభ్రువాహను డాడిన మాటలకు సుచిత్రుడు క్రోధారుణనేత్రములతో సిం మును శ్వానము బట్టనుంకించునట్లుగా బభ్రువాహనుడు తనతో యుద్ధము చేయు యని యెకసక్కెములాడుచు, వాడి బాణములతో బభ్రువాహనుని నొప్పించె బభ్రువాహనుడు అగ్రహోదగ్రుడై దివ్యాస్త్రములు ప్రయోగించి సుచిత్రుని చిక్కు పరచెను ఈ సందర్భములో సుచిత్రుడు సక్రోధమున చేసిన శపథ మా వీ గ్రేసరుని పౌరుషమునకు మచ్చుతునకవంటిది. [2]జలనిధు లింకినను, కులశైలము క్రుంగినను, తారలు రవిచంద్రులు భూమిపై రాలినను, ఇంద్రాదిదేవత లా బభ్రు వాహనునకు సహాయము వచ్చినను, అతని తల దుగ్ధింతునని వీర ముట్టిపడున శపథ మొనరించెను. ఈ సందర్భమున కవి సుచిత్రుని వీరమును ప్రదర్శించి తీరు మహోన్నతముగా నున్నది. ప్రపంచములో యే శక్తులడ్డుపడినను బ వాహనుని తననుండి కాపాడలేరని ప్రతిన చేయుట సామాన్యయోధునికి సాధ్యః

1. మ॥ అరయన్ యంత్రపు బొమ్మరీతిగను దివ్యాస్త్రముల్ దాల్చి.......... సంగరకళాలక్ష్యంబు జూపించెదన్"

సుచిత్రాభ్యుదయము ప్ర. అం. 16 ష

2. జలనిధు లింకుగాక కులశైలము లేడును గ్రుంకుగాక........ .. నీ శిరః దుగ్ధింతును నేడిదె చూడు నీచుడా"

సుచిత్రాభ్యుదయము ద్వి. అం. 25, 26 పుట

కాదు. ఎంతో ఆత్మవిశ్వాసము, సాహసము గల వీరునికి మాత్రమే యిట్టి ప్రతిన బూనుట సాధ్యము ప్రతిన నెరవేర్చుకొనుటలో గూడా సుచిత్రుడు వీరత్వమును ప్రదర్శించి బభ్రువాహనునేగాక వృషసేన, ప్రద్యుమ్నాది పాండవవీరులందరి నోడించెను.

సుచిత్రార్జునులు ద్వంద్వయుద్ధమునకు తలపడిరి. అర్జునుడు తన పరాక్రమము నుగ్గడించుకొని, బాలుడవు యుద్ధములో తనముందు నిలువలేవని చెప్పి యాగాశ్వ మొసంగి ప్రాణములు కాపాడుకొనుమని నచ్చచెప్ప ప్రయత్నించెను. కాని సుచిత్రు డాతని వీరకృత్యములన్నియు హరిసహాయమున చేసినవేకాని, పార్థుని సొంతబలమువలన కాదని యాక్షేపించి పోరునకు సిద్ధమయ్యెను. యుద్ధములో వీరు లొకరి నొక రాక్షేపించుకొను సన్నివేశమున చాలావరకు భారతయుద్ధములో యోధు లాక్షేపించుకొను ఘట్టములను కవి అనుకరించినట్లు కనిపించుచున్నది. ధనుంజయుడు వేసిన దివ్యాస్త్రము లన్నింటిని మార్గమధ్యమున త్రుంచి మార్గణము లాతనిపై గుప్పించు చుండెను. చివరకు పార్థుడు ప్రతిజ్ఞచేసి వదలిన బాణము సహితము నిష్ఫలమయ్యెను. ఈ సందర్భమున పార్థుడు తన బాణము సూర్యచంద్రగతులు తప్పినను జలనిధులింకినను శత్రువును హతమార్చునని పలికెను. కాని సుచిత్రుడా బాణమును ఖండించి తాను తండ్రి యాజ్ఞ జవదాటనివాడనేని సత్యవ్రతుడనేని వాసుదేవుని యందు భక్తిగలవాడనేని యా బాణము తప్పక విజయుని గూల్చునని ప్రతిన చేసి వదలెను. అనుకొన్నట్లుగనే యా వాడియాశుగమునకు పార్థుడు మూర్ఛిల్లెను. ఈ యుద్ధఘట్టమున నాటకకర్త వీరమును సమయోచితముగా పోషించెను. ఈ ఘట్టములో భారతయుద్ధవర్ణన ప్రభావము కవిపై మిక్కుటముగా నున్నదనుట స్పష్టము. యుద్ధవీరము వర్ణించుటలో కవి ప్రదర్శించిన ప్రతిభ మిక్కిలి శ్లాఘనీయము. వీరరసమును పోషించుటలో తిక్కనగారి ప్రభావ మీ కవిపై బడినది.

ఈ నాటకములో భక్తి కరుణరసము లొకదానివెంట నొకటి పోషింపబడినవి. శ్రీకృష్ణార్జునులు మాయావిప్రుల రూపములో రత్నపురియందు సంచరింతురు. ఈ సందర్భమున పట్టణములోగల గృహమేధులు సతతము వాసుదేవ ధ్యాన మొనర్చుటయు, వేశ్యలు విటులు సురతసమయమున భగవానుని నామో

చ్చారణము చేయుట కృష్ణార్జునులు చూచిరి. పట్టణములో ఎచట చూచినను హరి భక్తి తాండవించుట వారు కనుగొనిరి. ఇందుకు కారణ మా పురి పాలించు రాజు దైవభక్తి కలవాడగుటయే యని నిర్ధారించిరి. అట్టి రాజును పరీక్షించదలచి యజ్ఞ శాలకు వెళ్ళి ఆశీస్సులొసంగిరి. రాజు అతిథిపూజ లొనర్చి వారి కేమి కావలయునో కోరుకొమ్మనెను. ఈ సందర్భమున రాజు అభ్యాగత స్వయం విష్ణు వను సామెత ననుసరించి, వారిని దైవాంశసంభూతులని పూజించెను. కృష్ణు డాతని అర్ధశరీర మును సింగమున కొసంగవలయుననినపుడు రాజు నిశ్చింతగా తన యర్ధశరీరము నాతనికి ధారపోసినవిధము రాజునకు సత్యవ్రతముపై, త్యాగశీలతపై నున్న విశ్వాసమునకు తార్కాణము. ఈ సందర్భమున తన అర్ధశరీరము హరిహరాం భుజభవ, సూర్యచంద్రులసాక్షిగా ధారవోసి సర్వం శ్రీకృష్ణార్పణమస్తు[1] అనెను. ఈ సన్నివేశమున మయూరధ్వజునికి భగవానునియందున్న భక్తి తలమానికముగా నాటకకర్త చే పోషింపబడినదనినచో అతిశయోక్తి కానేరదు. సుచిత్ర నకులధ్వజు లీ యర్ధశరీరదానమున కడ్డుపడినను, రాజు వారిని వారించి తన భార్య దాన తీర్థముతో కృష్ణుని పాదములు కడిగిన భక్తితత్పరుడు.

ఈ సందర్భమున మయూరధ్వజుడు శ్రీకృష్ణునకు తన శరీరార్ధమును దానమొసంగినపుడు మాయావిప్రుని రూపములోనున్న కృష్ణు డా రాజును పరీక్షించినపుడు పాఠకుల మనస్సులో కరుణరస ముప్పతిల్లును. సుచిత్ర నకుల ధ్వజు లా విప్రుని మాటల కడ్డువచ్చినపుడు రాజున కసత్యమిష నాపాదించి విప్రుడు నిందించెను. తరువాత కుముద్వతి సుచిత్రులు రంపముతో శరీరము కోయునపుడు రాజు కుడికన్నునుండి కన్నీరు వచ్చుచుండెను. అది చూచి మాయా విప్రు డా రాజు దాతృత్వాన్ని, సత్యసంధతను కుతర్కముగా నిందించి దుర్భాష లాడెను. ఈ సన్నివేశమున రాజు మానసికక్షోభను చూచిన పఠితలు (ప్రేక్షకులు) ఎంత కఠినహృదయులైనను ద్రవించి కరుణ కలుగును రాజు తన మరణమునకు దుఃఖించుట లేదనియు, అపసవ్యాంగము దానయోగ్యమై, సవ్యాంగము దాన యోగ్యముకానందున కా వైపుననున్న కుడికన్నునుండి నీరు వచ్చుచున్నదని పలికి

1. గీ॥ "హరిహరాంబోజసంభవాద్యమరు లరయ......కృష్ణార్పణస్థితినివిప్ర."
సుచిత్రాభ్యుదయము చ. అం. 73 పుట

నపుడు నాటకకర్త ప్రదర్శించిన ప్రతిభ అమోఘము. కవి యీ సన్నివేశములో కరుణమును పోషించినతీరు మిక్కిలి రమణీయముగా నున్నది. ఈ భావమును సమర్థించినతీరు మిక్కిలి యుక్తియుక్తముగా నున్నది. ఆ తరువాతనే కృష్ణార్జునులు స్వస్వరూపములతో రాజుముందు సాక్షాత్కరించిరి.

నాటకకర్త యీ నాటకములో సంస్కృతాంధ్ర జాతీయములను కుప్పతెప్పలుగా వాడెను. జాతీయములు (సామెతలు) సందర్భోచితముగా వాడుటలో యీ కవికి అసాధారణమైన ప్రతిభావిశేషములున్నవి. దశరూపకలక్షణముల ననుసరించి చూచినచో యీ నాటకములో మిశ్రమలక్షణములు కనిపించుచున్నవి. నాలుగంకములు నాటికాలక్షణములు అత్యధికభాగము అనగా మూడంకములలో యుద్ధమే ప్రధానస్థాన మాక్రమించుటవలనను, నానాభావోపేతమైయుండుట వలనను యీ నాటకములో డిమ లక్షణములు చోటుచేసికొన్నవి. స్త్రీ పాత్రలు అతితక్కువయను నంశము చూచినచో వ్యాయోగ లక్షణము కూడా నున్నది. నాటకము మొత్తముపై నాకేయొకపాత్ర కుముద్వతి. ఈ పాత్రకు ప్రాధాన్యము స్వల్పము. పంచసంధులలో నాలుగే యీ నాటకములో కవి కూర్చెను. ముఖసంధి, ప్రతిముఖసంధి, గర్భసంధి, నిర్వహణసంధులు మాత్రమే కలవు. విమర్శసంధికి నాటకములో అవకాశము లేదు. ఈ నాటకము రచించుటలో నాటకకర్తపై సమకాలీన నాటకకర్తలగు బలిజేపల్లి లక్ష్మీకాంతకవి సత్యహరిశ్చంద్ర నాటకము ప్రభావము అధికముగా కన్పించుచున్నది. పద్యరచనలో కవిత్రయమువారి ప్రభావము పిల్లలమఱ్ఱి పినవీరన ప్రభావము కనిపించుచున్నది.

## శశికళ (నాటకము)

ఆసూరి మరింగంటి వేంకటనరసింహాచార్యులగారి నాటకములలో శశికళ అఱవది. దీనిని కవి క్రి. శ. 1950 లో రచించినట్లును, శ్రీ ఈదర వెంకయ్య, పట్టాభిరామయ్య గారల ద్రవ్యసాహాయ్యమున తరువాత క్రి. శ. 1956 లో ముద్రించినట్లు నాటకారంభమున విజ్ఞప్తిలో నున్నది. ఈ నాటకమును కవి పశ్చిమ గోదావరి జిల్లా చింతలపూడి తాలూకా రంగాపురములో వేంచేసియున్న శ్రీసత్యనారాయణస్వామి కంకిత మొసంగెను.

ఇది నాలుగంకముల నాటకము. కథాంశము దేవీభాగవతమునుండి గ్రైకొనబడినది. నాటకారంభమున కృతి ప్రకాశకుల ప్రశంస చేయుచు, వారి వంశములో గల ప్రసిద్ధ వ్యక్తులను పేర్కొని, వారీ నాటకమును ప్రకటించుటకు చేసిన ధన సాహాయ్యము నుగ్గడించి, వారికి సత్యనారాయణస్వామి ఆయురారోగ్యైశ్వర్యములు ప్రసాదించుగాక యని ప్రార్థించెను. ఈ నాటకము దశరూపకములలో నొకటైన డిమమునకు చెందినది. ఇందు నాయకుడు ప్రఖ్యాతుడు, ఉదాత్తుడుగా నుండును. అంకములు నాలుగు, సంధులు నాలు గుండును. ఈ నాటకములో పై లక్షణములన్నియు నాటకకర్త నిక్షేపించినట్లు స్పష్టముగా కనిపించుచున్నది. ఈ నాటకములో నాంది కలదు కాని ప్రస్తావన లేదు. రంగవిభజన ఉన్నది. స్థూలముగా యీ నాటకమునందలి కథాంశ మిట్లున్నది.

కథాంశము

అయోధ్య రాజు ధ్రువసింధుడు. మంత్రి ధీమంతుడు. రాజు రెండవ భార్య లీలావతి కుమారుడగు శత్రుజిత్తు దుండగముల గురించి మాటాడుకొనచుండిరి. శత్రుజిత్తు దౌష్ట్యములను ధ్రువసింధుడు మంత్రితో చెప్పుచు విచారించుచుండెను. మంత్రి ధీమంతు డా రాకుమారుని దండించి దారిలో పెట్టవచ్చునని రాజు నోదార్చెను. శత్రుజిత్తు ప్రవేశించి వినయముతో తండ్రికి నమస్కరించెను. రాజు మంత్రి శత్రుజిత్తుకు హితోపదేశములు చేసిరి. శత్రుజిత్తుకు వారిపై ఆగ్రహమున్నను పైకి తాను నిర్దోషినని మర్యాదతో పలికెను. రాజు మంత్రి సామంత, దండనాథులతో సభాకార్యక్రమములు నిర్వర్తించుచుండగా, పౌరజనులు తమ కడవిజంతువులవలన కలుగు యాపదలను వివరించి, వానిని చంపకపోయినచో తాము, తమ పశువులు, పంటలు కాపాడుకొనుట సాధ్యముకాదని వేడుకొనిరి. రాజు వారి కభయమొసంగి, మరునాడు క్రూరమృగముల వేటాడుటకు కావలసిన యేర్పాట్లు చేయమని మంత్రి కాజ్ఞాపించి, సభ చాలించి అంతఃపురమున కరిగెను రాజ సౌధమున మనోరమ (రాజు మొదటి భార్య పట్టమహిషి), లీలావతి (రెండవ భార్య) కలిసి మాట్లాడుకొనుచుండిరి. ఇంతలో మహారాజు విచారముతో ప్రవేశించెను. రాణులు రాజు విచారమునకు కారణ మడిగిరి. రాజు ప్రజల ప్రాణములకు, పంటలకు రక్షణ కల్పించుట కరణ్యమునకు వేటకు పోవలసివచ్చినదని

తెలిపెను. పెద్దభార్యయగు మనోరమ రాజుకు వేట సప్తవ్యసనములలో నొకటి కావున వలదని నివారించెను. కాని ప్రజారక్షణయే ధ్యేయముగాగల రాజు వారి కోరికను మన్నింపక వేటకు పోవుటకు నిశ్చయించెను.

అరణ్యములో ధ్రువసింధువు, ధీమంతుడు భటులతో వేటాడుచుండిరి. క్రూరజంతువులను నిర్దాక్షిణ్యముగా చంపుచుండిరి. ఇంతలో నొక సింహము కటాలున రాజుపై బడెను. రాజు ఖడ్గముతో నా సింహము నెదుర్కొనినను, శరీరము గాయములతో నిండి వివశుడై పడిపోయెను. ధీమంతుడు సింగమును పారద్రోలి, రక్తసిక్తాంగుడైన రాజును రథముపై నిడుకొని రాజధానికి తిరిగి వచ్చెను. ఒకవైపు రాజు గాయములనుండి రక్తస్రావమగుచు బ్రతుకుపై ఆశ లేకుండ పరితపించుచుండెను. మరియొక వైపు శత్రుజిత్తు రాజుపై మంత్రిపై గల ద్వేషముతో రాజ్యములో అల్లకల్లోలము సృష్టించుచుండెను.

ధ్రువసింధువుకు రాణులు, ధీమంతుడు రాజవైద్యులచే నుపచారములు చేయించుచుండిరి. కాని మనోవ్యాధికి మందు లేదన్నట్లు శత్రుజిత్తు యాగడముల వలన మహారాజు మానసికశాంతి కోల్పోయి, వ్రణముల బాధచే మృతినొందెను. మనోరమ సుదర్శనులు దుఃఖించుచుండిరి. లీలావతి, శత్రుజిత్తు, యుధాజిత్తు (మేనమామ) రాజ్యము నాక్రమించుటకు కావలసిన కుతంత్రములు పన్నుచుండిరి. ధీమంతుడు సరయూనది ప్రక్కన తిరుగుచు, తన రాజుకు కలిగిన యాపద గురించి చింతించుచు, సుదర్శనునికి రాజ్యము కట్టబెట్టుట కుపాయ మాలోచించుచుండెను. అతడు సూర్యున కర్ఘ్యమిచ్చు సమయమున శత్రుజిత్తు భటులతో ప్రవేశించి, ధీమంతు నకస్మాత్తుగా బంధించెను. ధీమంతు డెంత బ్రతిమాలినను వదలక కారాగారములో నుంచెను. కాలనేమియను యుధాజిత్తు సహచరునికి సుదర్శను నప్పగించి అరణ్యములో వధించి రమ్మని పంపెను. శత్రుజిత్తు యుధా జిత్తు సహాయముతో సింహాసనముపై గూర్చుండి తన ప్రజాపాలనను కొన సాగించెను. కాలనేమి సుదర్శనుని యరణ్యములో శిరచ్ఛేదము చేయనుండగా న డచటికి భారద్వాజమహాముని వచ్చి, సదర్శనుని కాపాడి తన శిష్యులతోపాటు ఆశ్రమములో విద్యాబుద్ధులు గరపుచుండెను.

అంతఃపురములో ధ్రువసింధువు భార్య (పట్టమహిషి) మనోరమ విగత భర్తృకయై దుఃఖించుచుండగా ధీమంతుని బంధించిన విషయము, సుదర్శనుని హతమార్చుటకు చేసిన ప్రయత్నము తెలియవచ్చెను. తా నక్కడనున్నచో శత్రుజిత్తు, లీలావతి తనను గూడా చంపింతురని ఒకనాటి రాత్రి యంతఃపురము బయలువెడలి, అయోధ్య ఎల్లలు దాటి పోయెను.

శత్రుజిత్తు నిష్కంటకముగా రాజ్యముచేయుచుండెను. భటులవలన సుదర్శనుడు భరద్వాజాశ్రమములో ధనుర్విద్య, వేదవిద్యలలో నిష్ణాతుడైనట్లు తెలిసికొని శత్రుజిత్తు యుధాజిత్తు నా సుదర్శనుని చంపుటకు పంపించెను. కాని యుధాజిత్తు జిత్తులా సుదర్శనునిపై పనిచేయలేదు.

ధీమంతుడు చెఱసాలలో విచారమగ్నుడై, విధి బలీయమని తలపోయుచుండెను. రాజు కుటుంబమునకు గలిగిన యాపద తొలగించుటకు ధైర్యముతో చెఱసాలనుండి తప్పించుకొని, సుదర్శనుని తాతయైన వీరసేనుని దగ్గరకు చేరెను. సుదర్శనుడు కాళికాలయములో భక్తిశ్రద్ధలతో మాతను పూజించగా, నా జగదంబ ప్రత్యక్షమై, యాతని కొక అమోఘమైన ఖడ్గము నొసంగెను. శత్రుసంహారిణి యైన నా ఖడ్గమున కెదురులేదని పలికి, యాపదలలో నున్నపుడు తనను ధ్యానించినచో తప్పక సహాయపడుదునని వరమొసంగి యదృశ్యమయ్యెను.

సుదర్శనుడు భారద్వాజుని సెలవు, ఆశీస్సులు గైకొని కాశీరాజపురము వైపు పయనించి, వ్యయప్రయాసల కోర్చి, కాశీపురోద్యానమున విశ్రమించెను. కాశీపురోద్యానమున విశ్రమించెను. కాశీరాజు సుబాహుడు. ఆయన భార్య చిత్రసేన, కూతురు శశికళ వివాహము గురించి స్వయంవరము ప్రకటించిరి. శశికళ చెలికత్తెలతో పురోద్యానవనమున పుష్పముల సేకరించుచు, జలక్రీడలాడి అందు విశ్రమించిన సుదర్శనుని సోయగమున కచ్చెరువొంది యాతడే తన భర్తయని మనములో తలపోసెను. చెలికత్తెల సాహాయ్యమున మేల్కొనిన యా రాజకుమారునితో మాట్లాడి పరస్పరము తమ ప్రేమలు వెల్లడించుకొనిరి. చీకటులలుముకొనుటవలన శశికళ చెలికత్తెలతో అంతఃపురము చేరెను. చిత్రసేన సుబాహులు తమ కూతురు వివాహమై యామెతో సంప్రదించగా, తాను పూదోటలో చూచిన సుదర్శనుని తప్ప మరియొకనిని వివాహమాడనని పలికెను. తల్లిదండ్రు

లామె నిర్ణయము మార్చుటకు ప్రయత్నించి విఫలులైరి. చివరకా దంపతులు తమ కూతురు అభీష్టను నెరవేర్చుట కంగీకరించిరి. సుదర్శనుని సగౌరవముగా నంతఃపురమునకు తోడితెచ్చిరి.

సుదర్శనుడు కాశీరాజు అంతఃపురములో రాజగౌరవము పొందుచుండెను. ఒకనాడు సుదర్శనుడు శశికళ వనవిహారమొనరించు సమయమున నొక మూలుగు వినిపించెను. సహాయముకొఱకు సుదర్శనుడు వెళ్ళెను. ఆ మూలిగిన స్త్రీ ఆయాసముతో నున్న మనోరమ తన తల్లియని తెలిసికొని, సముచితగౌరవముతో తోడ్కొని, అంతఃపురములో సకలోపచారములు చేయించుచుండెను. తల్లీ కొడుకులు చివరకీ విధముగా కలిసికొనినందులకు భగవంతునికి కృతజ్ఞత లర్పించిరి.

అయోధ్యనుండి శత్రుజిత్తు యుధాజిత్తు శశికళ స్వయంవరమునకు ససైన్యముగా వచ్చిరి. సకలరాజన్యులు స్వయంవరమునకు వచ్చినను, సుబాహుడు శశికళను సుదర్శనున కిచ్చి వివాహము చేయుట తమను వంచించుటయే యని, శత్రుజిత్తు సామంతులతో కలిసి సుబాహునిపై యుద్ధము ప్రకటించెను. వీరసేనుడు ధీమంతు డీ విషయము తెలిసికొని, ససైన్యులై సుబాహునకు, సుదర్శనునకు బాసటగా వచ్చిరి. ఉభయసైన్యములు భీకరముగా పోరాడెను. వీరసేనుడు యుధాజిత్తును చంపెను. సుదర్శనుడు కాళికాదేవిని ప్రార్థించి, ఖడ్గముతో వీరవిహార మొనరించెను. శత్రుజిత్తు పిరికిపందయై సుదర్శనుని పాదములపై బడి ప్రాణభిక్ష నర్థించెను. సుదర్శనుడు శత్రుజిత్తును క్షమించి విడిచిపుచ్చెను శశికళాసుదర్శనుల వివాహము తరువాత అందరు కలిసి అయోధ్య కరిగిరి. సుదర్శనుడు పట్టాభిషేకము చేసుకొనినపుడు భారద్వాజముని వచ్చి ఆశీర్వదించుటతో నాటకము సమాప్తమయ్యెను.

'శశికళ' నాటకేతివృత్తము దేవీభాగవతము నుండి గైకొనబడినది. కావున దేవీభాగవతాంతర్గత కథకు నాటకకర్త చేసిన మార్పులు, వీని వైశిష్ట్యము పరిశీలింపబడుచున్నవి.

## కథాంశములో మార్పులు

1. దేవీభాగవతములో ధ్రువసింధువు భార్యలు గర్భవతులుగా నున్నపుడే యాఖ్యాన మారంభమైనట్లు కలదు. కాని నాటకములో ఇరువురు భార్యలు మనోరమ, లీలావతి కుమారులు పెద్దవారైన తరువాత కథారంభమైనట్లు నాటక కర్త మార్పు చేసెను.

2. దేవీభాగవతములో వేటకు పోయిన ధ్రువసింధువు సింహముతో పోరాడి గాయములవలన అచటనే మరణించినట్లు కలదు. నాటకములో గాయపడిన మహారాజును మంత్రి రథముపై తెచ్చి, అంతఃపురములో వైద్యము చేయించినట్లును, అపరిమితమైన గాయములవలనను కుమారుని దుండగముల మనోవ్యాధివలనను మరణించినట్లు నాటకకర్త మార్పు చేసెను.

3. దేవీభాగవతమున రాజు మరణించిన తరువాత యుధాజిత్తు ససైన్యుడై శత్రుజిత్తు పక్షమున వీరసేనుడు సుదర్శనుని పక్షమున మొదటనే యుద్ధము చేసినట్లు, యీ యుద్ధములో వీరసింహుడు చనిపోయినట్లును, సుదర్శనుని కాలనేమి కొసంగి అరణ్యములో చంపించుటకు పంపించి నట్లును, శత్రుజిత్తుకు రాజ్యపట్టాభిషేకము చేసినట్లు కలదు. కాని యీ నాటకములో పై అంశము పూర్తిగా మార్చి మంత్రి ధీమంతుని బంధించి చెరసాలలో నుంచినట్లును, సుదర్శనుని చంపించుట కరణ్యమునకు పంపించినట్లును నాటకకర్త మార్పు చేసెను. ఈ సందర్భములో వీర సేనుని ద్వారా యుద్ధములో యుధాజిత్తును చంపించి, దుష్టులకు ప్రాణ హాని, శిష్టులకు మేలు కలిగినట్లు మార్పు చూపించి, నాటకకర్త ఔచిత్యము పాటించినట్లు తోచుచున్నది.

4. యుధాజిత్తు భారద్వాజముని ఆశ్రమము వచ్చి సుదర్శను నప్పగించు మనుట, అందులకా ముని నిరాకరించుట దేవీభాగవతములో కలదు. నాటకములో యీ అంశము లేదు.

ప్రధానకథ కనుబంధముగా వశిష్ఠ విశ్వామిత్రుల కథలు, బలిచక్రవర్తి కథ ద్రౌపది సైంధవుల కథలు దేవీభాగవతములో నున్నవి. కాని యీ నాటకములో ఉపకథలేవియు తడవబడలేదు. ఈ ఉపాఖ్యానములు నాటక కథ కే విధముగా నుపకరించకపోవుటవలన వీనిని తొలగించినట్లు స్పష్టము.

సుదర్శనునకు కామబీజప్రాప్తి 'క్లీబ'ను పఠించుటవలన శక్తి ప్రత్యక్షమై దివ్యశరాసన మొసగినదని దేవీభాగవతములో నున్నది. కాని సుదర్శనుడు కాళికాదేవిని ఆమె ఆలయములో తదేక నిష్ఠతో ధ్యానించుటవలన దేవి ప్రత్యక్షమై దివ్యఖడ్గ మొసంగినట్లును, ఆ ఖడ్గముతోనే సుదర్శనుడు శత్రుసంహారము గావించినట్లు నాటకములో కవి మార్పు చేసెను.

దేవీభాగవతములో విప్రుడు కాశీపురము వచ్చి శశికళకు సుదర్శనుని అందము, పరాక్రమము తెలిపి ఆమను సుదర్శనుని వివాహమాడుటకు ప్రోత్సహించినట్లును, ఆమె యా విప్రుని సుదర్శనుని వద్దకు పంపి, తనను వివాహమాడరమ్మని కోరినట్లు కలదు. కాని యీ నాటకములో సుదర్శనుడు భారద్వాజముని యానతి మేరకు కాశీపురోద్యానవనములో శశికళను చూచి మోహించి, ఆమె తలిదండ్రులలో తన అభిప్రాయమును తెలిపి, వివాహమాడెను. ఆ రోజులలో సమాజములో పురుషాధిక్యత కలదను విషయము చాటుట కీ మార్పు ఉపకరించినది.

దేవీభాగవతములో మనోరమ సుదర్శనునితో మంత్రి ధీమంతునితో పారిపోవుచుండగా దారిలో వీరిని దొంగలు దోచుకొనినట్లు కలదు. కాని యీ నాటకములో మనోరమ నిగూఢముగా అంతఃపురమునుండి పారిపోయినట్లును, ధీమంతుడు చెఱసాలనుండి తప్పించుకొని పారిపోయి, వీరసేనుని రాజ్యము చేరినట్లును, సుదర్శనుని కాలనేమి హత్యచేయుచుండగా భారద్వాజుడు విడిపించి, తన యాశ్రమములో నుంచుకొని కాపాడినట్లు నాటక కర్త మార్పు చేసెను.

పై మార్పులే గాక కొన్ని పాత్రల పేర్లు కూడ దేవీభాగవతములో వానిని మార్చినట్లు కనిపించుచున్నది. దేవీభాగవతములో మంత్రి పేరు

విదల్లుడు. నాటకము లో ధీమంతుడు. సుదర్శనుని చంపుటకు పంపినవాని పేరు ఖలుడని దేవీభాగవతములో కలదు. ఈ నాటకములో నతని పేరు కాలనేమి. ఈ పాత్రల పేర్లు మార్పువలన పెద్దగా ప్రయోజనము కనిపించక పోయినను, సన్నివేశములలో కథాభాగములలో చేసిన మార్పుల వలన నాటకకర్త నాటక ప్రయోగమున కనుకూలమైన స్థితిని, సైనికవిషయములలో సమతూకము సాధించుటకు కథాగమనసౌలభ్యము సాధించుటకు తోడ్పడినదని చెప్పవచ్చును. ఇట్టి మార్పులు కథాగమనమునకు గుణములుగా భాసిల్లుచున్నవి.

పాత్రపోషణ

'శశికళ' నాటకములో సుదర్శనుడు ధీరోదాత్త నాయకుడు, ఈ పాత్ర ప్రాధాన్యమునుబట్టి యీ నాటకమునకు మరియొక పేరు శశికళాసుదర్శనీయమనుట సమంజస మనిపించుచున్నది.

ప్రథమాంకములో సుదర్శనుని పాత్ర కనిపించకపోయినను రాజు ధ్రువసింధువు మంత్రి ధీమంతుని సంభాషణవలన సుదర్శనుడు సద్గుణసంపన్నుడను భావన కలిగించును. శత్రుజిత్తు నాదేశము ననుసరించి కాలనేమి సుదర్శనుని అరణ్యములో శిరచ్ఛేదము చేయనుంకించునపుడు కవి సుదర్శనుని పాత్రను పోషించిన తీరు మిక్కిలి శ్లాఘాపాత్రముగ నున్నది. ఇందు సుదర్శనుడు కాలనేమితో సంభాషించిన విధ మాయన నిష్కల్మషత్వమునకు తార్కాణము. శత్రుజిత్తునందు (సోదరుడు) తనకు భక్తియేగాని యాతని రాజ్య మాశించలేదనియు, తనను మంత్రి ధీమంతుడు రాజుగా చేయుటకు ప్రయత్నించుట తనకు తెలియదనియు ప్రమాణము చేసి చెప్పి, తనకు రాజ్యకాంక్ష లేదని, కాలనేమితో పల్కిన పలుకులు రాకుమారుని నిష్కల్మషహృదయమున కద్దముపట్టి చూపించును.[1] సుదర్శను డెన్ని విధముల ప్రార్థించినను వినక కాలనేమి చంప నుంకించ తనకిక భగవంతుడే దిక్కని, నిశ్చలభక్తితో పరాత్పరుని ప్రార్థించి

1. "చం॥ తలపను రాజభోగములు.......పలుకేది యెరుంగను దైవసాక్షిగన్"
"మం॥ కలనైనన్ పరవిత్త భోగముల నే కాంక్షింప..............సత్యంబు గుర్తింపకన్."
శశికళ ద్వి. అం. 39 పుట

శరణాగతి కోరును. ఇచట నాటకకర్త సుదర్శనుని భగవంతునియందపార విశ్వాసముగల భక్తునిగా తీర్చిదిద్దెను. ఆపదలందు ధైర్యము వీడని ధైర్యవంతుడుగా మనకు సుదర్శనుడు భాసించును.

భారద్వాజునిచే కాపాడబడిన సుదర్శనుడు ప్రాణదాతకు శిష్యునిగా నుండి వేదాధ్యయనము, ధనుర్వేదము, రాజనీతి మున్నగువాని నభ్యసించెను. కాళిమాత నాశ్రయించి యామెవలన యుద్ధములో తిరుగులేని శక్తివంతమైన ఖడ్గము పొందెను. పట్టుదలతో సాధన చేయుటలో తనకు తానే సాటియనునంతటి కీర్తి నార్జించెను. ఇచట సుదర్శనుని నిర్విరామకృషి, కార్యశీలత మన కడుగడుగున కవి వ్యక్త మొనరించెను.

భారద్వాజు ననతితో సుదర్శనుడు కాశీరాజ్యమునకు పోయి, శశికళను కలిసి, సుఖసంతోషములతో నున్నను తల్లి మనోరమను, మంత్రి ధీమంతుని గుర్తించి యాలోచించిన కరుణామయుడు. మలిన వస్త్రములతో వికారముగా నున్న తల్లిని గుర్తించి సేవచేసి, యామె నోదార్చి సంతసము కూర్చెను. మామ యగు సుబాహు పైకి శత్రుజిత్తు యితర రాజులతో కలిసి యుద్ధమునకు రాగా, నిర్భయముగా తాను స్వయముగా యుద్ధమునకేగి, ప్రతిపక్షు లెంత పరాక్రమవంతులైనను, ధైర్యముతో యుద్ధము చేసి, విజయము సాధించిన పరాక్రమవంతుడు. తనకు మొదటి నుండి హాని కలిగించి, నిర్దాక్షిణ్యముగా హత్య చేయించుటకు ప్రయత్నము చేసినను, రాజ్యము నపహరించి, తల్లిని, మంత్రిని చెఱసాలలో నుంచినను, ప్రతికారము గైకొనక యుద్ధములో ధీమంతునిచే బంధింపబడి, తన పాదముల చెంతనుంచిన శత్రుజిత్తును క్షమించిన ఉదారహృదయుడు. సవతితల్లిని తను రాజైనను గౌరవప్రదముగా చూచిన ఔదార్యవంతుడు. ప్రజలను కన్నబిడ్డవలె చూచుచు రాజ్యపరిపాలన చేసిన సుదర్శను నీ నాటకములో కవి మచ్చలేని నాయకునిగా పోషించి, నాటక రచనలలో తనకుగల ప్రతిభను ప్రదర్శించెననుటలో అతిశయోక్తి లేదు.

నాయిక :

నాటికములో నాయికయగు శశికళ తృతీయ, చతుర్థాంకముల మాత్రము కనిపించును. నాటకము పేరు నాయిక పేర శశికళ, యనుట సార్థకమనిపించును,

కాశీరాజు కూతురు శశికళ ఒక సామంతరాజు కూతురు మాత్రమే ఐనను, తను నమ్మిన విషయములో యెవరెంత చెప్పినను సమాధానపడని మనస్తత్వముగల నాయికగా కవి యీ శశికళ పాత్రను పోషించెను. సుబాహుడు చెలికత్తె వలన సుదర్శనుని శశికళ ప్రేమించెనని తెలిసికొని రాజ్యములేని సంపదలేని సామాన్యుని ప్రేమించి సుఖపడజాలవని, స్వయంవరములో నెవరినైన రాకుమారుని వరించి వివాహమాడినచో సౌఖ్యాంబుధిలో నోలలాడగలవని కూతురుకు నచ్చ చెప్ప ప్రయత్నించెను. కాని శశికళ కలిమిలేములు శాశ్వతములు కావనియు, వృద్ధి క్షయములు దైవసంకల్పములనియు, తాను వరించిన రాకుమారునికి నేడు రాజ్యము లేకపోయినను తరువాత లభించకపోదనియు, తెలిపి తల్లిదండ్రులను సుదర్శనుని తాను వివాహమాడుట కొప్పించెను.[1] శశికళ కన్యయేయైనను ధైర్యముగా తాను ప్రేమించిన సుదర్శనునితో తన అనురాగము తెలుపును. వనములో సుదర్శనుని ద్వారా మలినవస్త్రములు ధరించిన మనోరమ తన కత్తగారని తెలిసికొని మిక్కిలి వినయవిధేయతలు ప్రకటించి గౌరవించిన నిగర్వి. శత్రుజిత్తుతో విరోధము వలన యుద్ధము జరుగు సందర్భమున శశికళ భర్తను ధైర్యముగా యుద్ధమునకు పంపుటయేగాక కాళిమాతను ప్రార్థించి తన భర్తకు విజయము చేకూర్చమని ప్రార్థించిన సాహసవంతురాలు, భక్తురాలు. ప్రకృతి సందర్శించినపుడు కలిగిన ఆనందము తనవితీర ఆస్వాదించిన రాజకుమారిగా కవి యీ శశికళ పాత్రను పోషించెను.

నాటకములో ప్రతినాయకుడు శత్రుజిత్తు. ఈతని కనుయాయిగా యుధాజిత్తు కాలనేమి యను దుష్టవర్తనులు, మొదటినుండియు దుష్టకార్యములు చేయు చుండిరి. నాటకములో శత్రుజిత్తు ప్రజాకంటకునిగనే గాక, కన్నతండ్రిని సహితము సింహాసనముకొఱకు హతమార్చుటకు వెనుదీయని మనస్తత్వముగలిగిన క్రూరహృదయుడుగ కవి చిత్రించెను. తన మేలుగోరి హితబోధచేసిన ధీమంతుడను మంత్రిని చెఱసాలలో బంధించిన పరమకిరాతకుడు. తన రాజ్యకాంక్షచేత సోదరునిసహితము హత్యచేయించుటకు వెనుకాడని పాపి. ప్రజలను హింసించుటలో

1. మ॥ "ఇపు డీ రీతి నరణ్యసీమలను......ఉర్విన్ మాట లింకేటికిన్."
శశికళ తృ. అం. 66 పుట

కంటకునిగా అపకీర్తి తెచ్చుకొనుటలో రావణ, దుర్యోధనాదులకు తీసిపోని దుష్టుడు. శత్రుశేష ముంచగూడదను భావముతో సోదరద్వేషముతో కాశీరాజ్యమున సుదర్శనుని ఉనికి తెలిసికొని యా రాజుపై దండెత్తి యుద్ధముచేసెను. దుష్టవర్తనుల కపజయము కలుగునను విషయము స్థాపించుటకు నాటకకర్త యీ యుద్ధములో యుధాజిత్తు మరణించుట, శత్రుజిత్తు బంధింపబడుట చూపెను. బంధింపబడి సుదర్శనుని పాదములపై బడి ప్రాణభిక్ష నర్థించుట శత్రుజిత్తు పిరికితనమునకు మచ్చుతునకయని చెప్పవచ్చును. శత్రుజిత్తు పాత్రను నాటకకర్త సర్వదుష్టగుణములు మూర్తీభవించిన పాత్రగా తీర్చిదిద్దుటలోకృత కృత్యుడయ్యె నని నిష్కర్షగా చెప్పవచ్చును. ఈతని దుశ్శీలతకు తీసిపోని విధముగా ఈతని తల్లి లీలావతిని దుష్టురాలుగా కవి చిత్రించెను.

నాటకములో ధీమంతుని (మంత్రి) పాత్రను నాటకకర్త మిక్కిలి ఉదాత్తముగా పోషించెను. రాజభక్తిగల మంత్రిగను, అరణ్యములో వేటాడు నపుడు సింగముతో తలపడినపుడు తన ప్రాణముల నడ్డువేసి రాజును కాపాడిన ధీశాలి. సద్గుణవంతుడైన సుదర్శనునికి రాజ్యాధికార మొప్పగించుటకు, రాజ కుటుంబము మచ్చలేనివిధముగా నుండవలయునను కాంక్షతో జీవితాంతము ప్రయత్నించి, ఇందు సకలకష్టనష్టముల కోర్చిన స్వార్థరహితుడు. అపాయము నుపాయముచే తప్పించుకొని, అవకాశము లభించినపుడు శత్రువును బరిమార్ప వలయునను రాజనీతివిశారదుడు. తన జీవితమే రాజకుటుంబమును కాపాడుట కను సిద్ధాంతమును నమ్మిన రాజభక్తి కలిగిన విశ్వాసపాత్రుడు. తన ప్రాణము లెదురొడ్డి సుదర్శనుని కాపాడుటలో యుద్ధములో శత్రుజిత్తుతో తలపడి పోరి, శక్తియుక్తుల నొడ్డి బంధించితెచ్చిన పరాక్రమశాలి. మొదట శత్రుజిత్తును చంప వలెనని సుదర్శనునితో పలికి, సుదర్శను నాజ్ఞమేరకు క్షమించి వదలిన శాంత చిత్తుడు. సుదర్శనుని తాత వీరసేనునివద్దనుండి రాబోవు ఆపద నెరింగి, ససైన్యుడై సుదర్శనునికి బాసటగా వచ్చు సందర్భములో మంత్రాంగము నెఱపిన దూరదృష్టిగలవాడు. రాజతంత్రము నెఱపుటలో అప్పాజీ, యుగంధరుల సరసన నిలుపుటకు అమాత్యునిగా కవి ధీమంతుని పాత్రను తీర్చిదిద్దెను. ఈ నాటకములో సుదర్శనుని పాత్ర తరువాత ధీమంతుని పాత్రయే ప్రధానమైనది.

ఇవి గాక మహారాజు ధ్రువసింధువు, భారద్వాజ ఋషి అతీంద్రియశక్తులు కలవానిగను, సుబాహు వీరసేను పాత్రలను కవి యీ నాటకములో సముచిత రీతి పోషించి, నాటకరచనములో తనకుగల ప్రతిభను అమోఘముగా ప్రదర్శించెను. వీరి పౌరాణిక నాటకములలో శశికళ కలికితురాయివంటిది.

## రస పోషణ

ఈ నాటకములో శాంత, వీర, కరుణ, బీభత్సరసములను కవి సందర్భోచితముగా పోషించెను. యుద్ధములో కవి వీరమును పోషించినను, నాటకమంతటను శాంతము తొణకిసలాడుచున్నది. ధ్రువసింధువు శత్రుజిత్తును క్షమించుట భారద్వాజుడు సుదర్శనుని కాలనేమినుండి కాపాడుట, సుదర్శనుడు శత్రుజిత్తుని క్షమించు సన్నివేశములలో కవి పోషించిన శాంత ముదాత్తముగా నున్నది. ధీమంతుడు చెఱసాలలో నున్నపుడు, కాలనేమి సుదర్శనుని చంపుటకు ప్రయత్నించినపుడు, మనోరమ అరణ్యములో అవస్థలపడునపుడు కరుణమును హృదయము కలచునట్లు కవి పోషించెను. నాటకములోని యీ ఘట్టములలో (ప్రేక్షకుల) పఠితల హృదయము లార్ద్రితనొంది, సుదర్శనునివైపు సానుభూతి లభించునట్లు చేయుటలో కవి కృతకృత్యుడయ్యెను. ధ్రువసింధువు సింహముతో పోరాడునపుడు, నాలుగవ అంకమున యుద్ధములో ఉభయపక్షములు పోరాడిన ఘట్టములో బీభత్సము కొలదిగానే యైనను, కవి చూపిన కౌశలము సమయోచితముగా నున్నది.

## సాంఘిక పరిస్థితులు

నాటకములోని కథాంశము పురాణకాలమునకు సంబంధించినది. రాజకుటుంబములో బహుభార్యాత్వమున్నదనుటకు ధ్రువసింధువు మహారాజునకు గల ఇరువురు భార్యలు లీలావతి, మనోరమలు సాక్షులు. సింహాసనమునకు రాజకుటుంబములో ముఖ్యముగా సవతిపుత్రులలో సవతులలో మత్సరము, ఈర్ష్యాద్వేషము లుండుట యా రోజులలోగూడా యుండవచ్చును. విశ్వాసపాత్రుడగు అమాత్యుడు రాజకుటుంబమును కాపాడుట ప్రథమ బాధ్యత యనుటకు ధీమంతుడే తార్కాణము. రాజులు ప్రజాభిప్రాయమున కనుగుణముగను, వారి మేలుకోరి

రాజ్యపాలన చేయుటకు సాయశక్తుల కృషి చేసినట్లు ధ్రువసింధువు పౌరులతో వేటకు వెళ్ళుట, క్రూరమృగముల నుండి వారిని కాపాడుట నిదర్శనము. ఆ రోజులలో స్త్రీలు సహితము స్వేచ్ఛాస్వాతంత్ర్యము లనుభవించినట్లు రాకుమారి శశికళ తన తల్లిదండ్రుల అభీష్టమునకు భిన్నముగా సుదర్శనుని వరించి, తన మాట నెగ్గించుకొనిన విధ మీ విషయమును ధ్రువపరచుచున్నది. దుర్మార్గుల కెపుడు హాని సంభవించుననియు, సన్మార్గుల కెపుడు మేలు కలుగునను ధర్మ మీ నాటకముద్వారా కవి (ప్రేక్షకులకు) పాఠకుల కందించెను. భగవంతుని నమ్మినవారి కసాధ్యము సహితము సాధ్యమగునను ధర్మమును స్థాపించుటలో నాటకకర్త కృతకృత్యుడయ్యెనని ఘంటాపథముగా చెప్పవచ్చును. రచనావిష యములో కథాఘట్టములను కూర్చుటలో పాత్రచిత్రణలో నాటకకర్త అమోఘ మైన ప్రతిభ ప్రదర్శించెను.

ఈ నాటకములో వాడిన జాతీయములు అద్వితీయములు. వీరికి సామెతలు వాడుటలో నెంత అభిమాన మో యీ నాటకములో మన కడుగడుగున కనిపించును. ఈ నాటకములోని ధ్రువసింధువు వేటఘట్టముపై బలిజేపల్లివారి సత్యహరిశ్చంద్ర నాటకములోని హరిశ్చంద్రుని వేటఘట్టము ప్రభావమున్నట్లు కనిపించుచున్నది. చిలుకమర్తి వారి గయోపాఖ్యానములోని "నీ నాథునకు నేను మేనమరందినై ఉదయంబు నొందుట యొక్కతప్పు".... అను పద్యమును పోలిన పద్య మీ నాటక ములో కవి రచించిన ట్లీ క్రింది పద్యము వలన తెలియుచున్నది.[1] "నా మీద కొండెముల్ భూమీశునకు తెల్పి యుగ్రుని గావించు టొక్క తప్పు ........ పీఠ మెక్కించ దలచుటే పెద్దతప్పు."

మొత్తముపై నాటకరచనలో నాటకకర్త అందెవేసినచెయ్యి యనుట కీ నాటక మొక దృష్టాంతము. ఇంతటితో యీ నాటకపరిశీలన ముగించి తరువాత నాటకము పరిశీలనకు గైకొనబడినది.

1. శశికళ ద్వి. అం. 35 పుట

# లలిత ( సాంఘిక నాటకము )

ఆసూరి మరింగంటి వేంకటనరసింహాచార్యులవారి నాటకములలో లలిత ఏడవది. ఇది నాలుగంకముల సాంఘిక నాటకము. ఇందలి యితివృత్తము కల్పితము, అముద్రితము. దీనిని కవి క్రీ. శ. 1959—60 ప్రాంతమున రచించియుండవచ్చును. దీనితరువాత కావ్యము మిత్రవింద అసంపూర్ణము అముద్రితము. కావున ఇది వీరి నాటకములలో చివరి రచన. లలిత సాంఘికనాటకము ముద్రణకు కవి తాపత్రయపడెను. కాని ఆర్థికస్థోమత లేక యీ నాటకము ముద్రణభాగ్యమునకు నోచుకొనలేదు. నిజాం పరిపాలన అంతమై ఆంధ్రప్రదేశ్ రాష్ట్ర మేర్పడినను, జమీందారులు, వారి గుండాల దౌర్జన్యము సామాన్యప్రజలనే విధముగా హింసించుచుండెనో యద్దముపట్టి చూపినట్లుగా కవి యీ నాటకమును తీర్చిదిద్దెను. ఇందలి కథాంశము కొంగ్రొత్త ఒరవడిలో రూపొందించబడినది. సమకాలిక సాంఘికేతివృత్తము గైకొని రచించిన దీ నాటకము. కావున యిందలి పాత్రలు అలనాటి సంఘములో నిత్యము కనిపించు మానవుల గుణశీలాదు లీ నాటకమున కవి ప్రతిబింబింపజేసెననినచో అతిశయోక్తి కానేరదు. ఈ నాటకము చివర పాటలు యే యే రాగములలో నాలాపింపవలయునో ఆయా రాగముల పేర్లు వ్రాయబడినవి. దశరూపకములలో యీ నాటకము ప్రకరణము లక్షణము కలిగియున్నది. పంచసంధు లిందు చూపబడినవి. ఇందలి కథావస్తువు ఉత్పాద్యము. ఈ నాటకములోని కథాంశ మిది.

## క థా ం శ ము

మోహనరావు, గోపాలం పట్టభద్రులు. స్నేహితులు. సంఘసేవకులు. నిరుద్యోగులు. జమీందారు జనార్దనరావు, దివాన్‌జీ, దుర్గాజీలు రైతులను పెట్టు యిక్కట్టులను చూచి, సహింపలేక యే విధముగానైనను రైతుల నాదుకోవలయునను తాపత్రయముతో నుండిరి. ఆ జమీందారు పేదరైతుల కప్పుల నొసంగి, వారినుండి వడ్డీక్రింద, పన్నులక్రింద పంటలను, భూములను జబర్దస్తీగా వశపరచుకొని, ప్రజల ధన మానప్రాణములకు రక్షణ లేకుండ యాగడములు చేయుచుండెను. గోపాలం జమీందారు దగ్గర ఉద్యోగములో చేరి యాతని దుశ్చర్యలను

ఫోటో ఆధారములతో సాక్ష్యములను చూపించి, కోర్టులో అతని రహస్యములు బట్టబయలుచేసి చూపించుటకు నిశ్చయించుకొనెను. మోహనరావు పేదరైతులకు బాసటగా నిలబడి ధైర్యము కలిగించుటకు, సమయోచితముగా సలహాలందించుటకు నిర్ణయించుకొనెను.

జమీందారు సేవకుడు మస్తాన్ సోమరాజను గ్రామ కరణమును దివాణములో బాకి చెల్లించ వలయునని ఒత్తిడిపెట్టి, చేయిపట్టుకొని దివాణమునకు తీసికొని పోయెను. దివాణములో జనార్ధనరావుకు సేవకుడు రాంసింగు బ్రాంది యిచ్చుచుండెను. త్రాగిన మైకములో ఆ జమీందారీలోగల మోతుబరి రైతు గోవిందయ్య కూతురు లలిత అందచందముల గురించి జమీందారు రాంసింగుతో మాట్లాడెను. ఇంతలో మస్తాన్ సోమరాజును ప్రవేశపెట్టెను. జమీందారుకు రావలసిన డబ్బు చెల్లించమని నిర్బంధించగా తానేమీ బాకిలేనని సోమరాజు బదులు పలికి, తనకు గల యావదాస్తి అప్పు క్రిందనే తీసుకొని తిరిగి అప్పు చెల్లించమని యడుగుట అన్యాయమనెను. జమీందారు కోపించి సోమరాజు ఆస్తిపాస్తులన్నింటిని స్వాధీనము చేసికొని యా జమీందారీనుండి వెడలనడిపెను. గోపాలం జమీందారు దగ్గర ఉద్యోగమునకు కుదిరెను. దివాన్‌జీ (దుర్గాజీ) గోవిందయ్యయను (మోతుబరి) రైతులను ప్రవేశపెట్టి జమీందారు అనుమతితో అప్పు చెల్లించలేదని వంగబెట్టి బండలు యెత్తించి, యవమానించెను. గోవిందయ్య అవమానభారము భరింపలేక లేని యప్పుకు పత్రము వ్రాసియిచ్చి యింటికి వచ్చెను. ఈ దృశ్యమును చూచిన గోపాలం రహస్యముగా ఫోటోతీసెను. దుర్గాజీ, రాంసింగు పూజారి పూర్ణయ్య కూతురు గురించి మాట్లాడి వెడలిపోయిరి.

లలిత, ఆమె తల్లి సుందరమ్మ జమీందారీలో జరుగు అన్యాయముల గురించి మాట్లాడుకొనుచుండిరి. గోవిందయ్య అవమానభారముతో భోజనమున కాలస్యముగా వచ్చుట విచారించి యా ముగ్గురు తమకు జమీందారీలో జరిగిన అన్యాయమునకు వగచుచుండిరి. ఆ సమయమున మోహనరా వచటికి వచ్చి, వారికి జమీందారువలన కలిగిన యాపద తెలిసికొని వారి నోదార్చెను. గోవిందయ్య, మోహనరావు దివాణములో జరుగు అక్రమాల నరికట్టుటకు కావలసిన ఉపాయ మాలోచించుచుండిరి. కాని గోవిందయ్య ఇల్లు గడచు నుపా

యము లేకుండుటచే మోహనరావు తనకుగల పదెకరాల పొలము, నలుబదెకరాల మెట్ట భూమిని సేద్యముకొఱకు గోవిందయ్య కప్పచెప్పెను. గోవిందయ్య, లలితలు మోహనరావును శ్లాఘించి కృతజ్ఞతతో సాగనంపిరి.

రంగాచార్యులు, రామావధాని వీ రుభయులు కూడా జమీందారీలో జరుగు దుష్కృత్యములను తలచుకొని విచారించుచుండిరి. కష్టములలోనున్నవారి నోదార్చుచు దివాణములో జరుగు యాగడములను మోహనరావు బట్టబయలు చేయుచుండెను. కావున జమీందారుకు మోహనరావుపై కినుక కలిగెను. కాని మోహనరావు నిర్భయముగా రైతులను తమకు కలిగిన యిబ్బందులను తెలిపినచో సాధ్యమైనంతవరకు తాను వారి నాదుకొందునని అభయ మొసంగెను.

జనార్దనరావు, దుర్గాజి రాంసింగు రైతుల నెట్లు బాధించి, వారి యాస్తుల నెట్లు కొల్లగొట్టవలయునో యాలోచించుచుండిరి. మాటలలో గోవిందయ్య కూతురు లలిత ప్రస్తావన తెచ్చి యామె అందచందములు పొగిడి, యామెకు మోహనరావుకు సంబంధము కలదని తేలికగా మాట్లాడిరి. జమీందారు త్రాగిన మైకములో ఆగ్రహముకలిగి మోహనరావు అంతుచూచుటకు, లలితను బలిమితో ననుభవించుటకు పన్నాగము పన్నెను. గోపాలముతో కూడా జమీందారు మోహనరావుచేయు పనుల నేకరువుపెట్టి, వానిని శిక్షించుటకు తాను చేయబోవు పనులను వివరించెను. గోపాలం రహస్యముగా మోహనరావును కలిసి, జమీందారు దురాలోచన తెలిపి తగు జాగ్రత్తలో నుండుమని హెచ్చరించెను. లలిత ఇంటికి మోహనరావు గోవిందయ్య లేని సమయమున వచ్చి మాట్లాడి పోవుచుండెను. ఈ దృశ్యము దుర్గాజీ చూచి కోపముతో జమీందారుకు తెలియపరచెను. ఇంతలో పోలీసులు రాయణిపేట వ్యవహారముపై జమీందారును నిర్బంధించుటకు వచ్చిరి. ఇనస్పెక్టర్ గణపతి రాయణిపేటలో జరిగిన దుండగములకు జమీందారే బాధ్యుడని యాతని నిర్బంధించెదననెను. జమీందారు ఇనస్పెక్టర్ గణపతికి మూడు వేల రూపాయల నోట్లకట్టలు దుర్గాజీద్వారా లంచమిప్పించెను. ఈ దృశ్యమును చాటుననున్న గోపాలం ఫోటోతీసెను. ఇదేసమయములో జమీందారు, దుర్గాజీ మోహనరావు లలితలపై లేనిపోని అభాండములు గణపతితో చెప్పిరి. గణపతి పోలీసులతో వెళ్ళిపోయెను. జమీందారుకు, దుర్గాజీకి రాంసింగు సారాయి పోసెను.

మత్తుగా త్రాగి జమీందారు దుర్గాజీతో ఒంటరిగానున్న లలిత దగ్గరకు చేరి, యామెతో లేనిపోని ప్రేమను వెల్లడించి, మాట్లాడెను. లలిత యాతని తిరస్కరించెను. కాని జమీందారు లలితను బలాత్కరించెను. ఆ సమయమున ఒకవైపు నుండి గోవిందయ్య మరొకవైపునుండి మోహనరావు జమీందారున కడ్డమువచ్చిరి. జమీందారు కోపముతో కత్తి విసరెను. అది గోవిందయ్యకు తగిలి బలమైన గాయమై మూర్ఛపోయెను. ఈ దృశ్యమును గోపాలం రహస్యముగా ఫోటో తీసెను. ఇంతలో దుర్గాజీ వెళ్ళి ఇన్‌స్పెక్టర్ గణపతిని, పోలీసులను, తీసికొని వచ్చి, మోహనరావే గోవిందయ్యను హత్యచేయుటకు ప్రయత్నించినాడని తెలిపి, వారిచే మోహనరావును నిర్బంధింపజేసి, జైలులో పెట్టించెను.

జైలులో మోహనరావు పిచ్చివానిగా తిరుగుచు, అసందర్భప్రలాపము లాడుచు విచారగ్రస్తుడై యుండెను. లలిత ముసుగు వైచికొని జైలుదగ్గరకు పోయి మోహనరావుతో మాట్లాడెను. అప్పుడే లలిత మరుసటిరోజు కోర్టులో మోహనరావు నిర్దోషిత్వమును ఋజువుచేయుదునని సూచనప్రాయముగా తెలిపెను. సోమరాజు, రామావధాని జమీందారు చేయు దుష్టకార్యముల గురించి మాట్లాడుకొనుచు, గోవిందయ్యపై హత్యాప్రయత్నము జమీందారే చేసి, ఆ నేరమును మోహనరావుపై మోపుటకు ప్రయత్నించుట అన్యాయమని వాపోయిరి. లలిత, గోవిందయ్య, సుందరమ్మలతో గోపాలం తన దగ్గరగల సాక్ష్యములగురించి తెలిపి, మరునాడు న్యాయస్థానములో మోహనరావును నిరపరాధిగా ఋజువుచేసి, జైలునుండి విడుదలచేయింతునని తెలిపి వెడలిపోయెను.

కోర్టుహాలులో న్యాయాధికారి వాదోపవాదములు వినుచుండెను. ప్రసాదు మోహనరావు న్యాయవాది. సుందరయ్య జమీందారు న్యాయవాది ప్రసాదు ఇన్‌స్పెక్టర్ గణపతిని, జమీందారును ప్రశ్నించి, వారిచే సరియైన సమాధానములు పొందక, జమీందారే నేరస్తుడనెను. సుందరయ్య తమితుడు మోహనరావును ప్రశ్నించి, మోహనరావే నేరస్తుడని వాదించెను. కాని గోపాలం తాను తీసిన ఫోటోలతో కోర్టులో తన వాఙ్మూలమిచ్చి మోహనరావు నిర్దోషిత్వమును, జమీందారు నేరమును ఋజువుచేసెను. న్యాయాధికారి తన తీర్పులో జమీందారుకు (10,000) పదివేలరూపాయలు జరిమాన విధించి, రైతులనుండి అన్యాయముగా

ఆక్రమించిన భూములను తిరిగి యెవరివి వారి కప్పగించునట్లును, ఇనస్పెక్టర్ గణపతికి మూడు వేల జరీమానా, ఆరు నెలల సస్పెండు చేయునట్లును, దివాంజీ, రామసింధు, మస్తాన్‌లకు మూడు సంవత్సరముల కఠినకారాగారశిక్ష విధించినట్లు తీర్పుచెప్పెను. ఆ తరువాత జమీందారు జనార్దనరావులో పశ్చాత్తాపము కలిగి బుద్ధిగా నడుచుకొనుచుండెను. గోవిందయ్య తన కూతురు లలితను మోహనరావు కిచ్చి వివాహము చేసెను. జనార్దనరావు గోపాలమును తన జమీందారీ పనులు చూచునట్లు నియమించెను. రైతులందరు తాము కోల్పోయిన భూములన్నింటిని తిరిగి పొంది మోహనరావు, గోపాలముల సేవలను కొనియాడిరి. అందరు దేశాభ్యుదయానికి జై, ఆంధ్రమాతకు జై, రైతుసంఘానికి జై యనుటతో నాటకము సమాప్తమయ్యెను.

పాత్రపోషణ

ఈ నాటకములో మోహనరావు నాయకుడు. లలిత కథానాయిక. జమీందారు జనార్దనరావు ప్రతినాయకుడు. గోపాలం, గోవిందయ్య, దుర్గాజీ పాత్రలకు యీ నాటకములో కొంత ప్రాధాన్యత కలదు.

మోహనరావు కథానాయకుడు, యువకుడు బి. ఏ, పట్టా పుచ్చుకొనిన నిరుద్యోగి. ఇతనికి పదెకరముల పొలము, నలుబది యెకరముల మెట్టభూమి కలదు సంఘసేవ చేయుచు జీవితము గడుపుటకు నిశ్చయించుకొనెను. నిస్వార్థ బుద్ధి కలవాడు. విద్యావంతులైన యువకులు ప్రభుత్వోద్యోగముకొఱకు తాపత్రయ పడుచుండు రోజులలో విద్యావంతుడై యుండి సాంఘిక దురాచారము లెదిరించి, ఆపదలోనున్నవారి నాదుకొనుటలో సంతృప్తి నొందినవాడు. జమీందారు జనార్దన రావు రైతులపై చేయు దుర్మార్గములు తెలిసికొని వాని నరికట్టుటకు నడుము బిగించి, ముందునకు వచ్చి జమీందారు ఆగ్రహమునకు పాత్రుడయ్యెను. అన్యా యము నెదిరించుటకు భయపడని మనస్తత్వము గలవాడు. రైతుల యిబ్బందులను తెలిసికొని, వానిని తొలగించుకొనుటకు కావలసిన సూచన లొసంగుచుండెను. గోవిందయ్య ఆస్తిని మొత్తము జమీందారు అన్యాయముగా నాక్రమించుటవలన వారి కుటుంబము ఆధారము లేకుండ పోయినపుడు, తన పొలము, మెట్టభూమి వారికి వ్యవసాయముచేసికొని జీవించుట కాధారము కలిగించిన త్యాగనిరతి

గలవాడు. దీనికి కృతజ్ఞతగా లలిత తన ప్రేమ నందించుటకు సిద్ధపడినపుడు తిరస్కరించిన స్థిరచిత్తుడు. మంచిపనుల కాటంకములు కలుగుట సంఘములో సహజము. జమీందారు లలితను బలాత్కరింపబోవుసమయమున అడ్డుకొనబోయిన మోహనరావుపై హత్యానేరము మోపి, జైలులో పెట్టించినపుడు, ఉన్నతునిగా వర్తించినను, న్యాయము జరుగునను ఆశచే యెదిరిచూచిన ధీరోదాత్తుడు. గోపాలముతో స్నేహము చేయుచు అతని సహాయసహకారములవలన రైతుల నాదుకొని జమీందారు యాగడముల నరికట్టిన వివేకవంతుడు. చివరకు గోవిందయ్య, గోపాలముల ఒత్తిడివలన లలితను వివాహమాడెను. మొక్కవోని శీలముగల మోహనరావు పాత్ర నీ నాటకములో నాటకకర్త మిక్కిలి ఉదాత్తముగా చిత్రించెను. నాయకుని పాత్రను పోషించుటలో నాటకకర్త చూపించిన నైపుణ్య మనన్యసామాన్యమనినచో అతిశయోక్తి కానేరదు.

ఈ నాటకములో లలిత కథానాయిక. ఈమెను శృంగారనాయికగా కాకుండ సామాన్యగృహిణిగా సచ్ఛీలముగల స్త్రీగా నాటకకర్త పోషించెను. ఈమె స్వేచ్ఛావర్తనము కలదికాదు. సంపదల కాశించి నవనాగరిక వనితల మాదిరిగా సంచరించుట కిష్టపడదు. కాని సామాన్యగౌరవకుటుంబములోగల యువతి మాదిరిగా కష్టనిష్ఠురములను తల్లిదండ్రులతో చర్చించి వారికి సహాయముగా నుండు స్వభావము గలది. విద్యావంతులను, సద్గుణవంతులను గౌరవించు బుద్ధికుశలత యీమెలో మెండు. మోహనరావు తన కుటుంబము నాదుకొనుటకు తనకు గల భూమిని కౌలుకీయగా ప్రేమతో కృతజ్ఞత తెలిపిన వినయశీల. కుల స్త్రీకుండవలసిన సల్లక్షణములు కలది. జమీందారు తన నేకాంతముగా కలిసి, కపటప్రేమ ప్రకటించి తన సంపదనంతా యామె స్వాధీనముచేతుననినప్పటికి లొంగని ధీర. దుర్మార్గుల నసహ్యించుకొనుచు, నమ్మినవాడు ప్రేమించినవాడు, జైలుకుపోయినపుడు, ధైర్యముగా జైలుకుపోయి మోహనరావునకు ధైర్యము చెప్పి, మరునాడు న్యాయస్థానములో సాక్ష్యాధారములతో యాతని నిర్దోషిత్వమును ఋజువుచేయగలనని తెలిపి ఓదార్చి వచ్చిన చతుర. ఆపదలలో తొణకని శాంతస్వభావురాలు. జమీందారు, దివాన్‌జీ యామె నెంత ప్రలోభపెట్టినను మోహపడని స్థిరచిత్తురాలు. జైలునుండి విడుదలపొందిన మోహనరావును తండ్రియగు గోవిందయ్య, మిత్రుడగు గోపాలం ప్రోద్బలముతో వివాహమాడి కథను

సుఖాంతమగునట్లు నాటకకర్త లలితపాత్రను మిక్కిలి ప్రతిభావంతముగా పోషించెను.

ప్రతినాయకుడుగా జమీందారు జనార్ధనరావు, ఆతనికి సహాయులుగా దుర్గాజీ, రాంసింగు, మస్తాన్‌ల పాత్ర లీ నాటకములో తగిన స్థానము పొందినవి. సాధారణముగా నాటకకర్త లీ ప్రతినాయకులను, వారి యనుయాయులను క్రూర స్వభావులుగను, దుర్మార్గులుగను చిత్రించుట సహజము. నాటకకర్త యీ ఫక్కినే యనుసరించెను. జమీందారును త్రాగుబోతుగను, స్త్రీలోలుడుగను, నిర్దయాళువుగను నాటకకర్త చిత్రించెను. వాని మనోవాక్కాయకర్మము లెప్పుడు చెడువైపే లాగుట యీ నాటకములో విశేషము. రైతుల భూముల నన్యాయముగా నాక్రమించుటతో తృప్తిచెందక, వారిని హింసించి, వారి స్త్రీల ధనమానములను హరించుటలో సహితము వెనుకాడని క్రూరస్వభావముకలవాడు. తాను చేసిన నేర మితరులపై మోపుటకు వెనుకాడని అసత్యవాది. స్త్రీవ్యామోహమునకు రావణ, కీచకులకు మించిన దుశ్శీలము కలవాడు. పూజారి పూర్ణయ్య కూతురును బలవంతముగా తన ఇంట్లోనుంచుకొనిన పాపాత్ముడు. గోవిందయ్య కూతురు లలిత అందచందములు విని, ఆమెను బలవంతముగా చెఱపట్టుట కుంకించి, తండ్రి యడ్డమురాగా వానిని చంపుటకు వెనుకాడని కఠినహృదయుడు. తాను చేసిన నేరము నితరులపై నెట్టుటకు వెనుకాడని దుష్టచిత్తుడు అవసరముకొలది యధికారులకు లంచ మొసంగియైనను, తన దోషము కప్పిపుచ్చుకొనుటలో నేర్పరితనము చూపించిన కపటి. ఇతనికి తగినవారుగనే డివాన్‌జీ దుర్గాజీని, రాంసింగు, మస్తాన్ పాత్రలను నాటకకర్త మిక్కిలి దుష్టవర్తనులుగా చిత్రించెను. జమీందారు నేరములు ఋజువగుటతో తన ప్రవర్తనకు పశ్చాత్తాపపడి, నడవడి మార్చుకొని, రైతులభూములను తిరిగి యిచ్చుటయేగాక పరస్త్రీలను కన్నెత్తిచూడక సాధుస్వభావము కలవాడుగా మారిపోయిన జనార్దనరావు పాత్రను పోషించుటలో నాటకకర్త చూపించిన ప్రతిభ అనన్యసామాన్యము. నేరములు చేసినవారు తమ నేరములు గ్రహించి, వాని నంగీకరించి, పశ్చాత్తాపపడి తిరిగి యట్టివి చేయరాదను సందేశ మొసంగుటలో నాటకకర్త జనార్దనరావు పాత్రను చక్కగా నుపయోగించెను.

ఈ నాటకములో గోపాలం పాత్ర చాలా నైపుణ్యముతో పోషింపబడినది. గోపాలం పాత్ర నాటకములో మొదటి నుండి చివరి వరకు కలదు. గోపాలం

పట్టభద్రుడు. సంఘసంస్కరణాభిలాష గలవాడు. నీతిమంతుడు అన్యాయమును మోసముతో జయించవలెనను నీతిసూత్రమును పాటించినవాడు. జమీందారీలో జరుగు అక్రమముల నరికట్టుటలో మోహనరావునకు చేదోడు వాదోడుగా నుండ దలచెను. జమీందారీలో ఉద్యోగిగా చేరి, వారి రహస్యములను అకృత్యములను ఫోటోలు తీసి, అవసరసమయమున న్యాయస్థానములో వానిని సాక్ష్యములుగా చూపించెను. మోహనరావు నిరపరాధిత్వమును, జమీందారు నేరస్తుడుగను ఋజువు చేయుటలో గోపాలం పాత్రను నాటకకర్త సమయోచితముగా పోషించెను. "తిన్నింటి వాసాలు లెక్కించినట్లు" గోపాలం ప్రవర్తన పైకి ఔచిత్యవంతముగా కనిపించక పోయినను, న్యాయము కొఱకు మోసముతోనైనను నిజము చూపించ వలయునను విశ్వాసము కలవాడు. రైతుల మన్ననలు పొందుటయేగాక తిరిగి జమీందారు తన యకృత్యములకు పశ్చాత్తాపపడి, తనకు కండ్లు తెరిపించినందుకు కృతజ్ఞతగా గోపాలమునకు తన జమీందారీలోనే ఉద్యోగమొసగి గౌరవించుట వలన మనకు గోపాలం పాత్రను నాటకములో కవి పూసలలో దారముగా చూపించి, యాతని నిస్వార్థ సేవను చాటెను.

గోవిందయ్య, సోమరాజు లిరువురు జమీందారు యాగడములకు బలియైన రైతులుగను, సుందరమ్మ (లలిత తల్లి) సామాన్యగృహిణిగను, రామావధాని రంగాచార్యులు సామాన్య జనులుగను, నాటకములో కనిపించినను, వారు జమీందారు దుష్కృత్యముల నేకరువు పెట్టుటలో నాటకకర్త వీరి నుపయోగించెను. రాంసింగు మద్యపానసేవకుడుగను, మస్తాన్ క్రూరభటుడుగను నాటకములో కనిపింతురు. మరియొక పాత్ర గణపతి (ఇన్‌స్పెక్టర్) లంచగొండి ఉద్యోగి రూపములో కనిపించును. నాటకములో యీ పాత్రలనన్నింటిని కవి సమయస్ఫూర్తితో మిక్కిలి ప్రతిభావంతముగా పోషించి, నాటకమును రక్తి కట్టించెను.

## సాంఘిక పరిస్థితులు

ఆంధ్రదేశములో పూర్వపు నిజాం ప్రభుత్వరాజ్యములో తెలంగాణా జిల్లాలు తప్ప రాయలసీమ, కోస్తా ఆంధ్రప్రాంతములు స్వాతంత్ర్యము లభించిన తరువాత ఉమ్మడి మద్రాసు రాష్ట్రములో నుండెను. భారతదేశమునకు (1947)

లో స్వతంత్రము లభించినను తెలంగాణము (1948) వరకు నిజాంపాలనలో నుండి రజాకారుల దౌష్ట్యమునకు గురియై ప్రజలు అష్టకష్టములకు లోనైరి. ఈ సందర్భమున తెలంగాణములో కాంగ్రెస్‌వారు, కమ్యూనిస్టువారు కలిసి కొన్ని ప్రదేశములలో, విడివిడిగా కొన్నిప్రదేశములలో నిజాం నవాబుకు, యాతని తాబేదారులయిన రజాకారులకు వ్యతిరేకముగా స్వతంత్రతకొఱకు పోరాడిరి. ఆ సందర్భమున తెలంగాణములోగల కొందరు జమీందారులు భూస్వాములు తమ తమ స్వార్థముకొఱకు నిజాం నవాబునకు, రజాకార్లకు కొమ్ముకాచిరి. ఈ కాలములో ప్రజలకు జరిగిన అన్యాయములకు, హింస, దౌర్జన్యాదులకు అడ్డులేకుండెను. గృహదహనములు, దోపిడీలు, మానభంగములు రజాకార్లచే ఖాసిం రజ్వీ నాయకత్వములో విచ్చలవిడిగా జరుగుచుండెను. క్రీ.శ. 1948 సెప్టెంబర్, 13 న స్వతంత్రభారతప్రభుత్వ సేనలు జె. యన్. చౌదరి సేనాని ఆధ్వర్యములో నిజాం రాజ్యమును వశపరచుకొని, రజాకార్ల యాగడములు కట్టించెను. కేంద్రప్రభుత్వం నిజాం ప్రభువును నామమాత్రపు రాజప్రముఖుగా (1956) వరకు (అనగా ఆంధ్రప్రదేశ్ రాష్ట్రము యేర్పడు వరకు) నుంచి, యా పిదప గవర్నరును నియమించి, నిజాం నవాబును తొలగించెను. రాజరికము పోయినను వీరి కాలములో గల జమీందారుల దౌష్ట్య మీ నాటక రచనా కాలము నాటికి యింకా అచటచట చూపట్టుచుండెను. పల్లెలలో విద్యాగంధములేక రైతులు ప్రతివిషయములో దొరలపైనో, జమీందారులపైనో యాధారపడియుండిరి. కొందరు జమీందారులు ప్రజల పాలిట యమధర్మరాజులుగా ప్రవర్తించిరి.[1] ఇట్టి క్రూరజమీందారులను నాటకకర్త స్వయముగా చూచెను. కావున అట్టివారిలో నెవరి ఇతివృత్తముగాని, లేక అట్టి అనుభవపూర్వకమైన ఊహతోగాని యీ లలిత, సాంఘికనాటకము కవి రచించెను.

ఆ కాలములో జమీందారీలో గల ప్రజలకు యెంత శ్రమించి పండించినను, తమ పంటలను పన్నులక్రింద జమీందారులకే చెల్లించి, వారిదగ్గర అప్పు తీసికొని, వడ్డీలక్రింద తమ యాస్తిపాస్తులను పోగొట్టుకొనుచుండిరి. ఈ విషయమీ నాటకములో జమీందారు జనార్దనరావు కూడా సోమరాజును, గోవిందయ్యను,

1. "బాల్యములో యీ వ్యాసకర్త పై విషయములు స్వయముగా చూచెను".

రామావధాని, రంగాచార్యులను వారిని హింసించి, వారి యాస్తుల నపహరించిన సన్నివేశములు ధ్రువపరచుచున్నవి. అప్పటికి ప్రజలలో విద్యాగంధము లేక చైతన్యము లేక జమీందారులకు అణగిమణగి యుండెడివారు. ఈ పేద ప్రజల యిక్కట్టులను కవి వర్ణించిన విధము మిక్కిలి సహజముగా నున్నది.[1] జమీందారులు భోగలాలసులై కష్టపడి పనిచేసి పండించు రైతులను బానిసలుగా చూచి వారిని పెక్కు యిక్కట్టులపాలు గావించుచుండిరి. విద్యాగంధముగల వారా జమీందారీలో చాలా తక్కువయని చూపుటకు మోహనరావు, గోపాలంలు మాత్రమే పట్టభద్రులని చెప్పుట నిదర్శనము. ఏ కొద్దిపాటి చదివినవారైనను పాశ్చాత్యవ్యామోహములో పడి ధనవంతులకు, భూస్వాములకు, జమీందారులకు మాత్రమే సహకరించుచుండిరి. ఇట్టి పరిస్థితులలో విద్యావంతులగు యువలోకమున కలిగిన జాగృతి, సంఘసేవాపరాయణత్వము, అన్యాయము, అధర్మము ప్రతిఘటనము మున్నగు గుణములు చోటుచేసికొన్నట్టు లా నాటకకర్త మోహనరావు, గోపాలం పాత్రలను ప్రజాహితైషులుగా చిత్రించి, దుష్టజమీందారుల యాగడములు కట్టించుటకు ప్రయత్నించెను.

జమీందారులు త్రాగుబోతులుగను, పరస్త్రీమానాపహర్తలుగను, ఆ నాటి సంఘములో అపకీర్తి గడించుచుండిరి. వారికొలువులోగల దివాన్‌జీలు, బంట్రోతులు యీ జమీందారుల దురాలోచనలకు తగినవారుగనే యుండిరి. ఈ నాటకములో దివాన్‌జీ దుర్గాజీ, పానీయము నిచ్చు రాంసింగు, సేవకుడగు మస్తాన్ యిట్టివారికి దృష్టాంతము. వీరి పని కొండెములు చెప్పుట, మద్య మందించుట, పరస్త్రీలను సరఫరా చేయుట, రైతుల పంటలను దోచుకొని లంచములు పొందుట ఇట్టి దురాలోచనలలో వీరు అందెవేసినవారు. వీరి హృదయములు పాషాణమువంటివి. కావుననే గోవిందయ్యవంటి మోతుబరి రైతుపై లేనిపోని అప్పుకు పత్రము వ్రాయించుకొని, ఆ అప్పు వసూలు చేసికొనుటకు గోవిందయ్యను వంగబెట్టి వీపు

---

1. "ఉ॥ ప్రేగులు మాడిపోవ నిరుపేదలు కంటికి పుట్టె డేడ్చుచున్ భోగ
విహీనులై నిరతమున్ శ్రమలందుచునుండ హాయిగా రాగములొందు
చుండిరి ధరాతలమందు జమీనుదారు లింకే గతి కర్షకోద్ధరణ మింతకు
నీశ్వరసృష్టి యెట్టిదో."  లలిత ప్ర. అం. 2 పుట

పై బండలు పెట్టి జమీందారు అమానుషముగా హింసించెను. పూజారి పూర్ణయ్య కూతురును మగనినుండి వేరుచేసి, జమీందారు స్వయముగా తన ఇంటిలో నుంచు కొనుట జమీందారు అత్యాచారములకు మచ్చుతునక మాత్రమే. ఆ నాడు సంఘములోగల దురాచారత్వమున కీ స్త్రీలోలత్వ మొకటి. జమీందారులకు రైతుల కుండవలసిన సత్సంబంధము లా రోజులలో మృగ్యము శ్రమపడి పండించిన పంటలు రైతు లనుభవించుట కవకాశము లేకుండెను. ఎవరైనా ధైర్యముచేసి యెదిరించినచో వారి పంటకుప్పలు జమీందారు వారి అనుయాయులు దుర్మార్గులచే పరశురామప్రీతి చేయించి, యా నేరమును మరొకరిపై నెట్టి పోలీసులచే నిర్బంధింప చేసెడివారు. పోలీసులు శాంతిభద్రతలు, న్యాయము కాపాడవలసినవారు కూడ ధనవంతులకు జమీందారులకు తొత్తులుగా వ్యవహరించుచుండిరి. గణపతి యను పోలీసు ఇనస్పెక్టర్ జమీందారును నిర్బంధించుటకు వచ్చి, యతనిచే మూడువేల లంచముగొని, యతనిపై కేసును తొలగించుట యిందుకు తార్కాణము నేరముచేసినవారు ధనముతో తప్పించుకొనుట కా కాలములో యవకాశము మిక్కుటముగా నున్నట్లు, నాటకములో జమీందారు గోవిందయ్యపై హత్యా ప్రయత్నము చేసి, యా నేరము మోహనరావుపై మోపి, యాతనిని చెఱసాలలో బంధింపచేసిన యుదంతము ప్రబలతార్కాణమని చెప్పవచ్చును. (జమీందారు లింద్లలో జరుగు వివాహాది ఖర్చులన్నియు రైతులే భరించెడివారు.) జమీందారులను సంతోషపెట్టుటకు, వారి క్రింది నౌకరులను తృప్తిచేయుటకు లంచముల రూపమున ప్రజలు ధనమొసంగెడివారు. అన్యాయమైన అప్పులను, పన్నులను చెల్లించుటకు రైతులు పడుపాట్లను నాటకకర్త గోవిందయ్య పాత్రద్వారా వివరించిన యీ క్రింది పద్యముల పరిశీలించినచో వారి యావేదనలు తెలియును.

"[1]సీ॥ జన్మదినోత్సవసందర్భమున నాల్గు
వేల కట్నము సమర్పించినాడ
పెండ్లివేళకు నన్ను పిలిపించినంతనే
పదివేల రొక్కము బంపినాడ

1. లలిత సాంఘికనాటకము. ద్వి. అం. 38 పుట

పట్టాభిషేకోత్సవమునందు నజరాన
కాసులు దోసెడు పోసినాడ
దాయాదులకు నాకు దావాలు కలిగింప
లంచము పదినూర్లు పంచినాడ

ఇన్ని యేటికి పిత్రార్జితమున్న భూమి
సర్వమును విక్రయముజేసి శాంతితోడ
ధారపోసితి నీ జమీందారుగారి
బాధ తప్పించుకొనుటకు పాటుబడుచు."

"[1]సీ॥ తాత తండ్రులనాడు దాచిన ధనమెల్ల
లంచాల కొఱకు చెల్లించినాడ
.... .... .... ....
వారి కర్పించి యిపుడు బికారినైతి."

జన్మదినము, పట్టాభిషేకము, వివాహము మున్నగు సందర్భములలో జమీందారులు ప్రజలనుండి పన్నులరూపమున, కట్నకానుకల రూపమున ధన కనకవస్తువాహనములను పొందుట ఆచారముగా నుండెను.

నాటకద్వితీయాంకములో జనార్దనరావు జమీందారీలోగల యాగడములు కవి యారోజులలో తెలంగాణములో ముఖ్యముగా సూర్యాపేట, నల్లగొండ ప్రాంతములలో జమీందారులు హింసించు దృశ్యములనే కవి యీ నాటకములో యథాతథముగా పొందుపరచియున్నాడు.

రాజులొసంగిన అగ్రహారములను, ఇనాములను వృత్తులవారు వంశపారంపర్యముగా ననుభవించుటకు వీలుండెడిది. కాని దుర్మార్గులైన లంచగొండులైన ఉద్యోగుల పితూరీల ననుసరించి జమీందారులు వృత్తి ఇనాముదారులనుండి అగ్రహారములను, ఇనాములను, మాన్యములను బలవంతముగా స్వాధీనపరచుకొను

1. లలిత సాంఘికనాటకము. ద్వి. అం. 38 పుట.

చుండిరనుటకు దృష్టాంత మీ నాటకములో జమీందారు సోమరాజు, రామావధాని, రంగాచార్యుల భూముల నాక్రమించుటయే క్రీ.శ. 1960 ప్రాంతములో కాంగ్రెస్, కమ్యూనిస్టు నాయకులు పల్లెలలో అపుడపు డొసంగు ఉపన్యాసములను పోలిన ఉపన్యాసములే నాటకములో మోహనరావు పాత్రద్వారా నాటకకర్త యిప్పించి నట్లు స్పష్టము.

తెలంగాణా ప్రాంతమున ఆ రోజులలో ఉర్దూ ప్రధానభాషగా చలామణి యగుచున్నను, తెలుగుకు కూడా క్రమముగా ప్రాధాన్యము చేకూరుచుండెను. హైద్రాబాద్ ప్రాంతమందు తమిళులు, ఆంగ్లేయులు, ముస్లిములు కలిసిమెలసి యుండుట వలన వారివారి మాతృభాషలు మాట్లాడెడివారు. ఈ నాటకములో విద్యావంతులైన మోహనరావు, గోపాలం, గణపతి, (యస్. ఐ) పాత్రలద్వారా ఆంగ్లతెలుగుమిశ్రమభాషను, మస్తాన్‌ద్వారా ఉర్దూ తెలుగు మిశ్రమభాషను, తమిళలాయర్ సుందరయ్యర్ పాత్రద్వారా తమిళ తెలుగు మిశ్రమభాషను ప్రవేశపెట్టి నాటకములో నాటకకర్తకు గల బహుభాషాపరిజ్ఞానముతో, ఆయా పాత్రలకు తగిన సంభాషణము కూర్చుటచేత పాత్రౌచిత్యము పాటించుట జరిగినది.

నాటకములో ధర్మము జయించునను సిద్ధాంతము ప్రతిపాదించుట నాటక కర్త ప్రధానోద్దేశ్యము కావున మోహనరావు కథానాయకుడు. లలిత కథానాయిక యెన్ని యిబ్బందులకు గురియైనను చివరకు ఆపదలు గడచి, వివాహమాడి భార్యాభర్తలగుటవలన సుఖాంతమయ్యెను. కావున ధర్మమునకు విజయము లభించునను ప్రబోధము కలిగించుట కవి ప్రధానలక్ష్యమైనట్లుగా కనిపించు చున్నది.

"[1]సీ॥ కన్నబిడ్డలభంగి మన్నించి నిరతంబు
ప్రజల పోషింపుడీ ప్రభువులార
అధికారమదముచే యన్యాయ మొనరింప
బాల్గొనకుండుడీ భవ్యులార
భువిని సత్యానత్యములు విచక్షింపుచు
చరియింప దలపుడీ సదయులార

1. లలిత సాంఘికనాటకము. చ. అం. 112 పుట.

ధర్మ మెన్నటికైన తప్పక రక్షించు
దాని గుర్తింపుడీ ధన్యులార

ఐకమత్యంబు ప్రజలపై నలరజేసి
దేశసేవకు బూనుడీ ధీరులార
సత్యమే జయమనుటలో సంశయంబు
లేదు ముమ్మాటికిని లేదు లేదు లేదు."

ఈ నాటకముద్వారా ప్రజలలో దేశసేవ, సత్యదీక్ష ప్రచారము చేయవలెనని కవి సంకల్పించెను. నాటకకర్తకు సామెతల నుపయోగించుటలో గల సమయస్ఫూర్తి, ప్రతిభకు యీ నాటకములో కుప్పతిప్పలుగావాడిన సంస్కృతాంధ్రజాతీయములే నిదర్శనములు.

మొత్తముపై యీ నాటకము పరిశీలించిన తరువాత నాటకకర్తకు పౌరాణిక నాటకరచనములోనే గాక సాంఘిక నాటకరచనములో గూడా ప్రతిభ అమోఘమని చెప్పవచ్చును.

## సుందరీ విలాసము (వైశ్య వేశ్యవధ) ప్రహసనము

దశరూపకములలో ప్రహసన మొకటి. ప్రహసనములు మూడు విధములు.
1. శుద్ధప్రహసనము, 2. సంకీర్ణప్రహసనము 3. మిశ్రమ ప్రహసనము.
భగవత్, తాపస, విప్ర, శాక్యాదులను గూర్చిన హాస్యవాదములతో కూడినది
యును, కుత్సితపురుషులతో కూడినదియును, పరిహాసభాషణపూర్ణమును, వారి
భాష ఆచారములను యథాథతముగా ప్రదర్శించునదియును, విశిష్టభావద్యోతకము
లగు కళాఖండములను, నియతగతిగల ఇతివృత్తము కలదియును శుద్ధప్రహసన
మనబడును. అనిభృతమైన వేష, పరిచ్ఛదచేష్టితములుగల వేశ్య, చేటి,
నపుంసక, విట, ధూర్త, బంధకీ సంకులమగునది సంకీర్ణ ప్రహసన మనబడును.
లోకవ్యవహారసిద్ధమగు వార్తయును, దంభమును, ధూర్తుల (కృత్రిమతాపసుల,

విటుల) ప్రవివాదములును ప్రహసనములందుండవలెను.[1] పరిహాసప్రధానమైనది ప్రహసనము దీనికి అంకనిర్దేశము లేదు. రంగములుండును.[2]

'సుందరీవిలాసము' ప్రహసనము కీ॥ శే॥ ఆసూరి మరింగంటి వేంకటనర సింహాచార్యులచే రచింపబడి, క్రీ.శ. 1926 సంవత్సరములో కాకినాడలో ముద్రింపబడినది.[3] ఈ ప్రహసన పీఠికలో శ్రీమాన్ ఆచార్యులవారీ ప్రహసనము శ్రీసూర్యప్రకాశరావు ప్రోత్సాహము వలన వ్రాసినట్లు మనవి చేసికొనినాడు. ముఖ్యముగా ధనవంతులైన వైశ్యులలోగల వేశ్యాప్రియత్వమగు దురలవాటు మాన్పించుటకే ప్రహసనము వ్రాసిరి. ఈ ప్రహసనము మిగతా నాటకముల కంటే ముందే రచించి ముద్రింపించిరి. ఈ ప్రహసనము అతి కష్టముపై లభించినది.[4] ఈ ప్రహసనములో నాలుగు రంగములు కలవు. ప్రథమమున శార్దూలవిక్రడితములో శ్రీహరిని ధ్యానించి ప్రహసన మారంభించెను. క్లుప్తముగా యిందలి కథాంశ మిట్లున్నది.

---

1. నాట్యశాస్త్రము 18 అధ్యాయము. 527 పుట. పి.ఎస్ ఆర్. అప్పారావు
2. తెలుగులో ప్రహసనములు కందుకూరు వీరేశలింగంపంతులు
3 కాకినాడలోగల ది ఆల్బర్టు పవరు ప్రింటింగు వర్క్సు యందు జి. జగన్నాథ శాస్త్రిచే ముద్రింపబడినది. దీని ప్రకాశకులు కాళహస్తి సూర్యప్రకాశ రావు ప్రొప్రయిటర్ అంబికా బుక్ డిపో రాజమండ్రి
4. ఎంత ప్రయత్నించినను యీ ప్రహసన మీ ప్రాంతమున లభ్యముకాలేదు. పరిశోధనకార్యక్రమముపై యీ వ్యాసకర్త తంజావూరు, మదరాసు, తిరుపతి ప్రాచ్యలిఖితగ్రంథాలయములు నవంబరు 1980 లో సందర్శించి నపుడు తిరుపతి ప్రాచ్యలిఖిత భాండాగారములో యీ ప్రహసనము అచ్చు ప్రతి లభించినది. అచ్చటి గ్రంథాలయ నిర్వాహకులచటనే కూర్చుండి శుద్ధప్రతిని తయారుచేసికొనుట కనుమతించిరి. దీని శుద్ధప్రతిని సిద్ధపరచి యిచ్చుటలో సహాయమొనర్చిన మిత్రులు శ్రీ అంగలూరు శ్రీరంగాచార్యులకు కృతజ్ఞుడను.

## కథాంశము

రామశాస్త్రి, ఇందుశర్మ బ్రాహ్మణులు. మిత్రులు. రామశాస్త్రి వివాహితు
డైనను, వారకాంత సుందరి యందమునకు దాసుడై తిరుగుచుండగా ఇందుశర్మ
యాతని కెన్ని విధముల హితబోధ చేసినను వినలేదు. చంద్రముఖి సుందరి తల్లి
(వేశ్యమాత). సుందరి రామశాస్త్రిని వలచి, యాతనితోడిదే లోకమని భావించి,
యెంత ధనవంతులు వచ్చినను, వారిని వారి ధనమును తృణీకరించుచుండెను.
చంద్రముఖి కీ విషయమై చింతపట్టుకొని యే విధముగనైనను తన కూతురు
సుందరిచేత వ్యభిచారవృత్తి స్వీకరింపచేసి ధనమార్జింప వలయునని, పట్టుదల
కలిగి, చతుర్విధోపాయంబుల నామెను వ్యభిచారవృత్తిలోకి దింపుటకు ప్రయ
త్నించెను.

పెద్దిశెట్టి ధనవంతుడగు వైశ్యుడు. వయస్సు మళ్ళినవాడు వేశ్యా
వ్యామోహము కలవాడు సుందరి చక్కదనమునకు ముగ్ధుడై యామె పొందు
చేరుట కువ్విళ్ళూరుచుండెను. పుల్లిశెట్టి కూడా వైశ్యుడే. కాని గుణములో పెద్ది
శెట్టికి భిన్నుడు. మాటల సందర్భమున సుందరితో నీలవేణి (చెలికత్తె) పరపురుష
సాంగత్యముతో లక్షలార్జించవలయునని చెప్పగా, సుందరి వ్యభిచారము నీతి
బాహ్యమనియు, పాపహేతువనియు, అంతకంటె తను వలచిన పురుషునితో
కాపురముచేయుట యోగ్యమని తెలుపును. కాని నీలవేణి తల్లి మాటవిని ధనార్జన
చేయుమని బోధించెను. ఇంతలో చంద్రముఖి గూడా ప్రవేశించి కూతురు సుంద
రికి విటుల నాకర్షించు నుపాయములు, వారి ధనము నపహరించుటకు చూపించు
హావభావములు మున్నగు వారకాంతల కుండవలసిన లక్షణములు తెలిపి, పేద
బ్రాహ్మణుడగు రామశాస్త్రిని తరిమి, ధనవంతుడగు పెద్దిశెట్టి నాకర్షించి ధనార్జన
చేయుమని బోధించెను. కాని సుందరి ఆమె అభిప్రాయమునకు వ్యతిరేకమైన
అభిప్రాయము వ్యక్తీకరించెను. చంద్రముఖి కూతురు మనస్సు మార్చుకొని వ్యభి
చారవృత్తి స్వీకరించి ధనార్జన చేయనిచో కఠినముగా దండింతునని బెదరించుట
వలన సుందరి దైవముపై భారమువైచి తల్లి చెప్పినట్లాచరింతు ననెను.

చాందుఖాన్, హుసేన్ భటులు. వీరు సుందరీ రామశాస్త్రుల ప్రణయము
గురించి మాట్లాడుకొనుచుండిరి. హుసేన్ గూడా సుంధరియందమునకు ముగ్ధుడై

యామెకు రెండువేల రూప్యములొసంగి వివాహమాడి యానందతరంగముల నోలలాడదలంచెను. ఆ సమయమున చంద్రముఖి యానతిచే సుందరి రామశాస్త్రిని ఇంటినుండి గెంటివైచెను. రామశాస్త్రి తన దీనావస్థకు వగచుచు, చంద్రముఖిని ప్రాధేయపడుచుండెను. చంద్రముఖి గస్తీతిరుగుచున్న భటుల బిలిచి, యీ రామ శాస్త్రి తన ఇంట్లో దొంగతనమునకు వచ్చెనని, వానిని పట్టి బంధించి చెఱసాలలో వేయమని చెప్పెను. యుక్తాయుక్తవిచక్షణజ్ఞానములేని భటులా రామశాస్త్రిని బంధించి కారాగారములో నుంచిరి.

శేషగిరి నారాయణ యనువారు యువకులు. వైశ్యులు. స్నేహితులు. వీరు వేశ్యాలోలురు. సుందరి యందమును చూచి నాపై మోహముగొనిరి. సుందరీ నీల వేణులు ఉద్యానవనములో విహరించు సమయమున శేషగిరి నారాయణులు ప్రవే శించి యా సుందరికి తమ మనోగత మెరింగించిరి. ఆమె లేనిదే తాను జీవింప జాలనని శేషగిరి పట్టరాని మోహము ప్రదర్శించెను. సుందరి తన ఇంటికి వచ్చి, తన తల్లితో మాట్లాడి, ఆమె ఆజ్ఞానుసార మాతని కోర్కె తీర్తునని సమాధాన మొసంగి వెడలిపోయెను. నారాయణ శేషగిరులు తరువాత కార్యక్రమ మాలో చించుచు నిష్క్రమించిరి.

పెద్దిశెట్టి పుల్లిశెట్టి వేశ్యావిషయము సంభాషించు కొనిరి. పెద్దిశెట్టి సుందరి ఇంటికిపోయి యామె కోరిన ధన మొసంగెను. సుందరి యాతనిని రాత్రికి వచ్చి నచో కోరిక తీర్తునని చెప్పిపంపెను. హుసేన్ భటుడు రెండువేలరూపాయిలు సుందరికిచ్చి తన కోరిక వెల్లడించెను. కాని సుందరి రెండువేలు తీసుకొని హుసేన్‌ను బయటికిగెంటివేసెను. శేషగిరి తన ఇంటిలో శయ్యపైనుండి సుందరిపై మోహముచేత మన్మథ, చంద్రోపాలంభము చేయుచు భరింపరాని విరహమున సుందరి యింటికి చనెను. ఆమెకు కొంత ధన మొసంగి, యామె కోరిన నవరత్న హారము తెచ్చుటకు వెళ్ళెను. తరువాత పెద్దిశెట్టి సుందరి దరి చేరెను. సుందరి యాతనిపై విసుగుకొని గెంటివేయప్రయత్నించగా, కాసులపే రామె కొసంగి ప్రసన్నురాలుగా చేసికొనెను. సుందరి పెద్దిశెట్టి ఏకశయ్యపై పరుండిరి. ఆ సమయమున చాందూఖాన్, హుసేన్ భటులు వచ్చిరి. సుందరిని చంపవలయునని హుసేన్ ప్రయత్నించి ధైర్యములేక తిరిగి వచ్చెను. కాని చాందూఖాన్ ధైర్యము

చేసి సుందరి పెద్దిశెట్టి తలలను తన ఖడ్గముచే ఖండించెను. భటులు పారిపోయిరి నారాయణ, ఇందుశర్మ తమమిత్రులగు శేషగిరికి, రామశాస్త్రికి కలిగిన యాపదలు దలచుకొని విచారించిరి. వీరిరువురు యువకులకు వారకామినుల పొందు వలన కలుగు యనర్థము లెరింగించి, వేశ్యాలోలత్వము కలవారు తమ స్నేహితులు పొందిన పాట్లు పొందుదురని, కావున వారకామినుల యందలి కాంక్ష కూడదని హెచ్చరిక చేయుటతో యీ ప్రహసనము సమాప్తమగును.

## పాత్రపోషణ

ఈ ప్రహసనములో నాయిక సుందరి. కాని నాయకుని విషయములో యిదమిత్థముగా చెప్పుట కవకాశము లేదు కావున మొదట సుందరి పాత్రానుశీలనము గావించి తరువాత మరికొన్ని ముఖ్యపాత్రలు పరిశీలింపబడును.

సుందరి వారకామినియేయైనను ప్రథమమున వివాహమాడి పతివ్రతగా జీవించుటకు నిశ్చయించుకొనెను. తాను వలచిన రామశాస్త్రి పేదయైనను నాతనికి మనసిచ్చెను. తల్లి చంద్రముఖి పసుపున నీలవేణియను చెలికత్తె యెన్నివిధముల వేశ్యావృత్తి నవలంబించమని బోధసేసినను, దృఢమనస్కయై వినలేదు. తల్లి చంద్రముఖి యెన్నివిధముల చెప్పినను వ్యభిచారము పాపహేతువని వాదించి, తాను నమ్మిన సిద్ధాంతమునకు తల్లి నొప్పించుటకు ప్రయత్నించెను. ఈమె శ్రీకృష్ణుని భక్తురాలు[1] చంద్రముఖి యాజ్ఞ నంగీకరింపకుండుటచే సుందరిని కఠినముగా దండింతునని బెదిరించినపుడీ సుందరి శ్రీకృష్ణునిపై భారము వేసి యా దేవదేవుడే తన నీ యాపదనుండి కాపాడవలయునని ప్రార్థించిన భక్తురాలు. తల్లి బాధలు భరించలేక వ్యభిచారమున కంగీకరించిన విధము చూడ సుందరి పరిస్థితుల ప్రభావమునకు లొంగిన మానసిక దుర్బలగా కవి యామెను చిత్రించి

1. "సీ॥ సన్మార్గగమన ప్రసాదయోగ్య రథంబు
ఆయురారోగ్య ఫలాస్పదంబు ..........
హరిపదధ్యానమధురతరామృతంబు."
సుందరీ విలాసము. ద్వి. రంగము 8 పుట

నట్లు స్పష్టమగుచున్నది. ధనార్జన విషయములో తల్లి బోధించిన ఉపాయముల నన్నింటిని యాచరించి చూపినట్లు ప్రహసనములో కన్పించును. మొదట పెద్ది శెట్టి దగ్గర ధనము, ఆభరణములు గైకొని రాత్రికి రమ్మనుమని పంపించెను. ఇదే విధముగా హుసేన్ దగ్గర రెండువేలరూపాయలు తీసుకొని వాని కోరిక తీర్చకయే గెంటివేసెను. శేషగిరినుండి కొంత ధనము తీసికొని, నవరత్న హారము తెమ్మని వేధించి, యంతవర కాతని కోరిక నెరవేర్చననెను. రామశాస్త్రి దగ్గర కూడ కొంత ధనము బంగారము తీసికొని చివరకు దొంగగా నిందించి జైలుపాలు చేసిన కపటి. పెద్దిశెట్టి అపరిమితమైన ధనము పొందియు తృప్తిలేక కాసులపేరు తెచ్చి యిచ్చినపుడు మాత్రము కోరిక తీర్తుననిన దురాశాపరురాలు చివరకు పెద్దిశెట్టి తెచ్చిన కాసులపేరు గైకొని ధరించి, తనకిష్టములేక పోయి నను, వృద్ధుడైన పెద్దిశెట్టితో ఏకశయ్యపై పరుండి యాతని కోరిక తీర్చెను. యువకులైన శేషగిరి, నారాయణలను కూడా యీ సుందరి తన హావభావవిలా సాములచే వెఱ్ఱియెక్కించి, అందకుండా వారిని వెతలపాలు చేసెను. మొదట కవి సుందరి పాత్రను కొంత సాధువర్తనురాలుగా చిత్రించినను, తరువాత వార కాంతలలో జాణతనమును ప్రదర్శించి, ధనార్జన చేసినట్లుగా పై ఉదంతముల వలన తెలియుచున్నది చివరకీ సుందరి వంచించిన వారిలో నొకరగు హుసేన్ చాందుఖాన్ భటులచేతనే వధింపబడినది. మంచివారు సహితము దుర్బోధలవలన చెడిపోవుదురనియు, వంచన యెపుడో వొకప్పుడు తత్ఫలిత మందించుననియు, యీ సుందరి పాత్రవలన మనకు కవి సందేశ మొసంగెను. ఇది దుఃఖాంతమైన ప్రహసనము. సుందరి పాత్ర చింతామణి నాటకములో చింతామణి పాత్రతో కొంతవరకు పోల్చవచ్చును. వేశ్యమాతను చంద్రముఖితో, సుబ్బిశెట్టిని పెద్దిశెట్టి తో, రామశాస్త్రి బిల్వమంగళుని పాత్రలతో పోల్చవచ్చును. చింతామణి నాటకము ప్రభావ మీ కవి యీ ప్రహసనములో యెక్కువ వరకు చూపించినట్లు తోచు చున్నది.

రామశాస్త్రి వివాహితుడు భార్యయున్నను వారాంగనావ్యామోహములో పడి మొదట ధనగౌరవములు కోల్పోయి చివరకు కారాగారముపాలైన దుర దృష్టవంతుడు. వేశ్యమాత యనుగ్రహము లేనిది యెంతటి వారికైన యిట్టి దుర వస్థ తప్పదను అంశ మీ రామశాస్త్రి పాత్రద్వారా కవి చాటెను, మొదట

ఇందుశర్మ యెంత చెప్పిన నాలకింపక యా సుందరి వదనారవిందమే సర్వమని నమ్మిన రామశాస్త్రి వేశ్యమాతచేత గెంటింపబడి చెఱసాలలో బంధింపబడి నపుడు పశ్చాత్తాపపడుచు అభివ్యక్తీకరించిన యీ క్రింది అభిప్రాయ మా రామ శాస్త్రికేగాక వేశ్యాలోలురై కులకాంతలను బాధించినవారందరికి వర్తించు ననుటలో అతిశయోక్తి లేదు.

"[1]ఉ॥ అన్నలు దమ్ములున్ హితులు నాప్తులు బంధువు లెందరో భువిన్
కన్నుల జూచియున్ హితవు గానగ జెప్పిన నాలకించకన్
వన్నెలమారియైన సతి వద్దకు జేరియు దెచ్చుకొంటియా
పన్నత నేడు వాటిలెను పాపవినాశన బ్రోవరా హరీ."

సుందరి వలచినవారిలో శేషగిరి, నారాయణ, పెద్దిశెట్టి, హుసేన్, చాందూఖాన్ మున్నగువారు కలరు వీరిలో శేషగిరి, నారాయణులు సుందరి చుట్టు తిరిగి ధనము సమర్పించుకొనియు, రిక్తహస్తులై హతాశులై వగల పొందిరి. ముఖ్యముగా శేషగిరి పొందిన విరహవేదన కవి కొంత విపులముగా వర్ణించెను. మన్మథోపాలంభము[2] చంద్రోపాలంభము[3] గావించిన తీరు ప్రబంధము లలో కవుల వర్ణనలకు తీసిపోని విధముగా నున్నది.

హుసేన్ రక్షకభటుడే యైనను స్త్రీలోలుడు. వారకాంతలయందు మక్కువ గలవాడు. చాందుఖాన్‌ను కాదని రెండువేలరూపాయలు సుందరికొసంగి యామె పొందు లభించక పగబట్టి యామెను హత్యచేయదలంచెను. శీరా శయ్యాగార ములో ప్రవేశించి, యా సుందరి పెద్దిశెట్టితో కలిసి యుండగా ధైర్యములేక వెనుదిరిగి పారిపోయిన పిరికిపంద. చాందుఖాన్ తన మిత్రుడగు హుసేన్‌కు జరిగిన యవమానము, ధననష్టము గ్రహించి, ప్రతీకారముగా పెద్దిశెట్టిని,

---

1. సుందరీవిలాసము చ. రం. 20 పుట.
2. "ఓయీ మన్మథా! నీ విట్టి క్రూరుండవగుటచే నిన్నా ముక్కంటి కంటి మంటలచే దగ్ధునిగావించె."
3. "చల్లదన మొసంగును గాదె చంద్రు డనుచు ………… మింట గనుగొన్న నాకును మంట లొదవె." సుందరీవిలాసము చ. రం. 23 పుట

సుందరిని సంహరించెను. ఇచట కవి హుసేన్‌తోనే వారిని చంపించినచో కొంత వరకు బాగుండెడిది.

స్త్రీవ్యామోహముగలవారిలో పెద్దిశెట్టి ముఖ్యుడు. ఇతడు ధనవంతుడు, వయోవృద్ధుడు. కాని వారకాంతలయందు అమితమైన ఆసక్తి కలవాడు. ఇందు నిమిత్తము అత్యధికధనమొసంగియు, బంగారు ఆభరణము లొసంగియు, (కాసుల పేరు) సుందరిని మచ్చిక చేసికొని తన కోరికను తీర్చుకొన్న కాముకుడు. ఇతడు రెండు తడవలు సుందరి ఇంటికి వచ్చి, ఆమె మాయమాటలు నమ్మి తిరిగిపోయెను. మూడవ తడవ మాత్ర మామె కోరిన కాసులపేరు తెచ్చి యిచ్చి యామెతో సౌఖ్యము పొందెను. వేశ్యాసంపర్కము కొఱకు అసత్యమాడుటకు సహితము వెనుదీయని అధర్మవర్తనుడు పుల్లిశెట్టి కలిసి యెటువెళ్ళుచుంటివని యడిగినపుడు పెద్దిశెట్టి తాను తన ఇంట్లో జరుగు శుభకార్యమునకు వేశ్యామేళమును నాట్యమునకు చెప్పుటకు వెళ్ళుచుంటినని అసత్యమాడెను. దీనినిబట్టి పెద్దిశెట్టి పాత్రను కవి మిక్కిలి హాస్యము కలిగించు పాత్రగను, అబద్ధములాడియైనను వ్యభిచరించు వృద్ధవిటుడిగను, చిత్రీకరించినాడని చెప్పవచ్చును. ఈతని సంభాషణము సహితము హాస్యము కలిగించుచున్నది. పెద్దిశెట్టి వేశ్యతో కలిసి నిద్రించు సమయమున చాందుఖాన్ ఖడ్గమునకు బలియై మరణించెను. కావున కవి యీ పెద్దిశెట్టి పాత్రవలన వేశ్యాసంపర్కమువలన కలుగు ధన మాన, ప్రాణ నష్టములను అద్దము పట్టినట్లు చూపించి, పురుషులలో వేశ్యాలోలత్వము ముఖ్యముగా వైశ్యులలోగల విచ్చలవిడి వేశ్యాలోలత్వము మాన్పుటకు కావలసిన సందేశ మీ పాత్రవలన కలిగించెననుటలో సందేహము లేదు. మిగిలిన పాత్రలలో వేశ్యమాత చంద్రముఖి, నీలవేణి పాత్రలను కవి గణికల వృత్తి కనుగుణమైన రీతిలో పోషించెను. ఇది ప్రదర్శనయోగ్యమైన ప్రహసనము.

## సాంఘిక పరిస్థితులు

ప్రహసన రచనాకాలము క్రీ.శ. 1926 ఈ కాలమున వేశ్యావృత్తి జీవనాధారముగలవారు ప్రతిగ్రామమున, పట్టణమునం దుండెడివారు, వార కాంతలు దేవాలయములలో ఉత్సవసందర్భమున సేవలముందు సంగీతము ద్వారా నర్తనము గావించెడివారు. వీరిని దేవవేశ్య లనెడువారు. ధనవంతుల

ఇండ్లలో వివాహములు, పండుగలు, తదితర శుభకార్యములు జరుగు సందర్భమున కూడా యీ గణికలు తమ మేళములతో వెళ్ళి, వారి కానందము కలిగించు విధముగా నర్తనము చేయుచు, హావభావవిలాసాదులచే, వారి నాకర్షించుచు మెప్పించి వారిచే ధన కనక వస్తు వాహనాదులను బహుమానములుగా పొందెడి వారు ఎక్కువవరకు వైశ్యులు, జమీందారులు, ధనవంతులు వేశ్యలకు ధన ధాన్యము లొసంగి, తమ కామము తీర్చుకొనెడివారని యీ ప్రహసనమువలన తెలియుచున్నది. ఆ రోజులలో యువకులు, వృద్ధులు కూడ యీ వేశ్యావ్యామోహములో పడి మగ్గుచుండిరనుట కీ ప్రహసనమే సాక్ష్యము పురుషులు వేశ్యలను ఉంచుకొనుట ఒక గొప్పతనముగా భావించుచుండిరి. ముఖ్యముగా వైశ్యులలో యీ దురాచారము రూపుమాపుటకే యీ ప్రహసన రచన ఉద్దేశించినది. దీనివలన యే కొద్దిమందిలో మార్పు వచ్చినను, కవి యీయనను యీ రచనకొఱకు ప్రోత్సహించిన ప్రకాశరావుగారలు ధన్యులని చెప్పవచ్చును.

ఈ ప్రహసనమునందు కవి పాత్రోచితభాష నుపయోగించిన ట్లీ క్రింది మాటలవలన తెలియును

1. ఓ ఔరత్ చాలా చక్కనివాడురే
2. దాని సూశింది మొదట నాకు హోశ్నెల్ల జల్ జల్ మంటుందిహై
3. హల్లా నీకి దయా కర్కె హా సుందర్కి మాకి షాది కరోరే హయ్యా
4. నాకు హెక్కడ్కి పోతె హక్కడ్కి సైతాన్ వాల హెదురైనవు.

ఈ ప్రహసనములో కవికి కభిమానమైన జాతీయములు (తెలుగు, సంస్కృతము) ప్రయోగించెను.

1. 'విత్తము కొద్ది వైభవము.'
2. 'వినాశకాలే విపరీతబుద్ధిః'
3. 'షడ్భాగం తు మనుష్యాణాం సప్తమం దైవచింతనమ్'
4. వేశ్యాదర్శనం పుణ్యం స్పర్శనం పాపనాశనం'

ఇట్టి వెన్నియో యీ ప్రహసనములో చోటుచేసికొన్నవి. ఇవన్నియు కవికి గల బహుముఖప్రజ్ఞ కుదాహరణలు. కవి తనకు వివిధకవితాప్రక్రియలలోగల సామర్థ్య మీ ప్రహసనములో ప్రదర్శించి నాడనుట నిర్వివాదాంశము. ఇంతటితో యీ ప్రహసనపరిశీలన ముగించి యీ కోవకే చెందిన వీధి భాగవతము పరి శీలనకు గైకొనబడును.

## ప్రద్యుమ్న విజయము (వీధినాటకము)

'ప్రద్యుమ్న విజయ' మను వీధినాటకమును కీ. శే. అనూరి మరింగంటి వేంకటనరసింహాచార్యులు శ్రీ కొల్లు పాపయ్య గారి ప్రోత్సాహముచే రచించిరి.[1] కవి నాటకారంభమున నాటకమును రేపాలనరసింహస్వామి కంకిత మొసంగెను. తరువాత కృతిపోషకులగు కొల్లు పాపయ్య వంశావళి వివరించి పిదప తన వంశా వళిని పేర్కొనెను.

కవి చేపట్టిన వివిధ రచనాప్రక్రియలలో వీధినాటక ప్రక్రియ కీ ప్రద్యుమ్న విజయము చక్కని నిదర్శనము ఈ వీధి నాటక పరిశీలనకు పూర్వము యీ ప్రక్రియారంభమును గురించి క్లుప్తముగా వివరించుటనావశ్యకము కాదు.

వీధినాటకమునకే వీధిభాగవతమని పర్యాయపదము. యక్షగానము క్రీ.శ. 16వ శతాబ్ధినాటికే సాహిత్యప్రక్రియగా తెలుగులో స్థిరపడినదని చెప్పవచ్చును. సంస్కృతములో యక్షగానప్రక్రియ లేదు. ఈ యక్షగానరచన గాన ప్రధాన మైనది. ప్రదర్శనయోగ్యమైనది. కొందరు లాక్షిణికులు యక్షగానములు రచించి వీని లక్షణములు పేర్కొనిరి ఇట్టివి ప్రోలుగంటి చెన్నశౌరి సౌభరి చరితము, చక్రపురి రాఘవాచార్యుల 'విప్రనారాయణచరిత్రము', కందుకూరు రుద్రకవి 'సుగ్రీవవిజయము', బాలపాపాంబ 'అక్కమహాదేవి చరిత్రము', కంకటి పాపరాజు 'విష్ణుమాయావిలాసము' మున్నగునవి పేర్కొనవచ్చును. దీనిని సంస్కృత

---

1. ప్రద్యుమ్న విజయము క్రీ శ. 19̊5 లో బెజవాడలోని వాణీముద్రాక్షర శాలయందు ముద్రింపబడినది. ఈ గ్రంథముద్రణకు కొల్లు పాపయ్యగారు ద్రవ్యసహాయము చేసిరి.

సాహిత్యములో సంబంధములేని కేవల దేశీ సంగీత సాహిత్యప్రక్రియగా భావించ
వచ్చును.

ఈ యక్షగాన నాటకములందలి గీతులకు దరువులను పేరు వాడుకలో
నున్నది. ఇవి రాగతాళప్రధానమైనవి. అందుకే వీధి భాగవతములు ప్రదర్శించు
నపుడు హార్మోని, మద్దెల, తాళములు వాయించువారు తప్పనిసరియగుదురు.
యక్షగానములు మొదట తెలుగుభాషలో వచ్చి, తరువాత తమిళ, కన్నడ భాషల
లోకి వ్యాపించెనని శిష్టా రామకృష్ణశాస్త్రిగారు అభిప్రాయపడిరి. క్రీ.శ. 17 వ
శతాబ్దము నాయకరాజుల కాలములో యక్షగానములకు సాహిత్యాదరణ పెరిగి
నట్లు సాహిత్యచరిత్రకారుల అభిప్రాయము తెలంగాణలో యక్షగానాలు చాలా
వచ్చినవి. మరింగంటి కవులలో పూర్వులు యక్షగానరచన చేసినారు. మొదట
ఈ నాటకములను యక్షులనెడి ఒక తెగవారే ప్రదర్శించుటచేత వీనికి యక్షగానము
లని పేరు వచ్చినవి. ఆ తరువాత వీనిని గ్రామములలో గల వీధులలో
ప్రదర్శించుటచేత వీధినాటకములనియు, వీనిని భాగవతులను (దాసరి) వారు
ప్రదర్శించుటచేత వీధిభాగవతములనియు పేరు వచ్చినవి. అధునిక కాలములో
ప్రతి గ్రామములో కులవిచక్షణ లేకుండ గ్రామీణులందరు కలిసి. ఔత్సాహిక
కళాకారులుగా నేర్పడి యీ వీధినాటకములు ప్రదర్శించుచున్నారు.

ప్రద్యుమ్నవిజయము నాలుగంకముల వీధినాటకము. ఇందు పాత్రలు
తెరలో ఉండి ఒక దరువును, తెరవెడలి మరియొక దరువును పాడి, యందు తమ
పేరు, పట్టణము, కీర్తిప్రతిష్ఠలనుగ్గడించి తాము వచ్చిన కారణములు తెలుపుదురు.
ఈ పాటలు పాత్రధారులు పాడునపుడు హార్మోనియం, మద్దెల తాళకాండ్రు,
దరువున కనుగుణముగా వాయించుచు పాడుదురు. పాత్రధారులు తదనుగుణముగా
నర్తింతురు. వీధిభాగవతములో గూడ నాటకములోవలె నటి సూత్రధారులు
ప్రవేశించి రంగస్థలముపై సంభాషణద్వారా యా రోజు ప్రదర్శించబోవు వీధి
నాటకముపేరు, దాని రచయిత పేరు తెలిపి, ఇది ప్రదర్శించుటకు ప్రోత్స
హించిన సభ్యుల నామము లుచ్చరించి, వారందరికి శుభములు కలుగుట కా
భగవంతుని ప్రార్థింతురు. క్లుప్తముగా యీ వీధినాటకములోని యితివృత్తమిదె.

కథాంశము

రంగస్థలముపై ప్రధాన హాస్యగాడు హాస్యము కలిగించు మాటలు మాట్లాడు చుండగా శంబరాసురుడను రాక్షసరాజు ప్రవేశించెను. రాజు, మంత్రి సంవాదము పిదప సభచేసి కూర్చునియుండగా శంబరుని భార్య ప్రమద ప్రవేశించెను. తన స్వప్నవృత్తాంతము తెలిపి, అశుభకరమైనదని ప్రమద వేదనపడెను. ఇంతలో నారదుడు ప్రవేశించి, శంబరునిచే నతిథిసత్కారములు పొంది, యోగక్షేమములు విచారించి, శంబరుని ప్రాణము నపహరించు శత్రువు ద్వారకలో శ్రీకృష్ణుని భార్యయగు రుక్మిణికి జన్మించినాడని తెలిపి ఆ పసికూన నపహరించి యంబుధి పడవేసినచో యాతనికి శత్రుబాధ యుండదని సలహా నొసంగెను.

ద్వారకలో రుక్మిణి వనమాలయను దాదితో తన చిన్నికుమారు నెవరో యపహరించిరనియు, యాతడు లేకుండ తాను జీవించుట దుర్లభమనియు, వాపోవు చుండగా చెలికత్తె లోదార్చిరి. పుత్రవియోగము భరింపజాలక రుక్మిణి విచారముతో మూర్ఛిల్లెను. చెలికత్తె లామె కుపచారములు చేసి భర్తృసన్నిధికి కొనిపోయిరి.

శ్రీకృష్ణుడు రుక్మిణివలన ప్రద్యుమ్నకుమారుని కోల్పోయిన విధము తెలిసికొని విచారించి విధివ్రాత తప్పదనియు, చారులను బంపి యాసేతుహిమాచలపర్యంతము వెదికింతుననియు, రుక్మిణి నోదార్చి యంతఃపురమునకు వెళ్ళెను

రతీదేవి లలితయను చెలికత్తెతో ప్రవేశించి, తన భర్తయగు మన్మథు బాసి, వియోగబాధతో దురపిల్లుచుండెను. లలిత యామె నోదార్చుచుండెను. ఇంతలో నారదుడు ప్రవేశించి యా రతీదేవి కామె భర్త మొదట ద్వారకలో రుక్మిణీదేవి గర్భమున ప్రద్యుమ్నుడను పేరుతో జన్మించెననియు, శంబరాసురుడా శిశువును తీసికొనిపోయి సముద్రములో వైచెననియు ఆ శిశువు నొక మీనము మ్రింగివేసినదనియు చెప్పెను. ఆమీనమును జాలరులు పట్టితెచ్చులోపల రతీదేవి 'దేవి యనుపేరుతో శంబరు నంతఃపురమున దాస్యము చేయుచు, మీన [illegible] బాలుని వడసి, పెంచి పెద్దచేసి, విద్యాబుద్ధులు, ధనుర్విద్యనేర్పి, [illegible]ంపచేసినచో యామె భర్త యామెకు దక్కునని సూచించి

[illegible]

నారదుని సలహాననుసరించి రతీదేవి మాయాదేవియను పేరుతో శంబరు నంతఃపురపరిచారికగా చేరెను. సకలోపచారములు చేయుచు మాయాదేవి శంబరునికి నమ్మిన బంటుగా పేరొందెను. జాలరులు పెద్ద చేపను తెచ్చి శంబరున కొసంగి బహుమానము గైకొని పోయిరి. సూపకారు లా చేపను కోయగా దాని గర్భమందు శిశువు కన్పట్టెను. మాయాదేవి ప్రమద నడిగి యా శిశువును గైకొని తానే స్వయముగా పెంచుచుండెను.

ఉపాధ్యాయుని దగ్గర ప్రద్యుమ్నుని చదివించుచు, తాను కూడ ధనుర్వేదము మున్నగు యుద్ధవిద్యలు నేర్పి యుక్తవయస్సు వచ్చువరకు వేచియుండెను. ప్రద్యుమ్నునకు యుక్తవయస్సు వచ్చునరికి మాయాదేవి కాతనిపై కలిగిన మోహ మాపుకొనలేక తన అభిప్రాయ మతనికి వెల్లడించెను. ప్రద్యుమ్ను డామె శృంగార చేష్టలు, భావగర్భితవాక్కులు, విరహవేదన గ్రహించి, కోపముతో నామె తన తల్లి యనియు, కుమారునితో రతికేళి కోరుట పాపమనియు హితోపదేశము చేసి యామె నా కోరిక నుండి మరల్ప ప్రయత్నించెను. కాని రతీదేవి తన శక్తి యుక్తుల నుపయోగించి ప్రద్యుమ్నునితో సౌఖ్యమందుట కువ్విళ్ళూరుచుండెను. రతీదేవి ప్రద్యుమ్నుపై మోహమాపుకొనలేక కౌగిలించుకొనబోవ నాత డామెను తోసివేసి, ఆగ్రహముతో తూలనాడెను. ఈ సంధర్భమున నారదుడు ప్రవేశించి, ప్రద్యుమ్నునకు పూర్వజన్మవృత్తాంతము తెలిపి, రతీదేవి చెప్పినవి యథార్థ విషయములనియు నామె కోరిక కాదనకూడదనియు, తెలుపునపుడు ఆకాశవాణి కూడ యథార్థమని చాటెను. దీనితో ప్రద్యుమ్నుడు రతిని తనభార్యగా గ్రహించి శంబరునితో యుద్ధమునకు తలపడెను. ప్రద్యుమ్ను శంబరులకు ఘోర యుద్ధము జరిగెను. ఒకరి యస్త్రముల నొకరు ఖండించుకొనుచు, ఒకరినొకరు తూలనాడుకొనుచు భయంకర యుద్ధమొనర్చిరి. చివరకు ప్రద్యుమ్నుడు శంబరుని సంహరించెను.

శంబరుని భార్య ప్రమద భర్త మరణమునకు దుఃఖించి, మహాసంస్కారములు చేసెను.

ద్వారకానగరాంతఃపురమున శ్రీకృష్ణుడు రుక్మిణితో తమ పుత్రునిగూర్చి విచారించుచుండగా కోటవాకిట ప్రద్యుమ్నుడు రతీదేవి కలిసి వచ్చుచుండిరి.

వారిని చూచిన రుక్మిణి యా యువకుడు తన కుమారుడేమో నని భర్తతో ననెను. శ్రీకృష్ణు డామె నోదార్చుచు మానవులను పోలిన మానవులుండుట లోకసహజమనియు, సముద్రమునందుబడిన కుమారుడు జీవించుట అసాధ్య మనియు, తెలుపుచుండగా నారదుడు ప్రవేశించి, రుక్మిణీ కృష్ణుల కా వచ్చువారు ప్రద్యుమ్న రతీదేవులని తేటపరిచెను. ప్రద్యుమ్నుడు శంబరుని యుద్ధమందు నిర్జించిన విధము వివరించి వారి కెదురుగా నేగి సాదరముతో తోడ్కొని రండని పంపెను. శ్రీకృష్ణుడు మొదలగువారు రతీప్రద్యుమ్నులకు శాస్త్రోక్తముగా బ్రాహ్మణోత్తములచే వివాహము జరిపించి ఆశీస్సు లొసంగిరి. శ్రీకృష్ణుడు రతీదేవిని తన కుమారుని కాపాడి తెచ్చినందుల కభినందించి సంతోషించెను. కవి—నారదునితో ఫలశ్రుతి చెప్పించి నాటకమును సమాప్త మొనరించినాడు.

పా త్ర పో ష ణ

ప్రద్యుమ్నవిజయమను నీ వీధినాటకములో నాయకుడు ప్రద్యుమ్నుడు. రుక్మిణీకృష్ణుల కుమారుడు పుట్టుకతోనే తల్లిదండ్రుల నెడబాసి కష్టములపాలైన పసికూన నారదప్రేరితుడై శంబరాసురుడు ప్రద్యుమ్నుని దొంగిలించుకొనిపోయి సాగరమున వైచినను జీవించిన దీర్ఘాయువు మత్స్యము మ్రింగినను జాలరులచే తిరిగి శంబరాసురుని వద్దకే వచ్చుట, అంతకు పూర్వమే భార్యయైన రతీదేవి మాయాదేవియను పేరుతో నాతనికై వేచియుండుటా ప్రద్యుమ్నుని అదృష్టము కావుననే మత్స్యమునుండి వెలువడిన బాలుని చూచి రతీదేవి ప్రమదనడిగి పెంచు కొనుట జరిగినది. వివిధవిద్యలు ఉపాధ్యాయులనుండి నేర్చుకొని, అభిమానపాత్ర మైన విలువిద్యను కూలంకషముగా నేర్చుకొనిన పట్టుదలగలవానిగా ప్రద్యుమ్నుని పాత్రను కవి చిత్రీకరించెను.

యౌవనవంతుడైన ప్రద్యుమ్నుని చూచి రతీదేవి మోహము నాపుకొనలేక తన కోరిక వెల్లడించినపు డాతడు తనను పెంచి పెద్దచేసినది తల్లికాని భార్య కాదని నిరాకరించిన నీతివిశారదుడు. రతీదేవి పదేపదే కవ్వించి, తన అంద చందములచే వశపరచుకొనుట కాశించినను, చివరకు కౌగిలించుకొన ప్రయత్నించి నను చలించని దృఢమనస్కుడు. ఈ సందర్భములో కవి చిత్రాంగి సారంగధర నాటకములోని శృంగారము పోలిన శృంగార మిందు ప్రవేశపెట్టెను. సారంగ

ధరునివలెనె ప్రద్యుమ్నుడు కూడ పరస్త్రీ తల్లియనియును, యామెను గవయుట రౌరవాదినరకముల పాలగుదురనియు తెలిపి, యామె నా ప్రయత్నమునుండి విరమింప జేయుటకు ప్రయత్నించెను. ఈ సందర్భమున కవి రతీప్రద్యుమ్నుల సంవాదరూపమునగల యీ క్రింది సీసపద్యము తిలకించినచో యాతని మనోనిశ్చయము మనకు తేటపడగలదు.[1] యథార్థవిషయమును నారదునిచేతను ఆకాశవాణిచేతను తెలిసికొని, తన తప్పు క్షమించుమని రతీదేవిని ప్రార్థించి, యామెను భార్యగా అంగీకరించిన ధీశాలి. తన కాగర్భశత్రువైన శంబరుని సంహరించుట కాలస్యము లేక సన్నద్ధుడై, యుద్ధమునకు పోయినపుడు శంబరుడు ససైన్యుడు కాని ప్రద్యుమ్నునకు సైన్యము లేదు. ఏకాకియైనను ధైర్యము మొక్కవోని పరాక్రమవంతుడు. భీకరయుద్ధములో శత్రువు వేయు ఆయుధములన్నియు ఖండించి, నిశితాయుధముచే శంబరుని సంహరించి పగదీర్చుకొన్న వీరశిఖామణి. రతీదేవిని గైకొని తల్లిదండ్రులున్న ద్వారకకేగి, వారిని సంతోషపెట్టి, వారి యాశీస్సులు గైకొనిన వినయసంపన్నుడు. ఇట్లీ వీధినాటకములో ప్రద్యుమ్నుని పాత్ర నాటకమునందంతటను ప్రవర్తిల్లి యిందలి నాయికయైన రతీదేవిని పొంది సౌఖ్యాంబుధి నోలలాడుటవలన కవి యీ పాత్రను మిక్కిలి ఉదాత్తముగా పోషించెనని చెప్పవచ్చును.

ఈ నాటకములో నాయిక రతీదేవి. రతీదేవి భర్త మన్మథుడు శంభుని మూడవకంట చిచ్చైపోయిన తరువాత గౌరీశంకరుల వరము పొంది పతికై విలపించుటతో యీమె పాత్రను కవి యారంభించెను. నారదముని తెలిపిన

---

1. "సీ॥ జలబుద్బుదమువంటి శారీర సౌఖ్యంబు
ప్ర॥ తలపోయుటది నాకు తగునె తల్లి
ర॥ సౌఖ్యార్థినై నీదు సరసచేరుటగాదు
పరమేష్ఠి విధి యిది ప్రాణనాథ
.... .... .... ....
పుత్రభావంబు వదలక బ్రోవుమమ్మ
భక్తిచేతను నీ కాళ్ళ బడెదనమ్మ."
ప్ర. వి. తృ. అం. 65 పుట

ఉదంతము విని, భర్త పొందుగోరి, శంబరుని అంతఃపురములో దాసిగా యూడిగములు చేయుచు వారికి విశ్వాసపాత్రురాలిగా వాసిగాంచెను. సూపకారులు మత్స్యము ఛేదించినపు డందు బాలుడుండుట చూచి, రాణియగు ప్రమద ననునయించి, యా బాలుని పొందిన సమయోచితప్రజ్ఞాశాలిని. తాను సంరక్షకురాలుగా నే శంబరు నగరములోగల ఉపాధ్యాయులచే ప్రద్యుమ్నునకు విద్యాబుద్ధులు, అస్త్రవిద్యానైపుణ్యము నేర్పించిన దూరదృష్టి గలది. స్త్రీ సహజగుణములైన హావభావవిలాసాదులచే తన భర్తయైన, యౌవనము పొందిన ప్రద్యుమ్నుని నాకట్టుకొనుటకు విశ్వప్రయత్నము చేసిన సౌజన్యవతి. తా నెంతచెప్పినను వినక భీష్మించుకొని కూర్చున్న ప్రద్యుమ్నుని ముందు నిస్సహాయురాలిగా భగవంతుని ప్రార్థించిన భక్తురాలు. ఒక సందర్భములో ప్రద్యుమ్నుని పొందలేని తన జీవితము వ్యర్థమని వైరాగ్యము కలిగి, ఆత్మహత్యకు సైతము వెనుదీయని సాహసురాలు.[1] ప్రద్యుమ్నుడు నారదు నుపదేశము విని ఆకాశవాణి వాక్కు విని, రతిని భార్యగా నంగీకరించెను. కాని రతీదేవి ప్రద్యుమ్నుని కర్తవ్యము తెలిపి, మొదట శంబరుని తుదముట్టించుటయని హితోపదేశము చేసి, తన సౌఖ్యము తాత్కాలికముగానైనను విరమించుకొనిన దృఢచిత్త. శంబరవధానంతరము ప్రద్యుమ్నునితో ద్వారరకు పోయి, అత్తమామల యాశీస్సులు పొంది శాస్త్రీయముగా వివాహము జరిపించుకొని, భర్తతో సౌఖ్యము పొందిన ధన్యజీవి. ఈ విధముగా కవి యీ రతీదేవి పాత్ర నొక నిష్కల్మషమైన స్త్రీమూర్తిగా తీర్చిదిద్దుటలో సఫలత నొందెను.

ఈ వీధినాటకములో శంబరుడు రాక్షసరాజు. సామాన్యముగా మానవ బలహీనతలైన మరణమునకు భయపడు స్వభావము కలవాడు. హిరణ్యకశిప, రావణ కంసాదులవంటి దుర్మార్గుడగుటచే నారదుని ద్వారా తన్ను చంపు బాలుడు రుక్మిణికి జన్మించినాడని తెలియుటచే వెంటనే యా బాలుని తుదముట్టించ వలయునని, అంతఃపురములో రుక్మిణి పడకయందు గల ప్రద్యుమ్న కుమారుని మాయచే

---

1. "చ॥ గరళము లేదె మ్రింగుటకు కత్తి లభింపదె గొంతు కోతకున్........
చరణములాన సుమ్మి నను జాగొనరింపక కౌగిలింపుమా."
ప్ర. వి. తృ. అం. 67 పుట

దొంగిలించి సాగరములో బడవేసిన పిరికివాడు. తన జీవితము తుదముట్టించు శత్రువు తన యంతఃపురముననే పెరుగుచున్నను గ్రహించలేని మూఢుడు. ప్రద్యుమ్నుడు పెరిగి పెద్దవాడై, అస్త్రవిద్యలు నేర్చుకొని శంబరునిపై యుద్ధము ప్రకటించువరకు తెలిసికొనలేని దూరదృష్టిలేనివాడు యుద్ధములో మాత్రము ప్రద్యుమ్నునితో వీరోచితముగా పోరాడి మరణించెను. కవి యీ శంబరుని పాత్ర నీ నాటకములో కపటిగను, నిర్దయునిగను, రాక్షసప్రవృత్తి కనుగుణమైన రీతిలో చిత్రించెను. ఫలితము గూడా తదనుగుణ్యముగనే శంబరుడు పొందెను.

శ్రీకృష్ణుని పాత్ర కిందు కవి తక్కువ ప్రాధాన్యము నొసంగెను. రుక్మిణి తన కుమారుని కోల్పోయి విలపించుచురాగా విధివ్రాత కెదురీదలేమని ఓదార్చి బాలుని వెదికించు ప్రయత్నము చేతునని మాత్రము పలికెను. శ్రీకృష్ణుని పాత్రను కవి భగవంతునిగా కాక సామాన్యరాజుగా మాత్రమే పోషించెను. రతీప్రద్యుమ్నులు కోట వాకిట నున్నపుడు చూచిన రుక్మిణి యాతని తన కుమారుడని భావించెను. కాని శ్రీకృష్ణు డామెతో మనుష్యుల బోలిన మనుష్యు లుండుట సంభవమపియు, సముద్రములో బడి మరణించిన పుత్రుడు జీవించుట సాధ్యము కాదనియు, సామాన్యుని రీతిలో పలికెను. నారదముని వలన ప్రద్యుమ్నుడని తెలిసికొని, పట్టరాని యానందముతో శాస్త్రీయముగా వివాహమున కేర్పాట్లు గావించి, యాశీస్సు లొసంగిన తండ్రిగా కవి శ్రీకృష్ణుని పాత్రను ఉదాత్తముగా చిత్రించెను.

రుక్మిణి పాత్ర నీ నాటకములో స్త్రీసహజముగా తన బిడ్డ విషయములో నెంత యార్తి నొందునో సహజకోమలముగను, దైన్యముగను చిత్రించెను. శ్రీకృష్ణుడోదార్చినను, చెలికత్తె లోదార్చినను, కన్నతల్లి తన పుత్రవియోగమున కేవిధముగా సహించలేదో ఆ విధముగా సహజకోమలముగా కవి యీ రుక్మిణిపాత్రను పోషించెను.

ఈ నాటకములోని మరియొక ముఖ్యపాత్ర నారదునిది. ఈ నారదుడు ప్రతియంకములోను మనకు ప్రత్యక్షమగును. మొదట శంబరుని దగ్గర కేగి యాతని ప్రాణము హరించు శత్రువు ద్వారకలో రుక్మిణికి పుత్రుడుగా జన్మించి నాడని వెంటనే శత్రుసంహారమునకు కర్తవ్య ముపదేశించెను. తరువాత

రతీదేవిని కలిసి భర్తృవియోగముచే దుఃఖించుచుండగా, ప్రద్యుమ్నుడీ మన్మథుడనియు, నాతడు పుట్టగనే శంబరుడు తస్కరించి, సముద్రమున బడవైవగా మత్స్యము మ్రింగెననియు, ఆ మత్స్యమును జాలరులు పట్టి శంబరునికే బహుమాన మొసంగిరనియు, సూపకారులు ఛేదించునపు డామె యచట మాయాదేవిగా నుండి యా శిశువును గ్రహించి, పెంచి పెద్దచేసి, అస్త్రవిద్యలు నేర్పి, శంబరుని సంహరింపజేసినచో, తన భర్త తనకు దక్కునని రతీదేవితో చెప్పి నిష్క్రమించెను. ఈ సందర్భమున కవి నారదుని పాత్రను భూతభవిష్యద్వర్తమాన కాలములు తెలిసిన జ్ఞానిగా తీర్చిదిద్దెను. ప్రద్యుమ్నుడు పెరిగి పెద్దవాడై రతీదేవి కోరికను తిరస్కరింపగా, తిరిగి నారదుడా ప్రదేశమున ప్రత్యక్షమై ప్రద్యుమ్నుని పూర్వజన్మ వృత్తాంతము తెలిపి, రతీదేవిని భార్యగా స్వీకరింపుమని హితోపదేశము చేయుటయేగాక, ఆకాశవాణిద్వారాగూడా చెప్పించి, భార్యాభర్తలను కలిపిన హితైషి. చివరకు శ్రీకృష్ణుడు రుక్మిణి ప్రద్యుమ్నుని చూచి గుర్తింపలేనపుడు, తిరిగి నారదు డరుదెంచి విషయ మంత వివరించి, వారికి కుమారుని, కోడలు నప్పగించి తన కార్యము ముగించుకున్న కార్యసాధకుడు. కలహభోక్త కావున ప్రద్యుమ్న శంబరులకు కయ్యము కల్పించి, దీనివలన ఆనందము పొంది కలహభోక్తయను నామము సార్థక మొనరించుకొనిన సురముని. పై విధముగా నాటకకర్త యీ దేవముని పాత్రకు విశేషప్రాధాన్య మొసంగి అత్యుత్తమముగా చిత్రించెను.

రస పోషణ

ఈ నాటకములో శృంగారరసము ప్రధానరసము. వీర, కరుణ, హాస్య, భక్తి రసములు అంగరసములుగా సమయోచితముగా పోషింపబడినవి. తృతీయాంకము మొత్తము రతీ (మన్మథుల) ప్రద్యుమ్నుల సంవాదము రూపమున కవి శృంగారమును పోషించెను. ఇందు రతీదేవి భర్త పొందుగోరి ప్రదర్శించిన హావభావవిలాసాదులు, విరహవేదనలు ఆలింగన, చుంబనాది ప్రయత్నములు శృంగారమునకు పరాకాష్ఠలనియే చెప్పవచ్చును. అంతకుముందు రతీదేవి మన్మథ విరహముచే విప్రలంభమును గూడా కవి పోషించెను. చివరకు ప్రద్యుమ్నుడు రతీదేవిని భార్యగా నంగీకరించి వివాహమాడి, సౌఖ్యాంబుధి నోలలాడుటచే యిందు శృంగారము పరిపుష్టి నొందించుటలో కవి కృతకృత్యుడైనాడని చెప్ప

వచ్చును. కుమారుని కోల్పోయిన రుక్మిణి దుఃఖసమయమున, భర్త (శంబరుని) మరణానంతర మాతని భార్య ప్రమద దుఃఖించిన సమయమున కవి కరుణ రసమును ఔచిత్యవంతముగా పోషించెను.

శంబరప్రద్యుమ్నుల యుద్ధఘట్టములో వీరరసము పోషించిన తీరు కవి చాతుర్యమునకు మచ్చుతునక. ప్రతిపాత్ర ప్రవేశించిన సందర్భమున హాస్యగాని పాత్రద్వారా సంభాషింపజేసిన తీరు, నారదుని సంభాషణద్వారా కూడా కొన్ని సందర్భములలో హాస్యరసము నుప్పతిల్లజేయుటలో కవి మిక్కిలి సమయ స్ఫూర్తిని ప్రదర్శించెను. నారదుని పాత్రద్వారా కవి కొంత భక్తిరసమును కూడా పఠితలకు చవిచూపించెను.

ఈ వీధినాటకములో కవి పాత్రలను ప్రవేశపెట్టిన తీరు ఉత్తమముగా నున్నది. పాత్రలు పరదా వెనుకనుండి యొక కీర్తన చదివి, తెర వెడలు దరువుతో రంగస్థలముపై చిందులు వేయుచు ప్రవేశింతురు. దరువులు పాడుటకు కావలసిన రాగములు కవియే నిర్ణయించుట చూడ వీరికి సంగీతజ్ఞాన మపారమని తోచు చున్నది. కొన్ని చోట్ల పద్యములు, మరికొన్నిచోట్ల పాటలు కూర్చి ప్రేక్షకుల (పాఠకుల) నాకర్షించుటలో కవి మిక్కిలి నైపుణ్యము ప్రదర్శించెననుటలో అతిశ యోక్తి లేదు. ప్రతినాటకములో కవికి మిక్కిలి యిష్టములైన జాతీయముల నుప యోగించుటలో వీరి ప్రతిభ అత్యద్భుతముగా భాసించుచున్నది. వీరికి జాతీయముల నుపయోగించుటలోగల మక్కువ అనన్యసామాన్యము. దాదాపు పది నాటకములు రచించిన ప్రతిభాసంపన్నుడైన యీ నాటకకర్త తెలుగు నాటకకర్తల సరసన స్థానము పొందుట సమంజసమని చెప్పవచ్చును.



# లఘు కృతులు

## ఆంధ్ర శతక సాహిత్యమున మరింగంటి వేంకటనరసింహాచార్యుల శతకములకుగల స్థానము

ఇతరరచనలతోపాటు వేంకటనరసింహాచార్యులుగారు లఘుకృతులను నగా శతకములు, తారావళులు మున్నగువానిని కూడ రచించిరి. వీనిలో ఆరు తకములు, నాలుగు తారావళులు, ఒక హరికథ, ఒకస్మృతి పద్యావళి మున్నగు వి ప్రసిద్ధమైనవి. శతకరచన తెలుగు సాహిత్యములో 12వ శతాబ్దినుండి కవి ండితుల ఆదరాభిమానముల పొందిన ప్రక్రియ తారావళి కూడ ముక్తకపద్య చనలలో చేరు ప్రక్రియ. ఇరువదియేడు పద్యముల సముదాయము. ఈ ప్రక్రియలు ఆధునికకవుల ఆదరము నొందుట పరిశీలింపదగినది.

సింగరాచార్యులుగారు సీతాపతి శతకము, ఈ కవికి పూర్వులు వీరి తాతగారి తండ్రి వేం. రా. చా. కేశవస్వామి శతకరచన చేసినారు.

ఇరువదవ శతాబ్దములో ఆధునిక కవులు శతకసాహిత్యప్రక్రియను ఆదరించుచు శతకరచనలు కొనసాగించుచున్నారు. దాశరథి, నార్ల, మొదలగు కవులు శతకములు రచించిరి. వీనిలో భక్తి, హాస్యము, నీతిబోధాత్మకము లధికములు. ఇదే కాలములో గల వేంకటనరసింహాచార్యులు సమకాలిక కవుల రచనాప్రక్రియలైన శతకములు కూడ రచించెను. వీరి శతకము లివి.

1. రాఘవశతకము.
2. గోపాలచూడామణి శతకము.
3. మానసప్రబోధ శతకము
4. కళ్ళచెర్వు సీతారామశతకము
5. శ్రీమత్తిరుమలాపురభోగసుందర సీతారామచంద్ర శతకము.
6. శ్రీరంగాపుర సత్యనారాయణ శతకము.

కవి ఒక మానసప్రబోధశతకము తప్ప మిగిలినవన్నియు భగవంతుని భక్తిని కొనియాడుచు రచించబడినవి. ఇందు ఆత్మాశ్రయకవిత్వము ప్రధానముగా చోటుచేసికొనినది. లక్షణకర్తలు చూపించిన శతకలక్షణములనీ కవి చక్కగా పాటించెను. ఛందోనియమము, సంఖ్యానియమము, మకుటనియము కవి పాటించినట్లు వీరి శతకములవలన తెలియుచున్నది. వీరి శతకములన్నియు ముద్రితములే కాని మొదటి రచనయగు రాఘవశతకము నేడలభ్యము. కవి యీ శతకము క్రీ.శ. 1920 ప్రాంతమున రచించినట్లు కవి యితరశతకములలో లభించిన యాధారములవలన తెలియుచున్నది. రెండవది గోపాలచూడామణి శతకము ఇందలి విశేషము లివి.

## గోపాలచూడామణి శతకము

ఈ శతకము విభవనామసంవత్సర కార్తీకశుద్ధ పౌర్ణమిన పూరించిన ట్లీ శతకము చివరిపద్యమున పేర్కొనెను. ఈ శతకము క్రీ.శ. 1930 లో ముద్రింపబడినది.[1] భగవదంకితమైన యీ శతకమునందు (108) పద్యములు కలవు గోపాలచూడామణియను మకుటముతో వ్రాయబడినది. ఇందు (46) శార్దూలవిక్రీడితములు, (62) మత్తేభవిక్రీడితములు. ఈ శతకమున భక్తిరస మంతట తొణకిసలాడుచున్నది. కవి తన శతకములో ఆత్మాశ్రయకవితాధర్మము నెల్లెడల వ్యక్తపరచెను. ఈ శతకములో 47వ పద్యమునుండి 56వ పద్యము వరకు దశావతారములను వర్ణిరిచెను. ఈ శతకములోగల కొన్ని విశేషము లివి.

---

1. గోపాలచూడామణి శతకము కీ॥ శే॥ సముద్రాల నరసింహము ఓరుగల్లు వాస్తవ్యుల ద్రవ్యసాహాయ్యమువలన శ్రీ వెంకటేశ్వర ముద్రణాలయము నందు క్రీ. శ. 1930 లో ముద్రించబడిది.

"1శా॥ క్షీరంబందున నీరు సమ్మిళితమై జెన్నార రాయంచ త
న్నీరంబు న్విడి క్షీర మేవిధిని వన్నె ల్మీరగా గ్రోలు నా
తీరు న్నా దురితాళి లెక్కిడక హృద్వీధిన్ సదా ప్రేమ చే
కూర న్మత్కృతసత్క్రియల్ గొనగదే గోపాలచూడామణీ."

కవి సామాన్యమానవుడు జీవితములో ఎన్నో దురితము లాచరించి చివర కొక సత్క్రియ (శతకరచనము) చేసి, భగవదంకితము చేయుచున్నాడనియు, తన దురితములన్నియు విసర్జించి భగవత్సేవకొర కర్పించిన తన శతకమును గ్రహించమని భగవంతుని ప్రాధేయపడును. క్షీరనీరమిశ్రమమును రాయంచ వేరుచేసి, నీరమును వదలి క్షీరము గ్రహించుట సామాన్యధర్మము. ఇట్టి ధర్మ మునే భగవంతుడు తనయందు పాటించి, తన దోషములు వదలి, సత్క్రియను (శతకరచనము) మాత్రమే గ్రహించమని ప్రాధేయపడుట కవి భక్తితత్పరతకు తార్కాణము.

ఎండమావులలో నీటికొఱకు వెదకి నిస్పృహచెందిన మానవుని మాదిరిగా యీ సంసారసాగరమీదలేక అలమటచెందిన తన కాశ్రయము కల్పింపుమని ప్రాధేయపడుచు కవి చెప్పిన పద్య మిట్లున్నది.

"2మ॥ వరశాఖా కిస పుష్పపుంజములచే పాంథాళి తాపంబు సు
స్థిరరూపంబున దీర్చు భూరుహము నుద్దీపింప నీవట్టులే
పరమప్రీతి జెలంగ నా కిపుడు త్వత్పాదాశ్రయచ్ఛాయ జే
కురజేయ న్మదిబూనవయ్య యనఘా! గోపాలచూడామణీ!."

పాంథులు ప్రయాణబడలికకు తోడు సూర్యాతపమును భరించలేనపుడు దారిలోగల దట్టమగు శాఖలచే, పత్ర, పుష్ప ఫలములచే విరాజిల్లు వృక్ష మా పాంథులకు ఆశ్రయము కల్పించి, బడలిక తీర్చును. అట్లే కవి (ఆత్మా శ్రయత్వము) తాను సంసారసాగరము నీదలేక అలసి, తరించు నుపాయము

1. గోపాలచూడామణి శతకము. 5 పద్యము.
2. " " 19 "

గానలేక బడలికచెందినాడననియు, తన కా భగవంతుని చరణములే ఆశ్రయము లనియు, ఆశ్రయ మొసంగి తన ఖేదము తొలగించి, ప్రేమతో కాపాడవయునని కవి భగవంతు నిందు ప్రాధేయపడిన విధము మిక్కిలి ప్రశంసార్హము. వైష్ణవ భక్తి ప్రపత్తిమార్గము, శరణాగతి తత్త్వ మీ పద్యమున అంతర్గర్భితముగా భాసించుచున్నది.

భగవద్భక్తి శతకమం దంతటను తొణికిసలాడించుచున్నను, యీ కవి అలంకారముల నుపయోగించుటలో కూడ ప్రతిభను చూపించిన పద్యమిది.

"[1]మ॥ కరిణిన్గూడగనెంచి గుల్మయుతమౌ కాంతారకూపంబులో
నురుమోమోహంబున గూలు మత్తగజమ ట్లొప్పారు సంసారదు
స్తరనీరాశిని జెందు నన్నెటుల చేతంబందు భావింతువో
కురుకాంతారకుఠార! బోవ తగవా? గోపాలచూడామణీ."

శతకము చివర (108) వ పద్యములో యీ శతకము చదివినవారికి, విన్నవారికి శుభములు కలుగునని ఫలశ్రుతి చెప్పి ముగించెను.

## మా న స ప్ర బో ధ శ త క ము

శతకములలో తృతీయమైనది మానసప్రబోధశతకము. ఇందు నూరు (100) పద్యములు కలవు. ఇందు (42) ఉత్పలమాలావృత్తములు, (58) చంపక మాలా వృత్తములు కలవు. ఈ కవి భార్య శ్రీమతి ఆండాళమ్మ చిత్రభాను నామ సంవత్సర మాఘ బహుళ దశమినాడు స్వర్గస్థురాలైనది. కవి మానసిక పరితాప ముతో యీ మానసప్రబోధ శతకమును రచించి, భార్యకే యంకిత మొసంగెను[2] ఇటువంటివి కొన్ని మాత్రమే ఉన్నవి. వీరి రచనలలో నరాంకితమైనదిదొక్కటే.

---

1. గోపాలచూడామణి శతకము 78 పద్యము.
2. ఈ మానసప్రబోధశతకము క్రీ. శ. 1942లో రచించినప్పటికి క్రీ. శ. 1946లో హైద్రాబాద్‌లోని ప్రేమసాగర ముద్రణాలయమునందు దాతల ధనసాహాయ్యమున ముద్రింపబడినది.

దీనినిబట్టి కవి భగవద్భక్తికి ప్రథమ స్థానమును భార్యయందలి అనురాగమునకు ద్వితీయస్థానమొసంగెనని భావించ వచ్చును. భార్య మరణము వలన కలిగిన మానసికవేదనకు లోనై, ఐహిక సుఖముల రోసి, మోక్షమే ప్రధానమని భావించి యీ శతకరచన గావించినట్లు యిందలి పద్యములవలన తెలియును. పద్యము లందంతటను మానవజీవితము క్షణభంగుర మైనదనియు, దైవభక్తితో పురుషోత్తము నాశ్రయించినచో నాశములేని శ్రీహరిని పొందుదుమని బోధించి నట్లు స్పష్టము. శతకలక్షణము లన్నియు యిందు పాటించబడినవి.

మానవులు జ్ఞానవంతులైనను అజ్ఞానులైన తిర్యక్కులవలె సంచరించుట కనిపించును. ఇట్టి తార్కాణమును చూపించుచు వ్రాసిన పద్యమిట్లున్నది.

"[1]చం॥ కమలమరందమానుచు సుఖంబుగనుండెడు షట్పదంబు దు
ర్భ్రమగొని హేమపుష్పరసవాంఛను దేలగ జేరి తత్పరా
గము కనులందు రాలి మృతిగాంచిన కైవడి నీవ కాంక్షతో
నమసెద వేలమూఢమనసా! పురుషోత్తము నాశ్రయింపుమా."

జీవకోటిలో మానవజన్మ పరమోత్కృష్టమైనది. మానవుడు అస్థిరమైన ఐహికసుఖముల కాశించక శాశ్వతసుఖమైన భగవంతు నాశ్రయించి మోక్షము పొందుట జీవితలక్ష్యము కాని సాధారణముగా మానవులు క్షణభంగురమైన తనువును శాశ్వతమనుకొని, ఐహికసుఖము లనుభవించుటయే జీవితపరమావధి [illegible] భ్రమపడి, చివరకు పుట్టుచు, చచ్చుచు దుఃఖము లనుభవింతురు. ఈ విషయమునే కవి పై పద్యములో షట్పదము కమలములోని మకరంద మాస్వాదించి సుఖముగా నుండక, సంపెంగ సువాసన కాశించి, తద్రసము గ్రోలవచ్చి, తత్పరాగము కనులలో రాలుటవలన నశించును. ఇట్లే మానవుడు క్షణికసౌఖ్యముల కాశించక గాక, శాశ్వతమైన మోక్షము పొందుటకు పురుషోత్తము నాశ్రయించవలయునని కవి ప్రబోధించెను.

భక్తి వేదాంతప్రధానమైన విషయము చర్చించు పద్యములలో శరీరము పాంచభౌతికమైనదనియు, జీవుడొక్కడే స్థిరుడనియు, అస్థిరశరీరము [illegible]

1. మానసప్రబోధశతకము 17 పద్యము

విశ్వసించకు, జీవుడు పరమాత్మ నాశ్రయించి, మోక్షము పొందుటకు భక్తి, జ్ఞాన వైరాగ్యముల ఆవశ్యకత నుగ్గడించు పద్య మిట్లున్నది.

"[1]చ॥ మలినముతోడ యుద్దమును మావిని గర్భములోని పిండమున్
విలసితధూమజాలమున వేబడు నగ్ని విధంబు జ్ఞాన మీ
యిలగల కోర్కెలన్ బొదువు టెంతయు నిశ్చయమౌ టెరింగి చెం
చల సుఖమున్ దలంచి మనసా పురుషోత్తము నాశ్రయింపుమా"

మలిన మద్దమును కప్పివేయును. పిండమును మావి గప్పివేయును. అగ్నిని ధూమము గప్పివేయును అట్లే జ్ఞానమును కోర్కెలు కప్పివేయును. భగవంతుని పొందుటకు భక్తి, జ్ఞాన వైరాగ్యము లనుసరణీయములు. ఇట్టి మోక్షమార్గమున కాటంకములు గలిగించు కోర్కెలను తొలగించి, భగవంతుని పొందవలయునను సందేశము కవి పైపద్యములో సోపపత్తికముగా నొసంగెను. అలంకారములు సామెత లీ శతకములో సమయోచితముగా ప్రయోగించిన తీరు ప్రశంసార్హము.

## శ్రీ కళ్ళచెర్వు సీతారామచంద్ర శతకము

క్షేత్రదైవప్రశస్తిగల యీ శతకము కళ్ళచెర్వులో వ్యయసంవత్సరము పుష్యమాసములో రచించి, సర్వజిత్తు సంవత్సరము చైత్రమాసములో ముద్రింపబడినది. కళ్ళచెర్వు మొఖాసాదారుడగు శ్రీ రాజాచెలికాని వెంకట్రామనృసింహ భాస్కరరావుగారి ప్రోత్సాహముచే నీ శతకము రచించినట్లు కవి పేర్కొనెను. వీరే యీ శతక ముద్రణమునకు కావలసిన ధనసాహాయ్య మందించిరి. ఈ శతకము కళ్ళచెర్వు శ్రీ సీతారామచంద్రస్వామి కంకిత మొసంగబడినది. ఇందు మొదట కృతిపోషకు వంశావళి (35) పద్యములలో కవి వర్ణించెను. చివరి రెండు పద్యములలో సీతాపతి కృతిపోషకుల కాయురారోగ్యైశ్వర్యములను ప్రసాదించు నట్లు కోరెను.

ఈ శతకములో (108) పద్యములు కలవు. ఇందు (40) శార్దూలవిక్రీడితములు, (68) మత్తేభవిక్రీడితములు ఈ శతకములో మకుటము " కళ్ళచెర్వు

1. మానసప్రబోధశతకము 48 పద్యము.

పుర సీతారామచంద్రప్రభో" యని ఉన్నది. శతకములోని 1 నుండి 30 వరకు గల పద్యములలో లౌకిక దృష్టితో, కృతి విమర్శనముగా యీ భక్తకవి తన ఆవేదనను ఆత్మాశ్రయకవితాధర్మము ననుసరించి వ్యక్తీకరించెను. 31 నుండి 98 వరకు గల పద్యములలో రామకథ మొత్తము కథాత్మకధోరణిలో క్లుప్తముగా వివరింపబడినది. చివరి పద్యములో దశావతారములను కవి పేర్కొనెను. ఆ తరువాత శతకము పఠించిన, వినిన వారికి ఆయురారోగ్యైశ్వర్యములు కలుగునని ఫలశ్రుతి చెప్పి కవి శతకమును పూరించెను. కవి మానసిక వేదనను వ్యక్తీకరించు పద్య మిట్లున్నది.

> "[1]మ॥ ధనధాన్యేతరవస్తువాహనతతుల్ దారాసుతానేక భా
> గ్యనితానంబులు స్వప్రయత్నమున యోగ్యంబౌచు గన్పించి త
> క్షణమేబాయును నిత్యమై దనరు నీ నంస్తవ్యమే నాకు కా
> దనక స్గూర్పుము కళ్ళచెర్వుపుర సీతారామచంద్రప్రభో."

శ్రీమత్తిరుమలాపుర భోగసుందర సీతారామచంద్ర శతకము

ఈ శతకము క్రీ.శ. 1918లో ఏలూరు మంజువాణి ముద్రణాలయములో కనుపర్తి లక్ష్మీనరసింహమూర్తి పంతులుగారి ధనసాహాయ్యముచే ముద్రింపబడినది. కనుపర్తి లక్ష్మీనరసింహమూర్తి పంతులుగారు ప్రసిద్ధకవి కనుపర్తి అబ్బయామాత్య వంశానికి చెందినవాడనని కవి చెప్పెను. ఈ శతకములో (100) సీసపద్యములు కలవు. శతకాంతమున గల మంగళము గూడా సీసముతోనే పూరించెను. ఈ శతకమునందు మకుటము "భోగసుందర వరనామ పుణ్యసీమ, తిరుమలాపురధామ వైదేహిరామ."

శతకారంభమున కృతిపోషకుని ప్రశంస ఐదు పద్యములలో, ఆశీస్సులు రెండు పద్యములలో కవి చెప్పెను. తరువాత తొమ్మిది సీసపద్యములతో భక్తాంజనేయ స్తోత్రము గావించెను. సీసములన్నియు అంత్యప్రాసనియమమును పాటించి వ్రాయబడినవి. శతకములోని 31 నుండి 40 పద్యముల వరకు కవి

1. కళ్ళచెర్వు సీతారామచంద్రప్రభుశతకము 20 పద్యము.

దశావతారవర్ణన గావించెను. అలంకారములు, జాతీయములు పద్యములలో కవి అపరిమితముగా ప్రయోగించెను. శతకములో 41 నుండి 45 వ పద్యములలో అంత్యప్రాసలో ఉర్దూ పదముల నుపయోగించుట కవికి ఉర్దూభాషా పరిచయమునకు మచ్చుతునకలని చెప్పవచ్చును. మిగిలిన పద్యములన్నింటియందు భగవంతుని స్తోత్రములే మిక్కిలి ప్రాధాన్యము వహించినవి. ఈ పద్యములలో కవి ఆత్మాశ్రయధర్మము చక్కగా పాటించెను. పద్యములలో సమాసప్రయోగములు, భావశబలత, భక్తిసన్నుతులు పాఠకుల మన్ననలు పొందినవనుటలో అతిశయోక్తి యుండదు. ఇందలి సీసపద్యములన్నియు నరసింహశతకములోని "భూషణవికాస శ్రీధర్మపురనివాస దుష్టసంహార నరసింహ దురితదూర" యను శతకపద్యములను బోలియున్నవి. దశావతారవర్ణనలో నొక సీసపద్యమును, ఉర్దూపదము లంత్యప్రాసముగల మరియొక సీసము నుదహరించుట భావ్యము అవి ఇట్లున్నవి.

"[1]సీ॥ దశరథసుతుడవై కుశికాత్మజున కెట్టి
యాపద లేకుండ నరులదట్టి
శివుని చాపము ద్రుంచి సీతను చేపట్టి
పరశురాముని బాహుబలము నెట్టి
రంజిల్లు దండకారణ్య మార్గము జుట్టి
ఖరదూషణాది రక్కసుల గొట్టి
వానరస్నేహంబు భావంబునం బుట్టి
కల్లోలజలధిపై కట్టగట్టి

గీ॥ శాత్రవులనెల్ల త్రుటిలోన సమయబెట్టి
నట్టి రాముడవంచు నిన్నెందు ఘట్టి
భోగసుందరవరనామ పుణ్యసీమ
తిరుమలాపురధామ వైదేహిరామ."

"[2]సీ॥ దాసుల రక్షింప దలతువు హర్వఖ్తు
నీ కృపజూపుమా నేకులఖ్తు

1. శ్రీమత్తిరుమలాపుర భోగసుందర సీతారామచంద్ర శతకము. 37 పద్యము
2. " " " " 42 "

గలిగె నా కిపు డెంతొ ఘనముగా కంబఖ్తు
తమ సేవ నాకివ్వదగును పఖ్తు
నిన్ను దూరినవాని నిల్గింతువట సఖ్తు
తాపసాత్మలు నీకే పురోఖ్తు
క్షీరాబ్ధికన్యకా చిత్తంబు నీతఖ్తు
పూనికవింటి మేలైన సాఖ్తు

గీ॥ చేసితివిగాదె లంకాపురీక్షితిని సోఖ్తు
సకలమున కీవె దానకల్పకదరఖ్తు
భోగసుందరవరనామ పుణ్యసీమ
తిరుమలాపురధామ వైదేహిరామ."

## శ్రీ రంగాపుర సత్యనారాయణ శతకము

రుద్రవరపు కామేశ్వరమ్మ యను భక్తురాలియందు శ్రీరంగాపురము సత్య నారాయణస్వామి ఆదేశించి, నైజాంనుండి యీ కవిని పిలిపించినట్లును, ఆమెచే శ్రీసత్యనారాయణశతకము రచించుమని ఆజ్ఞాపించినట్లును, తదాదేశానుసారమే కవి యీ శతకము రచించినట్లును, దాతలైన భక్తుల ధనసాహాయ్యమున క్రీ.శ. 1956లో ముద్రించినట్లు శతకారంభమున కవి మనవి చేసికొనెను. ఇందు (108) పద్యములున్నవి. ఇందలి వృత్తములు శార్దూల, మత్తేభవిక్రీడితములు భక్తి, జ్ఞా వైరాగ్యము లీ శతకమునందు ప్రశంసనీయముగా కూర్చబడినవి. 36వ పద్య నుండి 45వ పద్యమువరకు దశావతారవర్ణనలు కలవు, సత్యనారాయణస్వా మహిమలు తెలుపు ఐదు కథల విషయము లైదు పద్యములలో వివరింపబడినవి అన్నవరపు సత్యనారాయణస్వామియే రంగాపురములో వేంచేసి యున్నాడని కవి చెప్పుకొనెను. భగవంతుని మహిమలు అమోఘములని తెలుపు పద్య మిట్లున్నది.

"[1]మ॥ జలధు ల్మారును చౌటభూముల క్రియన్ శైలంబు ధూళివిధిన్
విలసద్వజ్రము గడ్డిపోచవలె, గంభీరాగ్ని చల్లారి ని

1. శ్రీరంగాపురసత్యనారాయణ శతకము 10 పద్యము

శ్చలశీతాతపమట్లు తోచుగద నీ సంకల్పమాత్రాన భా
సిలు రంగాపురదివ్యరత్ననిలయా శ్రీసత్యనారాయణా."

ఇందు భగవంతుడు సంకల్పించినచో సముద్రములు చౌడుభూములుగను, పర్వతములు ధూళిగను, వజ్రము గడ్డిపోచగను, భీషణాగ్ని అతిశీతలముగను, మారునని వివరించిన విధము కవికి భగవంతునియెడగల ప్రగాఢ విశ్వాసమునకు మచ్చుతునక. శతకాంతమున మంగళహారతి గద్యము కలదు. గద్యమునందు కవి తాను శ్రీమదలవేలుమంగా సమేత శ్రీవేంకటేశ్వరకృపాలబ్ధకవితాధురంధరుడ నని చెప్పుకొనెను. భక్తుల కోరికలు తీర్చుటలో, సత్యనారాయణస్వామి ఎల్లపుడు చొరవ చూపునను సందేశము కవి యీ శతకములో నొసంగెను.

స్తోత్రతారావళులలో పద్యసంఖ్యనుబట్టి తారావళి నిర్ణయము జరిగినట్లు మన కీ క్రింది వివరణవలన స్పష్టమగుచున్నది.

"1. తారాణాం సంఖ్యయా పద్యై
ర్యుక్తా తారావళీ మతా
తారాణా మితి సంఖ్యయా సప్తవింశత్యేత్యర్థః."
ఇరువదేడు పద్యములుగలది తారావళి.

కం॥ తారక లిరువదియేడును
నారయ నొక్కొక్క పద్యమందు జెలంగన్
గూరిచిన పద్యమాలిక
తారావళియనగ నభిమతంబై పొల్చున్."

పై వివరణ ననుసరించి తారావళిలో ఇరువదేడు పద్యములుండునని స్పష్టమగుచున్నది. మరింగంటి వేంకటనరసింహాచార్యుల తారావళులలో ఇరువదేడు నక్షత్రముల మొదటి యక్షరములతో పద్యము లారంభించబడినవి. మకుటనియ

1. కావ్యాలంకారసంగ్రహము రామరాజభూషణుడు, 2-173 పద్యము వివరణ సన్నిధానం సూర్యనారాయణశాస్త్రి

మము పాటించబడినది. వీనిలో శ్రీరంగాపుర సత్యదేవస్తోత్రతారావళి మొదట పరిశీలనకు గైకొనబడినది.

## రంగాపుర శ్రీ సత్యదేవస్తోత్రతారావళి

ఈ తారావళి క్రీ.శ. 1957లో ముద్రింపబడినది. ఇది శ్రీరంగాపుర సత్యనారాయణస్వామి కంకిత మొసంగబడినది. ఈ తారావళి శ్రీరంగాపుర సత్యనారాయణస్వామి ఆలయ ధర్మకర్త శ్రీ అడవికొలను కామేశ్వరరావుగారి ధన సాహాయ్యమున ప్రచురించబడినది. కామేశ్వరరావుగారిని ఆశీర్వదించుటలో కవి యొక విశిష్టమైన పద్ధతి నవలంబించెను. తారావళికి ముందు కామేశ్వరరావుగారిని ఆశీర్వదించుచు కవి ఇరువదిపద్యములు వ్రాసిరి. ఆ పద్యముల ఆరంభాక్షరములను కూర్చినచో ఇట్లుండును. "శ్రీమదడవికొలను కామేశ్వరరావు గారికి స్వస్తి కలుగుగాత."

ఈ తారావళి యందు ఇరువదేడు సీసపద్యములున్నవి. గతములో చివరి రెండు చరణములు మకుటముగా కవి గ్రహించెను.

"ప్రథిత రంగాపురీధామ భవవిరామ
సత్కృపానందమయభావ సత్యదేవ."

పై మకుటము ప్రతి సీసమునందును గలదు. ఇరువదేడు సీసములలో వరుసగా అశ్వని మొదలు రేవతివరకు గల నక్షత్రనామములలో మొదటి యక్షరములతో సీస మారంభించెను. ఈ తారావళి యందు భగవంతుని స్తుతియే ప్రధానమైనది. భక్తుడు భగవంతుని లీలలను స్తుతించియు మానవమాత్రుడైన తను (కవి) అఖిలాండకోటి బ్రహ్మాండనాయకుని పొగడ తనకు శక్యముకాదని వినయముగా వేడుకొనెను. భగవంతుని మాయను దేవతలే గ్రహించలేకపోయిరి. అట్టి పరిస్థితులలో తాను (కవి) ఆ భగవంతుని మహిమ లుగ్గడించుటలో అల్పుడనని చెప్పిన యీ పద్య మిట్లున్నది.

"1సీ॥ పురహరుండే దివ్యమోహినీసౌందర్య
విభ్రాంతచిత్తుడై వెతలపడెనొ?

1. శ్రీరంగాపుర సత్యదేవస్తోత్రతారావళి 7 పద్యము.

పద్మజుడే పరబ్రహ్మ మెరుంగక
గర్వాతిశయమున కలతవడెనొ?
పురుహూతుడే దేవముఖ్యు గణింపక
స్వాతిశయంబున శ్రమలు గొనెనొ?
భృగుమౌనితిలకుడే జగదీశు మాయచే
నయభయభక్తుల నియతిగనెనొ?

గీ॥ అట్టి నీ భవ్యమహిమంబు లద్భుతములు
పలుక నేనెంతవాడనో పరమపురుష
ప్రథిత రంగాపురీధామ భవవిరామ
సత్కృపానందమయభావ సత్యదేవ."

భగవంతుని శక్తి నుగ్గడించుటలో ఒక్కొక్క చరణములో నొక్కొక్క కథను పాఠకుల కందించుటలో కవి చూపిన నైపుణ్యమున కీ క్రింది పద్యము మచ్చుతునక. ఈ పద్యమునందు ప్రతి చరణములో భగవంతుని సంబోధించిన తీరు, శైలి సమాసప్రయోగము కవి రచనానైపుణ్యమునకు దృష్టాంతమని చెప్పవచ్చును.

"[1]సీ॥ ఆద్యంతరహిత! నిన్నాశ్రయించుటగాదె?
ప్రహ్లాదు డిక్కట్లు బాయగనుట
వేదాంతవేద్య! నిన్వేడుచుండుటగాదె?
ధ్రువుడున్నతస్థాన ఠవశిగనుట
ఆర్త శరణ్య! ని న్నాత్మనిల్పుటగాదె?
శబరియోగవి మోక్షసరణిగనుట
దీనపోషక! నిన్ను పూని గొల్చుటగాదె?
పాంచాలివసనము ల్పడయగనుట

గీ॥ సర్వమున కీవె దిక్కని సంతతంబుఁ
తలచువారికిఁ గొఱతలు గలుగునొక్కొ?

1. రంగాపుర శ్రీసత్యదేవస్తోత్రతారావళి 9 పద్యము

ప్రథిత రంగాపురీధామ భవవిరామ
సత్కృపానందమయభావ సత్యదేవ."

పై పద్యములో మొదటి రెండుచరణములలో భాగవతములోని ప్రహ్లాద, ధ్రువోపాఖ్యానములను, తృతీయచరణములో రామయణములోని శబరి కథను, చతుర్థచరణములో భారతములోని ద్రౌపదీవస్త్రాపహరణఘట్టములో నామెకు వలువ లొసంగి కాపాడినకథను, వరుసగా పేర్కొని, కవి భగవంతుని నమ్మిన వారి కాపద లిట్టె తొలగిపోవునను సిద్ధాంతమును సోపపత్తికముగా స్థాపించెను. భారతీయులకు పై రామాయణ, భారత, భాగవతాది గ్రంథములు మిక్కిలి పవిత్రమైనవనియు, వీనిని పఠించినచో మానవుల కే యిక్కట్టులు రావను విషయము విశేషముగా యీ పద్యములో కవి ప్రబోధించినాదని చెప్పవచ్చును.

అన్ని భోగము లనుభవించుచున్న భగవంతుని ఏమియు లేనివాడవని, చేతగానివాడవని కవి చేయు వ్యాజస్తుతి పద్యమిది.

"1సీ॥ ఉదధి నీ నిలయమ్ము నురగంబు నీ పాన్పు
వాహనమగు నీకు పక్షిరాజు
ఇల్లాలు పొరుగింటి పుల్లకూరల మెప్పు
వడయు నీ తొలిచూలు వ్రాతకాడు
కడపటి సుతు డెందు గాన్పింపకే యుండు
పుంస్త్రీల బాధించు పుణ్యజనుడు
వనితలు విసుగొంద వలువలు గొని పొన్న
చెట్టెక్కి దిరుగు నీ చేష్టయగుట

గీ॥ దిక్కులే రెవ్వరని మదిన్ బొక్కుచుందు
విట్టి చేలవు నన్నెట్టు లేలగలవు
ప్రథిత రంగాపురీధామ భవవిరామ
సత్కృపానందమయభావ సత్యదేవ."

1. రంగాపుర శ్రీసత్యదేవస్తోత్రతారావళి 12 పద్యము

ఎవరు దిక్కు లేరని బాధపడు నీవు నన్నెట్లు పాలింతువని కవి భగవంతుని పై పద్యములో నిందించినట్లు కనిపించినను, పరమాత్మని గొప్ప దనమును శ్లాఘించుటయు గలదు. కావున ఈ పద్యములో కవి ప్రయోగించిన వ్యాజస్తుతి అలంకారము మిక్కిలి ప్రశంసార్హము. అలతి అలతి మాటలచే కవి రమణీయమైన యర్థములను పొందుపరచిన విధము కవి చాతుర్యమునకు, భక్తికి దర్పణమువంటిది.

ఈ తారావళిలోని యిరువదేడు పద్యముల తరువాత మూడు పద్యములలో సత్యనారాయణస్వామి కథలలో కాశీవిప్రుని కథ, కట్టెలమ్మువాని కథ, ఉల్కా ముఖుని కథ, రత్నాలవర్తకుని కథ, తుంగధ్వజుని కథయను ఐదు కథలను తెలిపి, వారెట్లు సత్యనారాయణవ్రతము లాచరించి, అష్టైశ్వర్యములు పొందిరో విపులీకరించి, చివర సత్యదేవునకు మంగళము చెప్పుటతో కవి యీ తారావళిని పూర్తి చేసెను, ఇందు సత్యనారాయణవ్రతకథలను చెప్పుటొక విశేషమని చెప్ప వచ్చును.

## శ్రీ ఉర్లుగొండ లక్ష్మీనృసింహ స్తోత్ర తారావళి

ఈ తారావళియు భక్తు లొసంగిన చందాలచే ముద్రింపజేసినట్లు కవి తారావళి చివర చందాదారుల నామములు, వా రొసంగిన ధనమును వివరించెను. ఇందు విజ్ఞాపనగాని, రచన పేరణకుగల కారణముగాని కవి వివరించలేదు. తారావళిలో యిది రెండవది. కావున క్రి. శ. 1957. తరువాత రచించియుండ వచ్చును. ఈ తారావళి ఊరుగొండ లక్ష్మీనరసింహస్వామి కంకితము. ఇందు ఇరువదేడు నక్షత్రముల మొదటి యక్షరములతో సీసము లారంభించబడినవి. ఇందలి పద్యములన్నియు, అంత్యప్రాసనియమము పాటించబడినవి. ఇందలి మకుటము కూడసీసములోని చివరి రెండు చరణములలో నున్నది.

" భవకలభసింహ దూరితపండితాంహ
శ్రితవరదరంహ గళదాద్రి శ్రీనృసింహ."

ఈతారావళిలో నరసింహస్వామి మహిమలు వర్ణించుటగలదు. పర మాత్మని అవతారము లోని నరసింహస్వామి అవతారము చాలా ఉగ్రమూర్తి.

ఆగ్రహముతో హిరణ్యకశిపుని వధించిన తీరు కూడ మిక్కిలి భయానకముగా నున్నది. కావున యీ తారావళిలో నృసింహస్వామిని, ఆయన మహిమలు వర్ణించుటకు, నుతించుటకు కవి ప్రయోగించిన ప్రౌఢ సమాసములు శబ్దాలంకారములు ధారాపాతములుగా పద్యములలో చోటు చేసికొనినవి. ప్రౌఢపద సమాసప్రయోగమున కుదాహరణముగా యీ క్రింది పద్యము చూడవచ్చును.

"[1]సీ॥ విశ్వసృడ్భవనుత విక్రమదోస్సార
నిరవధికవాత్సల్యనిధిగభీర
భువనమోహాకృతస్ఫూర్జితవాక్సార
రమణీయభూషణరత్నహార
సౌశీల్య వాత్సల్య సంభృతవిస్తార
విమలకాంతిస్ఫురద్విజితమార
మాహేశ్వరీదివ్యమానసాబ్జవిహార
ప్రబలతాపత్రయభయవిదూర

గీ॥ కమలజాంతభయాకరకదనవీర
పూరితాఖండలోజ్వలభువనతార
భవకలభసింహ దూరితపండితాంహ
శ్రితవరదరంహగళదాద్రిశ్రీనృసింహ."

పై పద్యములో కవి ప్రయోగించిన ప్రౌఢశబ్దసమాసము లా నృసింహస్వామి యుగ్రస్వభావమున కనుగుణములుగా నున్నవి. ప్రతిపద్యములోను నరసింహుని ఉగ్రస్వభావస్థితిని కన్పింపజేయుట యీ తారావళిలోని విశేషము.

1. "కృపణారి గళరక్త ధృతశాతనఖబాణ
సతతాండజాధీశ సత్ప్రయాణ"

2. "ఉరుమదాంధీకృతాసురభంజనోత్తీర్ణ
భూతభయావహశ్వేతవర్ణ"

---

1. శ్రీఉర్లుగొండ లక్ష్మీనృసింహస్వామిస్తోత్రము తారావళి 16 పద్యము

3. పూర్వామరస్తోమభుజఖండనోద్దండ
బలవిక్రమోపేతబాహాదండ."

ఈ తారావళిలో అన్నియు యిట్టి పద్యములే

1. గోదాదేవి స్తవము
2. కళ్ళచెర్వు రామచంద్రస్వామిస్తోత్ర తారావళి

పై రెండు తారావళులు నేడు లభించుటలేదు.

## శ్రీశ్రీశ్రీరాజారాఘవరాజు రంగరాజస్మృతి

ఈ స్మృతిపద్యముల చిన్నగ్రంథము క్రీ. శ. 1957లో శ్రీరాజారాఘవరాజు లింగరాజు సోదరుల ప్రేరణచే రచింపబడి, వారి ధనసాహాయ్యముచే ముద్రింపబడినది. చింతలపూడి తాలూకా జీలకర్రగూడెము పరిపాలకుడైన రాజా రాఘవరాజు రంగరాజు సాహితీపోషకుడు. ఈ కవిచే రచింపబడిన 'మాలతీ వసంత'మను ప్రబంధముద్రణకు ధనసాహాయ్య మొసంగిన మహనీయుడు. ఈ రాజు దివి. 7–4–1956 న పరమపదించెను. సంవత్సరము తరువాత వారి పుత్రులు రాజారాఘవరాజు లింగరాజు సోదరులచేత ప్రోత్సహింపబడి కవి యీ రాఘవరాజు రంగరాజస్మృతి యను చిన్నపొత్తము వ్రాసి ప్రచురించెను.

ఇందు రెండు ఉల్లాసములు కలవు. సాధారణముగా ఇట్టి కావ్యములు పద్యములలో రచించుట జరుగును. కాని యీ కవి ఒక ఉల్లాసమును గద్యమున, రెండవది పద్యమున రచించి ఒక విశిష్ట సాహిత్యప్రక్రియను సాధించెను. ప్రథమోల్లాసములో కవి కీ॥ శే॥ రాఘవరాజు రంగరాజు గారి జననము, విద్యాభ్యాసము, వివాహము, పరిపాలనాదక్షత, సాహిత్యపోషణ, భగవద్భక్తి మున్నగు విషయములు గద్యములో విపులీకరించెను. ద్వితీయోల్లాసమున శ్రీరాఘవరాజు రంగరాజు నిర్యాణఘట్టము (48) పద్యములలో కవి వర్ణించెను. కీ॥ శే॥ రాఘవరాజు రంగరాజు గొప్పదనము కొనియాడుచు కవి చెప్పిన పద్య మిట్లున్నది.

"[1]సీ॥ పండితప్రతతుల పాలిటి కీ వెన్న
ముంగొంగు పసిడివై పొలిచినావు
దీనులపరితృప్తి దేలింప నీ వెన్న
కామధేనువు రీతి గ్రాలినావు
ఆశ్రయించినవారి కనయంబు నీ వెన్న
దంగేటిజున్నువై దనరినావు
బీదసాదలజూచి ప్రేమింప నీ వెన్న
కల్పవృక్షముశక్తి గొల్పినావు.

గీ॥ అట్టిధర్మాత్ముడవగుదు వమలచరిత
మమ్ము విడనాడి వైకుంఠమందిరమున
కేగ దిక్కెవ్వ రిక మాకు యెంచి చూడ
ప్రథితరాఘవరాజ శ్రీరంగరాజ."

ఈ పద్యమున రాఘవరాజు రంగరాజు పండితులకు, దీనులకు, ఆశ్రయించినవారికి, బీదసాదలకు ముంగొంగు పసిడి, కామధేనువు, తంగేటిజున్ను, కల్పవృక్షము మాదిరిగా కోరిన కోర్కెలు తీర్చువాడనియు, ఇట్టి ధర్మాత్ముడు అస్తమించుటవలన ప్రజలు దిక్కులేనివారైనారని కవి వాపోయెను. ఇందు ముంగొంగు పసిండి, తంగేటిజున్ను ఐహికపరమైన అనగా భూమిపైగల కోరికలను తీర్చు వస్తువులుగను, కామధేనువు, కల్పవృక్షములు దేవతాసంబంధమైన స్వర్గములో కోరికలు తీర్చు వస్తువులుగను, కవి వర్ణించి మనుజలోక దేవలోక సంబంధమును కలిగించెను. ఇందు ముంగొంగు, కామధేనువు, కల్పవృక్షము, తంగేటిజున్ను మొదలగు ఉపమానముల ప్రయోగము పరిశీలించినచో వీరికి అల్లసాని పెద్దనగారియందలి ఆదరబావము ప్రస్ఫుటమగుచున్నది. ఇచట కీ॥శే॥ రాఘవరాజు రంగరాజుగారి దాతృత్వమును వివరించుటయే కవి ప్రధానోద్దేశ్యము దీనిని సమర్థించుకొనుటకు కవి చూపించిన దృష్టాంతములు అత్యంత రమణీయములుగా నున్నవి.

1. రాజారాఘవరాజు రంగరాజుస్మృతి, ద్వితీయోల్లాసము 10 పద్యము

రాఘవరాజు రంగరాజు శీలము వివరించుచు కవి వ్రాసిన యీ పద్య మిట్లున్నది.

"[1]మ॥ ధనవంతు ల్గల రెందరో మహాత్మా! నీ ప్రియత్వంబు నీ
వినయోత్సాహదయాదిలక్షణశుభాన్వితప్రవావాప్తి ధై
ర్యనితాంతస్థితి నే ధరాధిపునియందైనన్ విలోకింపలే
మన సందేహము గల్గునే తలప నార్యారంగరాజప్రభో."

ప్రపంచములో ధనవంతులు, రాజు లెందరున్నను రాఘవరాజు రంగరాజులో గల సుగుణములు వారిలో అరుదు అని కవి భావించెను. ఇంత చక్కని గుణ శీలములుగల మహానుభావుడు నిర్యాణము పొందుటవలన కవి మిక్కిలి ఖేదము నొందెను.

రాఘవరాజు రంగరాజుగారు చేసిన సత్కార్యములు వివరించుచు కవి పేర్కొనిన పద్య మిట్లున్నది.

"[2]సీ॥ వెలయించితివి కొన్ని వడుగులు పెండ్లిండ్లు
బ్రాహ్మణకోటికి ప్రమద మొదవ
వెలయించితివి కొన్ని తీయని నీరుండు
ఘనతటాకములు క్రమముగాను
నిర్మించితివి కొన్ని ధర్మకార్యంబుల
కనుగుణ్యమగు ద్రవ్యమందజేసి
ప్రసరించితివి కొన్ని ఫలవృక్షములతోడ
భాసిలు వనముల భవ్యమతిని

గీ॥ సప్తసంతానములకెల్ల శక్తికొలది
సలిపి కీర్తిని జెందిన సజ్జనుడవు
నీదు గుణముల వర్ణింప నేర్పుగలదె
ప్రథితరాఘవరాజ శ్రీరంగరాజ."

1. శ్రీరాఘవరాజు రంగరాజస్మృతి. ద్వి. ఉల్లాసము 24 పద్యము
2. రాఘవరాజు రంగరాజస్మృతి ద్వి. ఉల్లాసము 27 పద్యము

పుత్రులవలన తండ్రికి పున్నామనరకము తొలగిపోవును. సప్తసంతానముల వలన మానవున కైహికాముష్మిక ఫలము పొందుట జరుగును. కావుననే పూర్వము రాజులు సప్తసంతానములు సాధించుకొని తద్వారా యిహపరసౌఖ్యములు పొందినట్లు మనకు పౌరాణికాధారములు కనిపించుచున్నవి. ఇదే విధముగా రాఘవరాజు రంగరాజు వివాహములు చేయించి, తటాకములు త్రవ్వించి, ధర్మకార్యములకు ధనమొసంగి, ఫలవృక్షములుగల వనములను పెంచి, ప్రజోపయోగకరములైన పనులెన్నియో చేసి కీర్తి పొందినాడని కవి యీ రాజశేఖరుని శ్లాఘించెను.

రాఘవరాజు రంగరాజుగారి భక్తి గురించి కవి వ్యక్తీకరించిన అభిప్రాయ మిట్లున్నది.

"[1]సీ॥ నిజభక్తి గరిమచే నిఖిలయాత్రలు చేసి
ధర్మతత్పరబుద్ధి దనరినావు
తప్తచక్రాంకితధారణత్వము నొంది
తిరుమంత్రపఠనాస్తి దేలినావు
గరుడమంత్రధ్యానగరిమచే ప్రజలకు
సర్పబాధను దీర్పజాలినావు
శ్రీరామతారక మారూఢి జపియించి
భవతారకోన్నతి వడసినావు

గీ॥ కార్యదీక్షను నీవంటి ఘనుడు లేడు
లేడు లేడంచు ముమ్మారు లాడదగును
ప్రాకటంబుగ రాఘవరాజవంశ్య
రమ్యగుణసాంద్ర శ్రీరంగరాజచంద్ర."

తీర్థయాత్రలు చేసిన మానవులకు సకలపుణ్యక్షేత్రముల పుణ్యఫలమబ్బునను విషయము సర్వవిదితమే. కావున యీ రాజు సకలపుణ్యక్షేత్రములు దర్శించెనట. వైష్ణవులు చక్రాంకితములు పొందినచో విష్ణుసన్నిధి చేరుకొందురను

---

1. రాఘవరాజు రంగరాజుస్మృతి ద్వి. ఉల్లాసము. 26 పద్యము

విషయము వైష్ణవమతగ్రంథములు పేర్కొనుచున్నవి. చక్రాంకితములు పొంది, తిరుమంత్రము పఠించు వ్యక్తికి పునర్జన్మ యుండదను సాంప్రదాయము వైష్ణవ భక్తులలో అనుసంధింపబడుచున్నది. రాఘవరాజు రంగరాజు తప్తచక్రాంకితములు పొంది, పునర్జన్మలేని వాడయ్యెను. గరుడమంత్ర మనుష్ఠించి, సర్పదష్టులైన వారి కా మంత్రము వేసి సర్పబాధను తొలగించుట నేడుగూడా పల్లెలలో కనిపించు చున్నది. దీనినే రాఘవరాజు రంగరాజు సర్పబాధితుల కుపయోగించి, ప్రజాసేవ చేసెనని కవి అభిప్రాయము. సంసారసాగరము తరించుటకు తారకమంత్రము నావవంటిది. కావుననే రంగరాజు నిత్యము తారకనామము జపించి సంసార సాగరము తరించెను. ఇట్టి కార్యదీక్షగలవారు సామాన్యమానవులలో అరుదు. కావున యీ రాఘవరాజు రంగరాజు అస్తమయమునకు విలపిల్లి వారి స్మృత్యర్థ మీ చిన్న పద్యకావ్యము వ్రాసి పాఠకుల కందించెను. కవికి ఆప్తమిత్రులన్నచో నెంత అభిమానమో మన కీ చిన్నిస్మృతి పద్యములలో తెలియుచున్నది. స్మృతి పద్యకావ్యములలో యీ చిన్నపొత్తమునకు విశిష్టస్థాన మున్నదని చెప్పవచ్చును.

## శ్రీ సత్యనారాయణవ్రతము హరికథ

పరిశీలనలో ఇది చివరి లఘుకృతి. హరికథ చిత్రమైన కళ. తెలుగు సాహిత్యప్రక్రియలలో దీని కొక ప్రత్యేకస్థానము కలదు. ఇది యే యితర సాహిత్యములో లేకపోవుటవలన తెలుగులో యీ ప్రక్రియ ఒక విశిష్టత సంతరించు కొన్నది.

హరికథ పలువిధములుగా నిర్వచించబడినది. హరికి సంబంధించిన కథ హరికథ. ఇది సామాన్యార్థము "దేవకథాకథనము హరికథయని[1]" హరికథలు నృత్యసంగీతసాహిత్యాత్మకములైనవి. "హరికథను తౌర్యత్రికకళ యని వ్యవహ రిస్తారు.[2]" "హరిని కీర్తించుటయే హరికథ"యని[3] "ఆస్తిక్యమును ధర్మాధర్మ

---

1. శ్రీ జమ్మలమడక మాధవశర్మగారి అభిప్రాయము
2. శ్రీ పాతూరి ప్రసన్నం గారి "
3. శ్రీ తంగిరాల సుబ్రహ్మణ్యశాస్త్రిగారి "

ములను సర్వజన మనోరంజనముగా నృత్య, గీత, వాద్యములతో నుపన్యసించుట హరికథయని[1] నిర్వచించిరి. మొత్తముపై నిర్వచనములు పరిశీలించినచో హరికథ "గద్య పద్య గేయాత్మక సంగీత నృత్యకళా విశిష్టమగు నొకరూపక ప్రక్రియ" యని చెప్పవచ్చును. హరికథాగానము చేయువారిని హరిదాసులని, భాగవతులని యందురు. హరికథ వేదకాలమునాటికే యున్నట్లును, రామాయణ ములో కుశలవులు రామాయణగానము చేయుట యిట్టిదని చెప్పవచ్చును. హరి కథల స్వరూపము వేదకాలమునాటిదని, సర్వజ్ఞులైన అగ్నివేశాది మహర్షులు తొలుదొల్త నీ హరికథాశిల్పాన్ని సృష్టించియున్నారని విమర్శకుల అభిప్రాయము బ్రహ్మమానసపుత్రుడైన నారదుడు హరికథాగానము చేయుచు భక్తిసూత్రములను లోకముల కందించుట పురాణములలో కనిపించుచున్నది. హరికథ ఆధునిక ఒక నూతన విద్యాప్రదర్శక వినోదమని చెప్పవచ్చును, ఇందు సంగీతము, సాహిత్యము, చక్కని నృత్యము, శ్రోతల మనస్సుల కింపగు మాటలు మున్నగు నవి హరిదాసు ప్రదర్శించును ఆధునిక కాలములో శ్రీ ఆదిభట్ల నారాయణ దాసుగారీ ప్రక్రియావికాసమునకు మిక్కిలి దోహద మొనరించి, "హరికథా పితామహు" డను బిరుదు పొందెను.

శ్రీసత్యనారాయణ వ్రతమను హరికథను కీ॥శే॥ ఆసూరి మరింగంటి వేంకటనరసింహాచార్యులు తన మిత్రుల ప్రోత్సాహముతో క్రీ.శ. 1938 లో రచించెను. కాని ద్రవ్యాభావముచే ముద్రణ జరుగలేదు. ఆ తరువాత ఆరు సంవత్సరములకు సూర్యాపేట నివాసియగు దాండిగ నారాయణగారి ద్రవ్య సాహాయ్యమున యీ హరికథ క్రీ.శ. 1944 లో ముద్రింపబడినది. హరికథా రంభమునకు పూర్వము నామగర్భసీసమాలికలో కృతిపోషకులైన దాండిగ నారాయణగారికి శ్రీవేంకటేశ్వరస్వామి "సకలశుభములనొసగుగాత" యని ఆశీస్సు లొసంగెను. మొత్తము పది పద్యములలో దాండిగ వంశప్రశస్తి చేసి కవి నారాయణగారి ఔదార్యము చాటెను.

హరికథారంభమున ఇష్టదేవతాస్తుతి, విష్వక్సేనుని స్తుతి, భారతీ స్తుతి గావించి, గురుపరంపరలో పన్నిద్దరాళ్వారులను స్తుతించి, చాతుర్వర్ణములవారిని

1. ఆదిభట్ల నారాయణదాసుగారి అభిప్రాయము.

సంబోధించి, పండితులను గౌరవించి, తాను చెప్పబోవు హరికథలో దొసగులు కలిగినయెడల మన్నింపుమని కవి వినయపూర్వకముగా మనవి చేసికొనెను.

ప్రథమాధ్యాయములో నైమిశారణ్యమున శౌనకాది మహామునులు సూతునికి నమస్కరించి భూలోకములో నిహపరసాధనకు మూలమైన వ్రతమున్నచో సెలవీయవలయునని కోరిరి. సూతుడందులకు సమ్మతించి, తాను నారదునివలన విన్న కథను శౌనకాది మహామునులకు విశదపరచెను. పూర్వము నారదుడు భూలోకములోని జనులు అనేక కష్టము లనుభవించుచు దుఃఖార్తులై యుండుట వలన వారికి తరణోపాయము చూపవలయునని భావించి వైకుంఠమునగల శ్రీహరి దగ్గర కేగెను. శ్రీమన్నారాయణునికి నమస్కరించి నారదుడు తన మనోభావములు వెల్లడించెను. వైకుంఠవాసుడు నారదునకు సత్యనారాయణస్వామి వ్రతమాచరించినవారు యిహపరసౌఖ్యములు పొంది, జననమరణదుఃఖములు తొలగించు విష్ణుసాన్నిధ్యము పొందుదురని తెలిపెను. ఈ మాటలు విని శౌనకాదిమహామునులు సూతునితో భూలోకములో యెవరైన యిట్టి వ్రతము నాచరించి విష్ణుకైవల్యము పొందిరా యని ప్రశ్నింపగా సూతుడట్టివారల కథ చెప్పుట కారంభించెను.

ద్వితీయాధ్యాయములో సూతుడు సత్యనారాయణ వ్రతఫలము దృష్టాంత పూర్వకముగా విపులీకరించెను. కాశీబ్రాహ్మణుడు బీదరికముతో క్రుమ్మగ్గి, తుదకు భిక్షమెత్తి, సత్యనారాయణస్వామి వ్రత మాచరించి, యిహసౌఖ్యము లనుభవించి అంత్యమున పరమపదప్రాప్తి పొందెను. ఆ తరువాత కట్టెలమ్మువాడు తానెంత కష్టించినను, తిండికి బట్టకు గడవక యిక్కట్టు లనుభవించుచు నొకనాడు బ్రాహ్మణు నింటిలో సత్యనారాయణవ్రతము కథలు విని, తీర్థప్రసాదములు గైకొని తాను కూడ మరుసటిరోజు తన కట్టెలమ్ముటవలన లభించిన సొమ్ముతో సత్యనారాయణస్వామి వ్రత మాచరింతునని మ్రొక్కుకొనెను. మరుసటిరోజు అడవికి పోయి కట్టెలు తెచ్చి విక్రయించగా స్వామిదయవలన అమితమైన వెల వచ్చెను. ఆ ధనముతో వ్రతమునకు కావలసిన సామాగ్రితెచ్చి, శాస్త్రోక్తముగా సత్యనారాయణస్వామి వ్రత మాచరించి, తీర్థప్రసాదములు గైకొని, కొంతకాలము సంసారసౌఖ్యము లనుభవించి, దేహాంతమున విష్ణుసాన్నిధ్యము పొందెను.

సూతుడు శౌనకాది మహామునుల కుల్కాముఖుడను రాజు కథను తెలిపెను ఈ రాజు స్వామివ్రత మాచరించుచుండగా నొక వైశ్యుడు సంతానములేక యా స్వామికి మ్రొక్కుకొని తీర్థప్రసాదములు గైకొని తనకు సంతానము కలిగినచో వ్రతమాచరింతుననెను. స్వామి కృపవలన కూతురు కలిగినను వైశ్యుడు వ్రత మాచరించక కాలము గడుపుచుండెను. కూతురు వివాహము చేసి అల్లునితో ఓడలపై వ్యాపారము చేయుచు స్వామిని విస్మరించెను. దీనితో స్వామి కోపించి చేయని నేరమునకా వైశ్యులు మామా అల్లుండ్రను బంధించి చెఱసాలలో నుంచెను. వైశ్యుని భార్య లీలావతి, కూతురు కళావతి స్వామివ్రతము చేయుట వలన సత్యనారాయణస్వామి వైశ్యులను బంధవిముక్తులను చేసెను. సంతోషముతో తల్లికూతుండ్రు స్వామి తీర్థప్రసాదములు గైకొనక వారి కెదురేగిరి స్వామివారా యోడను సామాగ్రితో సముద్రములో ముంచెను. అపచారము తెలిసి కొని లీలావతి కళావతి తిరిగిపోయి స్వామి తీర్థప్రసాదములు గైకొని వచ్చిరి. సత్యనారాయణస్వామి సంతసించి, వైశ్యుల వస్తువులు మామ లల్లుండ్రతో సురక్షితముగా ఇంటికి చేర్చెను. తిరిగి వారు స్వామివ్రత మాచరించి తీర్థప్రసాదములు గైకొని యిహపరసుఖములు పొందిరి.

తుంగధ్వజుడను రాజు అడవిలో గోపాలబాలురు సత్యనారాయణస్వామి వ్రతమాచరించునపు డచటికి వెళ్ళెను. వారు స్వామి ప్రసాదము మొదట రాజున కొసంగిరి. కాని అధికారధనమదాంధుడైన రాజు ప్రసాదము తృణీకరించి, వారిని దుర్భాషలాడి వెడలిపోయెను. స్వామికి ఆగ్రహము కలిగి శత్రురాజులు తుంగ ధ్వజుని రాజ్య మాక్రమించుకొనునట్లు చేసెను. రాజు దుఃఖించి ప్రసాదము తిరస్కరించుటవలన కలిగిన ఆపదగా గ్రహించి తిరిగి గోపాలుర దగ్గరకు పోయి సత్యనారాయణస్వామి వ్రతమాచరించి తీర్థప్రసాదములు పొందెను. ఆ సమ యమున తన రాజ్యము, కుటుంబము సురక్షితముగా నున్నదని భటునిద్వారా తెలిసికొని రాజధాని కేగెను. ఆ తరువాత పురోహితులను పిలిపించి యథావిధిగా సత్యనారాయణస్వామి వ్రతమాచరించి తీర్థప్రసాదములు గైకొని యిహసుఖము లనుభవించి, అంత్యమున వైకుంఠమున కేగెను. మంగళహారతితో యీ హరికథ సమాప్తమయ్యెను.

ఈ సత్యనారాయణస్వామి హరికథలో కవి రచించిన గేయములు వివిధ రాగములతో పాడుట కనువుగా నున్నవి. ఏయే పాటలు యేయే రాగములో గానము చేయవలయునో కవి యీ పాటలపైన సూచించెను. ఇంతేగాక మరియొక విశేషమేమనగా, ఆ పాట చివరి చరణములో తత్సంబంధిత రాగము పేరుకూడా చేర్చెను. దీనినిబట్టి యీ కవికి సంగీతజ్ఞానము పరిపూర్ణముగా నున్నట్లు స్పష్టమగుచున్నది. 'శంకరాభరణ' రాగమునకి క్రింది పాట నుదహరించవచ్చును.

"[1] శ్రీసత్యదేవచరితంబు విన చేకూరు సిరి వారికే కాలంబు
దోసంబు నిక్కంబు దూలింప సులభంబు నాసింపదగు నిది సత్యంబు
పరవాసులకెల్ల భవుకంబు దాసాళికివి ముఖ్యంబు
మురారి కథనమ్ము ముక్తిగూర్చు నిజమ్ము
తరించుటకు మార్గమ్ము సురవరుల్గాంతు రనిశమ్ము
వివరించి యిదియే నమ్ము "శంకరాభరణమ్ము" శ్రీసత్యదేవచరితమ్ము

పై పాటలో మొదటి చరణములో 'ంబు' బిందుపూర్వక 'బు' అంత్యప్రాసయున్నది. చివరి చరణములలో 'మ్ము' అంత్యప్రాసగా నున్నది. చివర 'శంకరాభరణము' రాగము పాట చరణములో కూర్చుటవలన వీరికి చిత్రకవిత్వముపై మిక్కిలి మక్కువయని చెప్పవచ్చును. దీని కుపబలకముగా రాగమాలిక సీసపద్య మురాహరణగా నొసంగబడుచున్నది.

"[2] సీ॥ పతితపావనుడైన పరమేశ్వరుని పూజ
లొనరించి తత్కథన్ మనసు "నాట"
నాలించి తనవార లందరు గొలువంగ
మోదంబుతో కేల బూని "సురటి"
విసరుచు వికసిత విరుల నెత్తావిచే
మీరెడు నా "మలయమారుతమున"

---

1. శ్రీసత్యనారాయణస్వామి హరికథ 4 పుట
2. " " 21 పుట

హరికి ప్రీతినిగూర్చి జరగినచొ చాల
రయమున గలుగు "శ్రీరాగ" మహిమ

గీ॥ పూర్ణయుగ నిచ్చి నేలు నా "మోహనాంగు"
దమితసంతోషమును జెందుటదియె "బాగు"
నీదు "భాగేశ్వరి"ని గూడి నెమ్మిమీర
"శామ" సుందరు వ్రతమును జరుపుమనిన."

పై పద్యములోని చరణములలో నాట, సురటి, మలయమారుత, శ్రీరాగ మోహన, బాగు, భాగేశ్వరి, శామ, యనురాగములను చేర్చి రాగమాలిక నల్లిన కవి చాతుర్య మమోఘము.

హరిదాసు భక్తి, జ్ఞాన, వైరాగ్యములతో పాటు అపుడపుడు కొంత శృంగారమును, హాస్యమును సందర్భోచితముగా ప్రదర్శించును. అందుకొఱకే కవి యీ సత్యనారాయణస్వామి వ్రత హరికథలో శృంగారమునకు కూడ కొంత స్థానమొసంగి నట్లీ క్రింది పద్యములవలన తెలిసికొనవచ్చును.

"[1]మ॥ జలజాతంబుల నేలు నేత్రయుగ మాస్యం బబ్జబింబంబు కుం
తలము లుమ్మెదలన్ హసించు హరిమధ్యంబౌను లేగౌను చూ
పులు కందర్పుని వాలు తూపులగు నా పూబోణి చెక్కుల్ రా
జిలుచుండున్ ముకురంబులోయన నహో చిత్తంబు వారిరాశియా"

"[2]సీ॥ బిబ్బోకవతి గబ్బిగుబ్బల వీక్షించి
చక్రవాకంబులు జతనుగోరు
పల్లవాధరి కేశబంధంబు తిలకించి
సారంగనికరంబు సరసజేరు
సతిమోము పరికించి చంద్రుండు నిరతంబు
వన్నెలాడని మదినెన్నుచుండు

---

1. సత్యనారాయణవ్రతము హరికథ 20 పుట
2. " " 21 "

పౌలతి కీడుగనేను పోజాలనని యెంచి
కనకంబు వెంటనే కళనుదరగు

గీ॥ కాంత పలుచాలు మొల్లమొగ్గలు హసించు
లేమ కాళ్లేతు లరయంగ లేజివుళ్ళు
కల్కి పల్కులు చిల్కల నుల్కజేయు
అన్నుమిన్న సురలకన్నె లెన్నుమిన్న."

పై రెండు పద్యములలో కళావతి యౌవనవతియైన సందర్భములో కవి వర్ణించిన తీరు మిక్కిలి ప్రశంసార్హము. రసపోషణ విషయములో కవి చూపిన ప్రతిభ శ్లాఘనీయము. భక్తి, జ్ఞాన వైరాగ్యములతో శృంగారమును మేళవించిన తీరు సహృదయైకవేద్యము.

ఇందు సందర్భోచితముగా మనకు కొన్ని సాంఘికపరిస్థితులను కవి చూపించెను. (మూడవ అధ్యాయములో వైశ్యులు చోరులని భ్రమించి భటులు వారిని చెఱసాలలో పెట్టిరి) చెఱసాలలో నేరములు చేసినవా రనుభవించు కష్టములను కవి కన్నులకు కట్టినట్లు వర్ణించి, ఆనాటి సాంఘికపరిస్థితులను అద్దముపట్టినట్లు చూపించెను.

"[1]సీ॥ కడుపార భుజియింప కబళంబు లేకున్న
కందగడ్డలు దిని గడపవచ్చు
పాలింపగా రాజ్యభారంబు లేకున్న
గ్రామైకరాత్రముల్ గడపవచ్చు
తతహంసతూలికాతల్పంబు లేకున్న
పాషాణములపైన పండవచ్చు
సరభసంబుగనుండ సౌధంబు లేకున్న
పర్ణశాలలయందు పరగవచ్చు

గీ॥ గరళమును గ్రోలియుం పరయవచ్చు
నరకబాధలనైనను దొరలవచ్చు

1. సత్యనారాయణస్వామివ్రత హరికథ 24, 25 పుటలు

కాని చెరసాల కష్టము ల్గడపరాదు
అనుచు వైశ్యులు విలపించి రంచు మెగుల."

నాడు చెరసాలలో నేరస్థు లనుభవించు కష్టములను కవి పై పద్యములో ఒక్కగా వ్యక్తీకరించెను.

మానవుడు పాపభీతి కలిగియుండును. కొన్ని స
ిమ్మి, తన కోరికలు నెరవేర్చుకొనుట
అధికార ధన మదాంధులెట్లు దైవమున
ధ్వజమహారాజు వృత్తాంతము, వణిక్ప్ర
చెప్పవచ్చును. తుంగధ్వజమహారాజు అ
తృణీకరించుటచే రాజ్యము కోల్పో
మొక్కుకొని, కోరిక తీరగనే నిర్లక్ష్యము
వలన అష్టకష్టము లనుభవించవలసివచ్చెను. భక్తితో గొలిచిన మానవులకు యిహ సౌఖ్యము లొనగుటయేగాక, అంత్యమందు మోక్షము ప్రసాదించుటకు భగ వంతుడు ఎల్లప్పుడు సిద్ధముగా నుండునను విషయము కవి యీ సత్యనారాయణ వ్రత హరికథ యందు స్థాపించెను.

## ఉ ప స ం హా ర ము

ఇంతవరకు క్రీ.శ. 16వ శతాబ్దమునుండి నేటివరకు గల మరింగంటి కవులు, (అనగా సింగరాచార్యులనుండి చతుర్థి వేంకటనరసింహాచార్యులవరకు) వీరి ప్రశస్తి, ఆంధ్రసాహిత్యమునకు వీరు చేసిన సేవ, ప్రథమ ప్రకరణములో వివరించనైనది. విశేషముగా వీరికి సరస్వతీకటాక్షమువలన కలిగిన కవితా ప్రతిభ వంశపారంపర్యముగా వచ్చుచున్నదను విషయము స్పష్టమైనది. వీరి వంశములోగల చతుర్థి వేంకటనరసింహాచార్యుల జీవితవిశేషములు, వీరి రచనా వ్యాసంగము ద్వితీయప్రకరణములో నుగ్గడించనైనది. వీరి రచనలు వివిధ ప్రక్రియల వర్గీకరణము, వీరి భగవద్భక్తి, రచనలలో భక్తిని పోషించిన విధము పురాణప్రవచన విశేషములు, జీవితాంతము వీరు తమ రచనావ్యాసంగము కొన సాగించిన తీరు వివరించనైనది. తృతీయప్రకరణములో వీరి ప్రబంధములు

మాలతీ వసంతము, నీలోద్వాహము, మిత్రవిందయను మూడు ప్రబంధములను సమగ్రముగా పరిశీలించి, ఇందు వీరి కల్పనాశక్తి, పాత్రచిత్రణ, రసపోషణ, వర్ణనాత్మక ప్రాగల్భ్యము సమగ్రముగా వివరించనైనది. ప్రబంధయుగము తరువాత ఈ శతాబ్దారంభమునుండి ప్రాబంధసాహిత్యమును పాఠకుల కందించుటకు కవి గావించిన ప్రయత్నము సఫలమైనట్లు నిర్ధారించనైనది. కళాపూర్ణోదయము తరువాత కల్పనాప్రబంధమైన మాలతీవసంతములోగల విశేషాంశములను వెల్లడించనైనది. ఇతర ప్రబంధకవుల వర్ణనలతో వీరి కావ్యవర్ణనలను పోల్చి చూపనైనది. విశేషముగా యుద్ధవర్ణనల సందర్భమున, ప్రకృతి వర్ణనల సందర్భమున నన్నయ తిక్కనల ననుకరించినట్లును, శృంగారవర్ణనల సందర్భమున ప్రబంధకవులు ముఖ్యముగా రామరాజభూషణుని, చేమకూర వేంకటకవిని అనుకరించినట్లు చూపించనైనది.

తురీయ (చతుర్థ) ప్రకరణములో వీరి నాటకములు, వీధిభాగవతములు, ప్రహసనములకు సమగ్రపరిశీలన గావించనైనది. ఇందు వీరు పాటించిన నాటక లక్షణములను, ఉపయోగించిన భాషావిశేషములను, ఆనాటి సామాజికపరిస్థితుల కద్దముపట్టినతీరు పేర్కొనబడినది. ఈ నాటకములలో పాత్రచిత్రణలో కవి చూపించిన నైపుణ్యము రసపోషణ కనుకూలముగా నున్నది. ఇందలి సంభాషణలు పాత్రోచితములుగా నున్నవి. పాటలు, రాగములు కూర్చినతీరు వీరికిగల సంగీత పరిజ్ఞానమునకు తార్కాణము పౌరాణిక, చారిత్రక నాటకములలో వీరుగావించిన మార్పులు ప్రదర్శనానుకూలమైనవి వీరి నాటకములలో వేంకటేశ్వరస్వామి చిత్రణము కలియుగదైవమైన స్వామివారు నమ్మినవారి ఆపదలు తొలగించి, మోక్ష మొసంగిన వైనము కవికిగల దైవభక్తిని చాటుచున్నది. ఇరువదవ శతాబ్దములో వైశ్యులకు వేశ్యావ్యామోహము తొలగించుటకు సందేశాత్మకమైన వైశ్య వేశ్యవధము (సుందరీ విలాసము) అను ప్రహసనములో కవి కల్పించిన పాత్రలు, సన్నివేశములు సమాజమునకు హితోపదేశములై రమ్యముగనున్నవి.

ఐదవప్రకరణములో లఘుకృతులు అనగా శతకములు, వ్రతకథలు, తారావళులు, మున్నగువానిలో కవి చూపిన ఆత్మాశ్రయకవితారీతి, భక్తి, జ్ఞాన, వైరాగ్య, వేదాంత తత్త్వములను వెల్లడించినతీరు సుబోధమైయున్నది. ఈ

ంకృతులలో మానవజీవితగమ్యము మోక్షమేగాని ఐహికభోగములు కావను యము సోదాహరణముగా వివరించినతీరు పరమోదాత్తముగానున్నది.

జాతీయములనిన కవికి అమితప్రేమయను విషయము భాషావిశేషములలో పత్రికముగా నిరూపింపబడినది. సంస్కృతాంధ్రసమాసముల నుపయోగించిన ఛందస్సులో ప్రదర్శించిన చిత్రకవిత్వము, పాటలలో చూపించిన రాగము కవికిగల సంగీతజ్ఞానము ద్యోతకమగుచున్నది. కవి వివిధసాహిత్యప్రక్రియలు స్త్రి, వీనినన్నింటిని పండితపామరుల కందరికి మనోరంజకము కలిగించినతీరు రమ్యము. కవి జీవితాంతము బీదరికము ననుభవించినను తన రచనలను ంతులకు అంకిత మొసంగలేదు. ఇరువదియైదు రచనలలో ఒక్క మానస ధ శతకము తప్ప మిగిలినవన్నియు భగవదంకితములనువిషయము వీరికి దైవభక్తిని చాటుచున్నది. మానసప్రబోధశతకము భార్య మరణము వలన గ్యము కలిగి, ఆమె స్మృత్యర్థము రచించి, యామెకే యంకిత మొసంగ ది. ఈ కవికి భార్యయందుగల అనురాగమునకిది నిదర్శనము. వీరి రచన ంటిని మిత్రులకు, గ్రంథాలయమునకు ఉచితముగా పంచుట వీరి ఔదార్యము చిహ్నము తిరుపతి గ్రంథాలయములో వీరి రచనలు లభించుట యిందుకు ణము. జీవితాంతము సాహిత్యసేవ చేయుటలో, పురాణప్రవచనముచేయుట గడిపి కవి కృతార్థుడయ్యెను.

ఓం శాంతి, శ్శాంతి శ్శాంతిః

ఈ పరిశోధనా వ్యాసరచన కుపయుక్తములైన గ్రంథముల

# పట్టిక


1. అనిరుద్ధ విలాసము : మరింగంటి వేంకటనరసింహాచార్యులు (చతుర్థి)
2. ఆంధ్రనాటక కర్తలు : ఆదర్శసాహిత్యమాల
3. ఆంధ్రనాటక పితామహుడు : దివాకర్ల వేంకటావధాని
4. ఆంధ్రనాటకరంగచరిత్ర : మిక్కిలినేని రాధాకృష్ణ
5. ఆంధ్రమహాభారతము : కవిత్రయము
6. ఆంధ్రమహాభాగవతము : పోతన
7. ఆముక్తమాల్యద : శ్రీకృష్ణదేవరాయలు
8. కళాపూర్ణోదయము : పింగళి సూరన
9. కథాసరిత్సాగరము :
10. కావ్యశిల్పము : వి. మాధవరావు
11. కావ్యాలంకార సంగ్రహము : రామరాజభూషణుడు
12. కాళహస్తి మాహాత్మ్యము : ధూర్జటి
13. కూర్మనారాయణచరిత్ర : మరింగంటి వేంకటనరసింహాచార్యులు (చతుర్థి)
14. గీర్వాణరూపకము : తల్లావజ్ఝల కృత్తివానతీర్థులు
15. గురజాడ అడుగుజాడ : రమణారెడ్డి
16. గోదావధూటీపరిణయము : మరింగంటి పెదవేంకటనరసింహాచార్యులు
17. గోపాల చూడామణి శతకము : మరింగంటి వేంకటనరసింహాచార్యులు (చతుర్థి)
18. జానపద సాహిత్యము : డా॥ బి. రామరాజు
19. జైమిని భారతము : పిల్లలమఱ్ఱి పినవీరన

20. తారకరామబ్రహ్మరామ శతకము : మరింగంటి సింగరాచార్యులు
21. తాలాంకనందినీ పరిణయము : మరింగంటి వేంకటనరసింహాచార్యులు
22. తిరునామములు పరిశీలన : డా॥ కిళాంబి నరసింహాచార్యులు
23. తిక్కన కావ్యశిల్పము : డా॥ కేతవరపు రామకోటిశాస్త్రి
24. తెలుగునాటకవికాసము : డా॥ పోణంగి శ్రీరామఅప్పారావు.
25. దశరథరాజనందనచరిత్రము : మరింగంటి సింగరాచార్యులు
26. నాటక ప్రయోగం : వి. రామన్నపంతులు
27. నాటకోపన్యాసములు : రాళ్ళపల్లి అనంతకృష్ణశర్మ
28. శుద్ధాంధ్రనిరోష్ఠ్యసీతా కల్యాణము : మరింగంటి సింగరాచార్యులు
29. నీలాసుందరీపరిణయము : కూచిమంచి తిమ్మకవి
30. నీలోద్వాహము : మరింగంటి వేంకటనరసింహాచార్యులు (చతుర్థి)
31. పద్మవ్యూహము (నాటకము) :
32. పాండురంగమాహాత్మ్యము : తెనాలి రామకృష్ణకవి
33. పోతనచరిత్రము : వానమామలై వరదాచార్యులు
34. ప్రతాపరుద్రయశోభూషణము : చలమచర్ల రంగాచార్యులు
35. ప్రద్యుమ్నవిజయము : మరింగంటి వేంకటనరసింహాచార్యులు (చతుర్థి)
36. ప్రబంధసాహిత్యవికాసము : డా॥ పల్లా దుర్గయ్య
37. భాస్కర రామాయణము : భాస్కరుడు
38. బాణుని కాదంబరిపరిశీలనము : గోపాలరెడ్డి
39. మనుచరిత్ర : అల్లసాని పెద్దన
40. మానసప్రబోధ శతకము : మరింగంటి వేంకటనరసింహాచార్యులు (చతుర్థి)
41. మాలతీవసంతము : " " "
42. మిత్రవింద : " " "
43. రంగరాజస్మృతి : " " "
44. రంగాపురసత్యదేవస్తోత్ర తారావళి : " " "

45. రసభారతి నాటకమీమాంస : జమ్మలమడక మాధవశర్మ

46. రససిద్ధాంతము -ఆంధ్రుల వరివస్య : డా॥ రామకృష్ణమూర్తి

47. రాధికాసాంత్వనము : ముద్దుపళని

48. రాఘవపాండవీయము : పింగళి సూరన

49. లలిత నాటకము : మరింగంటి వేంకటనరసింహాచార్యులు (చతుర్థి)

50. లౌకిక వాఙ్మయము : సూర్యనారాయణశాస్త్రి

51. వసుచరిత్ర : రామరాజభూషణుడు

52. శ్రీమద్రామాయణము : వాల్మీకి

53. విజయ విలాసము : చేమకూర వేంకటకవి

54. వీరతెలంగాణా -నాఅనుభవాలు జ్ఞాపకాలు : రావి నారాయణరెడ్డి

55. వీరతెలంగాణా- విప్లవ పోరాటము గుణపాఠాలు : పుచ్చలపల్లి సుందరయ్య

56. వైదికవాఙ్మయము : సూర్యనారాయణశాస్త్రి

57. శశికళ నాటకము : మరింగంటి వేంకటనరసింహాచార్యులు (చతుర్థి)

58. శతకసాహిత్యవికాసము : డా॥ కే. గోపాలకృష్ణారావు

59. శివభారతము : గడియారం శేషశాస్త్రి

60. శ్రీఉర్లుగొండ లక్ష్మీనృసింహ స్తోత్రతారావళి : మరింగంటి వేంకటనరసింహాచార్యులు (చతుర్థి)

61. శ్రీ కళ్ళచెర్వు సీతారామ శతకము : " " "

62. శ్రీనాథునికవితా సౌందర్యము : డా॥ యం. సుజాతారెడ్డి

63. శ్రీమత్తిరుమలాపుర భోగ సుందర సీతారామచంద్ర శతకము : మరింగంటి వేంకటనరసింహాచార్యులు (చతుర్థి)

64. శ్రీరంగాపుర సత్యనారాయణ శతకము : " " "

65. శ్రీరామానుజకీర్తి కౌముది : ధనకుధరం వరదాచార్యులు

66. శ్రీవేంకటేశ్వర మహాత్మ్యము : తిరుమలతిరుపతి దేవస్థానము

67. శ్రీసత్యనారాయణస్తోత్ర తారావళి : మరింగంటి వేంకటనరసింహాచార్యులు (చతుర్థి)

68. సత్యనారాయణ వ్రతము (హరికథ) : " " "

69. సమగ్రాంధ్ర సాహిత్యము : ఆరుద్ర

70. సుందరీ విలాసము (ప్రహసనము) : మరింగంటి వేంకటనరసింహాచార్యులు (చతుర్థి)

71. సుచిత్రాభ్యుదయము ; " " "

72. సుమాలినీపరిణయము ; " " "

